అటుల నాయంగుళీయధారిణి యిరువది గజములదూర మేఁగునం తలో నామె కేదియో యూహ పొడమెను. “ఈహత్య చోరులకృత్య మనియే ప్రజలు భావింపవలె” నని యామె యనుకొని వెంటనే శవ మును సమీపించి సమీపమం దెవరును లేరుగదా యని నలువంకలఁ గలయఁజూచి యిఁకాచెంతనున్న యాభరణాదులను రొక్కమును నామెవసనాంతరమున నున్న లేఖను వడివడిగఁ దీసికొనెను. అంతలో హిమాంశుని శీతలకిరణములు శవవదనముపై బ్రసరింప “నేను మృతి నొందినవారిఁ జూచి వెరచునంతటి బేలను గాను. ఇట్టివాని నెన్నిటినో కనియుంటి” నని సగర్వముగ నుడువుచు శవముప్రక్కఁ బడియున్న పైజారును బిరానఁదీసి శవముమొమ్ము దూసిపోనాడెను.

అంతలో నడుగుల సవ్వడి వినంబడ నామె కడువేగముతోఁ గదలిపోయెను. ఉత్తరక్షణముననే ఫాస్టటకు వచ్చి నేలఁబడిన మానవాకృతిని దిలకించి వంగి చూచెను:—

“హా! ఇదా! ఏ మిది. పురుషవేషము. హత్య. ఇది యెవరి పనియో- ప్రాణములఁబాసెనే- ఆహా! ఇది తస్కరుల కృత్యమే. ఆమెనగలును ధనమునుగూడ వా రామెవసనములఁ జించి హరించి పోయిరి.” అని ఫాస్టు చింతాశ్చర్యమగ్నుఁడై పలుకఁగనే,

“దూరదృష్టిలేని మూఢమానవా!” అను ధ్వని వినబడిన ట్లయ్యెను. ఏదోఛాయ గ్రమ్మినట్లు తోఁచెను. ఫాస్టు సరగునఁ దిరిగి చూడ భూతనాథుఁడు గోచరంచెను. “ఇదేమి” నిను నేపిలువలేదే?

“పిలువలేదుగాని హంతకు లెవరో యని నీవు తెలుసుకొనఁ గోరెద వని గ్రహించి నేను యిందువచ్చితిని. నీ వెంతదూరదృష్టి లేనివాఁడవో గ్రహించితివా? ఇంతటి ఘాతుక మొనరింప సాహసము లవ్యక్తి యీహత్య తనవలనగాక మఱియొకరి వలన జరిగినట్లు

భ్రమింపఁ జేయగల వంచన నెఱుఁగకుండునని తలఁచితివా. ఇంతయు నిర్జీవమగుశవమును దోచుకొనుట కేమి తెలివితేట లుండవలెను!"

"నిజమే. హత్య జరిగినపుడు నీ విచటనే నిలచి కనులారఁ జూచుచుండియు నాప్రేమను గొంతవఱకుఁబడయగలిగిన యాసతిని గాపాడక యుపేక్షించితివా?"

"నే నిచటనే అగోచరుఁడనై యుంటిని గాని ఆమె కాయుః ప్రమాణము తుదముట్టుటచే నే నడ్డుకొనఁజాలకపోతిని"

"హత్య యొనర్చినవా రెవరు?"

"స్త్రీ నిన్నసాయంకాలము నీకును విచిత్రాంగుళీయధారిణి యగుస్త్రీకిని జరిగినసంభాషణమునఁ గతిపలుకుల నిడాసతి యాకస్మికముగ నాలకించి యాయువతి నీర్ష్యచే వధింప నెంచి నేఁ డిట కేతెంచి మృత్యుముఖమునంబడియె. అదిగో చెక్కిటగోటిపోటువలె గనఁబడుమచ్చను గంటివా? ఆసతివిషపుటుంగరపుగీటే యిది. కాలసర్పవిషముకంటెను దారుణమగు విష మాయుంగరమునం దున్నది."

"అటులనా! నా కాయుంగరము చాలవింతగానే కనఁబడెను."

"పిమ్మట నామె శవముచెంత నున్నఖైజారును నిడావక్షమున నాటెను."

"నా కాసతివివరములను బూర్తిగా నెఱిఁగింపవలెను. నే నా సుందరాంగివదనపద్మము నొక్కింతసేపుమాత్రమే చూడఁగలిగితిని. భూతలమున నంతటిశృంగారవస్తు వుందును నుండ దని తలఁచెదను."

"షరస్సాకంటెను సౌందర్యవతియా?"

"షరస్సామైన నీడుగాదు"

"ఈయిడాగూడ నీడు కాదా?

"కాదు. న న్నిపుడే యాసతీమణి మందిరమునకు గొని పొమ్ము."

"నీయుపపత్నిశవము నిటులే విడచిపోవుట పాడి యగునా."

,, నేనిపుడాశవమును గుర్తించినట్లు వెల్లడి యైనఁ జాలనను మానములకుఁ గారణ మగును. మసము పోయిన వెనుక నే తెరువరియో తిలకించి వెల్లడిచేయుట మేలు. ''

"నిన్న నాసుందరి తన తండ్రిసింహాసనాధిపతి యని పలికె. నేను విశ్వసింపలేదు. ఆమెనుగూర్చి నేను సాకల్యముగ వినఁగోరెదను.

"నిజమే. ఆమెతండ్రి చాలపలుకుఁబడిగల ధరాధిపతియే. ఆమెనుగూడ నొక భూకాంతుని సన్నిహితబాంధవునకే పెండ్లి చేసిరి. ''

,,ఆమెకుఁ బెండ్లి యైనదా"

,, ఆమెకు రెండవసారిగూడఁ బెండ్లియైనది. ఐన నేమి. ఆమె సర్వస్వతంత్రురాలు. ఆమె నడ్డుపెట్టఁజాలినవారు విశ్వమునందే లేరు. ఆమె యాకృతి కడుమనోహరము. హృదయ మతిదారుణము. ఆమె మానవాకృతిగల ఘోరపిశాచము. దానికేమి? కొంచెె మోపిక పట్టుము. నీచేతి నిటు తె'' మ్మని భూతపతి ఫాస్టుకరమున గ్రహించినంతనే వారిరువురును క్షణికమున వియన్నానగరమునకు వెలుపల మాఱుమూల వీధియం దున్న చక్కని గృహమునం దొక విశాలమగు నొక గదిలో నిలువగలిగిరి.

ఆగదియందు విలువగల కుర్చీలు మున్నగునవి గలవు. అందొక బల్లపై నైశ్వర్యవంతులు భుజింపఁదగిన యాహారపదార్థము లమర్పఁబడెను. దానిసమీపమునం దిరువురు పురుషులు కూర్చుండియుండిరి. ఒకఁ డొన్సలమునన్యాసి మఠాధికారి. రెండవపురుషుఁడు కొంచెము పొడగరి, ముప్పదియేండ్ల వయసువాఁడు. నీలనేత్రములును వినీలకుంతలములును బిళంగవర్ణముగల గెడ్డమును గలిగి యమూల్యవసనములను శిరమున నీలఫించవిరాజిత మగు నొక టోపీని ధరించి యుండెను. భూతపతి శక్తివలన ఫాస్టును, తానునుగూడ నందున్నవారి కగోచరములుగ నుండుటచే వారి సంభాషణమున కెట్టి యంతరాయ

మును గలుగ లేదు.

,, స్వామీ! మీ రీరాత్రియే వియన్నానగరమును వదలెదరా''

,, ప్రభూ! నేఁడే నాప్రయాణము. నే నీనగరమునం దుండరాదు. అపుడే నన్నిరువురు గుర్తించి స్పష్టముగ నధికారులకుఁ దెలియపఱచిరి. దేహము సంఘమునం దత్యధిక మగునిరసనమును నిరాకరణమును నిర్భీతిగల నగరమున సంఘాధ్యక్షుఁ డెన్నటికిని దీర్ఘ కాలము నిలువఁగూడదు.''

,, అటు లయ్యు సార్వభౌముని శయ్యాగృహమునసే ఖడ్గపాశములను నాటింపఁగలిగితి రే.''

,, సార్వభౌముని సన్నిధానపరిచారకులలో నొకఁడు మన యెడల భక్తియుతుఁడు గాన నాతని సహాయమున నది సాధ్యమైనది.''

,, లేఖను రాష్ట్రపాలకునికడ కంపఁబడినదూతను గడతేర్చిన దాతఁడు కాఁడుగదా''

,, కాఁడు. ఆకార్యమును నేనే స్వయముగఁ జేయవలసి వచ్చెను. సంఘాధ్యక్షులే యొక్కొకతరి సేవకధర్మమునుగూడ నిర్వహింపవలసివచ్చుచుండును. సార్వభౌముఁ డంపిన లేఖల వివరమును మనము ముఖ్యముగా దెలుసుకొనవలసి యుండుటచే నే నారాత్రి నాతనిఁ దుదముట్టించి వానిని బడయగలిగితిని. ఆలేఖ రాష్ట్రపాలకుని కందనేని యాతఁడుదుర్గమార్గముల నరికట్టి లోనివారి కాహారపదార్థము లందకుండఁజేసి వారిని లొంగఁదీయఁగలిగి యుండును. ఓటోదుర్గమార్గముల నన్నిటి నచ్చుగుద్దినట్లు చిత్రించెను.

,, ఇపుడు మీయనుచరు లందఱు నాదుర్గమును వదలిపోయెదరా''

,, పోరు, పోరు. నాచేఁబంపఁబడిన ప్రిస్టు, గ్రిగరీలు, ముందుగా నచటి కేఁగి వలయుపదార్థముల నన్నిఁటిని దుర్గమునఁ జేర్పఁగలరు.

ము చేయుటవలనను సార్వభౌముని జీవితస్వాంతుని
కు మనకుఁ గొంతవ్యవధి లభించినది. మరలసార్వభౌ
వునంతలో సర్వమును సమకూర్పఁబడును. అటుల
రాలకుఁ డంతనంత దుర్గమును సాధింపఁజాలక విసిగి
డగును.

,, గ్రిగరీయును క్రిస్టును కారాగృహమునుండి తప్పించుకొనఁ గలుగుట మిక్కిలి వింతవిషయము. అది యెట్లు జరిగెనో తమకే సరిగ సుబోధము కాలేదనిగదా క్రిస్టు తెలిపెను. సౌరాష్ట్రప్రభువు నాసోదరి ప్రోత్సాహమువలన వారిని విడిపించె నని వార్తయుం దేకో రహస్య మిమిడి యుండె నను ననుమానము నాకుఁ గలుగు చున్నది. ''

,, ఆరాకుమారి మనల వంచించుటకుఁ గల బలవత్కారణ మేదియు నాకు గోచరించుట లేదు. ఎట్లులైన నేమి మన కనుకూలమే జరిగినది. వా రిరువురును నిరపాయముగా దుర్గమార్గము ననుసరింపఁ గలిగిరి. ''

,, నేనును నాసోదరియు రేపే యిటనుండి సాఁగి పోయెదము. స్వీయకార్యములపై మే మాకస్మికముగ నీవిషమసమయమునం దిటకు నామాంతరముల ధరించి రాఁదటస్థించుటచే గ్రిగరీ యీ మహాపద నుండి తప్పించుకొనఁజాలెను గాని యాతఁడు ప్రభుకుమారపాత్రము నటించిన విషయము తలఁచుకొని నపు డెల్ల నాకు నవ్వు వచ్చు చుండును. ''

,, ఆసంపద యంతయు నాతఁడొక్కఁడే యనుభవింపఁబూనుట నాకెన్నటికిని సహ్యముగ నుండలేదు. ఎట్లులైన నేమి ఆమోసమే చివరను జన్నినుప్రభువు దుర్గమునుండి తప్పించుకొని వచ్చుటకు కారణ మయ్యెను. ఆప్రభువు నాదుర్గమున బంధింపఁజేయుటయందు మీకును మీసోదరికిని గలకారణము సెప్పెదరా ? ''

ఫో స్టు 6

,, ఒకనాఁడా ప్రభు వాకస్మికముగ వెసునన
దిరమునఁ బ్రవేశించెను. మే మపు డామందిరమున
ప్రచ్ఛన్నులమై కొన్నియుక్తుల నాలోచించుచు కొన్ని
వానిసాధనమున నే నాజనకుఁడే మహోన్నతపదవిని
ఆప్రభు వటులలోనికి వచ్చి రహస్యవిషయములుగల
శించెను. ఆరహస్యములు మీరుగూడ నెఱిఁగియే యున్నారు. అపుడు
గ్రిగరీగూడ నామందిరమునకు వచ్చి తుటుమ్మ నోకయందు తాఁ నను
భవించిన మస్థితిని గూర్చియు జర్మనుప్రభువు మైత్రినిగూర్చియు నుడువు
చుండెను. ఆహా! గదితలుపు మూయకుండ వచ్చితి నని నాసోదరి
జ్ఞప్తికిఁ దెచ్చుకొని చివాలున లేచిపోయెను. ఒకానొక ద్రావకమును
గొనిపోఁగోరి గ్రిగరీగూడ నామె ననుసరించెను. మా కుటుంబమున
కుపచరింపఁగోరువారి కండజికిఁ గాంటరెల్లో ద్రావక మత్యవసరము.
వా రిరువు నాగదిగుమ్మముచెంత కేఁగునంతలో నొకపురుషుఁ డచటఁ
గనఁబడెను. అతని జూచినంతనే గ్రిగరీ తటాలున వెనుకకుఁ బాఱి
పోయెను. నాసోదరి యాతనిచెంత కేఁగెను. ఆతఁడు ముమ్మూర్తుల
గ్రిగరీవలెనే యుండుటచేఁ దాను జర్మనుప్రభుఁడ నని యాతఁడు తెలు
పఁగా నామె విస్మయముపడలేదు. ఏదోయొక స్త్రీ యార్తధ్వని వినం
బడుటచే లోనికి వచ్చితి నని యాతఁడు తెలిపెను. అది నిజమో
కాదో తెలియదుకాని అవిధేయతఁ జూపిన పరిచారికను ముక్కోపి
యగు నాజనని యపుడు వెంటఁ దరుముచున్నమాట నిజము. మా
తండ్రికే గాక మాకుటుంబమునకే చాల శత్రువర్గ మేర్పడెను. ఎం
దరో గూఢచారులు మముచుట్టుకొని యుండిరి. వారిలాగున ననుమా
నపీడితులైయుండిరి గాన నీప్రభు వెట్టివాఁడో యను సంశయమున
నాత్మసంరక్షణార్థ మాతనిఁ బర్వతదుర్గమున బంధించి మీయధీన
మొనరించునట్లు నేనును నా సోదరియు గ్రిగరీతోఁ దెలిపితిమి గాని
గ్రిగరీ తానే ప్రభువు నని చిత్రనాటక మాడు నని మే మెన్నఁడును

చలఁచి యుండలేదు.’’

‘‘ జర్మనుప్రభుని నాయధీనునిఁ జేయుటనుగూర్చి యింతసావకాశముగ మీ రెన్నఁడును మాటలాడియుండలేదు. ఆతఁ డాభవనమునఁ జూచినవిషయముల వెల్లడించి యుండిన మీ ప్రయత్నము లన్నియు విఫలము లయ్యెడివి కాఁబోలు ’’

‘‘ ఆతనిసుందరాకృతిని జూచి నాసోదరిచిత్తము మెత్తంబడుటం జేసి యాతఁడు ప్రాణములతో బైటఁ బడఁజాలెను గాని, లేకున్న నచటనే మడిసి యుండును. ఆతనివధించుట కామె యంగీకరింప దయ్యెను. కాని యావజ్జీవ మాతని నాదుర్గమున బంధించుట కామె యెట్టకేల కనుమతించినది. ఆరీతిగా నొకయబల హృదయదౌర్బల్యమున నాతని ప్రాణములు దక్కెను. మన్న నారహస్యముల నన్నిఁటి నాతఁడు న్యాయస్థానముననే వెల్లడించెను.’’

‘‘ ఇపు డైన ఖడ్గపాశముల కతఁడందకుండఁబోలేదు.’’

‘‘ వలదు. అతనికి మావృత్తాంత మొకింతయును దెలియదుగాన నాతని వధింపఁబనిలేదు. అతనిమననిందు. మాకుటుంబ మిపుడు నిరుపద్రవస్థితిని బడయఁగలిగెను. ఇఁకమా కిట్టివానివలన నెట్టితొందరయును గలుగనేరదు.’’

‘‘ మీకుటుంబమువలన నేబడసిన యుపకృతులకు నిరంతరము కృతజ్ఞుడను. మీయానతిఁ దలదాల్చితిని.’’

‘‘ మీరు దీర్ఘకాలమునుండి చాలవిశ్వాసముతో మాకుటుంబమునకు సేవఁజేసితిరి. మీకు గొప్పపదవి నొసఁగెదము.’’

‘‘ మీరు దయతో నొసరించినవాగ్దానమునకు నే నత్యంతము కృతజ్ఞుఁడ ’’ నని అన్సలము స్వామి పట్టఁజాలని సంతసముతో నుడివెను.

‘‘ మిమ్ము మే మెన్నటికిని మఱచువారము గాము. నాసోదరి యింకను రాలే దేమి ? వియన్నాలోఁ జాలమెలకువతో మెలఁగవలె

నని నే నెంతయో హెచ్చరించితిని. ఆమెకుగల యుపశమనరహితవ భోగలాలసత్వమును విపరీతమగు పరపురుషానురక్తియు నామె నట్లు పిశాచివలెఁ ద్రిప్పటఁ బెట్టుచు ముఖ్యవిషయములకుఁగూడ ముప్పు దేఁజాలుచున్నవి.”

అంతలోఁ దలుపుఁ దెఱచుకొని యామె లోనఁ బ్రవేశించెను.

## ౪౮

ఆనారీమణి ముఖవస్త్రమును తొలఁగించి అలసటచే నొక యాసనము పైఁ గూలఁబడి ,,మద్యము ! మద్యము !! సీజరు అయ్యో ! నాకు మూర్ఛవచ్చుచున్నది. లేవవేమి’’ అని పలికె. ,,వట్టి’’ మద్యము గాదు. విషమిళితమగు మద్యము. వింటివా! నీ విటులే నాయాజ్ఞలఁ దిరస్కరించుచుందుము’’ అని యాపురుషుఁడు స్ఫటికపాత్రమున ద్రాక్షారసమును నింపి యిచ్చెను.

,,ప్రియసోదరా ! ఏల నీ విట్లు కఠినవాక్యములఁ బలుక నారంభించితివి?’’ అని చిఱునగవుతో నామె యాపాత్ర నందుకొనెను. అంతలోనే యామె వదనము కోపఘూర్ణిత మయ్యెను. నీవును నేనును విద్వేషుల మగుట తటస్థించెనేని నది యతిదారుణముగఁ బరిణమించు నని తెలియఁజాలవా’’ అని ఆమె యొక్క గ్రుక్క నామద్యమునంతను ద్రాగెను. ఆమె యెంతయు సొలసి సోఫాపైఁ జేరగిలఁబడి మృదుపాణితలాంగుళీవిరాజమాన కేసరీమసంకచిహ్నచిహ్నితమణిమయాంగుళీయకము ఫౌస్టుకు స్పష్టముగఁ గనఁబడున ట్లాదక్షిణపాణిని సోఫాపై ననఁజేసి ,,సీజరు, నీపట్ల నిదిమిక్కిలి అనుచితము, అవివేకము. మన కుటుంబమునం దందఱికంటె ముఖ్యముగ నీవును నేనును గలహింపఁగూడదు. కలహింపఁజాలము. పరస్పరాభిలాషలఁ బన్నుగడల మన మత్యధికముగ నెఱిఁగి యుంటిమి. మన మొండొరుల మత్య

ధికముగఁ దోఁచుపడఁగలిగి యుంటిమి. అట్టిచో నిట్టి నిరర్థకవాక్కలహములు పెరిఁగెనేని నాయాశ లన్నియు హత మగుటయే ప్రయోజనము.'' అని యామె నుడివెను.

"ఇన్నియుక్తుల నెఱిఁగియు నీవు మన యజ్ఞాతచర్యకు భంగముకలుగున ట్లేల నిరంతరమును బ్రవర్తించుచుండుట ? ఈనగరమున మననిజస్థితియొక్కరికిని తెలియకుండుట యత్యవసరమని యెఱిఁగించు భోగలాలన వగునీవు సదా పురవీథులందే క్రుమ్మరుచు మనరహస్యమునే భంగపఱుపఁగడఁగుచుంటివిగదా. మాక్సిమిలను సార్వభౌమునకును మనజనకునికిని మైత్రిఁ గలిగింపఁజాలినసంధిని సమకూర్చుటకు తాను కేవలము మేక్జిమిలనుసార్వభౌముని మేలుకోరెడి పనిచేయు ప్రభుభక్తిపరాయణునివలె నార్చిచాన్సలరు నటించుచుండ నీసాహసచర్యలవలన మన మీనగరమునం దుంటి మనువార్తయు సార్వభౌమునికి వెల్లడి యయ్యెనేని మనపోషితాస్సాహము నసే స్వామిద్రోహియగుచాన్సల రట్లు బోధించుచున్నాఁ డనునసుమాన మతనికిఁ గలుగదా ? ఈప్రయత్నమంతయు వృథగాదా ?''

"అటులె భావించినను నీవిట్లనఁ బనిలేదు. ఏలనన రేపె మన మిటనుండి వెడలనిశ్చయించి యుండలేదా ? సంధిపత్రమున పంతకము చేయమేక్జిమిలనుసార్వభౌముఁ డంగీకరించె నని యాయుద్యోగి తెలిపియుండెగదా. ఇఁకమనతండ్రి మెట్టిశాత్రవులనైన లెక్కింప నవసర ముండదు. ఇంకనొకటి యానగరసంచారము లాభదాయకము కాలే దని నీ వనఁగలవా ? రాజసైనికులు గ్రిగరీని పట్టుకొని పోవుసమయమున కాకస్మికముగ నేను జర్మనుప్రభుమందిరము చెంతకేగుట తటస్థించుటచేత నేగదా నే నతనికి మీరీనగరమున నే యున్నారని తెలిపి ధైర్యావిష్టుని జేయఁగలిగితిని. లేదేని వాఁడు మనరహస్యము లన్నియు న్యాయస్థానమున వెల్లడించి శిక్షను దప్పించుకోను ప్రయత్నించి యుండఁడా ?''

" అది నిజమే. నీసహజకరస్వభావమును నీవు చక్కఁగా నుపయోగించితివి. "

విచారణ జరుగునపుడు నేను న్యాయస్థానమునకుఁ బోఁగూడ దని నీ వంటివి. నేను వినలేదు. అట కేగితిని. అందువలననే గదా ఔరానాపరిభువును సందర్శించుటకును గ్రీష్ముగ్రిగరీలును కారాగృహ విముక్తుల నొనరింప నాతని ప్రోత్సాహపరచుటకును నా కవకాశము చిక్కినది. "

" ఈవిషయమునగూడ నీ కానుకూల్యమే కలిగినది. ఇట్టిసత్ఫలితములు వ్రేళ్ళపై లెక్కింపఁదగినన్ని మాత్రమె. ఇఁకఁ బ్రమాదములో వేలకొలఁది కలుగు గాదా? "

" ప్రమాదమా? నాకా? " అనిపలికి యామె స్వశక్తిని లెస్సగా నెఱుఁగజాలుటవలనఁ గలిగిన యహంభావములను వెల్లడించుచుఁ దల యూచి యోష్ఠచలనము గావించెను. " నేఁడు సాయంకాలమునఁ గూడ నేను మరల రాజమార్గముల సంచరించితిని. దాని ఫలితముగ జర్మను సార్వభౌమునివలన మన కత్యంత మగు సహాయము లభింపవచ్చును. "

" ఇది నిజ మని నీవు ధ్రువపఱుపఁ గలిగినచో నే నిక నెన్నటికిని నీమాట కెదు రాడువాఁడఁగాను. నీయిష్టమువచ్చినట్లు మెలఁగ దవుగాక. "

" అయినను వినుము. శోలుదొర్తి నేను గ్రిగరీభార్య యగు నిడాను వధించితిని. "

" ఇదిగో నాఘనకార్యము? "

" ఏల యిట్లు తొందరపడెదవు? ఆమె యౌరానాపరిభువున కపత్ని. "

,, అటులైనఁ దనప్రియురాలిని సంహరించినవారిని బట్టియి
చ్చుట కాప్రభువు సర్వశక్తుల వినియోగింపఁగలఁడు. ఆహా! యిఁక
మనగతి యేమికావలెను. ,,

,, ఆప్రభు విప్రుఁడు మనచేఁజిక్కియున్నాఁడు. నీవు సావధాన
ముగ నడ్డుచెప్పకుండ వినుము. ఆమె యాతనికి వ్రాసినలేఖ యామె
వసనాంతరమున నాకుఁ గనఁబడెను. నేను దాని నిపుడే నొకసారి
కడువడిగఁజదువ నవకాశము లభించినది. దానియం దత్యాశ్చర్య
కర మగురహస్యవిషయము____ ,,

అని యామె పలికినంతనే అయ్యది శిశువులను మార్చిన
విషయ మయియుండనోపు నని వెఱచి వెడలిపొమ్మని ఫాస్టు భూత
పతి కాజ్ఞాపూర్వకముగ సంజ్ఞచేసెను గాని తాను వెడలిపోవువాఁడ
గా నని తెలుపు రీతి నాతఁడు తల నడ్డముగఁ గదలించెను.

,, రమ్ము పోఁదము. నీవు నాయాజ్ఞానుసారము వర్తింపవలె ,,
నని ఫాస్టు నిష్కర్షగాఁ బలికెను. ,, చేయునది లేక భూతపతి మరల
ఫాస్టుచేయి పట్టుకొనినంతనే వా రెప్పటియట్ల పురప్రాకారసమీపము
నందు నిలిచిరి.

,, ఏల నీవిట్లు తొందరపడి వెడలివచ్చితివి? ,,

,, నీవు నన్నేమియు నడుగవలదు. నా యాజ్ఞానుసార మొనరిం
చుటయే నీకర్తవ్యము. ,,

,, అటులే కానిమ్ము. నే నిపుడు చేయవలసిన దిఁక నేమైన
నున్నదా? ,,

,, ఇడాను వధించినస్త్రీ పే రేమి? ,,

,, ఆమెపేరు జగద్విదితము దాని వినినంత నెంతటిధైర్యశా
లురుఁగూడ భయపరికంపితు లగుదురు. ,,

,, అది యేది? ,,

అని ఫౌస్టుఁడుగగ భూతపతి యాతని చెవిలో రహస్యముగ నుడివెను. అది యే మియింతయో ఆపేరు వినినంతనే ఫౌస్టంతవాఁడు గూడ నొకింతఁ జకితుఁ డయ్యెను. ఇట్టి స్త్రీ యెన్నఁడు నేను తనచేఁ జిక్కితి నని పలికెనా,'' అని యతఁ డనుకొనెను.

* * * *

కొండఱు సైనికు లిడ వధింపఁబడినమార్గమున నేఁగుచు నా శవమును గని సమీపసైనికస్థానమునకుఁ గొనిపోయిరి. పురుషవేషమునం దున్నయామె యువతిగా యని స్పష్టమైనంతనే సైనికు లక్కజపడిరి.

వారిలో నొకఁడు గ్రిగరీ, గ్రీట్జు, పెర్మనులను, పట్టుకొనఁ బోయినవాఁ డగుటచే నాఁ డాతఁడు ఇడాను జూచి యున్నకారణమున వెంటనే గుర్తించెను.

ఆవదంతి క్షణమున నగరమంతటను వ్యాపించినది. ఆదుఃఖవార్త యానోట నానోట నోటోచెవినిఁబడెను. ఆతఁడు వెంటనే సైనికస్థానమున కేఁగి యొకబల్లపై నుండి నతనిసోదరిశవమును గని యామెపైబడి విలపింపసాగెను.

కరుణామయుఁ డగునాత డామెదుర్వర్తనము నంతను మఱచి సహజసోదరీప్రేమచేఁ బొరలి పొరలి వచ్చుదుఃఖము నాపుకొనఁజాలక యావు రని యాఁడుదివోలె నాక్రందన మొనరించెను. సజ్జనులమానసములు నవనీతకోమలములు. సైనికులాతనిదుఃఖమును జూడఁజాలక తా మటనుండరా కని వెడలిపోయిరి.

,,హా! సోదరీ యెంతలో నీవు మృత్యుముఖమునఁబడితివి? నవయౌవనముననే, అయ్యో! నీ కెట్టి బలవన్మరణము తటస్థించెను. ఆహా భగవంతుఁడు నిన్ను శిక్షించుట కిట్టిమరణమును సంఘటించెనా? నీవు మహాపరాధిని వైనను సర్వేశ్వరునికృపాతిశయ మగణ్య

ముగదా ? ఆతని వాత్సల్యము విశ్వగోచరము కానిది. తన్ను విశ్వసించినవారల కాతఁడే కరావలంబన మొసఁగి నడపించును. తన సత్సంకల్పములు నెఱవేఱుటకే యీకరుణామయుఁడు చరాచరజీవ కోటి నంతను సృష్టించెను. ఆమహనీయుఁడే నీయాత్మ నాదరించు గాక. శాశ్వతశాంతి నొసఁగుగాక. నేను దుర్భరదారిద్ర్యము ననుభవించితిని. దుస్సహసంతాపమునకుఁ బాల్పడితిని. కట్ట గుడ్డయుఁ దినఁ గూడును త్రాగఁ బుడిసెడు నీళ్ళనుగూడ లభించక యలమటించిన దినము లెన్నియో గలవు గాని సర్వేశ్వరా నీపై నావిశ్వాస మెన్నఁడును గొఱవడలేదు. ఘోరదుర్దశ దుర్భరమై నామనస్సును గలఁచి వేసినపుడు నేను నీపవిత్రనామమును స్మరించి మొఱలిడినంతనే నాకు మనశ్శాంతి చేకూరుచుండెను. సర్వేశ్వరుఁడు నీప్రార్థన నాలకించె" ననుమంగళవాక్యము నావీనులఁ బడుచున్నట్లుండె. ఆహా! దేవా నీప్రార్థన మెంతమనోహరము. నీయందు విశ్వాసము గలభక్తుఁ డొనరించు నారాధన మెంతనిర్మలము" అని యేసుగుణఖని తలంచుకొనుచుఁ దన్మయుఁడై ధ్యాననిమగ్నుఁడై ఆశవముప్రక్కనే మోక[illegible]ది సర్వేశ్వరసాన్నిధ్యమును భావించుకొని తనసోదరి యాత్మ[illegible]తి నొసంగు మని ఆదేవదేవు నెంతయు భక్తితోఁ బ్రార్థించెను.

అంతటితో నాతనికిఁ జిత్తశాంతి కలిగినది. ఆతఁడు లేచి నిలువఁబడెను. తోడనే జర్మనుప్రభువు పరిజనులతోఁగూడ నచటి కేతెం[illegible]చిరి. వా రామెను గొనిపోవ వాహనమును గొనివచ్చిరి.

"ప్రియమిత్రమా! చింతిలకుము. నీ సోదరి శవమును నామందిరమునకుఁ గొనిపోవుదము. అటనుండి మనమందఱ మామెను సమాధిస్థానమునకుఁ గొనిపోవచ్చు" నని ప్రభువు చాల దీనముగ సాను[illegible]ముగ, ఓటోను చేరఁదీసి మనఃపూర్వకముగ సానుక్రోశముతోఁ [illegible]నెను.

ఆప్రభుని సద్భావమునకు, ఓటో మనసు కరఁగిపోయెను. అంతటి యాపత్సమయమునం దాదరించిన యాతఁడేగదా నిక్కపు మిత్రుఁడు. అటులే వా రాశవమును ప్రభు వపుడు నివసించుచున్న మందిరమునకుఁ గొనిపోయిరి. ఇజాసతి ప్రియసఖి యగు క్లారస్సామేరి యాసతు లావార్త విని మఱునాఁ డాప్రభుమందిరమున కేఁగి యాశవమును గని చాల విచారించిరి. పాప మావిమలహృదయ లిజాసతీ దుశ్చరిత్రముల నేమియును విని యుండలేదు.

మూఁడవనాఁ డుదయమున నిజాశవమును సమాధియం దుంచిరి. అచట నెందరో నిర్మలభావముతో నశ్రుజలముల విడిచి నిశ్చల భక్తితో నామెయాత్మ శాంతికై సర్వేశ్వరు నారాధించిరి.

౪౯

౧౪౯౭ వ వత్సరమున రోమునగర ముత్సవములతో నిండి యుండెను పదమూఁడుమైళ్ళచుట్టుకొలతఁగల యానగరరాజమునం దెందుఁ జూచినను విశాలోద్యానములందు, ద్రాక్షవనములందు, అత్యున్నతసౌధపంక్తులచే నలరారు లెక్కలేని యిరుకువీధులందు, సుందరదేవళసమీపమునందు, శిలావిగ్రహముల పరిసరములందు, గోపురరాజముల సామీప్యమందు అం దిందన నేల యెల్లడలను చిత్రవిచిత్రవర్ణము గల ముఖపట్టములు ధరించిన స్త్రీలును బురుషులును గుంపులుగుంపులుగాఁ గూడియుండిరి.

ఆనగరసమీపమునందు పెక్కుగ్రామములు బొడ సొం[illegible] నుండెను. ధైర్యశాలులగు సేద్యగాం డ్రాగ్రామములందు నివసించుచుండిరి. కళ్ళములందు క్రొత్తగానూర్పఁబడిన ధాన్యరాసులు కాలనంట పెరిఁగిన పచ్చికబయళ్ళయందు మదగజముల ధిక్కరించు వృషభరాజములు కనువిందొనరించుచుండెను. నగర మైశ్వర్యమున తులదూగుచుండెను.

మండలములందలి పట్టణములందుఁగూడ నభినవనాగరకత సమగ్రముగఁ దలఁజూపి యుండెను.

గ్రామీణులు సంతసముతోఁ బనిపాటు లొనరించుచు సద్భావము లుల్లములతో నలరారుచుండిరి. పుష్పఫలభరితవృక్షలతానిచయము కనువిం దొనరించుచుండెను. పరిశుభ్రము లగు పర్ణశాలలును, సంపన్నము లగు గ్రామములును, కర్మాగారములతో నొప్పుమీరు పత్తనములును జాలఁగలవు. ఆ కాలమున రోమను రాష్ట్రములు నిటలీ దేశమున జెలఁగుచుండెను.

ఇపు డంతయు నంతరించినది. దురభ్యాసములు, దురాచారములు, పాపచింతలు, అంతములేని విషయవిహ్వలత ఘోరకృత్యములు, చింకిపాతలు, అస్థిచర్మావశిష్టమానవాకృతులు, దారిద్ర్యము, దుస్థితి, పాడుగుడిసెలు, ఇదియే శేషించిన పరిణామము.

ఏమైన నేమి. ౧౮౯౭ వ సంవత్సరమునందలి సంపద్దశనే వర్ణించుచుంటిమి. అపు డుత్సవకాలము. పోపురాజమందిర సౌధముఖద్వార సమీపమునఁ బలువురు పలువిధము లగు వింతవేషముల ధరించి విహరించుచు సౌధోపరితలవితర్దికయం దాసీనులైన యున్నతపురుషుల నానందింపఁజేయఁ బలుపాటులఁ బడుచుండిరి.

ఆవితర్దికపై నున్నవారిలో నాఱవ యలెగ్జాండరు పోపు ముఖ్యపాత్రము. అతని దుర్యశము చిరస్థాయి. అతని మొదటిపేరు రోడరిగో లెన్జులిబోర్జియో. అతఁడు స్పెయినుదేశీయుఁడు. అతఁడు నవయౌవనదశయం దుండఁ దనయవసానకాలమున మరణోన్ముఖుఁడగు నొక మిత్రుఁడు తనభార్యను దనపుత్రికల నిద్దఱఁ గాపాడు మని యామిత్రద్రోహిని వేడుకొనెను. కాపాడెద నని రోడరిగో వాగ్దాన మొనరింప విశ్వసించి యామిత్రుఁడు ప్రాణముల వదలెను. మఱి కొన్నిరోజులకే యాతని యర్ధాంగిగూడ నాతనిఁ జేరఁబోయెను. అపు

ల్లల నిసువురఁ గావాడెక నని మరల నామెకుగూడ నాద్రోహి వాగ్దానమొనరించిన పిమ్మటనే యామె యసువులం బాసెను. ఆమెయంత్యక్రియలు ముగిసినంతనే జ్యేష్టపుత్రిక నాతఁడు సన్యాసినులమఠమున కంపెను. ద్వితీయపుత్రికను దన యుపపత్నినిఁ గావించుకొనియెను. ఆమె పేరు రోజావినోజా. ఆకాలమున నామెంబోలు సౌందర్యవతులు వేఱొక్కరును లేరనిగొ తలంపఁబడుచుండెను. ఆదంపతులకైదుగురు సంతానము.

మనకథాకాలమున కాతనివయసు అఱువదియేండ్లు. ఆతఁడు బాల్యమునుండియు విషయాసక్తుఁడును, భోగలాలసుఁడును, గామినీదాసుఁడును, దురితమతియు, దుష్కృత్యరతుఁడునై యుండినను వార్ధక్యమందుఁగూడ నాతఁడు జవసత్వారోగ్యములను గోల్పోవలేదు. అతని వామభాగమున నాతని ప్రియకాంత యిప్పటికిని సౌందర్యమును జాలవఱకు నిలుపుకొనగలిగి యాసీనయై యుండెను. కుడిప్రక్కన నాతనిసుతుఁడు వెలంటినోప్రభువు కూర్చుండెను. ఆతఁడు తన యగ్రజుఁడగు గాండియాప్రభుని వధించి వత్సరమాత్రమె యైనది ఇట్లారాజకుటుంబమువారును వారి ప్రధానోద్యోగులు నావినోదములఁ దిలకించుచుండ నానగరముననే వేఱొకప్రక్క ఫాస్టు జనసమ్మర్దమున కెడఁగొలఁగి చిన్నసందులో నొక గుమ్మము పొడిగిట నిలచి యుండెను.

మధ్యందిన మగుటచే నాతపబాధ హెచ్చుగానుండెను. అటులుండియు నుత్సవోత్సాహము కొంచెమైనఁ దగ్గలేదు. ప్రజలలో నొక్కరుడు గదలలేదు.

అంతలో విచిత్రసుందరవసనధారిణి యగునొకయువతి ఫాస్టుచెంత కాకస్మికముగ వచ్చి నిలచెను. ఆమె నీలవర్ణమగు పట్టుపుట్టమును ధరించి యుండెను. ఆమెగోపికావేషమును ధరించి మోహన

మూర్తియై యలరారుచుండెను. ఆమె యల్లనఁ దనమృదులపాణిత
లము నాతనిబుజముపై నిడి ,, ఓ రాణాప్రభు నిందుఁ దోడ్కొని
రాఁజాలునంతటికిఁ గారణ మేమైయుండు ,, నని పలికెను.

ఆతఁ డొంకిత యగు జెందెను. ఆకంఠస్వరము పరిచితము. అమృదులనినాదము నతఁడు తొలిసారి వియన్నానగరమునం దాలకించినది మొదలు ఎన్నఁడును మఱువనే లేదు.

,, నీయసామాన్యలావణ్యపాశమే నన్నీనగరమున కీడ్చుకొని రాఁజాలెను. ,, అని యాతఁ డనురాగప్రాబల్యమున నామెపాణి నెగ జేర్చుకొనుచు నుడివెను.

,, ప్రభు వాప్రశంసకు గడంగితిరా ,, అని పలుకుచు నామె మెల్లమెల్లన తనిచేతిని వెనుకకుఁ దీసుకొనెను.

,, నేను నిశ్చలానురాగముతోడనే నుడివితిని. వియన్నానగరమునందు నినుఁగాంచినది మొదలు నామానస మవశమైపోయెను దాని నెంతల నైన మరలించుకొన నేను విశ్వప్రయత్న మొనరించియు విఫలుఁడ నైతిని. నీదివ్యసుందరమూర్తి యహోరాత్రములు నానేత్రరంగమునఁ దాండవించుచుండెను. కడకు నే నాహృదయావేదన భరింపఁజాలక మరల నీసందర్శనాభిలాషచే నిం దేతెంచితిని ,,

,, ఎప్పు డీనగరమును జేరితివి ,,

,, నేఁ డుదయముననే నాభాగ్యదేవతగూడ సుప్రసన్నయగుటచే నింతశీఘ్రముగనే నీదివ్యసందర్శనము నాకు లభించినది ,,.

,, అటులైన నీమందిరము మానిలయమే యని నీ వెఱుఁగవా? అటులైన నీభాగ్యదేవత నిన్ను నామందిరద్వారమునకుఁ గూడఁ గొని వచ్చి విడచినది. నే నిప్పుడు నీ కాతిథ్య మొసంగవలయు ,, నని యామె ఘంటికారజ్జువును గదలింప నొకపరిచారిక ప్రక్కగుమ్మము దెఱచెను. ఆమె దారిఁ దీయువారిరువురును మేడయంతస్తునం దలి

మణీయ మగు నొకగదిలోని కేఁగిరి. అగదికిటికీలను దెఱువ సుందర మందిరోద్యానము గోచరింప సాగెను.

ఆసతీమణి ముఖవసనమును వర్జించి యలపాహారములఁగొని రాఁ బరిచారిక కాజ్ఞాపించెను. ఆదాసి వెంటనే బహువిధభక్ష్యభోజ్య మధురపానీయముల రజితపాత్రలందిడి తెచ్చి యమర్చి యజమాను రాలిఁ కనుసన్నన వెడలిపోయెను.

" వియన్నానగరమున మరల దర్శన మొసంగెద నని చేసిన వాగ్దానము చెల్లింపకయే వెడలిపోతివి ? జ్ఞాపకమున్నదా'' అని ఫాస్టు పలికెను.

" నేను మాట తప్పలేదుగాని నీరాకయేయాలస్యమయ్యెను.''

" నేను వచ్చుసరికి నా కచటఁ గనఁబడినది నీముద్దుమోము గాదు. నిర్జీవమును రక్తసిక్తమునగు నాతిశవము. ''

" నీయుపపత్ని యిడాశవము. నేనుగూడ నానిర్భాగ్యురాలిని జూచితిని. ''

" అట్లైన నామె చెక్కిటంగల గుఱుతునుగూడఁ జూచి యుంటివా ? ''

" చూచితిని. ''

" ఆశవముచెంతఁ గల యాభరణాదుల నెవరో హరించినట్లు కనబడెను.

" అటులనే గాని మన కీకపట నాటకమేటికి. ఆసతి నాచేతనే మడిసె నని నీ వెఱిఁగి యుందువు. నే నామె నెఱుగను. ఆమెను వధించుసంకల్పము నాకు లేనేలేదు. ఆత్మరక్షణముకొఱకే నేనామెను వధింపవలసినదాన నైతిని. ఆత్మ రక్షణార్థమే నే నెందరినో వధించితిని. ఆత్మరక్షణార్థము నీప్రాణముల హరించుటయే యవసర మయ్యె నేని వెనుదీయదానఁగాను'' అని యామె తన కంచుకమున

నుండి సింగముతలగల యుంగరమును దీసి యాతఁడు చూచుచుండఁ దన వ్రేలునకుఁ బెట్టుకొనెను.

"ఇదియేనా నీయాయుధము."

"ఇదియే. వ్యాఘ్రరాజశిరము. హానికరముగాదు. ఇదిగో చూడుము నేను దీనితో నాగండస్థలమున స్పృశించుచున్నా" నని యట్లు చేసి "యిది నిరపాయ" మని నుడివి యామె మర నొక్కఁగా సింహ శిరము సర్పశిరముగా మాఱెను.

"ఇపు డనుమాత్ర మీయుంగరము సోకినను దక్షణమే మర ణము తటస్థించును. నీ కిట్టివిచారము కలుగుటకుఁ గారణ మగు నిడా మరణము——"

"నీ ముఖపద్మ సందర్శనము లభించుటచే నిడా వియోగ సంతాపము నా కావంతయును లేదు గాని యామె యాభరణాదుల నీ వేల్హరించితివి? "

"నే నాపద కావంతయును జంకుదానఁ గాకున్న ననుమాన మును దొలఁగింపు ప్రయత్నము నేమరుట నా స్వభావము గాదు. అందులకే నే నట్లు చేసినను దాని ఫలితము మాత్రము మా కత్యను కూలమే యైనది. ఒక లేఖ లభించినది. అది యొక గొప్ప ప్రభువు రహస్యోదంతమునకు సంబంధించినది. అవసరము కలిగినపుడు మా కుటుంబమున కనుకూలమును దొలగించుటకు జర్మనుసార్వభౌమునితో నైన నార్చిడ్యూకుతో నైన ముచ్చటించుటలోఁ దన పలుకుఁబడిని వినియోగింపవలె నని మే మాప్రభుని వేడిన నాతఁడు కాదన నాహ సింపఁ జాలఁడు "

" ఆలేఖయం దట్టియపూర్వ విషయము లుండఁబోలును. కప టనాటక మనవసర మని యిప్పుడేగదా నీవు పలికితివి. ఆలేఖయందలి రహస్యములును నాకే సంబంధించిన వగును. మీచేతఁ జిక్కిన వాఁ

ఈ పరిస్థితియందు నే క్రుంగిపోవుచున్న నన్ను మీరు మఱింత యవమానించుచున్నారు. మీకు నాపై ప్రేమ తొలఁగినది. నిన్న సాయంకాలము మీరు మఱియొక స్త్రీతో సాంకేతిక మేర్పఱుచుట నేను చెవులార వింటిని గాని ఆస్త్రీ యెవరైన నేమి. ఆమె జీవింపదు. నేఁడు సాయంతనమే ఆమె ప్రాణములను గొనియెద. మీయెదుట నేనే నాహత్యఁ జేయవలసినదాన నగుదు నేమో తెలియదు.

మీపై గాఢతమ మగు ప్రేమను నెలకొల్పిన నాపట్ల విపత్సమయములందు మిమ్మాశ్వాసించిన నాపట్ల, అతిభయంకరము లగు దుష్ప్రయత్నములందు మీకుఁ దోడ్పడిన నాపట్ల మీ రనుచితముగఁ బ్రవర్తించితిరి. నాసహాయము లేనిచో రాజమందిరమున బాలికాగృహమున మీకుమారుని నుంచి రాజపుత్రికను మీరు మీభార్యచెంతకుఁ బంపుట జరుగునది గాదు.

,, ఈ విషయముల నన్నిటిని గూర్చి మీరు బాగుగా యోచించుకొనుటకే నే నిట్లు వివరించితిని. ఈలేఖను మీముఖ్యాప్తజనమున నీసాయంకాలమే నే నిచ్చెదను. మీనూతనప్రియను వధించినది నేనే యని మీరు గ్రహింపఁగలుగుదురు. దానిని బట్టి నాప్రేమవలెనే నాద్వేషముగూడ నపార మని మీరు గ్రహింపసాధ్యమగును.

గ్రిగరీవలన నా కెట్టియిబ్బందియును గలుగకుండఁ జేయవలెను. అతఁడు మృతినొందినఁగాని నా కాసక్తప్రవృత్తి లభింపదు. నాకు మహారాజ్ఞీపదవియు బిరుదములును గౌరవములు నైశ్వర్యములు లభింపవలెను. వీనిని నాకుఁ బ్రసాదింపుఁడు. నిరంతరము మిమ్మే ప్రేమించుచుఁ గృతజ్ఞనై యుండఁగలదానను.

,, ఇరా. ''

అని పాట్సు చదివెను. ,, ఏలిశాగ్రు రాజహస్త్య మిప్పు డీనిచే నాకు విదితమైనది నీకు స్పష్టమైనదా'' అని మహారాణి పలికెను.

,, ఇఁక నెవరికైనఁగూడ విదిత మయ్యెనా ?,,

,, నాసోదరుఁ డగుసీజరుకు, అన్నలను, అను సన్యాసికిమాత్రమే. ఈరహస్యము నత్రిభద్రముగఁ గాపాడెదము. ఆయుత్తరమును నీవు తీసికొని పోయి చింపివేయవచ్చును.,,

భూతపత్రికిని దనకునుగలసంబంధమును నిజా పేర్కొనకపోయినందులకు ఫౌస్టుకు చాలసంతసము కలిగినది ,, నీయాగ్రహమునకు వెఱచిగాక నీమైత్రి నాసించియే నేను మనఃపూర్వకముగ నీసేవ నొనరింపఁగలవాఁడ. నారహస్యములు నీకుఁ దెలిసినట్లే నీరహస్యము లన్నియును నాకుగూడఁ దెలిసి యున్నవి. మొదట నొకస్పెయిను ప్రభుపు భార్యవై యుండి స్వేచ్ఛావిహారిణివై నిరంకుశముగ నెల్లదేశముల నిచ్చవచ్చినట్లు సంచరించుచు భోగముల ననుభవించుచుఁ జెలరేగితివి. నీతండ్రికి రాజ్యపదవిలభించినంతనే నీభర్త నీపదవికసహ్యుఁడనితలంచి యావివాహమును రద్దుపఱచితిరి. పిమ్మట పిజారాప్రభువు గయోవన్నీని బెండ్లియాడితివి గాని యాసంబంధముగూడ మీకుటుంబమునకు సరిపడలేదు. నీయదృష్టమునఁ గట్టను విప్పను నీతండ్రి సమర్థుఁడగుటచే మరల నావివాహమునుగూడ రద్దుచేసితిరి. మూఁడవసారి నీవు ఆరగాను అల్ఫాంజోను బెండ్లియాడితివి ,, అని ఫౌస్టు పలికెను.

,, ఈ విషయములను యూరోపుఖండవాసు లందఱు నెఱిఁగియుండ నీ వేవో మహారహస్యముల గ్రహించినట్లు వీని నేకరువు పెట్టుచుంట వేటికి ? ,,

,,నిన్నును, నీకుటుంబములను, మావిషప్రదానపువిందులను, నీవ్యభిచారమును, నీస్వేచ్ఛావిహారమును, అతిరహస్యముగ శత్రువుల నంతరింపఁజేయు మీనైపుణ్యమును మీకొంటరెల్లా ద్రావకమును, దాని విరుగుడును, యితర రహస్యోదంతముల నన్నిటిని—.,,

,, చాలును, చాలును, అట్టిదో నిట్టి స్త్రీని ప్రేమించుటకు నీకు భీతికలుగుట లేదా ? ,,

,, లేదు, లేదు. నాకుగూడఁ పెక్కు విషగుణములు తెలియును. నీయుంగరమునందలి విషము సైతము నాప్రాణమును హరింపఁజాలదని కూడ నీవు తెలుసుకొనదగును. ''

" నీవే నాకుఁ దగిన ప్రియుఁడవు. నిర్భీతి, ఆత్మశక్తి, పరిజ్ఞానమును, మైశ్వర్యమును, రూపసంపదను గలిగియుండియు నీవు హింసాకార్యములతో సంబంధము కలిగి యుండుటచే నిన్నే నేను ప్రేమించుచున్నాను '' అని పలికి యామె తనచేతి నాతని కందించెను.

" ఓ సౌందర్యశాలినీ ! వందనసహస్రములు. ఓ లూక్రిజా నేను గూడ నిన్నే ప్రేమించుచున్నాను. నిన్నే యర్చించుచున్నా '' నని యాతఁడా సుందరి పాణితలమును ప్రమోదమున గ్రహించెను.

## ౧౦

ఈసుందరిగా లూక్రిజా ఆఱవ యలగ్జాండరు పోపునకును రోజావీనోజాకును జనించిన స్త్రీ. ఈమె సీజరుబోర్గియాసోదరి. అలెగ్జాండరు, సీజరు లూక్రిజాలకంటె ఘోరకృత్యముల నొనరించిన మానవాధము లెన్నఁడును బుట్టి యుండలేదు. పరమఘాతుకు లగునీ త్రిమూర్తుల కెట్టి ఘోరము లన్నను జంకులేదు. స్వార్థపరులై మహదైశ్వర్యకాంక్షచే వా రతిదారుణ కృత్యములు గావించిరి. వాని ఫలితముగనే యలెగ్జాండరుకు పోపుపదవి లభించెను. ఆతని పరిపాలనమునందు ప్రబలినంతటి దుర్నయ మేనాడును ప్రబలియుండలేదు.

మహాసౌందర్యవతుల యుత్తమ సౌందర్య మంతయును గుచ్ఛితాంగనల ఘోరసంకల్పము లన్నియు లూక్రిజాయందు నిరూఢము లయ్యెను. ఆమె పవిత్రభావముల నెఱుఁగనే యెఱుఁగదు. ఆమె భోగలాలసత్వమున కంతమే లేదు. ఆమె దురాశలకు పారమే కనఁబడదు. ఒకదాని వెంటనొకటిగ దారుణహత్యలొనరించుటయందామె

చూపిన యుదేశమునుబట్టి చూడ నట్టిఘోరకృత్యములే ఆమెకు ప్రియకరము లని స్పష్ట మగుచున్నది.

స్త్రీలపాతివ్రత్య మాకాలమున బరిహాస పాత్రమైపోయినది. పోపు ప్రభుత్వమున ప్రధానాధికారు లందఱును వ్యభిచారాది దుర్వ్యసనము లందు కూలిపోయిరి. వా రుంచుకొనిన వ్యభిచారులకుఁ గలిగిన బిడ్డల నాయున్నత మహోద్యోగులు నిర్భయముగఁ దమబిడ్డలే యని ప్రకటించుటకు గూడ జంకలేదు. రాజమార్గములఁ బ్రాణహత్యలు నిత్యకృత్యము లయ్యెను. పోలీసుభటులును న్యాయాధిపతులును ధనాశాపరవశులై లంచములకు మరిగి అన్యాయమునకు దోడ్పడుచుండిరి. పాపభీతి లేని పశుబలసంపన్నులు ధనికులవలన ధనముగొని ఘోర కృత్యములఁ గావించుచుండిరి.

ఫౌస్టులూక్రెజాతో నిట్టిమైత్రిని బడయు నాటికి రోమునగరస్థితి యీ చందమున నుండెను. ఏనాఁ డుదయమున ఫౌస్టును లూక్రెజా తన యింతిపురమునకుఁ దోడ్కొని పోయెనో యానాఁడు సాయంకాల మాగృహమునందే పడకగదిలో నామె యొంటరిగాఁ గూర్చుండి యుండెను. ఆనగరమునం దింక నొక భాగమున నామె కొక దివ్య భవనము గలదు. ఆమందిరమునఁ బరిచారికలు, పరిచారకులు, ఆశ్రితు లంగరక్షకులు, సన్నిధానవర్తులు, మున్నగు నుద్యోగులను స్థానగౌర వానుగుణ్యముగ నెందరినో యామె నియమించి యుండు టచే నామె తఱచు నామందిరమును వీడి తన రహస్యగృహమున స్వేచ్ఛావిహార మొనరించుట కామెకు మంచి యవకాశము లభించి నది. ఆమె రహస్యము చాలవఱకు వెల్లడి కాకుండుటకుగూడ వీలు కలిగినది. విషయలోలతచే నొడ లెఱుఁగకుండఁ బ్రవర్తించు నాఁడు నైతము రహస్యమును కాపాడుకొనఁ జూచుట యనుస్యూతము. గాన నీరహస్యమందిరమునం దత్యంత విశ్వాసపాత్రు లగు పరిజనులును

కొలఁదిమందిని మాత్రమే యామె నియమించెను. శత్రువుల రహస్యముగఁ గడతేర్చుట మున్నగు విషయములను గూర్చి యామెయును నామెసోదరుఁడగు సీజరును నీరహస్యగృహముననే యాలోచించుచుందురు. సోదరీసోదరు లగువారిద్దఱికిని నోట నుచ్చరింప సాధ్యముగాని మహాపాతకసంబంధము కలదని వ్రాయక విధిలేదు. సర్వవిధములవారి పాతకమున కెట్టి వెలితియు లేదని దీనివలన స్పష్టముకాఁగలదు.

సాయంసమయమున లుక్రెజా సింహశిరోంగుళీయమును ధరించి యొంటరిగా శయనగృహమునఁ గూర్చుండియుండెను. ఆమె మనస్థితిని సామాన్యస్త్రీలకువలె ముఖలక్షణములఁబట్టి నిర్ణయింప సాధ్యముగాదు. ఆమెవదనము ప్రశాంతముగ మందహాసభాసురమై యుండునపుడే లోన రాక్షససంకల్పములు ఘూర్ణిలుచుండును. ఆమె ఎవరికొఱకో నిరీక్షించుచున్నదానివలెఁ దఱుచు గడియారము వంకఁ జూచుచుండెను. ఆసమీపమున గోడయందొక రహస్యద్వారమున్నది. ఆమార్గముద్యానవనమునకుఁ బోవుదారి. ఆమె లేచి యా తలుపును బరీక్షించి మూయకుండఁ జేరవైచి మరల వచ్చి కూర్చుండెను. రాత్రి తొమ్మిదిగంటలైనది. నగరము ప్రశాంతమయ్యెను.

అంతలో రహస్యద్వారము చెంతఁ గాక వేఱొకద్వారముకడ నెవరో మెల్లగఁ దట్టిన ట్లయ్యెను. తనపరిజను లెవరో వచ్చి యుందురని యామె తటాలున లేచి పోయి గడియను దీయగ నీలముఖపట్టములను నిశితకరవాలములను ధరించినపురుషు లిరువురు దడదడ లోనఁ బ్రవేశింప నామె భయవిస్మయముల మునిఁగిపోయెను. కాని అంతలోనె సహజధీరత్వమును బూని "ఈయక్రమప్రవేశమున కర్థమేమి" అని యడిగెను.

ఆగంతుకపురుషులలో నొకఁడు గడియను బిగించి "మరణమున కాయత్తవు గమ్ము. నీ కవసానదశ యిపుడే చేకూరినది" అని కఠినాక్షరములఁ బలికెను.

"గాడ్ఫ్రీ మార్కోము" అను పలుకు లామెనోట వెడలెను.

"ఔను నేనే" అని యతఁడు ముఖవసనమును దీసివేసి "నా పితృవ్యుఁ డగుకసెజ్జాకార్డినలు హత్యకుఁ బ్రతీకార మొనరించుటకే నే నిందువచ్చితి" నని యాతఁడు పలికెను. ఆతనికి నలుబది యేండ్లుండును. అతని సుందరవదనమునఁ గాఠిన్యముపెల్లడి యగుచుండును.

"మీచే వధింపఁబడిన సెర్పిగ్లయోను సోదరుఁడను నాపేరు ప్రెడ్రికోబాస్సీ. ఆపగఁదీర్చుకొనుటకే నేనుగూడ వచ్చితిని" అని పలుకుచు రెండవపురుషుఁడుగూడ ముఖవసనమును తీసివేసెను.

"నన్ను మీరు వధించినచో ననపరాధినిఁ జంపిన పాతకమునకు నిష్కారణముగఁ బాలయ్యెదరు. మీరు పేర్కొనినవా రిద్దఱిమరణమునకు గూడ నేను బాధ్యుఁడను గాను.

"ఆహత్యలు నీవలననే జరిగిన వని మే మెఱుఁగుదుము. ఒకవేళ నట్లు జరుగకున్నను నీ వొనరించిన యితర ఘాతుకకృత్యము లసంఖ్యములు గాన నీవు చావక తప్పదు. బోర్జియాలరక్తమునకై రోము నగరము తత్తరపడుచున్నది. నిన్నును నీసోదరునిఁ దుదముట్టించిన పాపపరిహార ప్రార్థనముల నొనరించి ముప్పురు కార్డినలులు తురతసహాయ సంసిద్ధులైయున్నారు. కావున మాఱుపలుకక మరణమున కాయత్తపు గమ్మని మార్కోము కరవాలమును ఝుళిపించెను.

"అయ్యో రక్షింపుఁడు, రక్షింపుఁడు. నాకుఁ గొన్ని నిముసములైన నవకాశ మిండు. పోపుకన్న బిడ్డల నిరువుర వధించుటకు ముప్పురుకార్డినలులు మిమ్ముఁ బురికొల్పి రంటివే. మాకార్యములచే మాపై నంతటి యాగ్రహము చెందినవా రెవ్వరు? ఎట్లైనఁ బరిహార మొనరించినవారు శాంత—

,, కాసానోవా, కోపిసు, కాస్టెలెన్సలు మీతో నెట్టి రాయబార ములకు నంగీకరించువారు గారు. వింటివా వారి నామములను ; ఇదిగో నీకు స్వల్పకాలము గడు వొసంగుచున్నాను. అది గడచిన యుత్తరక్షణమునందే యీనిసిత కరవాలము నీహృదయరక్తమును జవిఁజూడగలదు. నీవు నీశ్వరుఁ బ్రార్థించుటకు నేను గడు వియ్య లేదు. నిన్ను బోలు ఘోరపాతకికిఁ బ్రార్థనలు నిరుపయోగములు. నీ వొనరించిన ఘోరపాతకముల నే నొనరింపజాలక మోకరిలబడి పైదాని నాలకించుటకే నీకీగడువొసఁగితి మోకరిలఁబడవేమి. ''అనిమార్కోము కౄరమూర్తియై పలికి బలవంతమున నామెను మోకరిలఁ జేసెను.

,, ఇదియే ప్రతీకార ప్రారంభము. దురభిమాన గర్వాంధచేతస్క వగునిన్ను మోకరించునట్లు చేసితిని. మిత్రమా ఈమహాపాతకి దుర వస్థావ్రినుము బ్రాణభీతిచే వెల్లవారినముఖమును దిలకింపుము. ఈమె నాపితృవ్యునిపట్లను నీసోదరునిపట్లను గాసంతమైనఁ గనికరము చూపె నా ! లేదు. అట్టి ఘోరరాక్షసిపట్ల మనము కనికరము చూపఁజాల ము '' అని మార్కోము పలికెను.

,, ఇట్టి దురాత్మురాలిని గనికరించుటయే ఘోరపాతకము. కాక నీ వాకార్దినలుల నామముల గుంటీమెయెడ వెల్లడించినపిమ్మట నీఘోర స్వరూపిణిని మననియ్య నగునా ? అని బాస్సీనుడి వెను.

" నిజమే మననీయరాదు. ఓలూకెరిజా ! నిన్నును నీసోదరుని హతముచేసెద మని మే మిరువురము నేలప్రమాణ మొనరించితిమో వినుము " అని మార్కోము పలికెను.

" లేదు. మీ రట్లు ప్రమాణముచేసి యుండరు. ఒకయనాథస్త్రీని మీరు వధింపఁజాలరు '' అని యామె ప్రాణభీతిచేఁ దల్లడించుచు నతి దీనయై వా రిరువురి వదనములను దిలకింపసాఁగెను.

" ఏకాలసర్పవిషము సంఘశరీరాంతర రక్తనాళ నిర్మల రక్త వాహినులందు గడువడిగ లీనము కానాగెనో యట్టి క్రూరవ్యాళమును

మేము చిలుకఁగొట్టెదము. నీ వెంత చూచినను నిన్నెక్కడను గాపాడువారు లేరు. అటు కానిచో మే మెంత నిర్దయముగ శిక్షముల సారించుచు నిలచి యుందు మని తలచితివా? నీవు మాచేఁ జిక్కితివి. మాకరముల వలన నేఁ డాయువులకు ముందు మీవచోఘాతముల నీశిలాహ్వానయమును బగులఁగొట్టెదము" అని మహారోషము పలికెను.

,, అయ్యో! ఆశఁ డింకను రాఁడేమి" అని యామె తనమొగమును దోయిలు నిడుకొని ప్రాణభీతిచే గంపిత యగుచుండెను,

,, మూఁడువత్సరములక్రితమునఁ దల్లి రోజావనోజా తనప్రత్యేక సౌధమున నధిక వైభవముతో విందొనరించెను. ఆవిందునకుఁ బ్రముఖు లగువా రందఱును వెళ్ళి యుండిరి. మృతినొందిన నీసోదరుఁ డగు గాండియప్రభువు తన ప్రియమిత్రుఁ డగుటచే నాప్రభునిప్రక్క నే నాసోదరుఁడు సెర్విగ్లోయి నాసీనుఁడై యుండెను. నీవు వెంటనే యటనుండి లేచి నీఘోరకృత్యములకు మూలస్థాన మగునీమందిరమును జేరి తక్షణ మిందురావలె నని నీసోదరుఁ డగు గాండియాప్రభునకు ముఖపత్త్రమును ధరించిన దూతచే నొక లేఖను బంపితివి." అని జాస్సి నుడివెను.

,, నేను వినఁజాల వినజాలను. నన్ను మన్నింపుము."

,, నిన్ను మన్నింపవలెనా? ఏనాఁడైన నెవ్వరినైన నీవుమన్నించితివా? వినితో తీరవలయును. వినుము."

అంతట నీసోదరుఁడు లేచి కొంతదూరమునఁబోయి తనవెంటరా నాసోదరుని గూడఁ బిలచెను. వెంటనే మరియొక అనాథుఁ డట లేచి యశ్వారూఢుఁడై ప్రక్కదారిని గడువడిగ నగరమువంక కేఁగెను. ఘట్టకోణముకడ వేచియున్న నలుగురుసాయుధుల నాయాశ్వికుఁడు సమీపించెను. నీసోదరు ననుసరించిన నాసోదరుఁడు కొంత

దూరమేఁగి నిలచి పోవుటచే నీసోదరుఁడగు గాండీ యాప్రభువు నంటరిగా నాప్రాంతమును జేరెను. అంతట నాయాశ్వికుఁడు నిశ్చలుఁడై చూచుచుండ నాహంతకు లాప్రభువు జీవితముల హరించి శవమును టైబరునదియందు ద్రోసిరి. ఆసుధవార్త నాయాశ్వికుఁ డీ మందిరమున కేతెంచి నీ కెఱిఁగించెను. అతఁడే నీ రెండవసోదరుఁ డగుసీజరు. ఈరీతిగా నీజ్యేష్ఠ సోదరుని మరణమునకు నీవు ప్రధాన కారణము. సీజరు కార్య నిర్వాహకుఁడు'' అని శాస్సీ నుడివెను.

"కల్ల కల్ల! నే నాలేఖ వ్రాయనులేదు. పంపనులేదు"

"మరణసమయమునగూడ నసత్యములనే పలికి చావకుము. నీ పితృవ్యపుత్రుఁడును హతుఁడైన నీసోదరుని ప్రియమిత్రుఁడు నగు కార్డినలు, గయోవని, యీమరణ వార్తను విని నిజ మారసి ద్రోహుల శిక్షింపఁగోరి ఫెరారానుండి రోమునగరమున కేతెంచెను. నీవును సీజరు నారిణిని ఫ్లోర్లియందు గలుసుకొని విందున కాహ్వానించితిరి. ఆహా! మీవిషపువిందు కెంతరిఁ దమ పొట్టబెట్టుకొనెను. మీర పుడుచూపిన దెంత యాదరణ. ఎంతటివినయము. ఎంతసన్మానము. ఆతని దారిద్రోరసమున విషముగలిపిన మీరాతనిపట్ల నెంతటిప్రీతినిజూపితిరి. ఈరీతిగా మీ రాపరమోదారస్వభావుని బరలోకమున కంపితిరి. అంతటితో మీబెడద తీరలేదు. యోధపుంగవుఁడు సద్వంశసంజనితుఁడునగు నాసోదరుఁడు, నాపితృవ్యపుత్రుఁడు, పోపు అంగ రక్షక దళాధికారి యగు సెర్విగ్లాయనుని మీప్రోత్సాహమున నే యొకానొక రాత్రి యొక హంతకుఁడు నిహతునిఁ గావించెను. నేను బగఁదీర్చుకొన కుండఁ జాల'' నని బాస్సీ పెదవులు మడచి పిడుగులు వడున ట్లతికఠినముగ నుడివెను.

"అయ్యో! నన్ను జంపకుము. అట్టి ఘాతుకమును నిమానస మంగీకరింపదు. వెడలిపొమ్ము. నీ కున్నతపదవిని మహదైశ్వర్యమును నపూర్వ గౌరవమును నేను సమకూర్చెద.

" రోమునగరమునఁ బుట్టిన పసిబిడ్డ యైనసీమాటలను విశ్వసింతునా " అల బాస్సీ నుడివెను.

సన్యాసిని యైనయొకస్త్రీ మరలఁ బెండ్లియాడఁగోర సీతండ్రి యామె చెంతనుండి యిఱువదివేల నాణెములు లంచము పట్టి అనుమతి పత్రమున నతఁడె సంతకముఁ జేసి యిచ్చెను. దాని వి... ప్రజలాందోళన మొనరింపఁ దనమానమును గాపాడుకొనుట కై పరమద్రోహి యనపరాధి యగునాపినతండ్రి కార్డినలుకోసాంట తనపేరును సృష్టించె నను వట్టి నేరము నాతనిపై మోపి నాపితృవ్యునిఁ గారాగారబద్ధునిఁ గావించెను. నీవును సీజరును నాకారాగృహమున కేఁగి నయభయముల నాతని వంచించి తానే యపరాధి యని యాతనిచే నొకలేఖను బడసితిరి. అంతట ఘోరరాక్షస స్వభావులగుమీరిద్దరు నా పినతండ్రిని చీఁకటికొట్టునం బడద్రోచి మూఁడుదినముల కొకసారి చిన్న రొట్టెముక్కను బుడిసెడునీటి నాతని కొసఁగున ట్లాజ్ఞాపించితిరి. ఆహా! యాతఁ డొకవత్సర మాబాధ ననుభవించెను. అతఁ డెట్లు జీవించెనో యని తలచిన గుండె తటతటఁ గొట్టుకొనుచున్నది. మీ రాస్వల్పాహారమునుగూడ నంతట నిలిపివేసితిరి. మఱి నారమురోజుల కాతఁడు చెఱసాలలోనే శరీరమును విడిచెను. ఇఁక నిన్ను బ్రతుకనియ్యను!" అని మార్కోమ పలికెను.

అంతట నామె మెల్లన లేచి నిర్భయముగ నారియెదుట నిలచి "మరణభీతి తొలఁగినది. నే నందులకు సంసిద్ధనైతిని గాని మీఖడ్గములు నాహృదయమును విదారించుటకు ముందు రెండువరముల మాత్రము వేడుచున్నాను."

" ఆలస్యముచేయక సంగ్రహముగాఁ బలుకుము. మేము వచ్చి కడుగడ వైనది " అని మార్కోమ పలికెను.

" ఈ తాళముతో నాయలమారును దెఱచి యందున్న నాసోదరుఁ డగు గాండియాప్రభుని చిత్రపటమును నాకొసఁగుఁడు. దానిని నేఁగడ సారి ముద్దాడిన దేవలోకమం దున్నయాతని యాత్మకుఁ తృప్తికలుగ వచ్చును " అని యామె యొక తాళముచెవిని మార్కోము కిచ్చెను. ఆతఁడు దానిని గొని యలమారువంక కేఁగెను. కాని యాయల మారు తుప్పుపట్టి యుండుటచేఁ తాళము త్వరగవిడక యాతఁ డచట శ్రమపడుచుండెను.

" నాప్రాణములు పోయినపిమ్మట నైన నీసోదరుని హత్యకు నన్ను క్షమించెద నని చెప్పుము " అని యామె బాస్సీని వేడుకొనెను.

,, అటులే క్షమించెదనుగాని నీ విపుడు చావకతప్ప " నని బాస్సీ పలికెను.

,, అటులైన నేను సంతసముతో మృతిజెందుదు " నని తన కృతజ్ఞతఁ దెలుపుటకో యన నాతని చేతిని తనచేతుల నిడుకొని స్పృశించి వెనుకకుఁ బోయెను. వెంటనే బాస్సీ భయంకరార్త ధ్వాన మొనరించి నేల నొరగెను. ఆక్షణముననే యలమారుచెంత నిలచిన మార్కోముగూడ నట్టి యార్తధ్వనితోడనే నేలఁగూలి తన మిత్రుని చెంత నొరగెను. ఇరువురును మృతిఁజెందిరి.

మార్కోము తాళముచెవిని గట్టిగఁ ద్రిప్పుటలో దానిపై నున్న ముల్లతని వ్రేలికి గీచుకొని పోయెను. అది విషసంకలిత మగుటచే నాతఁడు మడిసెను. లూక్రెజా తనవ్రేలి నున్న విషాంగుళీయముతో స్పృశించుటచే బాస్సీ ప్రాణములఁ బాసెను.

అంతట మానవాకృతి నున్న యారక్కసి యాశవములఁ గాల దన్ని ,, నాశత్రువుల కందరికిని గలుగుగతి యిదియే. ఇఁకనాకార్డి నలులు ముగ్గురనుగూడ హత మొనరింపవలయు " నని యామె వికృతాకారిణియై పలుకునంతలో రహస్యద్వారమున ఫాస్టు లోనికి

వచ్చెను. నిర్భయముగఁ బ్రశాంతముగ నుత్సుకతతో నాశవములఁ దిలకించుచు నిలచి యున్నలూక్రీజా యాకృతి నాతఁడు దివ్యసుగంధ తైల సమన్విత దీపికా ప్రకాశమునఁ గని రిచ్చవడెను. ''

" లూక్రీజా రాణిమా " అనుమాటలుమాత్ర మతఁడు పలుకఁ గలిగెను.

" ప్రభువా కలవరము వలదు '' నీవు సరిగ నిర్ణీత సమయమునకు వచ్చి యుంటివేని నీకరవాలము నన్నీరాజకోవరుల కటువాక్య ప్రహారముల కింతకాలము పాలుపఱచి యుండదు. తొలుత నా కత్యంత భయభ్రాంతి చేకూరెననుట నిక్కువము '' అని లూక్రీజా పలికెను.

౫౧

మఱునాఁ డుదయమున లూక్రీజా తనసోదరుఁ డగుసీజరు మందిరమున కేఁగి జరిగిన వృత్తాంతము నంతను వివరించెను. కార్డినలులు మువ్వురును విద్వేషు లని గూడఁ దెలిపెను.

" సోదరీ వారుమువ్వురునుగూడ జావవలయును. యుగంతము నిపుడే మనము జనకున కెఱిగింపవలయును. ఆతఁడు వానిని విహీన కాహ్వానింపఁగలఁడు ''

" మన మీవిషయమునఁ దొందరపడఁగూడదు. నిన్నరాత్రి నాచే హతులైనవారు మనరహస్యములను చాటింపకుండఁ బలికిరి. రోమునగరమునం దకారణ మరణములు హెచ్చుచున్న వని ప్రజలు గుజగుజలు పోవుచున్నారు ''

,, అటులైన నాకరవాలము విషసంకలితము ''

,, నీ కేమైన నున్మాదమా ? ఇది నీవంటి యుక్తిశాలి పలుకఁ దగినది గాదు. వారికట్టి బలవదాకస్మిక మరణమునకుఁ బాలుచేయఁ గూడదు. వారు నవసి నవసి చచ్చునట్టి విషముచే ప్రయోగింపవలెను. ''

,, మువ్వురు విద్వేషుల మృతి నొందింపవలెను. నీయంతరంగ
కుల నిరువురను వెంటనే గొనిరమ్మని పలికి సీజరు విశాలగృహము
కేఁగెను. ఆగది యతివిచిత్రముగ నున్నది. అచట నున్న పా
త్రము లన్నియు ద్రావకవిరహితములై యుండెను. మనము
వెంటనే పూరింపవలె నని పలికి తనవిషకలిత మగుకరవా
దూసి సీజ రచట నిలచెను. ఆతని కట్టెదుట దట్ట మగుద్వారము
యినుపగడియలచే బంధింపఁబడెను. లోన నెయ్యదియో భయంకర
వనసత్వము గర్జించుచున్నట్టి ధ్వని వినఁబడ సాగెను.

ఆపరిజనులలో నొకఁడు మృగముల మూఁతులకుఁ గట్టునట్టి తోలు
సంచిని చేఁబూని ద్వారసమీపమున నిలచెను. గడియలఁదొలగించి
చూడ లోన నతిభయంకర మగు నల్లని ఎలుగుబంటి కనంబడెను.

ఆమృగము వారిని గని యించుకసే పటునిటు తిరిగి లోన నుండి
వెలికి వచ్చెను. ఆసేవకుఁ డతిచమత్కారముగ నాతోలు సంచిని
దానిమూతికిఁ తగిలించెను. దానిని పాశములతో బంధించిరి గాని
యది యటునిటు నడయాడుట కవకాశము కలుగఁ జేసిరి.

అంతట సీజరు విషలోహములను మార్చి ద్రావకముగచేసి దాని
నామృగముచేఁ ద్రావించెను. పిమ్మట దానిని వారు తలక్రిందుగ
వ్రేలాడఁదీసిరి. సీజరు రజితపాత్రమును సరిగ దానినోటిక్రింద నుంచి
చర్మబంధము నూడఁదీసెను. ఆమృగము తన్నుకొనుచు ఘీంకార
ముల నొనర్చుచు మరణవేదనఁ బడసాగెను. దానినోట వెడలిన
దారుణవిష మారజితపాత్రమున స్రవించుచుండెను.

అతి భయంకర మగువిషవాయువు వ్యాపించుచున్న వాసన బయ
లుదేరెను. పదునేను నిముషములకామృగము మృతిఁజెందెను. పిమ్మట
నారజిత పాత్రలోని ద్రవమును మొదటివిషపాత్రలోఁ బోసి యా
ద్రావకమును జిన్నచిన్న కాచపాత్ర లందు నింపిరి.

ఇది కల్పన యని తలంపరాదు. బోర్జియా కుటుంబమువారు విషమును సిద్ధపఱచినరీతి సరిగా నిచట వివరింపఁబడియె. ఆనాఁడు జర్మను ప్రభువు వెనీసునగరమునఁ జూచిన దృశ్యమునఁ గల రహస్యమిపుడు స్పష్టమైనది. ఆవిషయము జరిగి యిప్పటి కెనిమిదేండ్లైనది. ఆగదియం దాప్రభువు చూచిన యితర విషయముల యంతరార్థము గూడఁ ద్వరలోనె వెల్లడింపఁ బడును.

ఆపరిజనులకు బహుమానముల నిచ్చి సీజరు పంపివేసి ముఖ్యభృత్యుఁడును దానును కార్యశేషమును నిర్వర్తించిరి. అచట నున్న మూఁడు ద్రాక్షారసపు సీసాలలో వారావిషద్రవమును గొంచెము గొంచెము మిశ్రమము చేసిరి. మరల నాసీసాలకుఁ గ్రొత్త బిరడాల నమర్చి సీళ్ళు వేసిరి. సీజరు తన ముద్రటుంగరముతో వానిపై ముద్ర వేసెను.

“నీ వామూఁడు సీసాలను నాతండ్రి ప్రధానపాచకాధికారి కందఁజేయుము. రేపు సాయంకాలము గొప్ప విందు జరుగును. ఈమూఁడు సీసాలను దక్కిన ద్రాక్షారసపాత్రములతోఁ గలపక ప్రత్యేకముగ నుంచి నిర్దేశింపఁబడినవారికి మాత్రమె యొసంగునది యని నా యాజ్ఞగాఁ దెలుపుము. వారి పేరులను నేనే యాతని కావల నెఱిగించెదను. నీ వీవిషయము నతిరహస్యముగ నాతని కెఱిఁగింపవలయు. భద్రము” అని సీజరు పలుక “చిత్తము” అనిభృత్యుఁడు వెడలిపోయెను. పిమ్మట సీజరు తనతండ్రి మందిరమున కేఁగి యాతనితోఁ గొంతసే పేకాంతగోష్ఠి సలిపెను.

మఱియొకగంటకుఁ గార్డినలులకు నితర ప్రముఖులకును విందు కొఱకై యాహ్వానపత్రములు పంపఁబడెను. ఇందవరివధ సంకల్పింపఁ బడినవో యాముగ్గురికి నాహ్వానములు ముఖ్యముగాఁ బంపఁబడె నని వేఱుగాఁ దెలుపు టనవసరము.

ఆనాఁడు రాజ (పోపు) మందిరము సహస్రాధికసంఖ్యాకము లగు గ్యాస మాలలచేఁ బట్టబగలట్టులఁ బ్రకాశమానమై మహా వైభవముతో నలరారుచుండెను. ప్రాచ్యదేశములందలి సార్వభౌముల రమ్యహర్మ్య శోభంగూడ నాప్రధానమందిరాలంకారముగీటునఁ బుచ్చుచుండెఁ గాని ఆస్తికమత ప్రచారక ప్రధానాచార్యుని మందిరమునకుఁ దగిన ట్లుండ లేదు.

ఉత్తరముకొన నున్న వేదికపై నాహారపదార్థముల పేటిక నమర్పఁ బడెను. దానిచెంత నగ్రభాగమున సింహాసనము నెలకొల్పఁబడెను. దానిపైఁ జీనీచీనాంబర కాంతి విలసిత మగు వితాన మొప్పారుచుం డెను. ఆ వేదిక కెదుటఁ బ్రముఖు లగుపురుషులకును స్త్రీలకును రెండుపక్కబల్లలపై నాహారపదార్థము లమర్పఁబడెను.

వర్ణింప నలవిగానికాంతి పుంజముల వెదజల్లుశాఖాశాఖా విలసితము లగు కాచదీపకళికల పూర్వరామణీయకము నొసంగుచుండెను. అపూర్వసుగంధ వీచికల భవనము నంతను బొలయుంజేయుచు దివ్య వాసనాతైల ప్రజ్వలితము లగు కరదీపికలు పేటికములపై నొప్పా మీరి యుండెను.

కుడ్యములు చిత్రవిచిత్ర కుసుమ తోరణములతో నలంకరింపఁ బడెను. స్వర్ణరజతభోజనపానీయ పాత్రనిచయమును బళ్ళెరములును నితర పరికరములును అలమారులలో నత్యంతము ప్రకాశించు చుండెను.

రాత్రి యేడుగంటలకా విశాలభవనద్వారము లన్నియును తెరువఁ బడెను. అతిథిపుంగవులు అలెగ్జాండరుపోపుపురస్సరులై భవనము నందుఁ బ్రవేశించిరి. అతివిలువయుపపన్న మనోహర భూషణాలంకార ములు ధరించి తనభోగపత్రీభుజముల నానుకొని నవరత్న భూషిత కాంచన శిరోవలయమును ధరించి యుండెను.

ఏసింహాసనము నధిష్ఠించి క్రైస్తవ ప్రపంచము నంత నాతఁడు మానసిక నేత్ర చాలనముననే భంగొనఁజాలెనే యట్టి మృగరాజ పీఠమున నల్బ్రాండ్ఁడను పోపాసీనుఁ డయ్యెను. ఆతని నిరంకుశాధికారమునుగూర్చి యాతనిపుత్రిక లూక్రెజా వియన్నానగరమున ఫాస్టుతోఁ బలికిన యంశములం దతిశయోక్తి యొకించుకయు లేదు. ఆతని నిరంకుశ ప్రభుత్వమునకు రోమునగర మొక్కటియే గాదు. ఇటలీ దేశ మంతయును, ఇటలీదేశమే గాదు, క్రైస్తవప్రపంచ మంతయును ప్రకంపిత మగుచుండెను. భక్తిచేఁ గాకున్న భీతిచే నెల్లర నాతనికి పాదాక్రాంతు లగుచుండిరి.

అగ్రపీఠాంతికమునఁ గార్డినలులున్నతాధికారులు విఖ్యాత నామములును గూర్చుండిరి. తక్కినవారు తక్కిన పీఠములకడఁ గూర్చుండిరి. ఈరీతిగా నూఱుమంది యతిథు లచటఁ జేరిరి. వారికి వలయు పదార్థములఁ గనుసన్నల గ్రహించి సమకూర్చుటకు రెండు వందల మంది పరిచారకులు సంసిద్ధులుగా నుండిరి.

ఎంతటి వైభవము ; ఎంతటి యాధ్యాత్మిక భౌతికాధికారము ! ఎంతటి దురంతఘాతుక చింత, ఎంతటి ఘోరవంచనము, బోర్జియా వంశ మెంత కళంకితమై పోయినది. ఆకళంకము శాశ్వతమై యా వంశసంభవులకు తీరని మచ్చయయ్యెనుగదా !

ఉన్నతాసనము చెంతనే యొక రోకను గొంతయడముగాఁ గాసానోవా, కోర్నిసు, కార్టెలెన్ని కార్డినలులుగూడ నాసీనులై యుండిరి. వారిహత్యకొఱకేగదా యీమహావైభవము. ఈగొప్పవిందు. విషపూరిత ద్రాక్షారసపాత్రిత్రయమును పరిత్యేకించుట. ఆనాఁ డాఘోర హంతకులు ముప్వారు నెంతటి నెయ్యమును వినయమును, లాలనమును, చమత్కృతియును, నెఱపిరో వివరింపఁజాలము.

భోగపరాయణాతియు నైశ్వర్యమునుగూడ నొక్కచోఁ జేరిన సమకూర్పఁబడెను నిజసమానావృత్త పదార్థజాల మునరిబుకేముక

సమకూర్చబడెను. ఇటలీ జర్మనీ స్పెయిను ఫ్రాన్సు బెల్జియం ప్రభృతి దేశములందు విఖ్యాతము లగుమద్యరాజములు స్ఫటికపాత్రములందు ప్రకాశించుచుండెను. కాంతామణు లామాధురసపాన ప్రకోపిత రక్తాయుతనీలలోచనులై సింధూరకాంతి విరాజమానకపోలభాసురలై యలరారిరి.

అందు నాపవిత్రమందిర మధ్యమునందు [illegible] కామినీకాముక జనమోహభావసూచకవిలోకనముల సమ్మేళనమును వాంఛాప్రకటనమును నంగీకారసంజ్ఞలును చెలగుచునే యుండెను. రహస్యసంభాషణములు సాంకేతిక స్థలనిర్దేశములు, ఈర్ష్యలు, మత్సరములు, ద్వేషములు, ప్రతీకారచింతలు మున్నగున వన్నియుం బరిశుద్ధమతవ్యాపకాచారోచితవసనముల మాటున బ్రకోపితము లగుచునే యుండెను.

రాత్రి పదిగంట లైనది. ఉన్నతపీఠాంతికమునం బవిత్రచిహ్నములు శుభరక్షలు మున్నగువానింగూర్చిన ప్రసంగము జరుగుచుండెను.

“ సర్వేశ్వరుని మహిమ నీమానవు లెవ్వరును గ్రహింపంజాలరు. ఆకృపాలుని కృపాతిశయమున కత్యంతము పాత్రులగుభక్తుల సంరక్షణార్థ మా దేవదేవుండు శుభరక్షల నేర్పఱచెను. కావున నా కట్టి వానియందు సంపూర్ణ విశ్వాసము కల ” దని యలగ్జాండరు పలికెను.

“ మీనిర్ధారణ నెవరు కాదనంజాలుదురు? తమచెంత నట్టి శుభరక్ష యొక్కటికల దనియే నానమ్మక ” మని కార్డినలు కారెఫా పలికెను. ఇతండు పోపు ప్రధానకార్యకర్త..

“ అయ్యది సర్వాశుభములం దొలంగించు ననుట కడుసాహసము గాని, విషఖడ్గముల బారినుండి మాత్రము కాపాడు ” నని పోపు పలికెను.

“ నే నిట్లడుగుట యనుచితమని తాము తలంప రేని యాపవిత్రచిహ్నము నొక్క నారి భక్తితోం దిలకింప ననుగ్రహింప వేడుదాన ” నని సాన్నియా ప్రభ్వి పలికెను.

"నిరభ్యంతరముగ జూడవచ్చు" నని యాతఁడు వనాంతర
మునఁ బరికించెను గాని యచట నది కనబడలేదు.

ఆతని వదన మొకింత చింతానుమానసంకుల మయ్యెను గాని దానిని వెంటనే మఱుఁగుపరిచి "ఓహో నేను దానిని నాయభ్యంతర గృహమున బల్లపై మఱచి వచ్చితిఁ జూచిర" మ్మని పోపు కార్డినలు కారఫాతోఁ బలికెను.

ఆతఁ డా సూచనాను గ్రహించి దానిని దేఁబోయెను. ఆయభ్యంతరగృహమునం దతిముఖ్యము లగు పత్రము లుండుటచే సామాన్యపరిజను నటకుఁ బంపుటకు పోపు సమ్మతించలేదు.

పత్న్యలలో నొకఁ డగు కార్డినలు కోసిమును, గార్డినలు కారఫాయు గాఢమైత్రిని గలిగి యుండుటచే నేఁడు గూడ నా రిద్దఱు నొక్కచోటనే కూరుచుండిరి గావున విషసంకలితద్రాక్షారసములను గార్డినలు కారఫా గూడఁ గ్రోలుట తటస్థించు నేమో యని సీజరు చాల భయపడుచుండెను. ఇపు డతఁడు వెడలిపోవుటచే విషప్రయోగమునకిది మంచి యదనని సీజరు గ్రహించెను. ఏలయనఁ గారఫా మరల నెంతవడిగ వచ్చినను బదినిముసములకుఁ దక్కువ పట్టదు.

"మనయతిథిపుంగవుఁ డగు నార్రానాప్రభుని గౌరవార్థము ధరాజాని యనుమతించినను మన మంగళమును మదిరారసపాన మొనరింపఁదగు నని విన్నవించెద" నని సీజరు పలికెను.

"నేను మనఃపూర్వకముగ నంగీకరించితిని. మనకు లభ్య మగు వానిలో నుత్తమోత్తమ మగు నాసవము నీయతిథిశేఖరుని గౌరవార్థ మాస్వాదింత" మని తనపుత్రుని గోపచింతను గుర్తించియే పోపు పలికెను.

ప్రధాన పాచకాధికారిని గనుసన్నచేఁ బిలచి సీజరు వానితో రహస్యముగా నేదో తెలిపెను. వాఁ డొకచోఁ బళ్ళెరమునం గొన్న

సచ్ఛఫలముల నతిథుల కొసంగ నాపాచకాధికారికే సౌన్నియాప్రభ్వ యాజ్ఞాపించెను.

సదాచారము ననుసరించి తొలుత నతఁడామె యానతిని నిర్వర్తింపక తీరదు గాన నాలస్యము కాకుండుటకు సీజరు సూచనల ననుసరించి ద్రాక్షారసము నందీయ నాపాచకాధికారి తన సహోద్యోగి కాజ్ఞాపించెను.

ఆయుద్యోగి పెక్కు స్ఫటికపాత్రలందు ద్రాక్షారసమును నింపి వెండిపళ్ళెరమునం దిడి తెచ్చి పోపు, సీజరు, ఫాస్టు, కాపిసు, కాస్టలెన్నీ, వెసానోవిసుల కొసంగెను. తక్కిన పరిజనులు తక్కినవారి కొసంగిరి. శౌరానాప్రభువుకు పోపు వినయమును నెఱపినంతనే యెల్లవాఱు నొక్కసారిగా నాద్రాక్షారసమును గ్రోలిరి.

అంతలో గారిఫా పాండురఫాలభాగుఁడై భయప్రకంపితుఁడై, చకితాంధుఁడై ఎల్లరిదృష్టి నాకర్షించుచుఁ దనస్థానమునఁ గూలఁబడి భయవిశోకసములఁ బఱపుచు నిట్టూర్పులు విడువసాగెను.

“ఆహా! ఏమిపరిణామము. ఆకస్మికముగ నేదైనవ్యాధి—”

“పావనచరిత్రా! నాకు గలిగిన వ్యాధి శరీరసంబంధమైనది గాదు మానసికము నైతికము” అని పోపుతోఁ గారిఫా పలికెను.

“అది యేమో తెలుపుము. మన మందిరమున నెవరైన నిన్ను విరోధించిరా” అని పోపు అడిగెను.

“నన్ను కటాక్షించి దానినిగూర్చి ప్రశ్నింపవల దని వేడుకొందును. అది భయంకర దృశ్యము.”

“భయంకర దృశ్యమా? మనసంభాషణము నీమనసు నాకర్షించిన నీ కట్టిభీతిని గలిగించు దృశ్యమును గను సల్లానరించెను. నీ వావివరముల నెఱిఁగింపకున్న మా యాతురత తొలఁగదు” అని పోపు పలికెను.

" నన్ను క్షమింపుము. నన్ను క్షమింపుము. "

" నీ విందు చెప్పక తీరదు. "

" ఆస్పృశ్య మోహమహనీయా నీకే సంబంధించి యుండెను. "

" ఎవరికి సంబంధించిన నేమి పూర్తిగాఁ దెలియఁ బలుకుము "

" భవదాజ్ఞానుసారము నే నొకదీపికం గొని కక్ష్యాంతరముల గడచి యభ్యంతరమందిర ద్వారమును దెఱువకమున్నే వాయు వేగమున నాకరదీపిక యారిపోయెను గాని యామందిరమునందు దీపములకాంతి కనబడుచునే యుండెను. "

" నాయభ్యంతర మందిరమున దీపముల కాంతియా ? ఆమందిర పావనత నుల్లంఘింప నెవ్వఁడు సాహసించి యుండును. "

" అది మానవకృత్యము గాదు " అను వాక్యములు కారఫా నోట వెడలగనే విందు మందిర మంతయు ప్రశాంత మయ్యెను.

" దీపములను గని నేను లోన నడుగిడినంతనే భయపరికంపితుఁడనై నిశ్చలుడ నైతిని. "

" శీఘ్రముగ నెఱిఁగింపుము. ఆలస్యమొనరించి మ మ్మాందోళనముపాలు చేయకు " మని పోపు కఠినముగఁ బలికెను.

" ఆమందిర మధ్యభాగమునం దొక శవపేటిక కాన్పించెను, యం దొకశవ ముండెను. దాని చుట్టు నాలు కొవ్వొత్తులు వెలుగు చుండెను. ఆశవవదనము నా కెన్నటికిని మఱువరాదు. "

" దాని పోలిక యెట్టులుండెను. " " మహాప్రభో తమ వదనమునే పోలి యుండెను. " అని యాతఁడు పలికినంతనే హాహాకారముచెలఁగెను. కాంతాకపోలరక్తిమ యంతరించెను. పురుషులఫాలతలములు వెలవెలఁబాఱసాగెను.

" పరమ పవిత్రమగు నాతండ్రి మందిరమున నిట్టి యపవిత్ర

ప్రవర్శన మొనరించినవా రెవ రైన హత—" మని కుటిలభ్రుకుటియై పలుకుచు సీజరు కరవాలము నొరనుండి తీయువంతలో

"రాజకుమారా! తీవ్రపడకుము. అది మానవ ప్రవర్శనము గాదు. అది మనుజులు చేసినపని గాదు. నేను ధైర్యము తెచ్చుకొని సిలువను స్మరించినంతనే అది యంతర్ధాన మయ్యె. నేను గాఢాంధకారమున మునింగితిని." అని కారఫా పలికెను.

"నాశుభరక్ష" అని పోపు పలికెను. అతనిస్వరమునుబట్టి యీ దృశ్యకథన మాతనిమానసమునుగూడఁ గలంచెనని స్పష్టమగు చుండెను.

"నే నాచీఁకటిలోనె బల్లపై వెదకి తెచ్చితి" నని యాతఁడు నవరత్నఖచిత మగు నొకపతకమును దీసిచూపెను—

"నాచేతి కిమ్ము. నాచేతి కిమ్ము. అది నాచెంత నున్నంతకాలము నేను శత్రువులకు వెరువఁ బనిలేదు. శత్రువుల విషఖడ్గప్రయోగ ముల నది నాకు స్పష్టపఱుచు" నని పోపు చేఁజాచెను. కారఫాశుభరక్ష నాతనిచేత నిడెను.

వెంటనే భయంకరార్తనాద మొనరించి పోపు కొట్టుకొనుచు సింహాసనముపై నొరగెను.

తోడనే సీజరు తనయన్నకోశమునందే బాధ గలుగుటను గుర్తించెను. దానింగనినంతనే యాతనికి భయంకర మగు ననుమానము కలిగినది.

"ప్రభువా! పొరబాటున విషపాత్రలు ఇతరుల కియ్యబడె నని నేను దలఁచెద. మీమొగము మిక్కిలి వివర్ణ మయ్యె. మీతండ్రి మరణోన్ముఖుఁడుగా నున్నాఁడు. నాజిహ్వకు చాలనరుచిగాఁ దోఁచెను. కార్డినలులు ముగ్గురును దప్పించుకొనిరి" అనువాక్యముల నెవరో పలుకఁగ విని సీజరు తిరిగి చూడ ఫాస్టు తనవంకకు వంగి యుండుటఁ గనఁబడియెను.

"మీయభిప్రాయమును నేను గ్రహింపఁజాలకున్నా" నని సీజరు పరుషముగఁ బలికెను.

"నీసోదరి సర్వమును నా కెఱింగించెను. నీవు వెంటనే విషమును బుచ్చుకొనుము" అని ఫౌస్టు పలికెను. "ప్రభూ! నీవేమిచేసెదవు" అని ఫౌస్టును సీజరడిగెను.

"నేనా! నావిషయమును నీవేమియును భయపడ నక్కఱలే" దని ఫౌస్టు సగర్వముగఁ బలికి యటనుండి వెడలి యత్రత్య బృందమునఁ గలసిపోయెను.

ఈరీతిగా నీమహావైభవము మరణసంతాపముగాఁ బరిణమించినది. ద్రోహులు కార్డినలుల ముఖ్యార వధింప నొనరించిన ఘోరాలోక ప్రయత్నము వారికే యశనిపాత మయ్యెను.

౧౩

పోపు స్మృతితప్పి పడినంతనే యాంతనిచావు అబద్ధము తనచావు నిద మనుభీతిచే స్వప్రాణసంరక్షణ తత్పరుఁడగు సీజరటనుండి కడువడిగ నిజమందిరమున కేఁగెను. అంతరంగసేవకుఁడగు మిచెలొట్టోకుఁ గొన్నియాజ్ఞల నొసఁగి శయనగృహమున కేఁగి విషవిఘ్నాలనపాన మగు నౌషధమును దిని పక్కపైఁ బొరలుచు నేమియును దోచక జరిగిన విషయముల నన్నిటిఁ స్మరింపసాగెను.

మఱికొంతసేపటికి మిచెలొట్టో రహస్యమార్గమునవచ్చి సర్వమును సంసిద్ధమని తెలుప సీజరుపక్కగదిలోని కేఁగెను. అందొకమూలశయ్య యుండెను. విశాలమగుకుండమున నగ్నిప్రజ్వాలన మధికముగ నుండెను. దీప మొక్కటి వెలుఁగుచు వ్రేలాడుచుండెను. శయ్యాతలమునకు శిగ వృగ బలమగు నాలుగినుప కడ్డీలు దూలముల కంటునట్లు కంబముల రీతి నాటఁబడి యుండెను. కొన్నిపీపాలును వెంటనున్న యొకబల్లపైఁ పశుమారకుల ఖడ్గములుండెను. ఆగదియందు చిత్రకంబళములు

మున్నగు నాస్తరణము లెవ్వియును లేవు. నేలగచ్చు నాగుగఁ గనఁబడుచుండెను.

వారచటికి రాగనే యిరువురు భటులు ప్రాకద్వారము లోనికొక యున్నతమగు వృషభమును గొని వచ్చి బలమగు నినుపదుడ్డుతో దాని తల పగులఁగొట్టి చంపిరి. పిమ్మట దానిని తోసుకఁదీసి వెన్ను భూమి కానునట్లు నాలుగు కంబములకు నాలుగు కాళ్ళు సంటగట్టిరి. వారిలో నొకఁడు పెద్ద కత్తితో దాని యుదరము రెండుభాగములఁ పొడుగున ఛేదన మొనరించెను. అంతఁ బ్రేవుల నూడఁదీసి కట్టుగొట్టల యందుంచిరి. అంతట రాజు దిసమొలతో [illegible] వృషభ గర్భమున బ్రవేశించి ఉష్ణరక్తస్నాన మొనరించెను.

అటుల నతఁడు పదునిముషము లుండి వెలికివచ్చి శయ్యపైఁ బండెను. అతని సర్వాంగములును చెమ్మటఁ దొప్పదోగెను. ఈ కుటుంబమువారు ఘోరవిషముల సిద్ధపఱచి వాని పటిమను బరీక్షించుటకు దొలుత తామె వాని నాహారించి విషబాధను దొలగించుట కిట్టి వికృతులను గొని పసురక్తస్నానము నొనరించుచుండెడివారు.

అతఁడు ప్రాణసంశయావస్థయం దుండినను నాతని కాముష్మిక చింత యావంతయును గలుగలేదు గాని రాజ్యాధికార విషయమగు చింత ప్రబలముగ నుండెను. అంతటఁ బరిజనులు చతుష్కంబములను పశుశవములఁ దొలగించి రక్తపుడాగులు కనబడకుండ నేలనంతయు గడిగి శుభ్రపఱచి వెడలిపోయిరి. అంతట [illegible] లొకఁడు శయ్యాసమీపమునకు నిలచెను.

" నాతండ్రి జీవించుట దుర్లభము. ఆతఁడు వృద్ధుఁడు. రక్తస్నానావకాశ మిప్పుడు లేదు. పిడుగువంటి మందు లెన్ని యిచ్చినను లాభము కలుగదు. కావున విశ్వాసపాత్రులగు పరిజనులతో నిప్పుడే గొని నాతండ్రి మందిరముఁ జేరి [illegible]

...డనాథరక్షకుఁడేగదా. ఏకనాథనమున నిష్టమూర్ణమును దొలఁగించి దుష్టనిధనముఁ గావింపఁజాలినదీనజనబాంధవుఁ డాఁ దేవదేవుఁడు గాక మఱియెవ్వాఁ డగును.

మి: చెంగాం కాసానోవాను బిలచి నిర్జనగృహమునకు గొనిపోయి బంధించి యుసురులఁ గొందు నని బెదరించి తాళముల గొనిపోయి ధనాగారమున్దెఱచి ధనసంచయమును స్వర్ణాభరణములను నెండి బంగారు పళ్ళెరములు పాత్రలు మున్నగువానినిగూడ సీజరు మందిరమునకు గొనిపోయెను.

మఱునాఁ డుదయమున మిచెలొట్టో నిజసైన్యమును పోపుమందిరమునఁ గావలియుంచెను. మరణసమయమునఁ బరితాపముగ ప్రాణముల విడుచుటకైన నాయలెగ్జాండరున కవకాశము లేకుండ సైనికార్భాటములును, ప్రజాకలహసంరంభములును ప్రబలసాగెను. సీజరెట్టులైనఁ దన యధికారమును నిలుపుకొనదీక్ష బూని తన యాజ్ఞానుసారము మెలఁగునట్టివానినే పోపు పదవియందు ప్రతిష్ఠింపఁ బూనెను.

అలెగ్జాండరు ప్రాణముల నంత శీఘ్రముగ విడువలేదు. ఇట్టిదుర్దశయందాతఁడెనిమిది దివసములు జీవించెను. అతఁడు కడపట నతిదారుణమగు మరణవేదన ననుభవించి తనువు దొరంగెను. కడయూపిరి వదలు వఱకు నాతనికి స్మృతి తప్పలేదు. తనకుఁ గొంత స్వస్థత కలుగగనే సీజరు పితృగృహమున నివాస మేర్పరచుకొనెను. విషము త్రాగుటచే గలిగిన లక్షణము లాతనియందు ప్రబలముగఁ గనఁబడుచుండెను. మొగము నల్లవారినది. పెదవులు రక్తహీనము లయ్యెను. కనులు గుంటలుపట్టెను. ఆతఁడు నడయాడనైన జాలనంతటి నీరసస్థితియందుండెను.

అలెగ్జాండరుమృతి నెల్లడియైనంతనే అనుగ్రహితాచారము ననుస

రించి సంఘాధ్యక్షుండు సీజు సనుమానించి గార్యనిర్వాహకాధి మును వహించెను. పోపుశరీరము విదగ్ధమై కొఱకచ్చుంబోలు కాఱునలుపురంగు గలిగి భరింపరాని దుర్గంధముతో నుబ్బి భయంకరరూపముగ మాఱి వికృతమై యుండుటచే అధికారాంగుళీయక గ్రహణవిధిని నిర్వర్తింపకుండుటకు సీజు నిశ్చయించెను. పౌరులాశవమును గనుట తటస్థించెనేని వదంతు లన్నియు సత్యమై స్థిరపడుట నిశ్చయము.

పలుకారణములచే ననాలస్యముగ నంత్యక్రియల నిర్వర్తింప నాతండు తీవ్రపడసాగెను. ముఖ్యమైనది శవము. దుర్గంధ పూరిత మగుటయే రెండవది. ప్రతిపక్షులసంరంభము అనుకూలు డగు నొకనిఁ గడుశీఘ్రముగ పోపుపదవియందు ప్రతిష్ఠించినంగాని సీజునకును బంధువర్గమునకును భద్రము కలుగదు. లేదేని వారు రణోగణిపా లగుటయే గాక మరణముకూడఁ దటస్థింపవచ్చును.

## ౧౪

తెల్లవాఱిన నంత్యకర్మ జరుగును. నాటిరాత్రి సీజు రహస్యముగఁ దనతండ్రి శవముగల గదిలోని కేఁగెను. ఆశవమును పేటికయం దుంచి దానినొక వాహనముపై నమర్చిరి. నలుతట్టులను పొడుగగు క్రొవ్వొత్తులు వెలుగుచుండెను. అచట దుఃఖించుచున్న బంధు లెవ్వరును గనబడలేదు. ఆతనిగూర్చి వెలువడిన భయంకర వార్తలచే నెల్లవారు భీతిలి చెంతఁజేరఁజాలకుండిరి. సుగంధబంధురస్నేహ పూరముచే నొప్పారు రత్నదీపకళికలు మనోహరముగ వెలుఁగుచున్నను దుర్వాసన నడఁగింపఁజాలకుండెను.

ఆనిశీథమున సీజు నట కాకర్షింపఁజాలిన యెట్టి కారణమో యూహింపసాధ్యము కాదు. తాను పితృఘాతకుఁడ నైతినను గాఢ సంతాపమో లేక తన్ను లోఁబఱచుకొనఁ జాలిన పుత్రసహజాను

రంగమో అతని నన్ను పేరిరేపించి యుండును. ఒక్కొకప్పుడట్టి కారణములను గుర్తింపకయే మనము కొన్నికార్యముల నొనరించుచుందుము. సీజరు కట్టి సద్భావము లెన్నటికిని గలుగజాలవు.

సీజరు శవముపైఁ గప్పఁబడిన వస్త్రమును దొలగించి భీకర వికారవైవర్ణ్యముఁ జెందినతిదాకృతిఁ దిలకించెను ,,ఎంతలో నెంతటి మార్పు. వార్ధకమునగూడ సౌందర్యమును గోల్పోని యలెగ్జాండరు గతప్రాణుఁడైనంతనే ఎంతవికారాకారుఁ డయ్యెను?

,, ఎంతలో నెంతమార్పు, నిన్నసార్వభౌమమకుట మాణిక్య విరాజితపాదుఁడగు నేఁడు నేఁడు నీచతమక్రిమితుల్యుఁ డయ్యెఁగదా? నీయధికార మంతరించె నిన్నిఁక నిర్భయముగఁ బరమనీచులుగూడ దురుక్తుల దూషింపుచుందురు. ఎవ్వనిబాహుముష్టి యెల్లదేశముల నల్లల నాడించెనో యట్టి చండశాసనుఁ డధమకీటకముల కనుకాలమునకే యాహారమగుచున్నాఁడు. కొన్నియేండ్లగునరికి మిగులునదిభస్మరాశిగా గదా ,, అని యాతఁ డనుకొనునంతలో

,, భస్మమో బండలో పటికిగొడవ ,, అను ధ్వని మెల్లగ వినఁబడెను. ఆధ్వని వినగనే మానవహత్యయనిన మది నిసుమంతయు గొంకని సీజరుగూడనదరిపడెను. ఆతనిభీతి కొన్ని నిమిషములవఱకును దొలఁగలేదు.

శవపేటిక కావలియున్న మోకరిలఁబడిన యొకవ్యక్తి లేచి నిలువబడెను. ఆవ్యక్తి తనసోదరి యగు లూక్రెజా యని సీజరు గుర్తించెను.

,, ఏమిది నీవుగూడ ప్రార్థనమొనరించుచుంటివా ,, అని యాతఁ డనెను.

,, నిజమే. నేను ప్రార్థనమొనరించి దీర్ఘకాల మైనది. మరల నీవు డొనరించితిని. కాని మన ప్రార్థనల వలనఁ బ్రయోజనము కలుగునని నీవు నమ్ముదువా ,,

„ విషసర్పములకు మానవభాష వచ్చి యుండునేని నాభర్తను కాపాడుమని నాగాంగన వేడుకొనిన మానవుఁడు క్షమించి యామె భర్తను చంపక విడచునా ? „

„ సోదరా ! పరమపవిత్ర మగు సర్వేశ్వరుని నిర్మలానురాగమును గూర్చి యపవిత్రముగఁ బలుకకుము. ఆమహానురాగమును మానవుల భావములతోఁ బోల్పఁదగునా ? „

„ అటులైన వడివడిగ సన్యాసినివై యద్వైత మఠమునకుఁ బొమ్ము. ఆవల ఘనకార్యభారము పైఁబడియుండఁ బ్రార్థనంబును ప్రలాపములునా ? „

„ విషమదశను మునిఁగి యుంటి మని నే నెఱుఁగనిదానఁగాను. పరిస్థితులను తిలకించుటచే క్షణకాలము నాధైర్యము చలించినది. ఇదివఱ కెన్నఁడును నాకట్టి భావప్రచలనము కలుగలేదు. నీ విచటికి వత్తువని యెఱుఁగక నేను రహస్యముగ నిందులకే యీమందిరమునకు వచ్చితిని. కడసారి మనజనకుని వదనమును జూడవలె ననునాశ యుగ్గలమయ్యెను. నే నిం దడుగిడినంతనే నాసర్వచైతన్యములు నీరవకాంత ప్రశాంతమున స్తంభించినవి. నాకు స్మృతి యుండియుఁ జలనశక్తి యంతరించినది. నే నొనరించిన మహాపాతకము లన్నియు బాహ్యాకారములై నాచుట్టుఁజేరి అతిభీకరముగ నాకుఁ గనఁబడసాగెను. నేను ప్రకంపితనై నలువంకలఁ జూడసాగితిని. మనచే వధింపఁబడినవా రందఱుప్రేతములును మహోగ్రస్వరూపములతోఁ శ్వేతవసనములతో శల్యాంగములతో రక్తేక్షణములతో నాపైఁబడబోవుచు నంగుళులతో నావంకఁ జూపుచు, కసిదీర ననుమూకుచున్నారో యనునట్లు పెదవులఁ గఱచుచు నావంకను మనతండ్రి శవమువంకను జూడసాగినవి. ఆహా ! ఆస్థితి యెంతదారుణము ! నే నిటనుండి యెగిరిపోఁ జూచితిని. నిలువజాలనంతటి మహాభీతి చేకూరె.

నైన నేమి? నా పాదములు బంధింపఁబడినరీతిఁ గదలక భూమి కంటు కొని పోయిన ట్లయ్యె. అంతట నేను మోకరిలఁబడి ప్రార్థన మొనరించితిని. నామానసము ప్రశాంత మైనట్లు తోచినది. ప్రేతము లగోచరము లయ్యెను. లూక్రెజా నీకుగూడ తరుణోపాయముకలదు సుమా" యని యెవరో పలికినట్లు వినబడినది.

"సోదరీ ఏటికీయసంగతసంభాషణము నేనుగూడ బసిబిడ్డఁగా భావించుచుంటివా? చాలు నీ స్వప్నభ్రాంతి నే నిట్టిభ్రాంతికి లొంగువాఁడఁగాను. పశ్చాత్తాపమునకు మన కవకాశమే లేదు. శత్రుమధ్యమునఁ బ్రాణాపాయసంశయం దుంటిమి. రమ్ము మన మిఁక నిట నుండగూడదు. మన హృదయములు పాషాణసదృశములు కావలెను. మన మింతవఱకు భయశార్దూలమువలె మెలఁగితిమి. మన మిపుడు సాధుమృగములుగ మారినచో మనపగతుఱ మనల జీల్చి వేసెదరు. రమ్ము. నిలువకుము రేపంత్యవిధి తీరినపిమ్మట నేను నీమందిరమున కేతెంచెదను. నాపరిజనుఁడు నిన్ను నీమందిరమున కిపుడు కొనిపోగలఁడు రమ్ము."

అని సీజరు పలుక లూక్రెజా యతనివెంటఁ జనెను.

ఈస్త్రీహృదయము గాఢాంధకార బంధురపర్వతగహ్వరతుల్యమై యున్నను నాకటికచీకఁటియందు మిణుగురుపురుగుకాంతివలె నణుమాత్రమాస్తికభావ ప్రకాశము గోచరింపలేదా! ఈనాతియాత్మఘోర కల్మష భరితమహాకూపాంతర్గతమై యడఁగియున్నను స్వప్రకాశవేళ మింకను గోచరింపలేదా? పరంజ్యోతి నిర్మల సూక్ష్మాంశ మెంతటి దురితమతులలో నడఁగినను నిజద్యుతిపరిసారమును నిగిడింపకమానదు.

ఆక్షణమున తనసోదరు డామృత్యుగృహమునకు రాక యుండెనేని ఆవిమలప్రకాశ మానాతిహృదయమున విస్తృతమై యుండదా? లవమాత్రమగునాపరిపూతము శరీరాంతర్గత సర్వాణునిచయమునకు వ్యా



పించి యుండదా ? అపుడు లూకెర్జాకుఁగూడ భగవదనుగ్రహ సంపాదనావకాశము చేకూరియుండదా ? లేదు. అట్టిభాగ్యమున కామె నోచుకొనలేదు. దైవసంకల్పము భిన్నముగానుండెను.

## ౫౫

ఆమరునాఁడు ప్రేతసంస్కారకర్మ ప్రారంభ మయ్యెను. దేశాచారము ననుసరించి శవమును మూతలేనిపేటిక యందుంచి దానిపైఁ గడుసన్నముగు వలిపెదుప్పాలువను గప్పిరి. వివిధములగు సువాసనలవెదజల్లు కుసుమములును సుగంధ భస్మములును దానిపైఁ జల్లబడెను. అందులకుఁ గలకారణము విదితమే.

ఉదయమున నేడుగంటలకూరేగింపు ప్రారంభ మయ్యెను. ఆ యుత్సవము పోపు మందిరమునుండి బయలువెడలి సెయింటుపీటరు దేవళమువంక నడువసాఁగెను.

స్విజరు సేనలు మిచెలాంజెలో నాయకత్వముక్రింద బారులుదీరి నిలచి యుండెను. కుటిలవదను లగునాసైనికుల వెనుక పౌరులు సహస్రాధికసంఖ్యల నిలచి యుండిరి. మేడలపై డాబాలమీఁద కిటికీలలో వసారాలలో తిన్నెలపై నెందుఁజూచిన వదనకమలనిచయమే.

విధిలేక పురజనులచే ప్రధానగృహములఁగడ దుఃఖసూచనగా నీలవస్త్రము లమర్పబడెను. ఘంటానినాదములు మ్రోయసాఁగెను. విపణు లన్నియును మూయబడెను.

మహోద్యోగులలోఁ గడపటితెగవారు ముందు కరదీపికలను చేబూని నడచుచుండిరి. ఆనాఁడు మబ్బుగ్రమ్మి చీఁకటిగానుండినను వాయుచలన మంతగా లేనందున కొవ్వువత్తులు చక్కఁగా వెలుగసాఁగెను. వారివెనుక పావనకళాశాల సభ్యులు నడచిరి. వారివెనుక యువకభటులు సుగంధతైలముగల దీపకళికలఁ గొనివచ్చిరి. ఆవల

కొంతసేనయుఁ బిమ్మట శవపేటికయు రాసాఁగెను. శవపేటిక ద్రాఁకను దానికి సంబంధించిన మొగములు సారను నెనమండుగురును వహించిరి. వారి వెనుక ప్రధానోద్యోగులును నున్నతోద్యోగులును ప్రభువులును నావల మఱియొక సేనాంగమును గొట్టకొనను పీజగాను రాసాఁగిరి.

మార్గములు జనసంకుల మయ్యెను. అడుగిడ నెడము లేదు. ఎందుఁ జూచిన నరనారీనిచయము. ఇండ్లకప్పులుగూడఁ గనఁబడకుండ జనసంఘము నిండిపోయెను. మందిరమును వీడి నాలుగడుగులు వచ్చుసరికి భయంకరముగ మెఱుపుమెఱసి మిరుమిట్లుగొలిపెను. దానిని గనినంతనే యీజనసమూహమంతయు భయభ్రాంతమై ప్రశాంతమయ్యెను.

సామాన్యస్థితియం దొక మెఱుపు మెఱసిన నెవ్వరును భీతిల్లియుండరు గాని మహాక్రూరుఁ డగునధికారిశవమును స్మశానమునకు గొనిపోవుతఱిని గలిగిన గాఢతటిల్లతాప్రకాశమున నెల్లరిగుండియలును దటతట లాడసాఁగెను. అది భయంకరశకున మనుమాట విశ్వాస మంకురించెను.

అంతలో దిగంతములు బీటలువారునట్లు మేఘనిర్ఘోషములు చెలగెను. భయవిహ్వలత మెండై కాళ్ళు గజగజ వడఁకసాగెను. శవవాహకులు నిలువఁబడఁజాలకుండిరి. పాషాణహృదయుఁ డగు నీజరుకుగూడఁ గొంతసంచలనము కలిగెను. దయ్యమునకును దేవునకును గూడ వెఱవని మిచెలోటోకుగూడ ముచ్చెమటలు పోసెను. సన్న్యాసులు మానసిక ప్రార్థనల గావింపసాఁగిరి.

ఈమహాప్రకంపన మడఁగకమున్నె మరల సౌదామినీ ప్రకాశము ప్రళయపయోధరధ్వానము ననుకరించు భయంకర శబ్దమొక్కటి పుట్టిన నేత్రకర్ణవిభ్రమము నొనరించెను. అంతలో దేవాలయ గోపుర స్తంభము పెళపెళా రావములతో విఱిగి పడెను.

అంతకంటె దారుణమగు నపశకున మింక నేమికలదు. వెనుకటిపోపు చనిపోయినపుడుగూడ నిట్టిభయంకరశకునమే కలిగెను. అది దుష్పరిపాలనా సూచకము. ఏలయనిన నలెగ్జాండరు పరిపాలన మత్యమితదుస్సహ మయ్యెను. మరల సీతని మరణసమయమునఁగూడ నీభయంకర శకునమే కలిగి రానున్న పరిపాలనముగూడ నిటులె యుపద్రవకర మగునని సూచించినను మూఢవిశ్వాస మొక్కమాటుగ నెల్లర హృదయముల మెఱసి పోయెను.

మహావాయు ప్రకంపనము చెలరేగినది. ఎడతెగని మెఱుములు నుఱుములు ప్రబలసాఁగెను.

పెక్కుకోట్ల ప్రజల నొక్కసారి భయపిశాచ మావహించి చైతన్యము హరించినది. ఉన్మాదులఁ గావించినది. ఉచితజ్ఞతను హరించినది. వారిచూడ్కులు విపరీతములు. సంజ్ఞలు భయానకములు. ప్రశాంతమగు మహాసముద్రాంతరమున బడబాగ్ని ప్రకోపనము కలిగినఁ గలుగుఁదరంగసంక్షోభమును బోలుసంక్షోభ మాజనముండలి నూగులాడింపసాఁగెను. బిగుసుకొనిపోయిన పిడికిడిలు ముడులువడిన కనుబొమలు ఒరలువెడలిన కరవాలములు పెచ్చుపెఱిఁగిన సంహార సంకల్పము. ఇదియే యిపుడు గోచరించిన భయంకర దృశ్యము.

సీజరు దానిని గమనించి సన్నిహితఘోరాపాయము కనిపెట్టెను. ధైర్యముతో నిలువుఁడని నిజపక్షమువారిని హెచ్చరించెను. ఆసన్న విపద్దశను మిచెంగాలో మాత్రము గుర్తింపఁగుండఁగలరా? సైనికుల సంసిద్ధులఁ గావించెను గాని కోట్లకొలఁది ప్రజల నెదురింప నెంతటి సుశిక్షితులైన నల్పసంఖ్యాకు లగుసైనికు లెట్లు సమర్థు లగుదురు?

అలెగ్జాండరు గావించిన మహాపరాధము లగణ్యములు గావా? ప్రతీకారచింత ప్రబలముగ ప్రజలయందు కలుగ లేదా? ఆశ్చర్యకరము లగుహత్యలు ఘోరకృత్యములు, నిరంకుశదౌర్జన్య పరిపాలనము,

51

ప్రజాపీడనము, రాజకుటుంబమువారి యవమానకర ప్రవర్తనము
మున్నగునవి పిశాచములవలెఁ బ్రజల నావేశించి ముందున కురుకఁ
చేయుట లేదా? ప్రతీకారమున కొను కలిగినది. పోపు శవమున
కవమానము ఘటింపఁజేరి చెనూరినది. ఎల్లర యాగ్రహమునకు
గుఱియై సీజ రెకుట గనఁబడుట ప్రజ్వలితాగ్ని నాజ్యహోమము రీతిని
వారి దారుణక్రోధానలము నినుమడింపఁజేసెను.

మంత్రస్వరము, బంభరఝంకారము, సాంఘికప్రణవాలినాదము,
తరంగఘోషము, మున్నగువాని నన్నిటి నతిక్రమించి క్రొంచన్నై
గొప్పదై గంభీరమై భయంకరమై దారుణమై ప్రజాఘోష మొక్క-
పెట్టున వెలువడెను. ,, బోర్జియా కుటుంబవిదారణ '' మను మహా
నాదము శతసహస్ర కంఠముల వెలువడెను.

క్షణికమున సేనలపంక్తి చీలిపోయినది. కరవాలములు రక్తాభి
షిక్తము లయ్యె. ఎడనొలఁగుట కవకాశము లేదు. కరము నవరింప
నవకాశము లేదు. సీజరు మొదలగువారలనే ఎల్లవారును నాగ్రహావలో
కనముల దహింపఁజేయుచుండిరి. వారి సేవకులును ప్రాణముల నరకు
చేయక దారుణముగ పోరుసలుపుచుండిరి. అంతయుఁ జిందర వందర
యైనది.

సన్న్యాసులు దేవళము దూరిరి. శవవాహకులు శవపేటికఁగొని
ద్వారముకడకు పరుగిడునంతలో కొక్కపెట్టుఁ గ్రమ్ముకొనిన
హుంకారధ్వానమున వారిగుండె లవిసి నాఁడు చైతన్యశూన్యులై
ప్రకంపిత శరీరులైరి. శవపేటిక ద్వార సోపానములపైఁ దొరలెను.
అలెగ్జాండరు శవము నల్లనై యుబ్బి శిథిలమై దుర్గంధయుతమైన
యలెగ్జాండరు శవము నేలపొరలాడెను.

అప్పుడా చెంత నిలచి దానిం జూడఁగలిగినవారినోట హృదయవిదా
రకమహాభీకరార్తనాదము వెడలి దశదిశల నలముకొనెను. ఆ నిరా

మిచెలొటో గూడ సీజరు సమీపమునకు రాఁగలిగెను. వారిరువురును ప్రాణములపై నాసవీడి భయంకరముగఁ బోరాడుచుండిరి.

మిచెలొటొ నిరాయుధుఁడై పోయెను. సీజరు నున్నతాశ్వము గతప్రాణ మయ్యెను. వారు మృత్యుముఖమునఁ బడుటకు సిద్ధముగ నుండిరి. అంతలో నొకబాహుశాలి కరవాలము సారించి ఎట్టయెదుట నున్నపగతుని తల నెగురవేసి ప్రజలయందు సంభ్రమమును కలిగింపఁ జాలెను. దాన వారిరువురు నూల్కొనఁజాలిరి.

ఫౌస్టు చిరచిర జనసంఘమున జొరబడి కరకు కరవాలమున నుగు మాడసాగెను. ఇట్లు ఫౌస్టసహాయశూరుఁడై దారిజేసుకొని పోవుటం గని ధైర్యవిభ్రమములు నెమ్మనముల ముప్పిరిగొన వారిరువురు నాతని ననుసరించి పరాక్రమింప సాగిరి.

ప్రజలలో ననిర్వాచ్య మగు మహాభీతి తలచూపెను. ముందున్న వారు వెనుక నున్నవారిని త్రోయుచు పరుగిడసాగిరి. పితృపతిసందర్శనము ఘటిల్లెనా యనునట్లు వారెల్లరును తల్లడిల్లి చెల్లాచెదరై తలచీరలు వీడ నలువైపుల కూరికిరి. అచిరకాలమున రాజమార్గములు జనశూన్యము లయ్యెను.

౫౬

అలెగ్జాండరుశవ మచట కొన్ని గంటలవఱకు నటులనే పడియుండెను.

శత్రుసేన యపారముగ వచ్చి పడె ననువదంతి నిముషమాత్రమున నగరమునందంతటను వ్యాపించుటచే నొకరివంక నొకరు చూడకుండ నెల్లరు పరుగిడిపోవుచుండిరి. మహోన్నతోద్యోగులు ప్రభువులు నితరులు శవవాహకులు వారు వీరననేల నొక్కసెట్టయైన నిలువకుండఁ బోయిరి.

లూక్రెజా మతబోధకుని దుస్తుల ధరించి నిజమందిరమును చేర

గలిగెను. సీజరు సేనాసమన్వితుఁడై పోపుమందిరమునఁ బ్రవేశించెను.

కొంతసేపటికి నెమ్మది కలుగఁగాఁ గొందఱు సుహృదయు లాశవమును సమాధియం దుంచఁగోరి యచటి కేతెంచిరి గాని దానివికృత రీతినిఁ గని బెదరి పాఱిపోయిరి.

సాయంకాలము వేళ ఫాష్టాదారిని బోవుచు నాశవముకడ నిలచి ,, యూరోపుఖండము నంతను గడగడ లాడించిన ఘంటశాసనుని గతియా యిది ,, అని యనుకొనెను.

,, ఈనికృష్టశవమునుగూర్చి నీ వేమితలంచెదు ,, వను భూతపక్షి కంఠధ్వని వినఁబడెను.

,, అహో నీవుగూడ నిచట నుంటివా! ,,

,, భోజనప్రియుఁడు విందుగృహమునగాక మఱెందుండును? ప్రణయమగ్నుఁడు తనప్రియకాంత సన్నిధానమునఁ గాక మఱెందుండఁ గలఁడు? రామబంధు పక్షి శవాంతికముననేగదా నిలచును? ఎల్లవారు నత్యంతప్రీతి పాత్రములనే చేరి యుండఁగోరెదను. కోట్లకొలఁది ప్రజలకు సౌఖ్యమును గలిగించ గలిగిన మానవుని శవముగతి యిదియే. ఎల్లరకు ప్రాణరక్షణార్థక మగు విమలతరంగిణీకూలమున నిలచి " దీనియందు విషమును గలుపుడు. దీనిలో నమృతమును జేర్పుఁడు" అని తా నెటుల నాజ్ఞాపించిన నటు లెల్లరును నోరెత్తకుండఁ జేయునట్లొనర్పగలశక్తిసంపన్నుఁ డీతఁడు. ఆనది నాతఁ డమృతమయ మొనర్పఁజాలినవాఁడు. అట్లొనర్చిన నాతని యాధిక్యత కాసంతయుఁ గొఱంత నొందియుండదు. గాని, యాతఁ డమృతమును గలుప నాజ్ఞాపింపక దానగరళము న్బోయ నాజ్ఞాపించెను. కావునే యాతని రాజ్యమునందలి ప్రజలహృదయము లాతనిపట్ల ద్వేషపూరితము లయ్యెను. వా రావిషసలిలముల గ్రోలి యాతని శాపతప్తుఁ గావించిరి. ఆవిషవాహిని క్రైస్తవమతవ్యాప్తిగల సకల దేశములం

మును శాపపరిశప్తమై ప్రవహించుటచే సకలదేశముల ప్రజలను గూడ విషోదకములనే గ్రోలి యాతని శపించిరి. ''

"ఆవిషోదకములవలె నీవాక్యములుగూడఁ గలుషితము లగు చున్నవి. ''

"నానుడులు సత్యములుగావా ? అవి కల్లలా ? అహో మానవు లెంతటి హ్రస్వదృష్టులు ! అవివేకులు ! నే నెవ్వనినామము నుచ్చరిం పజాలనో యాతని కంటెను నేనే శ్రేష్ఠుఁడనని భావించి, నా రాజ్య మును మానవులు సంతోషముతోఁ గావించుచున్నారు గదా ! ఎం తటి యజ్ఞానము—ఈతనిగతికి చింతిలకుము. ఈతఁడు మహోన్నత పదవిని బడసెను. ఈతనియెదుట సన్మార్గమును, దుర్మార్గమునుగూడ గోచరించెను. ఆరెంటికిని సంగమస్థానము కీర్తిప్రతాపైశ్వర్యసామ ర్థ్యనిలయ మగుపవిత్రాలయమే గాని యీ బుద్ధిహీనుఁడు దుర్మా ర్గము ననుసరించి దానిని పరిత్యజింప నని దీక్ష వహించెను. సన్మార్గ మెంతసుకరము : ఎంతసుగమము. అట్లుండియు దాని ననుసరించు వారే యుండుగదా ! మహామహామూర్ధాభిషిక్తులు, మతాధిపతులు, లక్షాధికారులు, భిక్షాధికారులు, ప్రభువులు, అనామకులు, నల్లవారును దుర్మార్గమునే వాంఛింతురే ? దుర్మార్గమువలనఁ గడువడిగఁ గీర్తిప్ర తాపైశ్వర్యములు లభించుననుమర్మమునకు మూఢమానవులు పాల్ప డియున్నారు. ఇది కేవలము పొరబాటు. ఇగిలవివేకము, ననిసితో— నీవు నావాఁడవగుటచే—నిర్భయముగ నీతో నేను చెప్పుచున్నాను. దుర్మార్గ మెన్నడును జేరువదారిగాదు. సుగమముగాదు. ఆదారిని కీర్తి ప్రతాపాదులనెవ్వరును గ్రమ్మరించియుండలేదు.

"ఓ మహాద్రోహీ నీతోఁబాటు నేనుగూడ నీవు దేవుని పవిత్ర నామము నుచ్చరింప నశక్తుఁడ నైతినో యాతని విడనాడితిని. నీకు నాయాత్మను సమర్పించుటకే యని నీవు భ్రమింగు" మని ఫౌస్టు దుర్భరసంతాపముతో నుడివెను.

"అయితే నానందింతుగాక! నే నెన్నియో దురాకర్షణములను గల్పింతు నని మానవులు నన్ను నిందించు చుందురు. అదికల్ల. నే నెట్టి ప్రయత్నమును చేయ నక్కఱ లేకయే మానవు లనాయాసముగ నావశ మగుచుండ నా కనవసర మగుశ్రమ మేటికి? దుర్మార్గము ననుసరించుటవలె సన్మార్గానుసరణముగూడఁ గడుసులభము. కంటకపథ సంచారముకంటెఁ బూబొదలచే నలరారు మార్గమున నడుచుట సంతోషప్రద మయ్యు మానవులు కంటకపథ సంచారము నే యభిలషింతురు. న్యాయసముపార్జితవిత్తలబ్ధ మగు నాహారము రుచికరమా లేక కార్యలబ్ధనోపార్జితము రుచికరమా యని తస్కరు నడుగుము. అమాయిక లగునారీమణుల మోసగించి వారిపాతివ్రత్యమును భంగపఱుచుటవలనను కులటాసంభోగమువలనను గలుగుసౌఖ్యముకన్న సహజానురాగప్రపూర్ణయగు కులవధూటీసంయోగ మానందప్రదమా యనికుచ్ఛితకులాంగనాదాసులను క్రూరులగు మోసగాండ్ర నడుగుము! ప్రజలనిడుమల పాల్జేయు సింహాసనాధిష్ఠానము సౌఖ్యప్రదమా యని ధరాధీశు నడుగుము. ఎట్టిద్రోహచింతయు లేకుండ నత్యల్ప మగుధనమును గడించి కుశాస్తరణమున నొరిగిననాఁడు కలిగినగాఢనిద్ర సుఖకరమా! అనాథయువతులను తలిదండ్రులు లేనిబిడ్డలను వంచించి వారిసొత్తు నపహరించి హంసతూలికా తల్పమున శయనించినపుడు కలిగిన నిద్ర సుఖకరమా యని యా యనాథస్త్రీ శిశుద్రోహి నీవడుగుము. ఇట్టి మానవులలోఁ గొందఱు వేదాంతులుగూడఁ గల రఁట. ఆహా వారెట్టి వేదాంతులు. ఈలోకమున సుజనుల కాదరణయు దుర్జనులకు శిక్షయుఁ గనుచు కలుగకనే పోవు నని వారు బోధింతురు. ఇది సత్యముగాదు. అట్టి వత్యల్పముగ జఱుగుచుండును. హంతకుడొకఁడో భూలోకమున శిక్షను దప్పించుకొనినవాని కింకశిక్ష లే దనియే వారు భావించెదరు. సజ్జను లాకస్మికముగ సంపన్నులు కాకుండుటచే యోగ్యతకు గణనలే దనియు వారు తలంతురు. ఇది యెట్టి కుతర్కమా

ఎట్టిమందబుద్ధియో పరికింపుము. ఈలోకమునందు శిక్ష దుర్మార్గునకు గలుగకున్నను సుజనునకు మేలు కలుగకున్న సంతటితో మగము టైనా ? కుజనునకుకలుగు కుటుంబసంబంధము గు మరవస్థయు ఆత్మ సంక్షోభమును శిక్ష కాదా ? సుజనునకు గలుగు చిత్తశాంతియు గృహానందము బహుమానముకాదా ? పాపసంతప్త మగునంతరాత్మ దుఃఖదాయకముకాదా. ఎట్టిపాపకార్యమును చేయమిచే నొప్పు నిర్మలాంతరాత్మ సౌఖ్యదాయకము కాదా? నే నిట్లెంతకాల మైనజెప్ప గలను,

"ఇటుల చెప్పి నా హాస్యవృత్తికి నను నిందించుటగా నీ కానందము"

"నీవు తప్పు చేసితి వని నేను జెప్పుటలేదు."

"నేను పరమదౌర్భాగ్యుడను. నాజీవితము దీర్ఘ మగుచున్నకొలందియు నాయపరాధమునకు శిక్ష యగ్గల మగుచున్నది. నీసంబంధమున నెంతటియైశ్వర్యమును సామర్థ్యమును గలిగినను నా కానందమావంతయును లేదు. మనశ్శాంతి యొక్కింతయును లేదు. నేనుగతించు శీఘ్రకాలమున తల పగులగొట్టుకొనదగు నని భావ మెన్ని సారులో గలిగినది. నేనటులొనరించిన నపుడే నీవశము కావలసివచ్చునని మానితి గాని లేనిచో నెన్నడో ప్రాణముల విడిచియుందును. ఆహా నాయంతరాత్మ కలదు. అది నిరంతరము నను వేధించుచుండును. మహోత్సవమధ్యమున నైన దాని వేదన యుపశమిల్లదు. హాస్యనటనము, ఆనందప్రకటనము, మోమున మందహాసము హృదయమున హాలాహలసదృశపరివేదనము. మానవాంగనల కెల్లకుశిరోమణి యనందగుమనోహరనారీశిరోమణి మృదులవక్షోభాగమున శిరము జేర్చి శృంగారసంభాషణల జెవులార చవులూర వినుచుండు నపు డైన నా కానందము కలుగుటలేదు. ఒక లేఖకుండు నాహృదయ

రంగమున నిలచి నాయపరాధముల బిగ్గరగా లెక్కించుచుండును. ,, నాకే గాని యితరుల కెరికిని వినరానివాక్కు సదా ,, భూతపతికి నీయాత్మ నమ్మితివిగదా యని పలుకుచునే యుండును.

,, ఓ మూఢుడా నే ననుభవించుచున్న మహా సంతాపబడబానల జ్వాలాప్రభూత మహాతరంగమాలికలయెదుట నీమనస్తాపము చిఱు నీటిబుగ్గయైనం గాంజాలదు. దాని కేమిలే. నీమనస్తాపము నీసౌఖ్యమును వమ్ముచేయుచున్న దనుచుంటివా? అట్లైన నీవు దానిని విస్మరింపంగోరెదవా ? ,,

,, ఆహా నీప్రశ్న నాకు వెనుక యిడా చేసినబోధనలును జ్ఞప్తికిం దెచ్చుచున్నది. నాజీవితశేషమున నే నీసంతాపవిషయములం బూర్తిగ మఱువంగలుగునట్లు చేయగలశక్తి నీకుం గలదా ? ,,

,, మధ్యధరాసముద్రమునం దొకదీవి గలదు. దానినడుమ నత్యున్నత మగు పర్వతకందర మొండు గలదు. దాని సౌందర్యమునకు మానవనిర్మితి మగునీరాజభవనము నీడు గాదు. దానినడుమ రెండు విమలవాహిని మర్మరధ్వనులతోం బ్రవహించుచుండును.

,, అవిమలతోయములు విస్మృతి బాహ్యములు. ,,

,, ఆహా అట్లైన నేను వానిం గ్రోలంగోరెద ఒక్కసారి నా కట్టిభాగ్యము చేకూర్పుము. అపుడు నా కీజీవితము సౌఖ్యప్రదము కాంగలదు. ,,

,, రేపటియుదయమున సూర్యోదయ సమయముననే మన మచటికి పోవుదము ,, అని నుడువుచు భూతపతి నెడలిపోయెను. ఫాస్టు మహానందభరితుం డయ్యెను.

,, విస్మృతి—గాఢవిస్మృతి. నాసంతాపమునంతయును విస్మరించెదను. గతమును మార్పం జాలకున్న మానె. మఱువంగలిగిన నదియే పదివేలు. నేను నిర్వికారముగ మహచ్ఛక్తి మగ

ధీనమును మహానానందముతో సంతాపమావంతయు లేకుండ సకల భోగములను ననుభవించెద. మఱువవలయు. సర్వమును మఱువనిచో శాశ్వతనరకావాసమును మఱువనిచో క్షణక్షణము దానినే స్మరించుకొనుచున్నచో నాజీవితము దుర్భరమగును. మఱచెద. సంపూర్ణముగ మఱచెద. ఆనందమున నోలలాడెద. ఆవిమలసలిలముల గ్రోలెద. ''
అని భావించుచు నలెగ్జాండరుశవ మున్నతావును వీడి ఫాస్టు వెడలి పోయెను. మఱికొంతసేపటికిఁ గొందఱు మహోద్యోగులచటి కేఁగి శవమును శవపేటికయందు గ్రోసి సమాధియందు పూడ్చివేసిరి.

## ౧౨

గ్రీసు అనటోలియాదేశములకు నడుమ నున్న ద్వీపకల్పమున నాంటి ఖోరసను చిన్నదీవి యొండు గలదు. ఒకనాఁడు ప్రాతఃకాలమున ఫాస్టును భూతపతియు నాదీవియందు సంచరించుచుండిరి. ఆయుషఃకాలరామణీయ మగణ్యము. సర్వజనమానసవశీకరణదక్షము. తరుశాఖల విహంగరాజములు విమలగాన మొనరించుచుండెను. గండుతుమ్మెదల ఝంకారనినాద మానందదాయకమై చెలఁగుచుండెను. పికాంగనామృదుగీతము సమ్మోహనము గావించుచుండెను. విమలసలిలపరిపూర్ణజలాశయముల చిరుమీలు చెలరేగుచుండెను. పశుల మందలు బాలభానుని కిరణజాలమున స్వర్ణకాంతుల చెలంగుచుఁ బచ్చికబయళ్ళ విచ్చలవిడి కనవు మొనవుచుండెను. క్రూరపన్నగములు వల్మీకపరిసరముల నక్రగతుల చరించుచుండెను. విశ్వ మంతయును ప్రేమ ప్రపూర్ణముగఁ గనఁబడుచుండెను. కరుణావేశ మెన్నడు నెఱుంగనికఠోరహృదయులుగూడ ప్రేమదేవికి వినమ్రు లగుచుండిరి. కాటికిఁ గాళ్ళు చాచుకొనిన ముదుకలుగూడ నవయౌవనమును మరలఁబడసితిమా యని యుప్పొంగుచుండిరి. అదిగో దైవచిత్రము. దైవప్రకాశము. దైవశక్తి ప్రభావము.

వా రిరువురు నాలతావితానచ్ఛన్నాంతర్గత మగు పర్వతకుహరమునుసమీపించిరి.

ఇదియే మహాద్వారము. ఈగుహాంతరాళమున పెక్కువేలవత్సరములనుండి ప్రకృతి పెక్కుమార్పుల నొనరించుచున్నది. సహజవనస్పతివనౌషధనికరస్పర్శనమున నిర్మలమై పరిశుద్ధమై స్వచ్ఛమైన సలిలము పర్వతాగ్రసీమనుండి యీ కందరమునఁ బ్రవహించుచున్నది. రమ్ము నీ వాసలిలముల గ్రోలి తృప్తిఁ జెందుదువుగాక " యని పలికి భూతపతి ముందు నడువ ఫాస్టాతని ననుసరించెను.

కొంతదూరము వఱకును సూక్ష్మరంధ్రములగుండ సూర్యకిరణములులోనఁ బ్రసరింపసాగెను గాని ముప్పదిగజములు సాగిన పిమ్మట నంతయు గాఢాంధకారముగనే కనఁబడెను. కాని భూతపతిమహిమచే నొక యద్భుతజ్యోతి యాకస్మికముగ నాప్రదేశము నంతను వెలిగింపసాగెను. అచటఁ దరులతాదిరూపములును మానవాకృతులును పశువిహంగాదిరూపములును క్రూరమృగ స్వరూపములును గోచరింపసాగెను. భూతపతి ఫాస్టు నొక యఖాతశిరమునకు గొనిపోయెను. ఆ ప్రదేశము చాల వక్షువరకముగ నుండుటచే నచట నెంతటిధైర్యశాలి యగు మానవుఁడైన సాహసింపఁజాలఁడు.

ఫాస్టున కట్టిభయ మావంతయును లేదు. గాన భూతపతి యిట నుండి యీయఖాతమున నురికినంతనే ఫాస్టుగూడ నతనిననుకరించెను. దాని యెదుటనే యొకగుహ కనఁబడియెను. వింతదీపపు కాంతిచే నాప్రదేశముగూడఁ బ్రకాశిత మగుటచే నావిషమమార్గమున వా రవలీలఁ జరింప సాగిరి.

వా రీరీతి నంతరంతరములుగ నున్ననాలుగు అఖాతములఁ బడి స్ఫటికశిలామయప్రదేశముల దాటిపోయిరి. అన్ని యఖాతములందును గూడ విచిత్రదీపకాంతులు ప్రసరించుచునే యుండెను. అంతలో నాప్రకాశ మడఁగి గాఢాంధకారము గ్రమ్ముకొనెను.

“భయపడకుము. అత్యద్భుత విషయముల నీ విపుడె చూడఁగలవు” అని భూతపతి యాతని చెయిపట్టుకొని కొంతదూరము నడిపించి “యదిగో చూడు” మని పలికి ఎడఁదొలఁగి నిలచెను. నూటయిరువది గజముల పొడుగు నూటపదిగజములు వెడలుపు అఱువది యడుగుల యున్నతంబును గల విశాలప్రదేశము భూగర్భమునం దెక్కడనో యెంతలోతుననో ప్రకృతిచే నిర్మింపఁబడినది. ఉపరిభాగమున స్ఫటికశిలామయ మగువితానము. ఆవితానమునం దనంత కాంతుల నీనుచిత్రవిచిత్ర తోరణాద్యలంకారములు అలౌకికప్రకాశము శ్వేతశిలామయములగు వృక్షములు వేయేల మానవు లెన్నఁడును గనినదియు వినినదియు గానిదివ్యవిలాస మపుడు ఫౌస్టుకుఁ గనఁబడియెను.

తన్మధ్యభాగమున నారడుగులు పొడుగును రెండడుగుల వెడలుపుగను పదిహేనడుగుల యెత్తునుగల దేవతానిలయ మొప్పమీరుచుండెను. దానిచుట్టును యిరువదియడుగుల యెత్తుగల స్ఫటికదీపస్తంభములు దనరారుచుండెను. ఎచటఁ జూచినను వింతవింతకాంతులు నధోభాగమున నూర్ధ్వభాగమున నిరుపార్శ్వముల దశదిశల గోచరింపసాగెను. చిత్రవిచిత్ర వివిధవర్ణవిలసితమగు రత్నకంబళ మమర్పఁబడిన దీని నాప్రదేశ మంతయును శోభితమగుచుండెను.

ఫౌస్టు తన్మయుఁడై నిలచిపోయెను.

“ఆహా యేమివిచిత్ర మిది. ఏమి ప్రకృతినిర్మాణకౌశలము. సరే గాని విస్మృతివాహిని యెం దున్నది.”

“ఇదిగో కనుగొనుము”

“అటులైన నే నాసలిలముల గ్రోలెదను.”

“నీవు స్థిరచిత్తుఁడ వైతివా”

“ఏటి కీసంశయము. నేను సర్వమును విస్మరించి సంతసమున నోలలాడెదను.”

"మూర్ఖుఁడా నీవు సర్వమును విస్మరించెదవు. పూర్వాపరములను వ్యక్తిత్వమునుగూడ మఱచి పశుతుల్యుఁడవై పర్వతకుహరమును నిర్గమించెదవు. నీజ్ఞాన మంతయును నీవిద్య యంతయును శూన్య మగును. చదువఁ జాలవు వ్రాయ నేరవు ఏభాషయును నీకు బోధ పడదు. నీ వేభాషయందును మాటలాడఁజాలవు. అప్పుడే పుట్టిన పసిబిడ్డవలె నుందువు. శరీరదార్ఢ్యము మాత్ర మత్యద్భుతముగ నుండును.

"నీ విట్టిస్థితి నుపదేశించుటకా నన్నిందుఁగొని వచ్చితివి."

"లేదు. మానవులకు గల వివేకశూన్యతను వెల్లడించుటయే నాకు మహదానందము. మానవులతోఁ బోరుట వారిఁ బీడించుట వారిలోపముల వెల్లడించి ధిక్కరించుట వారిని సన్మార్గములపాలు చేయుటయును నవియే నాజన్మఫలితములు. అదియే నాప్రారబ్ధము. ఆశాభంగమునఁ గలిగిన యశక్తి దుర్జనత్వమును నీ విపుడు వెల్లడించుటఁ గనుటయే నాపరమవాంఛ.

"అయ్యో" నోటి కందించిన పానపాత్రి నేల నిటుల నేలఁబడఁ గొట్టితివి."

"అది నాప్రకృతి. అదియే మానవసంఘముపై నాకుగల ద్వేషమహానలము; అవిచ్ఛిన్నము. అది యెన్నటికిని బ్రశాంతమగునదికాదు. నే నింతకంటెఁ జెప్పఁజాలను."

"ఆహా ఎంతటి యడియాశకు పాత్రై చేసితిని. అయినఁ జాలు పోవుదము పద."

"ఎచటి కేఁగెదవు. నేఁడు రోమునగరమున సందడి మెండు."

"సరే యచటికే పోవుదము. నేఁడచట పోపుపదవి కొకని నిర్ణయింతురు."

అని పాస్టు నుడువ భూతపతి ఆతనికరమును స్పృశించెను. వారిరువురును రోమునగరమున చేరిరి.

సెంటుపీటరుచతుష్పథము మరలజనాకీర్ణ మయ్యెను. పోపుమందిర ప్రధానభవనమునఁ బవిత్రకళాశాలల వారందఱును క్రొత్తపోపును నియోజింప వచ్చి యాసీనులై యుండిరి.

ముప్పదియేగురు కార్డినలు లందుఁ జేరిరి. వెలుపల నున్నప్రజలు బలవంతమున నియోజనమునకు భంగము కలుగఁజేయకుండఁ దగిన ఏర్పాటు లన్నియును జేయఁబడెను.

చతుష్పథమునందుఁ జేరియున్నసహస్రాధికసంఖ్యాక మగుజనసముదాయ మాభవనమువంకఁ దిలకించుచుండెను. పగలు పదునొకండు గంటలవేళ యైనది. ఆతురత యత్యధికముగ నుండెను. అంతటఁ బొగగూడునుండి అణుమాత్రముగ ధూమము వెలువడసాగెను. కార్డినలులు భిన్నాభిప్రాయులైరి. నియోజనఫలితము తేలలేదు. నియోజనాపత్రములు తగులబెట్టఁబడెనని ప్రజలు గ్రహించి వికటాట్టహాస మొనరించిరి.

మరల నియోజనము జరుగును. దానిఫలితము సాయంకాల మయిదుగంటలకు గాని తేలదు. ఈలోపల కార్డినలులు భుజింపవలసి యున్నది.

మన మింతలో నొకసారి సీజనుమందిరమున జరుగువిషయములను బరికింతము. నియోజనము జరుగునపుడు సీజ గామందిరమున నుండినచో నియోజకుల కెట్టియభిప్రాయము కలుగునో యనియు నిష్పాక్షికముగ నియోజనము జరుగుటకు సీజ రచటనుండకుండుట మే లనియు నచటివారు నిర్ణయించుటచే సీజ రటనుండి నిజమందిరమున కేఁగెను. అతఁ డాందోళనముతో నటునిటు తిరుగుచుండ నిచెడువార్త వచ్చి నియోజనపత్రములు తగులబెట్టఁబడెనని తెలిపెను.

,,ఆహా భిన్నాభిప్రాయములు కలిగెనా? జ్వాలయను శ్రీ...

రోవరీ—ఫ్రాన్సెస్కో, పిక్కోలోమినిగార్లలో నెవ్వరైన నియోగింపఁ బడవచ్చును. కాని నేను పిక్కోలోమినీకి మాట యిచ్చితిని. అతఁడు విజయుఁడైనఁగాని నాకు భద్రము కలుగదు. రోవరీపక్షము వారిలో నొక్కని వశపఱచుకొనినఁ జాలు. మనకు ఫలము చేకూరఁగలదు "

" కార్డినలు మెటూరీ. "

" తెలసె తెలసె. అతఁడు ధనాశాపరుఁడు. అత్యధికముగు సంపద నొసఁగిననతఁడు వశుఁడగును. మిచలోటో అటులనే కావింతము " అని పలికి సీజరు మిక్కిలి వెలగల స్వర్ణాభరణములు గలపేటిక నలమారునుండి తీసి మిచెలొటోకు జూపెను.

" ఈధనమున నొక్కనిఁగాదు పన్నిద్దఱు కార్డినలుల దాసులఁ గావింపఁగలను. "

" మన ప్రయత్నము తప్పక నెఱవేఱుట కీధనము నంతను గార్డినలు వెంటూరో యుపపత్ని యగు నిసీడామారినో కొసఁగి రసీదు గొని రమ్ము. ఈయాభరణముల సంఖ్యను విలువను గూడ నామెచే వ్రాసి సంతకము చేయవలె నని కోరుము. " అని సీజ రాజ్ఞాపింప మిచెలొటో వెడలిపోయెను.

తోడనే అన్సైనుమతాధికారి యగు ఆన్సెలమునాస్ట్రసు సీజరుమందిరమునఁ బ్రవేశించెను.

మామూలు మర్యాదలు జరిగినవెనుక " మీ రేలవచ్చితిరి? నెహాముసంఘకార్యములందు నిమగ్నులై మీ రెంతో యింటి రని తలంచితి " నని సీజరు పలికెను.

" మీవాగ్దాన మింకను చెల్లింపలేదు. రోమగ్రా పీఠాధిపత్యస్థానము ఖాళీ యయ్యె నని విని మిమ్ము సందర్శింప వచ్చితిని. చిరకాలము నుండి విశ్వాసముతో సేవించు మీయనుచరు నుచితరీతి నాదరింప ననను గలిగిన దని విన్నవించుచున్నాను. "

" దాని నొసంగుటకు నా కధికారము లేదే ''

" మీతండ్రి కీర్తిశేషుఁ డగుటచే ప్రభుత్వాధికారము మీకరగత మైనదిగదా ''

" ప్రిక్లోమసి కనుకూలముగ వోటు నిచ్చుట కొఱకై నిని కౌన్సిలు ప్రెస్సోలో కిదివఱకే వాగ్దాన మొనరించితిని.''

అటులైన నా కొసఁగినవాగ్దాన మింకను రిత్తపో దగినదేనా! నే నొనరించిన మహత్తమ మగుసేవను బాగుగా గుర్తింపుము. దేహము సంఘమును మీ కనుకూల మగుసాధనము గానొనరించితిని, నా స్వాధీనమం దున్నవారి సంఖ్యని మీకార్యసాఫల్యము కొఱకు నియమించితిని ''

" మీయుపకారమును నేను మఱువలేను. నేను కృతఘ్నుఁడను గాను. నేను మిక్కుటమగుధనలోపమున నిబ్బందిపడు నపుడుగూడ మీకు ధన మొసఁగుపట్ల నెట్టికొఱంతను గలుగఁజేయలేదు. నా కధికారము లభించినపిమ్మట మీ కత్యధికముగ ధనము నొసఁగి యుంటిని. ఇప్పుడు మీ కెంతధనము కావలసినను వెంటనే యొసఁగ సంసిద్ధుఁడను ''

,, నాకు ధన మవసరము లేదు. వాగ్దానమును మీరు చెల్లింప వలె ననియే నేను గోరుచున్నాను. ''

,, వాగ్దానమా! అగును మద్యపానమున మైమఱచినపు డట్టివా గ్దాన మొనరించి యుందును. కావున నట్టివాగ్దానముల చెల్లింపవలె నని యుచితజ్ఞు లెవ్వరును గోరరు" మద్యపానసమయముననుమఱి యొక రహస్యావస్థయందును యొడ లెఱుంగనిసారిలో నిట్టివాగ్దానము లను చేయుదురు. గాని వాని నెవ్వరును జెల్లింపఁదలపరు. ''

,, అటులైనఁ జెల్లింపఁదలంపకయే మీ రిట్టివాగ్దానముల నొనరించి తిరా? ''

" మీ రేమనుకొనిన సరే. నన్నిపుడు బాధింపకుఁడు. నామనసు కలతఁజెంది యున్నది. నియోజనఫలితము తేలలేదు. విషపానముఁ వలనఁ గలిగిన బడలిక యిపు డిపుడే సడలుచున్నది. ఇపుడు నాకు నిజముగ జీవితసంశయమే కలిగి యున్నది. ఇట్టితఱిని మీరు నామనసు నొప్పింపకుఁడు. "

" నన్ను విద్వేషిగ నొనరించిన నేమగునో గ్రహింపుఁడు. మీరిట్టి సందిగ్ధదశయం దుండుటచేతనే వాగ్దానము నెఱవేర్పఁగోరుట కిదియే యదన యని తలఁచి నే నిందువచ్చితిని. "

" సర్వసంగపరిత్యాగి వగుసన్యాసివి గావున చక్కఁగాఁ బలికితివి. నీస్వార్థపరత్వమును మఱుగుపరపక స్పష్టముగఁ దెలిపి నందులకు సంతసించెదను. నేను నిన్ను సరకుచేయు వాఁడగాను. "

" అటులైన జాగరూకుఁడవై మెలఁగుము ! "

" ఎవరికొఱకు—నీకొఱ కా సన్యాసి వేషమున కుఱుఁగుపడిన రాజద్రోహి వగు నీకొఱకా ? ఉరికంబములనుండి శవమై పడి మరల బ్రతికింపఁబడిన—"

అనునంతలో సన్యాసి వసనాంతరమునఁగల కరవాలమును జేఁబూని "ఆగుము. అధిక ప్రసంగము వలదు. మన మింతటినుండి ప్రబలశత్రువులమే. మనశత్రుత్వము ప్రాణాంతమునఁ గానితొలంగదు. నేను మీకుటుంబము నంతను రూపు మాపఁగడంగెదను. నాకుగల సాధనసంపద యనల్ప మని గ్రహింపుము " అని పలికెను.

" నీబెదరింపులకు నే నదరిపడువాఁడఁగాను. ఆపదవిని నీకీజాలను. నీవిట్లు బెదరించితివి గాన రోమన్నాయం దధికారము నీ కుండుటయే గాక ప్రవేశముకూడ లభింప నీయను. నీశక్తిఘనమును నాసామర్థ్యమల్పమును గాదు. దేహముసంఘానుచరులు నీబలము. నాకుగలసేన, నాబలము. నారహస్యములు నీవు వెల్లడింతు వని నేను భీతిల్లువాఁడఁ

గాను. నీ వల్లానరింపజాలవు. నీ వల్లనరించినంతనె నీ వెవ్వఁడు— నేను నిజమును లోక—

చాలును. నీరహస్యములను నేను వెల్లడింపను గాని యితర విషయముల నిను సాధింపఁగలవాఁడ ,, అని పలికి సన్యాసి వెడలిపోయెను.

సీజ రతనిప్రల్లదములఁ దృణీకరింపసాగెను. అంతలో మిచెలోటో మరల వచ్చెను.

,, కార్యము నెఱవేఱినదా ? ,,

,, పూర్తిగా నెఱవేఱినది. ''

,, ఆమె మణికానుక నందుకొని తనకృతజ్ఞతను దమకు విన్నవింపఁ గోరెను. ఇదుగో రసీదు. ',

,, సరే నీవు పోపుమందిరమున కేఁగి మూఁడు గంటలకు కార్డినలుల కాహారములు పంపఁబడునపుడు నిసీదా వ్రాసిన లేఖను కార్డినెలు వెంటూరో భోజనపాత్రయం దుంచి యాతని కందఁజేయున ట్లొనరింపుము. పరీక్షకుఁ డగు పరమామతాధిపతి మన కనుకూలుఁడే గాన నిది సులభసాధ్యమే " అని సీజరు పలుక మిచెలోటో వెడలిపోయెను. అతఁ డారీతిగా స్వామి యాజ్ఞను నిర్వర్తించెను. ఉపపన్ని లేఖ కార్డినలుకుఁ జేరినది.

క్రమక్రమముగ జనసంఖ్య హెచ్చినది. సాయంకాలమున నైదు గంట లగుసరికి నగర మంతయు జనశూన్యమై చతుష్పథము జనసంకుల మయ్యెను. ఈసారి ధూమము వెలువడలేదు. పోపు నియోజనము సాగినది.

కార్డినలు వెంటూరో సౌధాగ్రమున నున్న వసారాలోనికి వచ్చెను.

,, సియన్నా కార్డినలు సీజరుఫ్రాన్సిస్కో-పికోలోమినిగారు పోపుపదవికి నియోజింపఁబడె నను శుభవార్తను మీ కెఱిఁగింప వచ్చితిని. ఆయన యధికారమును వహించెను.''

72

అని యాతఁడు తెలుపగనే యొక్కపెట్టున నెల్లవారును హర్షధ్వనుల గావించిరి. ఈవర్తమానము సీజరునకును లూకెబ్రిజాకునుగూడఁ దెలుపఁబడెను.

౫౯

ఆరీతిగా నాన్సలమునన్యాసి మాగ్రహముతో సీజరుసముఖమును వీడి వడివడిగ శిథిలమైన కలిసియావంకకు నడువనాగెను.

అత్యద్భుతమని విఖ్యాతి గాంచిన యామహాభవన మంతయు శిథిలమైనను దానిగాంభీర్యమునకు సూచన లింకను గలవు.

ఆవిశాలభవనమున సత్క్రైస్తవులగు ననాదిప్రజలను క్రూరమృగములతో బాహాబాహిఁ బెనఁగునట్లు మూఢవిశ్వాసముగల రోమనులు నిర్బంధించుచుండెడివారు „మూఢవిశ్వాసులవలన నపవిత్రమై భక్తుల రక్తప్రవాహమునఁ బరిశుద్ధ మొనరింపఁబడె" నను లిఖిత మాశిథిలముకడ శిలాఫలకమునఁ జిత్రింపఁబడెను.

ఆయావరణము ౨౦౦౦ అడుగులు వలయాకారముగ నున్నది. బందీలుగఁ జేయఁబడినముప్పదివేలమంది యూదు లాభవనమును నిర్మించి రని యనుశ్రుతముగ వినవచ్చుచుండును. దానిలో నెనుబది వేలమంది కూర్చుండుటకు దావుకలదు. ఒక్కసారి యైదువేల ఘాతుకమృగములతో మల్లయుద్ధములు జరుపుటకుఁ దగిన విశాల మగుతిన్నె గల దని చరిత్రకారులు వ్రాసిరి.

అట్టిభవనము శిథిలమై యచట నచట శిలాస్తంభాదులు కొన్ని మాత్రమె నిలచి యుండెను. అన్సలమునన్యాసి యచటి కేఁగుసరికి సోమభానుఁ డమృతకిరణములఁ బ్రసరించి దానిని బ్రకాశింపఁ జేయసాగెను.

ఆభవన మంతయును శిథిలమైన నొకచోఁ బవిత్రవేదికాపరిసర ప్రదేశము సలక్షణముగ నిలచి యుండెను. వేదికపై నున్నత మగు

క్రాసుచిహ్న ముండెను. "పశ్చాత్తాపచిత్తములతో నిచటికి వచ్చు వారికి నెలదినములవఱకుఁ శాపము లంట" వని యచట చిత్రింపఁ బడెను.

అన్సలముసన్యాసి యాదారిని బోవ నచట నొకగోడచెంతఁ పండుకొనియున్న పురుషు లిద్దరిలో నొకఁ డాతని యడుగులసవ్వడి విని తటాలున లేచి "యెవరువా" రని యడిగెను.

"నేనే. క్రిస్టు నెమ్మదిగా మాటలాడుము. ఏలయనఁ పరిశుద్ధులగు సన్యాసులు కొందఱు రాత్రులలో నిచటికి వచ్చి ప్రార్థనలు గావించుచుందురు. వెలస్టేనునుగూడ లేపుము. అత్యవసర మగుపని కలదు" అని అన్సలము పలికెను.

"నేనుగూడ మేల్కొనియే యున్నానుస్వామీ. ఏమివిశేషము!"

"సీజరుద్రోహి ఆడితప్పినవాఁడు విశ్వాసఘాతకుఁడు కృతఘ్నుఁడు అతఁడు ధన మొసంగెద నన నేను నిరాకరించితిని. నేను కోరిన పని నాతఁ డియ్యనని. నేనందుల కతన్నిశిక్షింపవలెను."

"అయ్యో ధనము నేల నిరాకరించితిరి !" అని వెలస్టేను పలికెను. ఇతఁడే యిడాభర్త.

"నీ వనవసరముగ మాటలాడకుము. మీరు నామాట ప్రకారము నడచితిరి గాన మీ కొసఁగెద నన్న పసదనము లనిచెదను. నే నచిరకాలముననే సీజరు కుటుంబవినాశన మొనరింతుఁగాని వారిచ్చుధనమును గొనువాడనా ? సీజరునే గాక యతనితో సంబంధముగలవారి నందఱినిగూడ హత మొనరించెద. ప్రాణములఁ బాసిన వానితండ్రినిగూడ నెల్లరచే గర్హింప బడున ట్లొనరించెదను."

"మన మిల్లిచటకాలయాపన మొనరించిన లేబరురాష్ట్రపాలకుఁడు గిరిదుర్గము నాక్రమించును. కారలు కానేరిదు మున్నగువారి నవలీలవారు లోఁబరుచుకొనిన మనగతి ఏమి"ని మరల వెలస్టెను పలికెను.

,, నా కావిషయమున నెట్టిభయమునులేదు. సార్వభౌముఁడు ఖడ్గ పాశములం గని కడుసడలియుండెఁ గావున నతఁ డనవసరముగఁ బ్రాణము నర్పింప నంగీకరింపఁడు. వెహాముసంఘమువారు తలంచినఁ దస ప్రాణముల నవలీలగఁ గొనఁజాలుదు రని మేక్సిమిలను బాగుగా నెఱింగి యున్నాఁడు. ”

,, అటులైన నే నింక నిర్భయముగ మీయాజ్ఞల నెరవేర్తును. ఇది యేలనో ఫ్రిట్జు తన కెట్టిసంబంధము లేనివానివలె మౌనము వహించియున్నాఁ ” డని వాలస్టైను పలికెను.

,, నీవుగూడ నామార్గము నే యనుసరింపుము. ధీశక్తిగలవారి యాజ్ఞలను బాహుబలముగలవా రనుసరింపఁదగును. నీ వీమార్గము ననుసరించి యున్న వియన్నానగరమున నంతటియవమానము నీకుఁ గలిగియే యుండదు. జర్మనుప్రభు వింకను దుర్గమున నవయుచునే యుండును. ఎట్టి యనుమానమునకును గారణము లేకనే యుండును. ఇపుడన్ననో దుర్గమార్గములు మున్నగున వన్నియును వెల్లడి యైపోయెను. ” అని ఫ్రిట్జు నుడివెను.

,, నన్నేల నిందించెదవు. నేను ప్రభుని గాన నంతకాలము నటించితినిగాదా — దానివలన నాశక్తి విదితమగుట లేదా! ” అని వాలస్టైను పలికెను.

,, వటవట వదరకుము. నీవు మహాపరాధము నొనరించితివి. ఫ్రిట్జు పలికినది నిజము గాని, దాని నిపుడు కూడఁ జేయఁజాలము. గాన దానిని బేర్కొనఁ బనిలేదు. నీ సాధనము నంతను స్వార్థపరుఁడవై వశపరచుకొని సంఘమునకు చిల్లిగవ్వకైన నీయవైతివి. ఏమైన నేమి గతమును ఫ్రిట్జు తలపెట్టవలదు.” అని సన్యాసి కఠినముగఁ బలికెను.

,, మీయాజ్ఞ మీఱువాఁడఁగా ” నని ఫ్రిట్జు వినమ్రుఁడై పలికెను.

,, ఇఁక ప్రతీకారము. నీజను వంశవినాశన మైనచో మనము

అటుపిమ్మట జర్మనుసామ్రాజ్యమునఁ గొంతపని చేయవలె యున్నది. సంఘమువారు ఓటోపియనల్లాను గడతేర్ప నిశ్చయించిరి. మఱినీ కేమియు దెలియును. పియనల్లా యెటులాడించినవారల నతఁడెఱుఁగును గాన నతనిజోలి మన కక్కఱ లేదు.''

''స్వామీ మిత్రురాండ్రమాట ఏమి ?''

''ఛీ ఛీ. పరమనీచురాలు దానిపైననా? నుసిపురుగులతోఁ దుల్య మగుముదుసలియాఁడుదానిపైననా? వెంటుముసంఘము కర్త గట్టుట! పియనల్లా యనిన నధికోత్సాహమును ధైర్యమును, సుగుణ సంపదను, మాన్యవర్తనమునుగలవాఁడు గాన నతనివలన మనకు గొప్పప్రమాదము కలదు. గాన నతనిరూపు మాపవలెను. ఆపని ముగియగానే ఎల్బీనదీపరిసరమున కేఁగెదను.

''అహో మన వెనుకటియజమానుఁడగులిన్సుగ్రాఫు మాన్యగృహ ప్రభుని సందర్శించుటకా'' అని గ్రిట్జు నుడివెను.

''గ్రిట్జు నీవు సరిగా నాలోచించితివి. నీవుగూడ నా వెంట నచటికి రావలసి యుండును. ఆనురభిమాని యగుప్రభువు మనచేతఁ జిక్క గలవిషయము నాకిటీవలనే గోచరించినది. నీవు గ్రహించితివా''

''స్వామీ ఆబిడ్డజాడ యేమైనఁ దెలసెనా''.

''ఇంకను బిడ్డయా! యెన్నివత్సరములు గడచెను. ఆమె యిపుడు సంపూర్ణయౌవనవతియు సౌందర్యవతియునే గాక శుభ గ్రహబలమున మహోన్నతపదవినిగూడఁ బడయఁగలిగెను. ఆగోడవ యిపుడేల! ఒంటరిగ నున్నపుడు తెలిపెదను.''

''నేను వినగూడనిచో వెడలిపోయెద'' నని నెల్సను గ్రోధము తోఁ బలికెను.

''నేను తొందరపడువాఁడనుగాను, గాన నుచితజ్ఞతచే నటుల బలికితిని. నీ వందులకు గి[illegible] లేదు. నీవు [illegible]

నీనోట నుచ్చరింపఁదగినదైన దానను నని నీవే యెఱుఁగుదువు. పోపాముసంఘ రహస్యములనుగూడ నీ వట్టి యవస్థలో వెల్లడించుచుందువు. ప్రిన్సు నీవుమాత్రము లిన్సుశ్రీఫు వర్గమునకు నా వెంట రావలెను. ఇపుడు నీతల ముగ్గుబుట్టవలె నెఱసి యుండుటచే నీవు హూర్యాగోవని యూతఁడు నిన్ను గుర్తింపఁ జాలఁడు."

"గుర్తింపఁజాలఁ డని యే తలఁచెదను. కాలము మనయాకృతులందును పరిస్థితులందును పెక్కుమార్పులఁ గావించుచుండును. నేనా ప్రభువునకు విశ్వాసపాత్రుఁడ నగుభృత్యుడనై యున్నకాలమున నీవు గూడ నీచపరిచారకుఁడవై యతని సేవించుచుంటివి. నేఁ డన్ననో పోపాముసంఘప్రధానాచార్య పీఠము నధిష్ఠింపఁ గలిగితివి. పాపమా భాగ్యహీన యగు భామామణిని గావలిఁగాయుపనియందు నన్నుఁ దొలగించి నిన్నాప్రభువు నియమించుట నిన్నమొన్న జరిగినట్లే నాకుఁ దోచుచుండును" అని ప్రిన్సు పలికెను.

"ఏమి నీవెఱ్ఱి. అవి పరమ రహస్యములు. పల్లెత్తి పలుకఁదగినవి గావు. కాలపరిపక్వ మింకను గాలేదు. అచిరకాలముననే కానున్నది. నేను జర్మనీదేశమున కేఁగినంతనే లిన్సుశ్రీఫు ప్రభువు నచట సంఘాధికారిపదవినుండి తొలగించుటకు నుత్తరువొసఁగఁబడును. ఆతఁడు సంఘాధికారమును పెక్కువిధముల దుర్వినియోగ మొనరించెను. నీపట్ల నాపట్ల నవిశ్వాసమును గనబరచెను గాన దానిఫలము నాతఁ డనుభవింపక తప్పదు. మన మిట్లు గూఢముగ మాటలాడుకొనుట వెలస్టేనుకుఁ గష్టముగా నుండును. గావున నిఁకఁజాలింతము."

"స్వామీ నా కావిషయములతో నేమియును బనిలేదు. ఈ మొండిగోడలనడుమఁ బడియుండుటయే నాకుఁ గష్టముగా నున్నది. గాన నే నొనరింపవలసిన పనులనుగూర్చి వడివడిగ—"

"అటు లనెదవేల? కల్లంగడి కంటఁబడదాయె నని కలవరపడుచుంటి వనుము. నరే మీ రిఁక నిచట నుండఁ బనిలేదు. శ్రద్ధతో

వినుము ఫ్రిజ్జు! నీవు ఫెబెయో ఆర్సినో ప్రభుని మందిరమున కేఁగి దర్శనమును గోరుము. నాపేరు చెప్పినజాలును వెంటనే యతఁడు నీతో ముచ్చటించును. ఇరువదినాల్గు దినములలో సీజరు కుటుంబ వినాశనమున కీనగరమున నెహముసంఘానుచరులు కొందరు యుండి సంకేతస్థలమును జేరి వినాశన మొనరింపఁగల రని నీ వాతని కెఱిగింపుము. వెరెస్టేను నీ వీపత్రమును శ్మశానద్వారమున కతికింపుము. దీనివలన నరోడ్డాండగు మత్సరిత మండలికిని వెల్లడి యగును. మొదట నాతఁడే నాకినుకకుఁ బాత్రుఁ డగుగాక. మీ రీరెండుకార్యముల నెఱవేర్చితి రేని యిరువదిమూఁడు దినములవఱకు నిచ్ఛావిహారమున నీనగరమున వినోదింపవచ్చును. నే నంతవఱకు నీనగరమున నుండను. ఇరువదిమూఁడవదినము సాయంకాలము మరల మీరు న న్నిచట కలిసికొనుఁడు. అప్పటికి సంఘానుచరులందఱు విడివిడిగ నీ నగరమును చేరెదరు. నేను బోధించురీతిని వారి నందఱిని మీరు సంకేతస్థలమునఁ జేర్చవలెను. మన మీవిషయమున ఫెబెయో ఆర్సినికి తోడ్పడి సీజరు కుటుంబమును రూపుమాపవలెను. ఆర్సినో ధన మొసఁగుటలో వెనుదీయువాఁడుగాఁడు" అని నుడివి అస్సలముసన్యాసి యటనుండి వెడలిపోయెను. మరికొంతసేపటికి నా రిద్దఱును గూడ యూరోపి యాన నెఱవేర్ప వెడలిపోయిరి.

మఱునాఁ డుదయమున శ్మశానావరణముఖద్వార సమీపమున జనులుగుమిగూడి యుండిరి. ఏల నన నచట నేరొక లిఖితపత్ర మతికింపబడి యుండెను. దానిపైన వ్రాయఁబడిన రెండువరుసలయక్షరములం దేమి యిమిడి యున్నదో గాని వారందఱు నొక్కసారి దయ్యము పట్టినవారివలె హాహాకారము లొనర్ప సాగిరి.

అంతలో నొకఁడు కడువేగమున జనమధ్యమునఁ బడి దారి చేసికొనుచు ద్వారమును జేరి ఆపత్త్రమును తుత్తునియ లొనరించి ఆచినుపలు ఆప్రజల మొగములఁ గొట్టి ఖడ్గముదూసి వెడలిపోయెను.

ఆతనికను లగ్నికణముల వర్షింపసాగెను. ఆతనిగభీరత దురాలోక ముగ నుండెను. గాన నొక్కరైన నాతని నిరోధింపఁజాలకపోయిరి.

ఈమహాసాహసికుఁడు సీజరే. అవసరము కలిగిన ప్రజల చించి చెండాడుటకు సేనతో మిచెంలాంగ్ సంసిద్ధుఁడై చేరువనే నిలచి యుండెను.

౩౦

ఇరువదిమూఁడు దినములు గడచెను. ఇరువదినాల్గవదినమున నుషః కాలమున రెండువందలమంది జర్మనులు కలిసి యాయావరణమునఁ గూడియుండిరి. అన్సలము, ఫ్రిజ్జు, వెల్ట్సీనునాయకులుగ నుండిరి.

సూర్యోదయ మైనంతనే వారు సీజరుమందిరమువంకకు నడువ సాగిరి. వారట్లు రాజమార్గమును జేరగనే సాయుధు లగునిటలీదేశీయులు పెక్కుమంది పరిసరగృహములనుండి చడిచప్పుడు లేకుండ వారిలోఁ గలిసిపోయిరి.

సీజరుమందిరసమీపమున నార్సినీసైనికు లేడు వందల మంది యదివఱకే నిలచి యుండిరి. అన్సలము అనుచరు లాసేననుగలిసిరి. ఆసేన కగ్రభాగమున ప్రాభియా ఆర్సినీనోః నిలచియుండెను.

అప్పటికి సీజ రింకను నిద్రాముద్రితుఁడై యధికార స్వప్నములను గని యానందించుచుండెను గాని సన్నిహితమగు నాపదను గుర్తించి యెఱుఁగడు. గాన తోడనే మిచెలాటో సీజరును మేలుకొలిపెను. ఆతని సేనగూడ క్షణికమున నాయత్త మయ్యెను. సీజరు మిచెలాటో లాసేనను నడిపిరి. ఉభయవాహినులు భరముగ బోరసలిపెను.

ఆర్సినీగూడ దీర్ఘవైరముల స్మరించుచు భయంకరముగఁ బోరు సలిపెను. అచిరకాలముననే సీజరుసేనలోడి దుర్గాంతరమునకుఁ బరు గిడెను. ఆర్సినీ సేనలు వెన్నంటి వప్రకుడ్యములఁ బగులగొట్టి లోన బ్రవేశించెను. దుర్గాంతరమునఁ బెనుముల మగుసంగ్రామము మిక్కి

జరిగెను. ఒక్కరొక్కరుగ మగటిమిగలశత్రువీరులు తనతోఁ బోరఁ దగునని సీజరు గర్జించెనుగాని యాతనిమాట నెవ్వరును లెక్కింప రైరి. ఆతనిసేన పూర్తిగా నోడిపోయెను.

నమ్మిన వీరభటులు వీరశయ్యనొరుగుట గని మిచెలోటో సహాయమున సీజరు రహస్యద్వారముగుండ పోపుమందిరమునకు పాఱిపోయెను.

విజేతలా భవనమును విధ్వస్త మొనరింపసాఁగిరి. వా రన్నిగదుల లోనికిని భవనములలోనికిని రక్తస్నాన గృహమునకును విషౌషధ నిర్మాణస్థానమునకునుకూడఁ బోయిరి. అం దున్నవిషయమును బర్ఠొర్ధము ఫెబియోఆర్సినీమందిరమున కంపిరి. ఈరీతిగ సీజరుకుటుంబ రహస్యములు లోకవిదితము లయ్యెను.

సీజరు తనసేనను ద్వారరక్షణమునకు నియమించి రోగపీడితుఁడై ప్రాణములువీడ నున్నపోపుశయనగృహమున కేగెను. పాప మాపోపు ఇరువదినాలుగుదినములుమాత్రమే యాయున్నతాధికారమును బూన గలిగెను. ఆతఁడు కడువృద్ధుఁడు. రక్తసిక్తాంగుఁడైనసీజ రటు లాక స్మికముగ లోనికి రాఁ బోపుభగవన్నామమును మెల్లమెల్లన స్మరింప సాఁగెను. ఏలయన సీజరు తన్ను నరకవచ్చె నని యాతఁడు భ్రమ జెందెను. సీజరును గనినంతనె యచట నున్నవైద్యుఁడుగూడ నాగ దిలో నొకమూలకు బోయి నిలచెను. అతఁడు తప్పమఱియెవ్వరు నందు లేరు.

„ ఓమహాస్వామి. మనశత్రువులు నాసేన నోడించి నామందిరము నాక్రమించి పలువుర యోధుల వధించిరి. రోమను సైన్యాధిపతి నగు నన్నుఁ దాము రక్షింపవేడెదను " అని సీజరు వేడుకొనెను.

„ అయ్యో, చావనున్నవృద్ధుఁడ నీదుర్దశయందు నిన్నెట్లు కాపాడ గలను "

„హావనుంటివా? ఇదియేమి. ఎంతయో నెంతటిమార్పు మీముఖమునం గనంబడుచున్నది. ఏదో స్వామిద్రోహము జరిగియుండును. స్వామీ! మీకుంగలబాధ యెట్టిది ?"

„చిన్నకురుపు పెద్దగాయమైనది. దానిబాధ దుస్సహము! భరింపజాలకున్నాను. క్షణికమైన విరామము కలుగుటలేదు."

„ఆహా ఆర్సినీకుటుంబమువారే యీఘోరకృత్య మొనరించిరి" అని సీజరున్మాదునివలె బలవంతముగ బోపును జేయిబట్టి లేవందీసెను. ఆతండా బాధకు దాళజాలక హాహాకార మొనరింపసాగెను. దూరమున నిలచినవైద్యునిబట్టి తెచ్చి శయ్యాసమీపమున సీజరు మోకరిలంజేసెను. ఆవైద్యుండు ధైర్యమును పూర్తిగంబోనాడి రక్షింపుము రక్షింపు మని యాక్రందన మొనరింపంసాగెను.

సీజరు రక్తాభిషిక్త మగు భయంకరవాలమును శయ్యాతలమున వీడి తనతండ్రి ధరించెడు రత్నపతకమును లోననుండి తీసి పోపు గాయముచెంత నుంచెను. ఆపతకమునకు మధ్యభాగమున ప్రకాశించుహరిన్మణి తక్షణమే నల్లవారెను.

„సంశయము లన్నియును తీరినవి. స్వామీ మీకు విషప్రయోగము జరిగినది."

„హా! విషప్రయోగమా" అను ధ్వని నోటవెడల వెంటనే పోపు స్మృతితప్పి శయ్యపై వ్రాలెను.

„రక్షింపుము, రక్షింపుము, సర్వమును విన్నవించెదను" అని వైద్యుండు పాదాక్రాంతుండయ్యెను.

"ఎవరు నీకు లంచమిచ్చినవారు? నిజము చెప్పుము!"

"ఖిబియో ఆర్సినెసీనే" అనుమాట వానినోట వెడలినంతనె సీజరు రెండడుగులు వెనుక కిడి యొక్కవేటున వానితల నరికెను. తత్క్షణ మతండు నిర్జీవుడై నేలంబడియెను. ఆతనిశిరము సహస్రశకల

ముతై గదియంతయు మేనోమాంసరక్తములతో నతిభయానక మయ్యెను.

ఆధ్వనివలన పోపు మరల స్మృతిని బడసెను." స్వామీ! ఫెబియో ఆర్సినెసీయే యీగోరిహికి లంచ మిచ్చి విషపట్టికను మీగాయముపై వీనిచే కట్టించెను. వీనిఁ గడతేర్చితిని గాని నేను మహదాపదలో నున్నాను. ఏమిగతి?"

" సెయింటుఅంజిలోమందిరమునకు పోవుమార్గమునకుఁ జెందిన తాళము నాతలాడక్రింద నున్నది. నీ వాదారిబట్టి పోయి ప్రాణముల దక్కించుకొనుము. ని న్నాశీర్వదించెద " నని పోపు పలికినతోడనే సీజ రాదారి ననుసరించి అంజిలోదుర్గమునఁ బ్రవేశించెను. దుర్గపాలకుఁ డాతని నెంతయు నాదరించెను. ఆతాళము పోపే యాతని కిచ్చి యుండు నని గ్రహించెను. మిచెలొట్టో తనసేనతో నాదుర్గమునఁ దలదాఁచుకొనవచ్చు నని సీజరు కోరిక ననుసరించి దుర్గపాలకుఁడు మిచెలొట్టోకు వర్తమానము పంపెను. వా రంరఱును గడు సంతసమున నటు లొనరించిరి.

ఆర్సినీ సీజరుమందిరమును చూరగొని పోపుమందిరమువంక కేఁగుచుండెను. పోపుమందిరముద్వారమునఁ గార్డినలుకోపీసు నిలచి పోపు మృతినొంద నున్నాఁడని తెలిపెను. అది నిజ మని ఆర్సినీగూడ నెఱుఁగును. వైద్యునికి లంచ మిచ్చినది ఆర్సినీయే. సీజరు దుర్గమును జేరఁగలిగె ననిగూఁడ కోపీసు నుడివెను.

ఆదుర్గమునుగూడ సాధింత మని ఆనసలమున కేసి చాలపట్టు బట్టి నను తనసేన యందులకు సమర్థముగాదని యార్సినో వెడలిపోయెను. పట్టణమునఁ గోలాహల మతిశయించెను. లక్షలకొలఁది ప్రజలు సీజరును దిట్టుచు నార్సినోనుఁ గొనియాడసాఁగిరి. సన్యాసి సీజరు కుటుంబవినాశనదీక్షను బూనినవాఁ డగుటచే లూక్రెజా పోఁబడి నా

రయ ననుచరుల నియమించెను గాని యామెజాడ యెందును గనఁ బడలేదు.

శత్రువులు తనసోదరుని మందిరము నాక్రమించి రనువార్త విని నంతనే ఫాస్టు సహాయమున లూక్రెజా రోమునగరమును వీడి పోఁ జాలెను.

ఆదిన మట్లు గడచినది. మన కెన్నటికని శాంతి కలుగదాయెగదా యని ప్రజలు చింతిల సాఁగిరి. నాఁడు సాయంతనముననే పోపు మృతి నొందెను. ఆత్సినోకుఁ బ్రతిపక్షు లగు కార్డినలులు సీజరునకుఁ దోడ్పడెద మని వర్తమాన మంపిరి. ఆ యనుకూలవర్తమాన మర్ధరాత్రమున నాతని కందెను. మరల నాతనిహృదయక్షేత్రమున నాశాబీజ మంకురించెను.

ఆతఁడు కసుబడలి శయ్యపై నొరగి కనులమూయునంతలో నెవరో మెలకువతోఁ దలుపు తెఱచి లోని కరుదెంచిరి. ఆతఁడు సన్యాసివేషమునఁ గరదీపికగొని వచ్చెను. వానిఁ గనినంతనె సీజరు చెంతనున్న కరవాలమును బిరానఁ జేబూని నిలచెను.

„ ప్రభో! భయపడకుము. నేను శరణార్థినిగాని శాత్రవుఁడఁ గా" నని యాతఁడు కరదీపిక నొకపీఠముపై నుంచి ముసుగు దొలగించెను. ఆతఁడు కార్డినలుజ్యూలియనుడెలారోవరియె.

"మీ రిం దేల వచ్చితి రని సంశయాస్పదమతియై సీజ రతని ప్రశ్నించెను.

„ ప్రభువా! నాకు పోపుపదవి నొసఁగుము. పవిత్రకళాశాలలు మీపక్షమున చేరఁగలుగును. మీరు మీశత్రువుల హత మొనరింప గలుగుదురు. "

„అట్లయిన నే నంగీకరించితిని" అని సీజరు పలికెను. వారి కిర్వురికిని సమాధానము కలిగినపిమ్మట జ్యూలియసు వెడలిపోయెను.

మఱునాఁ డుదయమునఁ బదునొకొండు గంటలవేళ కార్డినలు లందఱును చేరి జ్యూలియనను నియోజించిరి. అవత్రమాంసమును మిచెలోటో సీజరు కెఱిఁగింప వచ్చినంతనే సైనికుల పదఘట్టనము వినఁబడి వా రిరువురును జకితులై గవాక్షముగుండఁ బరికించిరి. ,,ఆహా! మోసము. మోసము. జూలియను మనలఁ బరిపూర్ణముగ వంచించెను. మన కింక నాధారములేదు. కడవరకును పోరుటయే కర్తవ్యము. ఆర్సినీసేన సమీపించుచున్న '' దని సీజరు విహ్వలచిత్తముతోఁ బలికెను.

“ఆర్సినీసేన ని న్నింకఁ బ్రతుకనీయదు'' అని గర్జించుచు ఫబియో ద్వారమును పగులగొట్టి లోనఁ బ్రవేశించెను. అన్సలము. వెలస్టేను, ఫ్రాజ్జి మున్నగువా రందఱును లోనఁజొరబడిరి.

,, హా! హతాశుఁడ నైతిని '' అని సీజరు ప్రలపించెను.

,, నీకు మరణకాల మాసన్నమైనది. ద్రోహీ! కృతఘ్నుఁడా!'' అని అన్సలము దీర్ఘ కరవాలమును ఝళిపించుచు సీజరుపై నురికెను.

అంతలో ద్వారముకడ జనమండలిమధ్య ఫాస్టుశరవేగమున సన్న్యాసి కరవాలధార కడ్డుపడి యాతని కొంతదూరమున పోయి పడునట్లు విసరివైచెను. ,, ద్రోహీ! సీజరు కుటుంబమున కింకను మిత్రులు కలరని గ్రహింపు '' మని ఫాస్టు పలికెను.

,, ప్రభుశేఖరా! నీవు రెండవసారి మరల నాప్రాణరక్షణ మొనరించితివి. వందన సహస్రము'' లని సీజరు పలికెను.

ఈ యద్భుత కార్య మవలీలగ జరుగుటంగని ఫబియో ప్రభృతులు విస్మితులై చిత్రప్రతిమల చందమున వెరచరచి నిలువఁబడిరి.

,, పిరికిపందలారా! వెనుకకు మరలుఁ '' డని అదలించుచు ఫాస్టు నిర్భయముగ వారి నెదుర్కొనెను. శత్రుసంహారమునకు మీకు లభించినమార్గ మిదియా! భీరువులారా! వెనుక కొదుగుఁ డొదుగుడు. ఫబియో! నీవు పవిత్రవేషధారి వగుపరమపాతకివి. నిను హానాసి యన్యా

దో నీ వెఱుఁగుదువా? ఆతఁ డురికంబములనుండి నేలఁగూలినమహా పరాధి. ఉరిత్రాడు వానిమెడకు నగుల్పఁబడియెను. ఉల్రికుకిన్సును వియన్నా దుర్గకుడ్యముపై నురిదీసి యిరువదియాఱు వత్సరములైనది. వాఁడే నేఁడు నీకు శాసటనైన అన్సలముసన్యాసి. కడంటినప్రాణము మరల కలుగుటచే బ్రతుకఁగలిగిన పరమపాతకియగువీఁడు మహాస్వామి నని మదించి పిలుచున్నాఁడని ఫౌస్టు హుంకారపూర్వకముగ బిగ్గ రగఁ బలికెను.

## ౬౧

మహాస్వామి, విరాగశిఖామణి యని తా మెవ్వని గౌరవించుచుండిరో అట్టి అన్సలము నిట్టుల ఫౌస్టు పరాభవించి పలుకుటచే ఆర్సినీ లంగ ఉను విభ్రమవశులైరి. మరణదండన విధింపఁబడి యురిఁదీయఁబడి ఎట్టులో బ్రతుకఁగలిగెనని వినినంతనే యట్టివానిసహవాస మతిదూష్య మనునభిప్రాయము వారికిఁ గలిగినది. ఆ యభిప్రాయ మాకాల మువారి కందరికిని సామాన్యముగఁ గలదు.

ఫిబియోకుగూడ నట్టిభావమె యంకురించినది, కావున నతనికి నాన్సలముపై ననగా ఉల్రికుకిన్సుపై నత్యసహ్యము కలిగెను.

ఇరువదియాఱు వత్సరముల క్రితము వేలకొలఁది జనులు సమావే శమై యుండ వియన్నానగరమున వప్రకుడ్యములపై నెలకొల్పఁబడిన యురికంబముల కంటగట్టి ఉల్రికుకిన్సు నురిదీసిరి. ఉరిని మెడకుఁ దగిలించి పాదపీఠమును దొలఁగించి యురి బిగించిరి. ప్రాణము పోయె నని యెంచి శవమునుగోసి పరీక్షించుటకు నపరాధుల చెఱసాలయం దుండు వైద్యునికడ కంపిరి. అతనితో పాటు మఱికొందఱిని గూడ నురి దీసిరి. ఆశవముల నన్నిటిని వేఱొకగదిలో నుంచుఁడని వైద్యుఁ డాజ్ఞాపించెను. ఆసాయంతనమే యుల్రికుకిన్సుకు స్మృతివచ్చి యాతఁ డు తప్పించుకొని పోయెను. చీకటిపడగనే వైద్యుఁడాగదిలోని కేఁగి చూడఁ దాళము పగులఁగొట్టఁబడి యుండెను. ఒకశవ మచట లేదు.

ప్రక్కగదిలోఁ దా నుంచినకోటు కనఁబడలేదు. బీరువా తాళము గూడఁ బగిలియుండెను. ఆ అంగీయందు తా నుంచిన రొక్కము గూడఁ బోయిన దని యాతఁడు తెలుసుకొనెను. చనిపోయె నని తలఁపఁబడినవారిలో నొకఁడు మరల బ్రతికె నని యాతఁడు వెంటనే గ్రహించెను గాని యా సంగతి వెల్లడి యైనఁదానే యతుల వాని బ్రతికించి పంపివేసెనని అధికారు లనుమానింతురని వెఱచి యాతఁడు మిన్నకుండెను. ఈ విషయము నిజముగా నని యావుల్రికుకిన్సు పలుకఁగలఁడేమో తెలుసుకొను ” డని ఫాస్టు పలికెను.

అజీవచ్ఛవ మల్లనల్లన నేల నానుకొని లేచి ముసుగు వేసుకొని “ నన్ను పోనిండు. నన్ను పోనిండు. నే నిఁక నిచట నుండఁ బనిలే ” డనెను. ఆతని వసనములు తమకుఁ దగులు నేమో యనుసంశయమును నెల్లవారు నిరుపాయులుగాఁ జీలి దారి నిచ్చిరి. అతఁ డటుల పోవుచు వెలస్టేనువంకఁ గూఢార్థముగఁ జూచెను గాని యాపరమనీచుఁడు—ఫాస్టు సహాయమున యురిని దప్పించుకొనినమానవాధముఁడగు వెలస్టేనుగూడ వుల్రికుకిన్సు వంకఁ జూచుట కేవఁజెందెను.

ఫ్రిజ్జుకుమాత్ర మట్టి నిరసనము కలుగలేదు. ఉరిఁదీయఁబడి బ్రతికినంతమాత్రమున నతని నంతనీచముగ నేలచూడవలెనో నేను గ్రహింపఁ జాలకున్నాను. ఎల్లరు నాతని విడచి పోయినఁ బోయెదరు గాక ! నేనుమాత్ర మట్లు చేయ ” నని పలికి ఫ్రిజ్జు వుల్రికుకిన్సు ననుసరించెను. వా రిద్దఱును వెడలిపోయిరి.

“ ప్రభువా ! నీవింతటిచుండియైన నీ కార్యసాధనమునకు సహాయభూతులుగఁ జేసుకొనఁ గోరువారిమంచిచెడ్డలను జక్కఁగా గుర్తించుచుందువుగాక! నీవు వీరపురుషోచితము గానిరీతిని సంకల్పించిన హత్యాచరణమును—” అని ఫాస్టు ఫెబియోనుగూర్చి పలికెను.

“ అన్యదేశవాసుఁడ వగు నీ వెట్టి మునకారణమువలన నన్నిట్లు ప్రశ్నించుచున్నా ” వని ఫెబియో కఠినాక్షరముగఁ బలికెను.

" నాయధికారము స్వసామర్థ్య పరిజ్ఞానమువలననే కలిగినది. ఈ మందిరమున నఖాతము లున్నవి. ఒక్కమీట నొక్కినంతటనే గుప్త ద్వారము తెరువబడి వేలకొలఁది యొక్క పెట్టున నాయఖాతమునఁబడి యంతరింతురు. మీవంశీయు లగుపూర్వులలో నొకఁడగుమార్కొ ఆర్సినో యనునతఁడు శత్రువులరూపు మాపుటకీమహామారణ యంత్రముల నిం దమర్చె నని నీ వెఱుఁగవా ? " అని ఫాస్టు పలికెను.

" అట్టిగుప్తద్వారములు కల వని నేను విని యున్నాను. కాని అది సత్యము గాదనియు గల్పిత మనియు నాయభిప్రాయము. ప్రభువా! ఎడదొలగుము. సీజరుకుటుంబవినాశనమున కిఁక నాలస్యము జరుగఁగూడ " దని ఆర్సినో పలికెను.

" ఎడదొలగవలసినది నీవుగాని నేనుగాదు. క్షణికము నీ వాలసించిన నీపాదాంతికముననే గుప్తద్వారమువిడివడి నిన్నును నీయోధులను గూడ హత మొనరింపగలదు. ఇదిగో చూడుము. ఇదియే ఆగుప్త ద్వారమునకు మీట నేను దానిని గదలించినఁ జాలు మీ రథోభాగమునకు బోయెద " రని ఫాస్టు గోడకు బిగింపబడిన ఆయన కంకణమును జేతఁబట్టుకొనెను.

ఫిబియో అనుచరు లంతయును హాహాకార మొనరించిరి గాని ఫిబియోకుమాత్ర మింకను నమ్మకము కలుగలేదు.

" ఓ యవిశ్వాసీ ! నీ కొక్కనిముషము గడు విచ్చితిని. తొలగిపొ " మ్మని ఫాస్టు కంకణమును వదలెను.

వెంటనే మిచెలొటో వడివడిగ నట కేఁగి ఫాస్టు నిరోధించునంతలోనే దానిని బలిమిని ద్రిప్పగా ఫిబియో పాదాంతికమున నొక వలయ మేర్పడి యతఁడును మఱియైదుగురు నఖాతమునఁ గూలిపోయిరి. అతిభయంకరమును హృదయవిదారకము నగునార్తనినాదము వారినోట వెలువడెను. లోన నీకుకదులాడిన ధ్వనియు నార్త

ధ్వానములును గొంతసేపటివఱకు వినఁబడసాగెను. ఆ యదృష్టహీను లా ప్రవాహమునఁ గొట్టుకొనుచుండిరి. కొంతసేపటి కంతయు నడఁగి పోయినది. ఆయఖాతమున నొకవంక హతశేషు లగు ఆర్సినో అనుచరులును, నొక వంక ఫాస్టు, సీజరు, మిచెలోటోలును, నిలచి యుండిరి.

ఆర్సినో అనుచరులు మతిబోయినవారివలె నఖాతమువంకఁ జూడ సాగిరి. ఫాస్టుగూడ విచారభావముతో దానివంకకే చూడసాగెను. సీజరు మిచెలోటోలు కార్యసాఫల్యమైనను సంతసమును వెలిబుచ్చుచు నొండొరులఁ దిలకింపసాగిరి.

„ ఇఁకమీరు వెడలిపొండు. ” అని కొంతసేపటికి ఆర్సినో అనుచరులతో ఫాస్టు పలికెను. వెంటనే వారందఱును వెడలిపోయిరి.

„ గతమునకు చింతించుట ధీరలక్షణము కాదు గాని యీ యత్యాచారము జరుగుట నాకు సమ్మతముగాదు ” అని ఫాస్టునుడివెను.

„ వారు దొంగపోటున మాప్రాణములఁ దీయవచ్చిరి గాన మిచెలోటోచేసిన యక్రమముగాదు గాని ప్రభువా! నీ వొనర్చిన మహోపకారమునకు వందనములు. నీ వెట్లగ నెఱిఁగి రాఁగలిగితివో తెలియజాలకున్నాను. ” అని సీజరు పలికెను.

„ నిన్ననుదయమున నేను రాకుమారి యగు బూటిజానును భద్రముగా ఫెరారావంకకు గొనిపోతిని. నిన్నుగూడఁ గాపాడవలెనని ఆమె పలుమఱి కోరుటచే శక్తివంచన లేకుండఁ బనిచేసెద నని వాగ్దాన మొనరించితిని. ఆమె కొఱకు నీవు వెఱవఁబనిలేదు. ఆమె సురక్షితయై యున్నది. నీకొఱకె నేను మఱల నిన్న సాయంకాలమునకు రోమునగరమునకు వచ్చితిని. అన్సలకు నీసోదరికొఱకును నీకొఱకు నారయుచున్నాఁడనియు మీ ప్రాణముల గొననున్నాఁడనియు నేను వింటిని. అతని పూర్వవృత్తాంత మెటులనైన నేమి. నాకు సాకల్య

ముగ విదితమై యున్నది. నీవీ కోటయందున్నావని వింటిని. ఎటుల
నైన నిను గాపాడ నిశ్చయించితిని. నియోజనమైన వెంటనే అన్స
లము క్రొత్తపోపగు జ్యూలియను సందర్శించెను. 'దాని ఫలితముగనే
అన్సలవము మున్నగు వారీదుర్గము లోనికి రాఁగలిగిరి. నేనుగూడ వా
రితోడనే యుచటికి కేతెంచితిని గాన నిరీక్షించి యాద్రోహి నిజవృ
త్తాంతమును వెల్లడింపఁగలిగితిని.

" నేను నిరంతరమును నీకుఁ గృతజ్ఞుఁడను. ఈ కోటయందు దిట్ట
మారణసాధనములు కల వని నీ వెట్లు గ్రహింపఁగలిగితివి. "

" నేను వానిని వివరింపఁజాల నని క్షమింతువు గాక. నా కత్య
ద్భుతముగ సర్వవిషయముల గ్రహింపఁగలయవకాశము కలదు. నీ
హితముగోరు నామంతన మూలకింతు వేని నీకు మేలు కలుగును.
రోమునగర మపాయములతో నిండి యున్నది."

" నీవతిబలాఢ్యుఁడ వగు మిత్రుఁడవు. మంత్రవేత్త వగు నుపదేశ
కుఁడవు గాన నీహితోపదేశమును నే నక్షుచేయువాఁడఁగాను. " అని
సీజరు పలికెను.

" సన్యాసివేషమున నగరమును వీడి ఆస్ట్రియా కేఁగి నా కక్క
స్పైకిరోగా కేగుము. అటనుండి సురక్షితముగ ఫెర్రారా లుచేరఁగలి
గెదవు. నీకింకను రోమగ్నరాజ్యాధికారము నిలచి యుండును గాని
రోమకసైన్యాధిపత్యము పోపు నియోజనాధికారములను నీ విఁకఁబ
డయఁజాలవు. పోపు జ్యూలియసు నీకు ప్రబల విరోధి గాన జాగుసే
యక వెంటనే వెడలిపొమ్ము. పోపున్న నప్పుడు జరిగిన మహాపచార
మునకు అర్సినీలు నిను మననీయరు. "

" నీవు కూడ పిజ్జారాకు వచ్చెదవా "

" రాను. మీవ్యవహారములపట్ల నాకు విముఖత కలిగినది. నిన్న
భార్యముగ నాస్తియూషఁ జేర్చి అటనుండి వెడలిపోయెదను.

12

"అప్పుడె నీకు లూక్రెజాయంకలి ప్రేమ యంతరించెనా ?" అని సీజ రాగ్రహముతో నుడివెను.

"నాకు నిజము చెప్పుట కెట్టి సంశయమును లేదు. నీ సోదరిచేసిన ఘాతుకక్రియ లపారము. చేయఁదలచిన వానికి బరిమితి కనఁబడదు. ఆసతి మానవాకృతి నున్నదానవాంగన. నేనుగూడ నాదారుణముల విని కని సహింపఁజాలకున్నాను."

"ప్రభువా, నాయెదుట నీ విట్లు పలికెదవా?" అని సీజరు కత్తి నెత్తెను.

"నీవు నన్నింతకు ప్రేరేపించుటచేత నే నిట్టులఁ జెప్పవలసి వచ్చినది" అని ఫౌస్టు నిర్లక్ష్యముగఁ బై కెత్తఁ బడిన కత్తివంకఁ జూడనైన జూడకుండఁ బలుకుచు ఆయసకంకణమును సరిఁజేసి అఖాతమును మఱుఁగుపరచెను. "నీవు నాహితోపదేశమును పాటింపఁగోరెదవేని యాలసింపక రమ్ము" అని ఫౌస్టు పలికెను.

సీజరు తన మహాగ్రహము నడఁచుకొనుట కిదియే తొలిసారి. ఫౌస్టు సన్నిధి నాతఁడు చకితుఁడై పోయెను. అతని యద్భుత చరిత్రములు సీజరుకు జంకు కలిగించెను. ఫౌస్టు విషపాన మొనరించి కసుగంది లేదు. అలెగ్జాండరు అంత్యక్రియలు జరిగిననాఁడు శత్రునికరము నవలీలఁ బాఱద్రోలి తన్ను కాపాడెను. ఇప్పు డత్యద్భుతముగ వచ్చి పుత్రికకిన్ను బారినుండి రక్షించెను. అతని కెట్టి భీతియును గనఁబడదు. వీని నన్నిటిని చర్చింప ఫౌస్టుకు గల మహాద్భుతశక్తి సీజరుకు పొడగట్టెను గాన నతఁడు ధైర్యహీనుఁడయ్యెను. వారికి కావలసిన మాఱువేషపు దుస్తులను గొని రా మిచెలోట్టోను బంప నతఁడు త్వరలోనే వానిని గొనివచ్చెను.

ఆవసనముల ధరించి వారు ముప్పురును నిర్నిరోధముగ దుర్గము నుండి వెడలిపోయిరి. వారు టైబరు కేఁగి నావ నెక్కి కడు వడిగ నాప్లిసూను జేరిరి.

అచటి కేఁగగనే ఫాస్టు విశేషధనము గల సంచిని సీజరుకొసంగి ,, నీ కిఁక శత్రువులవలన భయములేదు. నే నరిగెదను. మరల మన మెన్నఁడును గలుసుకొన మని తలంచెద '' నని పలికెను.

,, కడసారి వందనము గొని మావిషయమున నీ విట్టి యభిమానము నేలచూపితివో విన గోరెదను. ''

,, అందులకు సౌందర్యతిలక యగు నీ సోదరిపైఁ గల నామోహమే ప్రధానకారణము గాని నేనును మీవలెనే సాహసప్రియుఁడ నగుటగూడఁ గొంత సహకార మని చెప్పక తీరదు. '' అని పలికి ఫాస్టు కడువడిగ వెడలిపోయెను.

" ఈతని చరిత్ర మలౌకిక మమానుష మత్యద్భుతము. ఈతని కేదో మహచ్ఛక్తి యెటులనో లభించినది. దానిని నేను గుర్తింపఁజాలకున్నాను. '' అని సీజరు పలికెను.

,, ఈతనికి భూతనాథుఁడు వశుఁడై యుండవచ్చు '' నని మిచెలాంటో పలికెను.

,, అట్లు నిజముగ భూతపతి మానవులతో మైత్రి యొనరించుట కల్పితకథలు వ్రాయు వారి కాల్పనిక ప్రపంచవృత్తాంతముగాక ప్రత్యక్షవిషయమే యగునేని యా భూతపతి యిదివర కెన్నఁడో మాకుటుంబమునకుఁ బరమ మిత్రుఁడై యుండఁడా! '' అని సీజరు పలికెను.

,, అతని సహాయ మక్కర లేకుండ నే యాతని సంకల్పముల మీరి తిశ్రేష్ఠముగ నిర్వర్తించుచుండుటచే తా నట్టి ప్రోత్సాహమును గలిగింప నవసరము లేదని భూతపతి యెంచెనేమో '' యని మిచెలాంటో పలికెను.

అంతలో నెవరో వికటహాస మొనరించిన యలుకుడు కలిగి వారిరువురును బిక్కజరచిరి.

,, ఇది యేమి చిత్తవిభ్రమము '' అని కొంత సేపటికి తేరుకొని సీజరు పలికెను.

.. నిజమే యిది మననిశ్చలమే '' గాని ఒకప్పుడు పరిహాసవాక్యములే పరమార్థము లగుచుండును. నే నిప్పు డాడిన వట్టిదే యగునేమో '' అని మిచెల్హోక్ పలికెను. పిమ్మట వారిరువురును నౌకాశ్రయమున కేఁగిరి. అటనుండి వారొక నౌకలో స్విజరో కేగఁదలంచిరి.

## ౯౨

౧౮౯౭ వత్సరమున నాగష్టు నెలలో నీ కెంబ్రిడ్జి పరిసరమును గోధుమల పండిన పైరులతో నింపి కృషివలులకు గను పండువొనరించుచుండెను.

మఱియొకసారి కెంబ్రిడ్జి పాంథగృహమును మనము తిలకింతము. కెంబ్రిడ్జి గ్రామమునందలి పాంథగృహమున యజమాని ప్రాంగణసీమ నాసీనుఁడై యింటచేయఁబడిన మద్యము నల్ల నల్లన గ్రోలుచుండెను.

ఈతఁడు మనకుఁ బూర్వపరిచితుఁడగు హార్మను. ఇప్పు డితనికి నేరాధవిచారణాధికారము గూడ లభించినది. రహస్యసంఘముతో నితనికి సంబంధము కలదని చాలమంది యనుకొనుచుందురు గాని నితనిపట్ల ప్రజల కొక విధమగు భీతియో గౌరవమో కలదు. దానిని గోల్పోకుండుటకుఁ దగినరీతి నాతఁడు ప్రగల్భముల పలుకుచుండును.

చీఁకటిపడిన కొంతసేపటి కొక యాత్రికుఁడా గృహద్వారముకడకు వచ్చి నిలిచెను గాని యాతని కనుచరు లెవ్వరును లేరు. ఆతనివస్త్రులు చాల పరిశుభ్రముగ నుండినను అమూల్యములు గావు. ఆతని చెంత సామగ్రులుగూడఁ గనఁబడలేదు గాన నెవఁడో సామాన్యుఁడగు తెరువరి వచ్చినంతమాత్రమున మేటపీఠముపయి నున్న హార్మను లేవఁదగునా? ఆతఁడు లేవలేదు. కాని ఓరి సోమరిపోతా, ఎడ్విను ! ఎందున్నావు? ఎవరో బాటసారి వచ్చియున్నాఁడు. వడిగరమ్ము '' ని యఱచెను.

వెంటనే లక్ష్మిగు వెలికి వచ్చి గుఱ్ఱముచెంత కేగి నిలువ నాశ్వికుఁడు మెల్లన గ్రిందకు దిగెను. “నేఁడు రాత్రి నా కాహారమును బండుకొనతావు నొసఁగఁగలరా” అని పాంథుఁ డడిగెను.

“ధన మొసఁగిన నన్నియు లభింపగల” వని లక్ష్మిగు పలికెను.

“ధన మీకుండ నుచితముగ నేను చేసిని గోపువాఁడఁ గాను హెర్మను నన్ను మరచిపోవుటకుఁ దగినంత మార్పు నాయందు దేహ యును గలుగలే దని తలఁచెద” నని యాయువకుఁడు పలికెను.

“ఆహా, పియునల్లా కంఠధ్వని వలె నున్నదే.”

“ఔను. నే నోటో పియునల్లాను. నాకు మిక్కిలి యాకలి యగు చున్నది. దాహముగూడ హెచ్చుగా నున్నది. త్వరగా భోజనమునకు నేర్పాటు చేయ నాజ్ఞాపింపుము.”

“లక్ష్మిగు వడిగ రుచికరములగు పదార్థముల వడ్డనచేయింపుము. ఓటో! యిప్పుడే నీకు భోజనము సిద్ధము చేయఁబడును. నీదాహము తీర ముందుగా ఈమద్యము నించుక గ్రోలుము. ఇది మన యింటి మద్యముసుమా. కలితీలేనిది. అని హెర్మను క్షణకాలము తనయున్నతి పదవిని బ్రతిష్ఠను మరచి చనువుగ మాటలాడెను. పియునల్లా యీ గ్రామముననే పెఱిఁగినవాఁ డగుటచేఁ జన్నునాటనుండియు హెర్మను పియునల్లాను బాగుగా నెఱిఁగి యున్నాఁడు. పియునల్లా సుగుణసంపన్నుఁ గూడ నాతఁడు బాగుగా నెఱుఁగును. పియునల్లా సంతసముతో నంగీకరించి యాతని చెంతఁ గూర్చుండి కాలయాపనమునకు గాను భోజనము సిద్ధమగువఱకును లోకవార్తలు ముచ్చటింప నంగీకరించెను.

“ఈగృహమున నొక్కగది మాత్రమే గలదు. దాని యందు దివ్యపు నూతన పురుషులు దిగి యున్నారు. వారు కేవల మపరిచితులు గాను— దాని కేసుగాప సిరా మధ్యగదిలోనే భోజనము సమర్చ వలసి వచ్చును.”

"నాకీ సుగ్రామములును భోగములును బనిలేదు. ఏబల్లమీఁద నైన నే రొట్టెముక్కనైన నాకొసంగినఁ జాలును. నీ విందుల కిన్ని అనుస యోక్తులఁ బలుకుట యనవసరము."

"నీ సోదరి యిడా సురక్షితముగా నున్నదా? ఆమె ఎవనినో ప్రభువును పెండ్లియాడె నని వింటిని."

"ఆమె చనిపోయినది."

"ఎంత సంతాపవార్త! ఇంత లేఁబ్రాయముననే మరణమా?"

"ఆమెకు దారుణమరణముగూడఁ సంభవించినది. మనము వేఱొక విషయమును గూర్చి ముచ్చటింతము."

"నీవు వియన్నాలోనే స్థిరావాస మేర్పఱచుకొని ధనాఢ్యుఁడ వగుదు వని తలంచితిని. ఇపుడు నీ రాకకు గత మేమో తెలిపెదవు గాక."

"నేను దీర్ఘకాలము దారిద్ర్యము ననుభవించితిని గాని నాయదృష్టవశమున సుగుణశాలి యగు నొక ప్రభుశేఖరునికిఁ గొంత సహాయము చేయగలభాగ్యము నాకు లభించినది. కావున నిపుడు నేను సుఖజీవనము చేయఁగలుగుచున్నాను. థెరిస్సావతి తన తండ్రిని జూచి నాలుగేండ్లైనది. ఆమెకొన్ని లేఖలనాతని కంపఁజేయ నాచేతి కిచ్చినది. నాజన్మస్థాన మగుటచే నీప్రాంతమును గనునభిలాష నాకు గూడఁ గలుగుటచే నేను సంతోషముతో నేనందుల కంగీకరించి నే నిందు వచ్చితిని. ముఖ్యముగా నాతల్లి సమాధిచెంత శిలాప్రతిష్ఠఁ గావించుటయే నారాకకుఁ బ్రధానకారణము."

"నాయనా! నీవు మొదటి నుండియు మాతృసేవాపరాయణుఁ డవేనోయి! నీ తల్లి చనిపోయినను గూడ నీ వామెను మఱువవైతివి గదా!" అని హెర్మను పలుకునంతలో హెర్మనుమేనగోడలు కొంచెము వాతశరీరముగల బాలిక, యువతియు ననఁదగును—పరుగునవచ్చి—"భోజనమును సిద్ధపరచితి" నని పలికెను. ఓట్టో లేచి

పోయిన పిమ్మట నాకన్నియు ఆ క్రొత్తవారిద్దఱును వెంటనే నిన్నుఁ జూడఁ గోరుచున్నా" రని హెర్మను చవిచెంతఁ బలికెను.

ఓటో భోజన మమర్పఁబడినచోటి కేఁగి భుజింపసాగెను. వెంటనే హెర్మను క్రొత్తవా రున్నగదిలోని కేఁగెను. ఆగది తలుపు తెరచు నపుడే అతని గాంభీర్య మంతయు నంతరించి యాతఁ డతివినయము చూపసాగెను. అతఁ డటులలోని కేఁగి భద్రముగఁ దలుపు మూసి మొగము నేలసోకునట్లు వంగి అన్సలముకు నమస్కరించెను. ఆగదిలో నాన్సలమును, ఫ్రెడ్జును, గూర్చుండి మద్యపాన మొనరించు చుండిరి.

" హెర్మను, ఇపు డిచటికి వచ్చిన పాంథుని నేను గుర్తించితి" నని ఆన్సలము పలికెను. ఏలయన నాగది కిటికీలు వీధివంక కుండుటచే వారు సులభముగాఁ జూడఁగలరు.

ఆన్సలము కంఠధ్వని పరుషముగ నుండుటచే నోటోను గూర్చి యాతఁడు సుముఖుఁడుగా లేఁ డని హెర్మను గ్రహించి భీతిఁజెంది " స్వామీ, మీ రాతని నెఱిఁగి యున్నారా " అని వినమ్రుఁడై పలికెను.

" ఔను. అతఁ డోటో పిలియసల్లా. నేను బాగుగా నెఱుఁగుదును. అతని సంహరింప వేహముసంఘము నిశ్చయించినది. రెండు నెలల క్రితము వియన్నానగరమునం దతనికి ఖడ్గపాతనం జేయ నుండ చేయఁబడినను నాతఁ డాజ్ఞను జెల్లింపలేదు. కావున నతనికిఁ బరోక్షముననే మరణదండనము విధింపఁబడెను. ఆకస్మికముగ నతఁ డిందు చిక్కెను. అతని నీవు యిటు కలగదిలోఁ బరుండఁజేయుము. ఇచటనే యాతఁడు వధింపఁబడవలెను. "

అని యాన్సలము పలుకగనే హెర్మను మోము వాడిపోయినది. కూడదని పలుక నతఁడు సాహసింపఁ జాలఁడు. అతఁ డొనరించిన కఠినప్రమాణ మాతని కంఠమున కురిత్రాడైనది. బాంధవ్యమును

మోహమును మైత్రిని స్వలాభమునుగూడ సంఘసభ్యులు పాటింపఁ గూడ దను నియమము నాతఁ డిప్పు డెటుల నుల్లంఘింపఁ గలఁడు ? పాపమాతని కెటులైన నోటోను గాపాడవలె నని యున్నదిగాని తా న్నట్లు చేసినఁ దన ప్రాణమునకే ముప్పువచ్చు నని యాతఁ డెఱుఁ గును. కావున నాతఁడు తన విచారమును మఱుఁగు పఱుచుకొని వినయముఁడై నిలచెను.

“ నీ విప్పుడు వెడలి పొమ్ము. నీ వాతనితో మాటలాడునప్పుడు మెలఁకువతో మెలఁగుము. మే మిచట నున్నా మను ననుమాన మొకింతయు నాతనికి గలుగఁ గూడదు. ఒక గంటలో నీవే స్వయముగా మాకు భోజనపదార్థముల నిందు గొనిరమ్ము. ”

అని అన్సలము ఆజ్ఞాపింప మఱియొకసారి హెర్మను నేలంటఁ దల వంచి వెడలిపోయెను. అతఁడు తిన్నగాఁ దనశయన గృహమున కేఁగి ప్రక్కపై నొరగి బాగుగా నాలోచింప సాఁగెను.

“ నేను పసితనమునుండియు నోటో నెఱుఁగుదును. అట్టియుత్తముని నాయింటనా వధియించుట ? అతిఘోరమతిఘోరము ! నేను చేయఁజాలఁ జేయఁజాల. కాని నే నతని నెటులఁగాపాడఁ గలను? నా ప్రాణము దక్క దే. ఓభగవతీ, మ మ్మనుగ్రహింపుము. నే నేమి చేయువాఁడ. నే నతని నిప్పుడే హెచ్చరించిన నాపై ననుమానము కలుగక మానదు. ఆహా, నే నీ సంఘమున నెట్టి దుర్ముహూర్తమునఁ జేరితిని. క్రైస్తవధర్మములలో నొక్కదాని నైన నీసంఘము గౌరవించుట లేదే. ప్రేమయును సానుభూతియును నొకింతయైనఁ గానరావే. అయ్యో, ఏమిగతి ! వాని నేను గాపాడఁజాలను. వాఁడికఁ బ్రతుకఁజాలఁడు. అయ్యో వానిని మృత్యుగృహమునకు నేనే కొనిపోవలసి వచ్చెనే ” అని యాతఁడత్యధికముగఁ బరివేదన మొనరింపసాగెను.

ఇట్లొకగంట గడచినది. అక్షను నెలవేర్పుటకై యాతఁడు నిశ్చయించుకొనెను. పిమ్మట నాతఁడు లేచి వారి స్థలికిని నాహారపదార్థముల నందజేసివచ్చెను. అతనికి మనశ్శాంతి యావంతయును లేదు. అటులనే తనచింత కనబడనీయకుండ నడంచుకొని పాకశాల కేఁగి తన మేనకోడలిని పిలచి ,, వినుము. పియనెల్లా శయనింపఁగోరినప్పుడు ముఖకలగదిలోనికి గొనిపొమ్ము. నా కేమో యస్వస్థతగా నున్నది. నేను పడకగదిలోఁ బండుకొందు ,, నని పలికి యతఁడు కడువేగమున గడచి పోయెను.

ఆకన్నియ వచ్చి కొన్నిదినములే యైనది గాన నీటుకలగది యెట్టి ఘాతుకస్థానమో యెఱుఁగదు. కానితనచుగఁ బాంధుల కాగదిలోఁ బక్కల నమర్చ రని మాత్ర మామె యెఱుఁగును. దానివలన నామె కెట్టియనుమానమును గలుగలేదు. దానిగూర్చి యామె యెరల నాలోచింప నైనలేదు.

రాత్రి పది గంట లైనది. ఇఁక శయనించిన బాగుండు నని పియనెల్లా యూహింపసాగెను గాని ఆవలుత నశ్వశాలకుఁ బోయి తనగుఱ్ఱమునకు సరిగ గడ్డివేసిరో లేదో చూచి వత్తమని యాతఁడు తలఁచెను. ఆతఁ డటులు వెడలిపోయిన వెంటనే దీర్ఘ ప్రయాణము నరించి కడుబడలిన ట్లగుపడుచు నొకపురుషుఁడు లోనికి వచ్చెను.

అతని కేమి కావలెనో తెలుసుకొనుటకా కన్నియ యాతని చెంత కేఁగెను.

,, ఓ బాలికా, కొందఱు శత్రువులు నను వెంబడించుచున్నారు. ఇదిగో నీ కీ యాభరణమును బహుమానముగ గొని నేను పండుకొనన నొక గదిని జూపుము. ”

,, శత్రువులా ! దారిలో మీ కెవ్వరైన నగపడిరా ? ,,

,, ఔ నౌను. ఆలస్యము చేయకుము, న న్నొకగదిలోనికి తీసికఁ

గొనిపోయి నాకుఁ గొంచెము మద్యము గొనిరమ్ము. దాహ మత్యధికముగ నున్నది. ''

,, అయ్యో! గదిలేదు. మిగిలిన యొక్క గదిలో నొక పాంథుఁడిపుడు పండుకొనును. అతఁ డశ్వశాలకుఁ బోయి యున్నాఁడు గావున మీకు మధ్యగదిలోనే పక్క వేసెదను. ''

,, వలదు వలదు. నా కొక గది ప్రత్యేకముగ నుండవలెను. అతని కీయఁదలంచినగదిని నా కిమ్ము. నీ వంటి సుందరాంగి చెప్పిన నా తెరువరి యీమాత్రి మంగీకరింపక పోదు.

,, మామాము ''

,, ఇఁక నేమియును బలుకకుము. ముందు దారిదీయుము. ఇదిగో యీ నాణెముగూడఁ గొనుము. మరల నీ కుదయమునఁగూడ నింక నొక నాణెము నిచ్చెదను. " అని యాతఁ డాతురతతోఁ బలికెను.

నాణెమే ధనము. దానిని జూచిన నిఁక సంశయము నిలుచునా? నిలువదు. గావున నాకన్నియ వెంటనే కరదీపికను చేఁబూని దారి దీసెను.

,, ఆగదిలో నెవ్వరు పండుకొనిన నేమి? మామామకుఁ గావలసినది ధనము గదా? ఇతఁడధికముగఁ ధనమిచ్చెద ననుచున్నాఁడు. నాకుఁ గూడ మంచి బహుమాన మిచ్చెను. ఇంకను ఈయఁగలఁడు. నేను దీని నేల పోగొట్టుకొనవలెను? వత్సరమంతయు శ్రమపడినను నా కీ మాత్రము లభింపదు. పియునల్లా మిక్కిలి మంచివానివలె నగుపడుచున్నాఁడు. చాల వినయమును దయయును సద్భావమును గల యువజనుఁడు. కావున నే నెటులఁ జెప్పినను గాదనఁడు. అదిగాక యాతని కెచట ప్రక్క నమర్చునదియు నే నతనితో నింతవఱకును జెప్పనే లేదు. కావున మ రెట్టితొందరయును గలుగ'' దని తలపోయుచుఁ గ్రొత్తగావచ్చిన తెరువరి నామె ఝటుకలగదిలోనికిఁ గొని పోయెను.

,, కొంచెము ముష్ణోదకమును మద్యపాత్రియును వడిగఁ గొనిరమ్మని యాతఁ డామె చేతనున్న కరదీపిక నందుకొనుచుఁ బలికెను. ఆమె వెంటనే వానిం దెచ్చి యిచ్చి వెడలిపోయెను. తోడనే యతఁడు తలుపుమూసుకొనెను.

ఆమె క్రిందికి వచ్చుసరికి పయినల్లో యచటఁ గూర్చుండి యుండెను. ,, నే నిపు డశ్వశాలకు పోవుట చాల మంచి దైనది. మీసగి జనుఁడు నాగుఱ్ఱమువంకఁ జూడ నైన లేదు. మీ లడ్వాడు చేయవలసిన పని నంతయు నే నిపుడు చేసి దానికి సదుపాయ మొనరించి వచ్చితిని. వగే గాని నాకు పక్క యెక్కడనో తెలిపెదవా ? ,, తగిన గదిలే దని తెలుపవలసి వచ్చినందుల కామె యేమేమో సమాధానములు చెప్పసాగెను.

ని వేమియును జెప్పవలదు. నాకట్టి మర్యాదలు భోగములు నక్కఱ లేదని నేను మొదటనే మీ మామతోఁ జెప్పితిని. హంసతూలికాతల్ప ముండినఁగాని నిద్రపట్ట దనువారు వేఱు. నే నట్టి సుఖభోగినిగాను. ఎచటనైన సరే పండుకొనఁ దావు చూపినఁ జాలును ,,

అని ఓటో పలుక నామె చాల సంతసించి మధ్యగదిలో నాతనికి శయ్య నమర్చెను. ఆపర్హాటున నాతఁడు గూడ ముద పుంది పండుకొనెను. ఆమెయు దన గదిలోనికి పోయెను. అంతయును ప్రశాంతమైనది.

## ౩౯

బ్యారొకగానాక్రొత్తదొనువరి గదితలుపును మూసుకొని యాచ్ఛాదనవస్త్రమును దీసివేసి యగ్గల సుగుదాహము తీర నొక్క గ్రుక్కను నిండుగలాసుమద్యమును ద్రావెను.

పిమ్మటఁ దనవస్త్రులపై నేర్పడిన రక్తపుమరకల నుష్ణోదకముతోఁ గడుగ నారంభించెను.

„ ఈమరకలు నరహత్యను వెల్లడించుగుఱుతులని మునుపే లండలు ఏమనిన నేమి నీటితోఁ గడిగిన మాసిపోవుచున్నవి. ఇఁక భయములేదు గాని నేను నిష్కారణముగఁ బ్రాఁకరపడితిని. ఆ మాశ్వికు నట్లు మార్గమధ్యమున నే నడ్డగొనఁగూడదు. నాకు ధన మావసరముగఁ గావలసి యుండెను. ధనము కన్న నాతని యశ్వము కొఱకే నేనాతని నట్లు నిరోధించితిని. „ ఓ ద్రోహీ నాచేతు వదలు మని మాత్రి మాతఁడనెను. ఆధ్వని నాకుఁ బూర్వపరిచితమువలెనే కనఁబడెను గాని అంధకారము గ్రమ్మియుండుటచే నే నతని గుర్తింపజాలకపోతిని. ఆహా! అతఁ డెంతతీవ్రముగాఁ బోరుసలిపెను. నే నంతగా నాసించిన యశ్వముగూడ నాకుఁ జిక్కకుండనే పోయెను. ఆతని నే నదృష్టమున నేలఁ గూలిచినంతనే అది చెంగున నెగిరిపోయెను. అది ఎట కేఁగునో గద! ఎట్లైన నాతని శవము పాంథులు చూడకముందే తెల్లవారకముందే నే నిందుండి వెడలిపోవలెను." అని యాలోచించుకొనుచు నతఁడు మఱియొకసారి మధ్యమును గ్రోలెను.

„ గుఱ్ఱము లభించిన శీఘ్రము కానమున కనుపుగలిగెడిది. పోనిమ్ము. చాల ధనమును మంచి అంగీయును దొరికినవి. గదా ఆధనముతో నేనిచటనే యశ్వమును గొనఁగలుగుదును గాని దానివలన ననుమానములకుఁ గారణ మగు నని సంశయించుచున్నాను. ఫ్రాన్సు దేశమునకే పోవలెను. పారిసునగరమును నే నీ ధనముతో సురక్షితముగఁ జేరఁగలిగితినేని జర్మను ప్రభువు నని నటింప వీలగును. అపుడు ధనికురాం డ్రగుయువతు లెందరో నాకటాక్షము నర్థింప వచ్చెదరు. పిమ్మట నేను ఫాస్టుతో రాయబారములు జరిపెదను. అతనికి సంబంధించిన గొన్ని పత్రములను నిడాగదిలోనుండి నే నపహరించితిని. అవి నాచెంత నుండుట నాకిపుడు మేలైనది. నేను జర్మనీదేశమునందుండఁజాల. ఇటలీదేశముపై నాకు రోత పుట్టినది. గాన నింక ఫ్రాన్సు దేశమునకే పారిసునగరమునకే పోయెదను. నేను సీజరు పక్షమునఁ

జేరి యుండి సంజాలలాభించి యుండును. తెలివి లేమిచే నతని శత్రువులతోఁ జేరి చెడితిని. పోనిమ్ము. సీజరు మాత్ర మిప్పుడు మొగము చాటు వేసి దేశద్రిమ్మరియై పోలేదా ? ఇఁకఁ గొంచెము విశ్రమించెదను. ''

అనుకొని యూతఁడు మద్యపాత్రయందు మిగిలిన మధురాసవ ముసు బూర్తిగా గ్రోలి శయ్యాతలమున నొరిగినదే తడవుగ గాఢ నిద్రలో మునిఁగెను. మఱియొక గంటకు సరిగా పన్నెండుగంటలవేళ గోడలో రహస్యద్వారము తెరువఁబడెను.

ఆన్సలము మెల్లన లోనికి సగము వంగి చూచి ,, అతఁడు నిద్రించుచున్నాఁ '' డనెను.

,, దీపము కావలెనా '' అని వెనుక నున్న గ్రిఫ్సు పలికెను.

,, వలదు. నిముషములో నంతయుఁ జక్కనగు. నీ వక్కడనే నిలువు '' మని పలికి యీ పరమఘాతుక స్వభావుఁడు మెల్లన లోనికేఁగెను.

ఆయిటుకల గదిలో నిట్టి హత్య లెన్నియో జరిగెను. ఖడ్గపాఁతీసందేశము లెందరికో అందచేయబడెను. గాఢాంధకారము గ్రమ్మినది. వెలుపల విరాజిల్లుచున్న చంద్రికావైభవములోనికి రానవకాశము లేదయ్యె. గావునఁ బండుకొనినవాఁడు వెల్స్టీనుగాని ఓటోగాఁడని యూనరహంతకుఁడు గుర్తింపజాలక తనచేతి కైజాకునూచి యూతని పక్షమునఁ బూర్ణశక్తితో గ్రుచ్చెను.

వెంటనే వెల్స్టీను ప్రాణముల విడచెను. అన్సల మొక్కడాటున రహస్యమార్గమున కురికి తలుపు మూసెను. ఆక్షణముననే యెవరో బిగ్గరగా వీధితలుపు తట్టిరి. ఆశబ్దము గృహమునం దంతటను బ్రతి ధ్వనించెను.

హేర్మను క్షణికమైన రెప్పవాల్చలేదు. నిశ్చేతుకముగ నోటో మృత్యుముఖమునఁబడి పోవుచున్నాఁ డనునంత నాతని యంతరంగ

మును గాల్చివేయుచుండెను. గావున నతఁడు గవాక్షము తెరచి, „అర్థ రాత్రమునం దిట్లు తొందర చేయున దెవ" రని యడిగెను.

„నాయజమానుని దారిలో నెవరో యడ్డగలి నిర్దాక్షిణ్యముగ హింసించి" రని యాశ్వికుఁ డగువాఁడు పలికెను. అతని ముందట నాగుర్రముపై స్మృతితప్పిన మాసవాక్కు కనఁబడెను. అతఁడు జర్మని దేశీయుఁడు కాఁడని యుచ్చారణ వలననే హెర్మను గ్రహించెను.

„అయ్యో! ఇదిగో వచ్చుచున్నా" నని పలుకుచు హెర్మను శీఘ్రముగ నంగీనిదొడుగుకొని దీపమును జేతఁ బట్టుకొని దిగవచ్చెను. అతని సహాయమున నాశ్వికుఁడు క్రిందికుదిగెను. వారిద్దఱును, చైతన్యరహితముగు నావ్యక్తిని లోనికిఁ గొనిపోయిరి. అశ్వము నశ్వశాలకు గొనిపోవుటకు లక్ష్మిగును హెర్మను పిలచి మధ్యగదిలోనికి నాశ్వికుఁడును దాసు నావ్యక్తిని గొనిపోయిరి. పిమ్మట వా రావ్యక్తి నొకపడకకు క్ప్రైఁ బరుండఁ జేసిరి. హెర్మను దీపమును గొని రా వెడలిపోయెను.

అతఁడు మరలి వచ్చి చూడ నచట నొకపక్క యమర్పఁబడి యుండెను. దానిపై నవ్వారో కూర్చుండి యాకస్మిక నిద్రాభంగము వలనఁ గలిగిన భయసంభ్రమములతో నఱుఁగుఁ జూచుచుండెను.

„అయ్యా నీ వెవ్వరు? ఇట కేటులవచ్చితి" వని హెర్మను ప్రక్కపైఁ గూర్చుండిన మాసిచెంత కేఁగి యడిగెను.

„నీవు చూచుచుండగనే గదా నేను వచ్చి యుంటిని. ఇదేమి!"

„అయ్యో. దైవమా! ఇదేమి. నీవు — ఎటుల"

„అబ్బబ్బా పల నిమిషముల కాలము వ్యథచేసినావు. రమ్ము రమ్ము. ఆహా నాయజమానుఁడు కనులఁదెఱచి చూచుచున్నాఁడు. శ్వాసము వెడలుచున్నది. అమ్మయ్యా. బ్రతికెను. బ్రతికెను! అయ్యా, వడివడిగ ద్రాక్షారసము గొనిరమ్ము పొమ్ము" ని యిట్టి పలుకులు విని ఏమి

...చున్నదియుఁ దెలియక వింతమాట లాడుచున్న హెర్మ్సను నుద్దేశించి క్రొత్తపురుషుఁడు బిగ్గరగాఁ బలికెను.

,, ఆవ్యక్తి గాయముల నుండి రక్తము స్రవించుచుండెను. నే నిపు డెందున్నా '' ననిక్షీణస్వరమున నాతఁడు పలికెను.

ప్రభువా, నీకిపుడు ప్రమాద మేమియును లేదు. అని క్షతగాత్రునితోఁ బలికి తిరిగి చూచి అయ్యో! నీవు కదలవేమి? నీ మిత్రుని నంతవింతగా రయ్యుముపట్టినవానివలెఁ జూచుచున్నావు. గాఢనిద్ర లోనుండి యాకస్మికముగ లేచుటచే నాతని కదటు కలిగి యుండును. పోయిరమ్ము'' అని పురుషుఁ డాత్రుతతో హెర్మ్సను దిలకించిపలికెను.

,, ప్రభువా '' యను సంబోధనము హెర్మ్సను చెవినిఁ బడినది. ఓటో ఆనప్రలముబారినుండి బ్రతికె నను సంతోష మొకవంకఁ గలిగినది. తనయింటి కొకప్రభు వతిథిగా వచ్చె నను తలంపా సంతసము నతిశయింపఁజేసినది గావున నతఁ డధికోత్సాహముతో వలయువాని నన్నిటిని సిద్ధపఱుపసాగెను.

ఓటో గూడ లేచి యొక యంగీని దొడుగుకొని చేతనైన సాయ మొనరింప సిద్ధమయ్యెను.

ప్రభుని అనుచరుఁడు ఓటోసాయమునకు సంతసముతో నంగీకరించుటచే వారిరువురు నాతని దుస్తులను మెల్లనఁ దొలగించి యుతనిని వెనుకటికంటె సౌఖ్యకర మగుచోటఁ బరుండఁ జేసిరి. అంతలో హెర్మ్సను ద్రాక్షారసమును పాత్రిస్త్రిలను, పేశీల్పను, గొని వచ్చెను.

,, ప్రభువా నీ కిపు డెట్టియపాయమును లేదు. ఈద్రాక్షారసము నాస్వాదించినఁ గొంత సత్తువ గలుగఁ గల '' దని మిచెలోటో పలికెను.

,, ప్రభువా నామందిరమునం దున్న మద్యములం దుత్తమోత్తమ మగుదానిని దెచ్చితిని '' అని హెర్మ్సను పలికెను.

అవ్యక్తి సీజరే. అనుచరుఁడు మిచెలోటో. సీజరునోటికడ — లోటో పానపాత్రము నుంచ నాతఁడు మెల్లగఁ గొంత మద్యమును గ్రోలెను. దాని వలనఁ గొంతవఱకు త్తేజనము కలిగినది.

"ఇపుడు కొంతవఱకు సౌఖ్యముగ నున్నదా" యని సహజమగు ప్రేమతో మిచెలోటో యడిగెను. మిచెలోటో కతనియెడ నిక్కపు స్వామిభక్తి కలదు.

"మిచెలోటో! కొంత సౌఖ్యముగా నున్నది గాని అయ్యో, నాతల నాతల పడిపోవుచున్నది." అని యాతఁడు వెనుక కొరగెను. అంతట నోటో శీతలోదకమున నాతని వదనమును జెక్కులను దడిపి కరఁడుగట్టిన రక్తమును గడిగి వేయు నచటఁ బెద్ద గాయము కనఁబడియెను.

"గాయము పెద్దదే యైనను ప్రాణాపాయకరము గాదు," అని అనుభవజ్ఞుఁడగు మిచెలోటో పలికెను.

"నేను చక్కగాఁ గట్టు కట్టనేర్తు." నని పలికి ఓటో నైపుణ్యముతో సాధ్యమగునంత వేగముగఁ గట్టుకట్టసాగెను.

పిమ్మట హెర్మను దీపము వెలిగించి తాను మెల్లన వెడలి పోయెను. ఏలయన నీరహస్యమును బూర్తిగ గ్రహించువఱ కాతని కూరట కలుగలేదు. కావునఁ నతఁడు తన మేనకోడలి గదియొద్దకు బోయి మెల్లనఁ దలుపుదట్టెను. ఆమె యదివఱకే క్రొత్తగావచ్చిన సవ్వడి విని లేచి యంగీని ధరించుచుండెను.

"మామా, ఇదిగో వచ్చుచున్నాను. నాకిక భోజనమమర్పవలెనా?"

"వద్దు! గట్టిగా మాటలాడకుము. పియనల్లాకు మధ్యగదిలో నేల పక్క వేసితివో మొదట చెప్పుము."

"నీవు పండుకొనిన వెంటనే క్రొత్తపాంథుఁడు వచ్చెను."

"క్రొత్తపాంథుఁడా?"

„ ఔను. తనకుఁ గది ప్రత్యేకముగాఁ నిచ్చితీరవలెనని యాతఁడు చాల పట్టు బట్టెను.”

„ హా దైవమా! నీవాతని నీ నౌకల గదిలోనికిఁ బంపితివా?”

„ అలాగే చేసితిని. దానివలనఁ బ్రమాద మేమియును గలుగదని—”

„ అయ్యో! నేను చెప్పిన ట్లేల చేయవైతివి? నీ కేమియును దెలి—”

„ అవును కేమియును దెలియనిపని లే” నన్నమాని అర్ధోక్తిలోనే హేర్మనుకు విఘ్నబడెను. తిరిగిచూడగ నచట అన్సలము నిలచియుండెను.

„ సరే. నీవిప్పుడు రానక్కరలేదు. పండుకొనుము” మని హేర్మను ఆయువకునితోఁ దెలిపి తానే తలుపు మూసెను. పిమ్మట నతఁడు అన్సలముతోఁ గూడ నతని గదిలోని కేఁగెను.

„ నీకును నాకన్నియకును జరిగిన సంభాషణ మంతయు వింటిని. నీవొనరించిన యపరాధ మేమియును లేదు, గొప్ప ఘోరకార్యమాత్రము జరిగిపోయినది.”

" పని ముగిసినదా?” అని హేర్మను గద్గదకంఠుఁడై యడిగెను.

" పని ముగిసినది. ఇప్పుడు కూడీరాదు గాని నిర్దోషుఁడు తప్పించుకొనఁగలిగెను.”

„ ఆహా! నిర్దోషి మృత్యువు నోటఁబడిపోయెఁగా! ఎంతసంతాపకరము; ఎంతదారుణము.” అని హేర్మను చింతింపసాగెను.

„ ఈమాత్రము స్వల్పకార్యమున కింతవందుర నేల? ఊరడిలుము. ఇప్పుడు క్రొత్తగా వచ్చినవారెవరో నీ వెఱుఁగుదువా? ఆ యాత్రికుని కంఠధ్వని నే నెన్నఁడో వినినట్లున్నది.” అని అన్సలము పలికెను.

„ అతఁడు పరిజనుఁడు. అతనియజమానునికిగాయము తగిలెను. అదియెంతలఁతగిలెనో తెలియలేదు. అతఁడుప్రభువో లేక మహారాజో.

,, నాయనుమానము నిశ్చయమైనది. వారే. వారిచటి కేలవచ్చి యుందురు ? ''

,, పరిజనునిపేరు మిచలెటో యనియజమానుఁడు పిలువగా నేను వింటిని '' అని హెర్మను పలికెను.

,, ఇకసంశయమే లేదు. ఆహా ! ఏమి యీవిచిత్రసంఘటనము ? చిక్కె ! నాచేతఁజిక్కె ! దురభిమాని యగునాఘోరశత్రువు ; నా రహస్యమును వెల్లడించి, నా నెత్తిని దుమ్ముపోసి, మహాభిమాని యగు రోమనుప్రభునిసన్నిధానమున నన్నుఁ పూర్తిగా నవమానపఱచిన విరోధిపైఁ బగదీర్చుకొనియెదను.''

,, ఎవ డామహారాజు '' అని హెర్మను నడిగెను.

,, అతఁడే సీజరు. నే నెట్లు పగదీర్చుకొనవలెనో నిర్ధారణచేయ నగు '' నని యాన్సలము ఫ్రిట్జువంక సాభిప్రాయముగఁ జూచెను.

,, సరే ఖడ్గపాశసందేశము ప్రభువులకును సామాన్యులకునుగూడ భీతిని గొలుపునదిరో కదా ? '' అని ఫ్రిట్జుపలికెను.

,, మన మిపుడు యిటుకలగదిలోనికి బోయి యచట ప్రాణములఁ గోల్పోయిన భాగ్యహీనుఁ డెవఁడో చూచి వత్తము రండు. ఒక్క మాట నేనుగాని ఫ్రిట్జుగాని నీయింట నున్నవార్త వారికి గొంచెమైన దెలియఁగూడ '' దని ఆన్సలము పలుక, హెర్మను వినమ్రుఁడై తన సమ్మతిని దెల్ల మొనరించెను.

## ౬౪

అన్సలము కరదీపికను జేఁబూని దారితీసెను. సహజ మగుమొండి చొరవతో ఫ్రిట్జు తని ననుసరించెను. హెర్మనుమాత్రము బెదరుగుండెతో వివర్ణవదనుఁడై నడువసాగెను.

వారు రక్తసిక్త మగుశయ్యాతలమున జేరిదీపపుకాంతిని ప్రసరింపజేయగనే హాహాకారధ్వనుల నొక్కసారిగా నాన్సలమును ఫ్రిట్జును గూడ వెలువరించిరి.

,, వేలస్టేను గ్రిగరీ ! ప్రాణావసరసమయమున ననుబరిత్యజించెను. గావుననె వీని కిట్టిబలవన్మరణము తటస్థించినది. హెర్మను! దీనికిసీవంత గాఁజింతిలనక్కఱలేదు. ఇతఁడును సంఘసభ్యుఁడేగాని చాలనుపద్రవకారిగావున నీతఁడు మృతి నొందుటయే మన కనుకూలము లేనిచోఁ దప్పదాగి యెప్పుడో సంఘరహస్యముల నితఁడు వెల్లడింపకమానఁడు. దాని కేమి యీతనిదుస్తుల నొకసారి శోధింత ,, మని ఆన్సలము పలికెను.

అట్లు పరీక్షింపఁగా నంద మగుధనపుసంచి కనఁబడినది. దానిపై సీ. బో. అనుపొడియక్షరము లుండెను.

,, ఆహా ! తెలిసె. ఇతఁడే దారిలో సీజరును దలపడి క్షతగాత్రుని గావించె నని నిర్ధారణ చేయ ననువుకలుగుచున్న ,, దని ఆన్సలము పలికెను.

,, నిస్సంశయము. దీనిపై గల గురుతు లావిషయమును స్పష్టపరచుచున్న '' వని హెర్మను పలికెను.

,, ఇవిగో రక్తపుడాగులు పూర్తిగాఁ బోలేదు. ఇఁక నెట్టి యనుమానమును లేదు. నీవు మిచెలొటో నడిగినలోఁటుపాటుల నతఁడు పూర్తిచేయఁగలడు. ఇందేవో కాగితము లున్నవి. వానినిగూడఁ బరీక్షించుట మంచిది. '' అని యాన్సలము కాగితములకట్టను విప్పి చదువసాఁగెను.

,, ఇవియన్నియు ఫాస్టు యిూసు వ్రాసిన లేఖలు. ఆవదంతి నిజమే యని వీనివలన స్పష్టమైనది. ఈయిడా ఫాస్టు కుపపత్ని, వెల్‌స్టీనుభార్య. ఈకారణముననే వెల్టే నామెను బెండ్లియాడుటకుఁ బ్రోత్సాహకముగ ఫాస్టు వెలస్టేనుకుఁ జాలధన మొసఁగెను. ఇదిగో యిది అతిముఖ్య మగుపత్రము. ప్రబలగర్వితమతియగు నౌరానాప్రభువు గూడ నిపుడు నాచేతఁ జిక్కినాఁడు. ఆతఁడే ఆర్సినీయోఘుల యెదుట నన్నవమానించినవాఁడు. ఇపుడు నాకుఁ బాదాక్రాంతుఁడు కాఁగ

నాయజమానుఁడు కొంచెము నాకంటె ముందు గుఱ్ఱమును వడి వడిగ నడిపించుచుండెను. నేను వెనుకఁబడుటయే గాక నాగుఱ్ఱము కాలిజారి యూడి యెచటనో పడినందున నది చప్పున మోకరిలబడెను. నేను తోడనే క్రిందకు దిగి దానిని హెచ్చరించి నిలువఁజేసి నాడాకొట్టుటకు వెనుకగా మఱికొంత కాలవ్యయమైనది. నేను మరల గుఱ్ఱము నెక్కి రాఁగా నచట రెండుమార్గము లగుపడెను. యజమానుఁ డేదారిని బోయెనో తెలియలేదు. వెనుక మేము బసచేసిన యింటి యజమానుఁ డాదారినిగూర్చి నాయజమానునితోఁ దెలిపినసంగతులను నేను సరిగా వినలేదు. నే నొకదారిఁబట్టి పోఁగా కుటీరము కనంబడియె. నేను వారి నడుగఁగ దప్పుదారినిఁ బడితివనిరి. నేను మరల వెనుకకు దిరిగి రెండవదారిని కొలఁదిదూర మరుగునరికి మూలుగు వినఁబడెను. వెంటనే నే నాతావునకుఁ బోయిచూడ నాయజమానుఁడు జీవములేని వానివలెనే నేలఁబడి యుండెను. అతని గుఱ్ఱమును నిలువుటంగీయును ధనమునంచియుఁగూడఁ గనఁబడలేదు. తస్కరులెవరో యాతని నట్టిదురవస్థకు పాలుచేసి యుందురని తలంచితిని గాని యొక్కటిమాత్రము మేలైనది. చాల మొత్తముగలసంచి నా జనునకుఁ దగిలించితిని. కానిచో ధన మంతయును దొంగలవశమై చాలతొందర కలిగియుండును. పమ్మట నే నాతని నెత్తినాతొడలపై బరుండఁజేసి కడువడిగ నిటకు గొనివచ్చితిని. ''

అని మిచెలాటో తెలిపిన సంగతుల నన్నిటిని పూర్ణను విని అంతకుముం దశ్వాతమునఁ గూలఁద్రోయఁబడినవాఁడే యీదారిఁ దోపిడీ చేసి యుండు నని నిశ్చయించెను. ఆసమయమున అన్నలమును ఫిట్జును రహస్యాలోచన మొనరించుచుండిరి.

,, పీడరును మనము లిన్సుఫౌల్డు దుర్గమున బంధించి అతఁడు తన వ్యాపారధనసంచయము నెచట భద్రపరచెనో తెలుసుకొనవలెను. ఆవివరముల నెఱిగించిన వదలెదమని [illegible] జగును '' లని అన్నలము పలికెను.

,, మీచెంత నున్నయాజ్ఞాపత్రమును జూచినమాత్రమున ప్రభువు మీయాజ్ఞ శిరసావహింపఁగలఁడు. ,,

,, వేకువనే నే నాదుర్గమున కేఁగెదను. ఓరా పియుసల్లాను నీవు కనిపెట్టి యుండుము. అతఁడీగృహమున దీర్ఘకాలముండఁడు. మనము ఖడ్గపాశము సహాయమున నాప్రబలశత్రువి గడతేర్పనేవలయు. ,,

,, మీ కెట్టిసంశయమును వలదు. నేను మిమ్మెచట గలుసుకొనవలెనో యానతిండు ,,

,, లిన్నద్రాఘ్రుమార్గమునందే. ,,

అని అన్నలము పలికెను. ఇటుల వారిర్వురును వేకువ యగువఱకును ముచ్చటించుచుండిరి. అంతట నాన్నలము వెడలిపోయెను. ప్రేజు పియుసల్లాను గనిపెట్టుచుండెను.

సూర్యోదయ మైనవెంటనే ఓరా నిజాశ్వము నధిరోహించి వెడలిపోయెను. దాని గనిపెట్టుచున్నప్రేజు వెంటనే పరటిదారిని అరణ్యమువంక కేఁగెను. ఆయరణ్యమున కది చాల వేకువ యగుకాలిదారి. ఆప్రాంత మంతయు నాతనికి బాగుగాఁదెలిసినదే. ఓరా ఆయరణ్యమునకు చుట్టుదారిని రావలసియుండుటచే నతనికంటె ముందుగ నచటికి పోగోరి ప్రేజు వడివడిగ నడచి పోయెను

ప్రేజు నిర్ణీతస్థలమును జేరినతోడనే దూరమునఁ దనయశ్వమును మెమ్మదిగ నడిపించుకొని వచ్చుచున్న ఓరాను జూడఁగలిగెను. అచట ప్రేజు గుబురుగ నల్లుకొనినపొదలమాటున నున్నస్థలములో నిలచియుండుటచే తనప్రాణమును దీయఁబూనినపగతుఁడు నత్తిదూరమున సన్నిహితుఁడై యున్నాఁడని ఓరా తెలుసుకొనఁజాలక పోయెను.

ఓరా సమీపమునకు వచ్చినంతనే భరతఖండమునందలి మహారణ్యములలోఁ బ్రయాణము చేయు పాంథులపై నేవృక్షాగ్రమునుండియో యుఱుకుభయదసర్పము వలెఁ బాశయుతఖడ్గమును జేఁబూని ప్రేజొక్కయుఱుక నతనిపైఁ బడెను.

యుఱుకుపడికి బెదరియో, దైవవశముననో, అదృష్టవిశేషమున నో, గుఱ్ఱము ప్రక్కకు దాటినది. ఫ్రెజ్జుచేతికరవాలము జీనునకుఁ దగిలెను గాని ఓటోకుఁ దగులనేలేదు. పదిరెం డడుగులయెత్తున నుండి యుఱుకుటచే ఫ్రెజ్జు దభాలునఁ గ్రిందపడెను.

అదివఱకే గుఱ్ఱము బెదరియుండుటచే నాచప్పుడు విని మఱింత యదరిపడి తనవెనుకటి కాళ్ళతో నాహంతకునిఁ జితుకఁద్రొక్కెను.

వెంటనే ఓటో క్రిందకు దిగి ఫ్రెజ్జును గుర్తించెను. ఏలయన నతఁ డాతని యాల్ప్సను పర్వతదుర్గమునందు తొలుతను బిమ్మట వియన్నా నగరమున న్యాయస్థానమునందునుగూడఁ జూచి యుండెను. గావున నతఁడు వెంటనే పిస్తోలును చేఁబూని మరల నీవు ఘాతుకమును గలంచిన మనఁజాల ” వనెను.

ఓయువకుఁడా వెరువకుము. నీకే గాదు. మఱి యే ప్రాణికిని గూడ నిఁక నే నెట్టియపకారమును జేయఁజాలను.

“ చింతింపకుము. నిన్ను నే నీసమీపగ్రామమునకు గొనిపోయి చికిత్స చేయించెదను. నీవు జీవింపఁగలవు. అప్పుడైనను పశ్చాత్తాపములో నీ వొనరించినమహాపాతకములకు చింతిలి సర్వేశ్వరు నారాధించెదవుగాక ”

“ ఓ దయామయుఁడా! నీయాలోచన నిష్ప్రయోజకము. నాప్రక్కయెముకలు చూర్ణమైనవి. నేను ప్రాణముల వదలుచున్నాను. ఆహా ఏమిది? ఇప్పుడే నీప్రాణములఁ దీయఁబ్రయత్నించిన నాపైనఁగూడ నీకింతకనికరమా? ”

“ నేను నిన్ను మనసార క్షమించితిని. నిక్కము. నీయవసానకాలమున నీవు నన్ను జంపఁగడఁగినందులకు వగజెందకుము. మృత్యుముఖమునఁబడ నున్ననీకు మనస్తాపమును దొలఁగింప నేను చేయఁదగినదేదైనఁగలదేని తెలుపు మని దయామయుఁ డగుఓటో శాంతచిత్తుడై పలికెను.

“ కలదు. కలదు. నాసంచిలోని యొకయరలో లేఖ గలదు. నచట నంటకుట్టితిని. దానిందీసి భద్రముగ ఆర్చిబాల్డుకు తీసుకొనిపో రాసక్తియగు మేరియూప్రభ్వి కిమ్ము ”

“ అటులనే జేసెదను. నీవు నమ్మవచ్చును. చెప్పవలసిన దింకేమై నంగలదా ? ” అని ఓటో పలుకునంతలోనే బ్రూడు కంఠస్వనము సిర సింపదొడంగెను. వదనము వివర్ణము కాసాగెను.

“ అన్నలము నీప్రాణముం దీయనున్నాడు. జాగరూకతతో నుండుము. ”

“ ఇందులకు నిన్ను బురికొల్పిన దతండేనా ? ”

“ అతడే. అతడిపుడు లిన్సుడ్రాపు దుర్గమునం దున్నాడు. అతని కెడదొలంగి యుండుము. ఆహా ! పోవుచున్నది, పోవుచున్నది. ప్రాణము ”

అని యింక నేమేమో చెప్పంబోయిన స్థితి నుండెను గాని అంతలోను దవుడలు దగ్గరం బడెను. కుత్తుకయందు ఘుర్ఘురధ్వని వెడలెఁ ప్రాణములు పోయెను.

పిమ్మట ఓటో ప్రశాంతభావముతో నాతనివదనమును దిలకించి యాతని యాత్మశాంతికిని దనప్రాణములం గాపాడినందులకును భక్తి పూర్వకముగ సర్వేశ్వరుం బ్రార్థించి ఆతని సంచిని సన్నకై జాగ్రతతోఁ జల్చి దానియందు పైవిలాసము లేకుండ సీలువేయంబడియున్న లేఖను దీసికొనెను.

ఆతఁడు దానిని భద్రపఱచి శవము నొక ప్రక్కకుం దీసి దానిపై నాకులుగలకొమ్మలను గప్పి తాను గమ్యస్థానమును జేరి యెవరి నైన బంపి యంత్యక్రియల నిర్వర్తింపఁజేయ నెంచెను. అటునుండి యాశ్వ మున్నకడకు పోవుచుండ దారిలో పాపయుత మగు ఖడ్గము కనంబడెను. అప్పు డతని కంతయు విదితమయ్యెను. అన్నలము కాసంఘముతో సం

" అటులనే నా గ్రంథాలయమున నుందును. నీ వీలోన సంతృప్తి భోజన మొనరింపుము. పిమ్మట నీవచటికి వచ్చిన మన మిష్టాగోష్ఠిని గొంతప్రొద్దు పుచ్చెదము. " అని ప్రభువు పలుక నాతఁడు తలవంచి నతియొనరించి వెడలిపోయెను. ప్రభువును నిష్క్రమించెను.

" ఒకచో ప్రాకారకుడ్యపరిభాగమునుండి సన్నిహితసోపానపఙ్క్తిని జేరబోవునంతలో నొక స్త్రీ మేనిండ ముసుగుధరించి యాకస్మికముగ నాతని కెదురుపడెను. ఆమెమోము మించుకైనఁ గనఁబడకున్నను నామె గొప్పయింటి యువతివలెఁ గనఁబడుటచే నాతఁడు సహజవినయముతో గౌరవమును నెఱపెను.

ఆమెయు నుచితరీతి నావందనము నందుకొనుచు ముఖవసనము మాటుననుండి యాతనికోమలవదనసరోజముపైఁ దనచూడ్కులఁ బ్రసరింపఁజేసి బిరబిరనడచి పోయెను. ఆమె యౌన్నత్యము శరీరసౌష్ఠవము, అంచయానము, గభీరభావము మున్నగు సల్లక్షణములు క్షణమాత్ర మాతని నచట బంధించెను. ఆతఁడామెవంక నట్టె నిశ్చలనేత్రములతోఁ దిలకింపసాఁగెను. ఆమెవదనకాంతియొక్కింతయుఁ గనబడకున్నను నామె సుందరియగునని యాతఁడు నిశ్చయించెను. ఆమె కొంతదూరము వఱకు వడివడిగ నడచి చటాలున వెనుకకుఁ దిరిగిచూచెను.

ఆతఁడటులనే కదలక రెప్పవ్రేయక తనవంక నట్టెచూచుచుండుట నామె కనిపెట్టఁగలిగె ననుటలో వింత [illegible] లేదు.

ఆహా! తానటుల నాసతివంకఁ జూచుట యనుచితము. అట్టిస్థితిలోఁ దన్నామె తిలకించుటగూడఁ దటస్థించినది. తన ప్రవర్తనము నామె యెట్లు భావించునోకదా? అపరిచిత యగులావణ్యవతి నట్టె యొకనవయువకుఁడు అనిమేషలోచనుఁడై తిలకించుట మోటుతన మని తలంచు నేమో యని సిగ్గుపడి చింతిలుచు నొకింత తొట్రుపాటుతోఁ గడువేగమున వెడలిపోయెను.

...ని కాదుర్గము చిరపరిచితము గావున నతివేగమున నాతఁడు భోజనశాలఁ బ్రవేశించెను. అచటియుద్యోగి యాతనినుచితరీతినాదరించెను. అతఁడు తనివిదీర భుజించి ప్రభునిగ్రంథాగారమున కేఁగెను.

"రమ్ము. ఓటో! ఇందుఁగూర్చుండుము. నా థెరస్సా వ్రాసిన లేఖల నన్నిటి జదివితిని. అవి సంతోషప్రదము లని పలుకఁజాలను. థెరస్సాకు సౌఖ్య మేమియు నున్నట్లు కనఁబడదు. ఆ విషయము నామె స్పష్టముగ వివరింపకున్నను బ్రతిపదమునందును బ్రతివాక్యము నందును నా కావిచారభావము విశదిత మగుచునే యుండెను. కాని ఓటో దాపరికము లేకుండ నాకంతయు నెఱిగింపుము., సర్వసౌఖ్యములకు భాజనమై యుండదగిన థెరస్సాకిట్టి యశాంతికలుగుట కేమికారణమో పూర్తిగా నెఱిఁగింపుము."

"ఉన్నతపదవీవిరాజమానులగు ప్రభువరేణ్యుల ప్రవర్తనల విమర్శించుట నాబోటిసామాన్యున కనుచిత మయ్యును దామిట్లాజ్ఞాపించుటచే—"

"అయ్యో! అట్లనకుము. నేనాజ్ఞాపించుటలేదు. ప్రియమిత్రుఁడ వగునిన్ను వేడుకొనుచున్నాను."

మహాభిమాని యగుగోసెంథాలుప్రభు విట్లఁ డకువను జూపుట యసహజము గాని యతనికి తనపుత్రికపై గలకూర్మి గాఢతమము గావున పితృప్రేమ వెల్లివిరిసి యహంకారము నడఁచివేసినది. "నేనీ లేఖలలోనికొన్ని వాక్యములను ముఖ్యముగాఁ జదివెదను. వానిసందర్భమునుగూర్చి మాత్రము నీవు సమగ్రముగ వివరించి నాసంశయమును దొలగింపుము. నీ వేవిషయమునుగూడ మఱుఁగు పఱుపవలదు" దని పలుకుచుఁ బ్రభు వాలేఖలను బల్లపై విప్పి పఱచెను.

"తనకుఁ దనపుత్రికపై నంతప్రేమ కనఁబడదనియు నార్చిడ్యూకుపుత్రునిపై గాఢానురాగము నెలకొనె ననియు నాసుత కనుదీన

...సనది. కనియర్థ మేమి? ఆతఁ డామెపట్ల చూపవలసినంతదయను జూపుట లే దనుటయే గదా?" అని ప్రభువు తీవ్రముగఁ బలికినను నాతని నేత్రములు బాష్పపూరితములే యయ్యెను. ఆతఁడు చాలవిషయములందు గంభీరహృదయుఁడే గాని తన ప్రియపుత్రికయందుమాత్ర మాతనికూర్మి వినిర్మలము.

"ఆప్రభువుకుగూడ నేదో నిగూఢ మగుసంతాపకారణము కల దనియు నాతనికిగూడ మనశ్శాంతిలే దనియు ధరన్నాసతి నమ్ముచున్నది. ఆమె నిర్మలోదారస్వభావ యగుటచే నీనమ్మకమే యామె కమితదుఃఖదాయక మగుచున్నది."

"ఆతఁ డేదైన మహాపాతక మొనరించి యుండ కున్న నట్టి నిగూఢసంతాప మేలకలుగును. సార్వభౌముఁ డాతని నత్యధికముగ గౌరవించుచున్నాఁడు. ఆర్చిడ్యూకు సోదరప్రేమనే జూపుచుండెను. ఆతని నైశ్వర్య మతుల మని యెల్లవారును బ్రశంసించుచుందురు. అట్టిచో నాతని కసౌఖ్య మేలకలుగును. ఆతఁ డేదో పాతక మొనరించెను. అసన్మార్గమున నాతఁ డీఐశ్వర్యమును బడసి యుండునా? ఆపదవిని యధికారమును బడయుట కెట్టిఘోరకృత్యము నైనఁ గావించెనేమో! ఆతఁడు భగవదారాధనమునందు సంపూర్ణముగ విముఖుఁ డని కడువిచారముతో ధరన్నా వ్రాసినది."

"ఆవిషయమున వియన్నానగరవాసు లందఱు నన్ను [illegible]చుచున్నారు. మహా దైశ్వర్యవంతు డయ్యుఁ దన యింట నొక్కపురోహితు నైన నియమింపఁ డయ్యె. ఏనాఁడును దేవాలయమున కేఁగినట్లు లే దని వ[illegible]బోతు లగుము[illegible]సలు లాతనిగూర్చి నిరసనోక్తుల నెల్లప్పుడును బలుకుచునే యుందురు. ఆతఁడు మహోన్నతపదవియం దుండుటచే జేయునది లేక మిన్నకున్నారు గాని ఆతఁడే సామాన్యస్థితియం దున్నచో మతాధిపతు లిందులనుగూర్చి యీపాటికే యాతని నిర్బంధించియుందురు. గాని మన మీ విషయమున నిష్కారణముగఁ జింతిం

పఁగూడను. అతఁడు రహస్యముగఁ బోధించుచుండవచ్చుని యాడంబరములు మోసపుక్రియలు గావనిభావించి యుండవచ్చును. తనలోపములను దైవమునకే విన్నవించుచుండ నోపు. లోకమాన వుని చెవిని వేరు నొల్లకపోవచ్చును. ''

"నాయనా! మంచిమాటచెప్పితివి. అట్లనే యైయుండును. అయినను లోకముతోఁ బాటు తనతోడి ప్రభువులవలెఁ దానుగూడ పురోహితుని నియమించిన నీయూరడియుండనుగదా! ఆతఁడీవిషయ మున మంచిపని చేయుటలేదు. మహాధికారుల ధిక్కరించుట అవివేక ము. అనుచితము."

,, అనుచితమైన నగుగాక. దుస్స్వభావముతో నాతఁడట్లు చేయుచున్నాఁడనిమాత్రము మనము తొందరపడి నిశ్చయింపఁ గూడదు. ''

,, వత్సా! నీవు సుగుణశాలివి గాని నిదాక్షిణ్యమునకు గూడ నాతని ప్రవర్తనము మితిమీరినది. ఆజన్మవైరి యగుటనిన్నుడాసి ప్రభునకు వెఱచి నే నీమార్గమును విడువఁజాలకుంటిని గాని లేనిచో వెంటనే నేను వియన్నానగరమున రెక్కలగట్టుకొని వ్రాలక యుందునా? నాప్రియకొమారినోట నే స్వయముగ నంతవృత్తాంతమును వినకుందు నా? పోనిమ్ము. కొంతకాల మామె నాయింట నివసించుట కాతఁ డనుమతింపఁడా? నే నతని కిపుడే వ్రాసెదను. నీవీపరిసరమునం దెం తకాల ముండఁదలఁచితివి?

,, కొద్దిరోజులుమాత్రమే. నాతల్లి సమాధిచెంత శిలాస్థాపన మొనరించవలసిన ముఖ్యవిధి కొఱవడియున్నది. నాబాల్యస్నేహితు లను గొందఱిని జూచి వారిలో సంపన్నులు కానివారికి చేతనైనంత వరకు ధనసహాయ మొనరింపఁగోరుచున్నాను. భగవదనుగ్రహమునఁ బ్రతికియున్నంతకాలము నా కెట్టిలోటును గలుగనీయక జరిగ

నుచు మఱియు నత్యంతసహాయమును బడయనర్హులగువారికి స్వల్పసహాయ మొనరించుటకుగూడ నా కవకాశమును సర్వేశ్వరుం డొసంగె " నని యెటో యత్యధిక మగులజ్జతో నాత్మాధిక్యమును గూర్చినవృత్తాంతమును బ్రభునకు విన్నవించెను.

,, నీ వీప్రాంతమున నున్నంతకాలమును నా యింటనే నివసింప వలెనుసుమా? నీవు వియన్నానగరమున కేఁగునపుడు నా కుమారునకు గల్లునకుఁ గొన్నియుత్తరముల నీచేతి కిచ్చెదను. ,,

,, నే నిచట బుట్టి యిచటనే పెఱిగినవాఁడనగుటచే నా కీప్రాంత ముపై నభిమానము వదలలేను. గావున నీజన్మభూమియందు కొన్ని వారము లుండ మనియో మొదట తలచితిని గాని నేఁ డుదయమున జరిగిన విశేషమువలన వెంటనే వియన్నానగరమున కేఁగవలసిన యవసరము కలిగినది. ఆవిషయమును మీకావల విన్నవించెదను. ,,

" ఏమిసోదర! నీ విందే యుందువుగదా! ఎప్పుడైనఁ దెలుప వచ్చును. విదేశవాసులును ఉన్నతస్థానమునం దున్నవారు నగు నీకుటుంబమువారు శత్రువులవారి కగ్గమై వియన్నానగరమున జేరి మాక్సిమిలను సార్వభౌముని శరణుజొచ్చిరి. వారి నానగరమునం దుంచుట యపాయకర మని తలఁచి వారి నారాజేంద్రుఁడు నాపై గల గౌరవముచే నామందిరమున కంపెను. ఒక రాకుమా రుఁడు నాతనిసోదరియు నీసద్మమునకు వచ్చెదరని సార్వభౌముఁడు ...డు వ్రాసెను. ఆరాకుమారివచ్చి యున్నది. ఆమె తనసోదరుని కొఱకను క్షణక్షణము నిరీక్షించుచున్నది. నీ వారాకుమారి నాకస్మిక ముగఁ జూచుట తటస్థింపవచ్చు నని ముందుగా నెఱిగించితిని. ,,

అని ప్రభువు పలుకుచుండ నంతకుముందే తాను వీక్షించిన యెల నాగయు హెర్మను గృహమున క్షతగాత్రుండైనయువకుఁడు నీసోదరీ సోదరులై యుందురని యోటో నిర్ణయించెను. గాన నాతఁడు పాంథ గృహమునఁజరిగిన దంతయుఁ బ్రభునకు విన్నవించెను.

"ఆతని పేరు నీకుఁ దెలియలేదు."

"లేదు."

"అట్లయిన నాతనిపేరు గోప్యముగ నుండవలె నని యే వారిసంకల్పము. ఆతని పరిజనుఁడు పాలుమాలి ప్రభువా! మహారాజాయని సంబోధించియుండును. ఈయువతి గూడ సామాన్యస్త్రీవలెనే ఇచట కేతెంచెను. గావున నేను వారిరహస్యమును గాపాడుటయే పరమధర్మము. కాని వెంటనే కెంబర్గున కేఁగి నేనా రాకుమారు నీదుర్గమునకు గొనిరావలయును." అని పలుకుచుఁ బ్రభువు సత్వరముగ లేచెను.

అంతట శిబిరోమార్గమధ్యమున ఫ్రీట్జు తన్నుఁ జంపఁబోయి నేలఁ గూలి మడిసినయుదంతము నెఱిఁగించి ఆశవము నిందుగొని వచ్చి సమాధి యొనరింపవలసియున్న దని విన్నవించుచు ఖడ్గపాశవృత్తాంతమునుగూడ ప్రభునకు దెలిపెను.

"వెహ్ముసంఘమున కెంతటిఅధికారము మైనఁ గలదు. గాని నేను గూడ నీవలెనే వారిసందేశమును ధిక్కరించితిని. ఆలస్యముచేయక నాపరిజనులలో గొందఱి వెంటగొనిపోయి నీవాశవము నిందుగొని తెమ్ము. నేఁటిరాత్రి నాపురోహితుఁ డుచితరీతి నంత్యకర్మ నెరవేర్ప గలఁడు. నే నిపుడే కెంబర్గున కేఁగెదను. నీవు స్వేచ్ఛగా నిస్సంశయముగ నీమందిరమునఁ జరింతువుగాక."

అని ప్రభువు పలుక ఓటోకృతజ్ఞతం దెలిపి వెడలిపోయెను. పిమ్మట ప్రభువును సాయుధు లగు నాల్గురు యోధులు నశ్వారూఢులై కెంబర్గునకు వెడలిపోయిరి.

౬౬

అన్నల మారానాఁ డుదయమున బయలుదేరి లిన్నుడార్ఫు మార్గమున కేఁగెను. అంతివేగముగ ఫ్రీట్జు కపటసాహాయకుఁడుగుదాని యింటికిఁ జేరుగడ.

నే నీప్రభుసేవయందు నిన్ననే ప్రవేశించిన ట్లున్నది. అప్పటి నాస్థితి కడునీచము. మృత్యుదేవతకోరలక్రిందఁ బడియు మరల బ్రతుకఁగలిగితిని. నే నెవ్వరికిని దలచూపరానిస్థితియం దుంటిని. అదివఱకు నేను మాన్స్ఫ్డుసేనలోఁ బనిచేసి యుండుటచే నాతఁడే నా కపు డాధారముగాఁ గనఁబడెను. నే నతనిసేనలో నున్నపు డాతని కీపదవియు సంపదయునుగూడ లేవుగాని యతఁ డాశాపరవశుఁడై యుండెను. అతఁ డెట్టిదుష్కార్యమునకును వెనుదీయువాఁడు కాఁడు. గావున నే నతని నీపాలింతమునందే యీసౌధమునఁ గాదు—చిన్నయింట నతఁ డుండదర్శించి న న్నురిదీసినకథ నంతను స్పష్టముగా నెఱిఁగితిని. నా యట్టివాఁడే యతని కత్యవసరముగఁ గావలసియుంటచే నాతఁడు నిరభ్యంతరముగఁ దనచెంతఁ జేర్చుకొనెను. వెహముసంఘమునఁ నభ్యుని గావించెను. ఆవిశ్వాసమును నేను వృథచేయలేదు. అదనుకలిగినపు డతనికి దోడ్పడి ప్రభుత్వము నడయఁజేసితిని. ఈదుర్గమతనివశ మయ్యెను. అందులకాతఁడు చేసిన ప్రత్యుపకార మేమి ! అతిదారుణ మగునారహస్యము నతఁ డెఱిఁగి యుండుటచే సహజ మగుక్రౌర్యము నంతయు నాపైఁజూపి నల్లిని నలిపినట్లు నన్ను నలిపివేసెను. ఆబాధపడలేక హ్యూగోనుగూడఁ బ్రోత్సాహపఱచి సన్యాసివేషమున నే నతనితోఁగూడనాదుర్గమునుండి వెడలిపోతిని. నా కాసన్యాసివేషము మహోపకార మొనరించెను. ఆలప్సుపర్వతదుర్గాధికారము లభించెను. హ్యూగో న న్నెడఁబాయకుండెను. పిమ్మట సీజరు కుటుంబముతోఁ బరిచయమును దానివలన నధికధనసంపాదనమును జేకూరెను. సీజరు న న్నిట్టుల వంచింపకుండినచో నా కున్నతపదవిగూడ లభించియే యుండును—ఇపు డింతకాలమునకు మరల నే నీదుర్గమునఁ బ్రవేశించుచున్నాను. దురభిమాని యగునీప్రభునిఁ బాదాక్రాంతునిగఁ జేసుకొనఁగల యధికారపత్ర మిపుడు నాచేత నున్నది." అని యనుకొనుచు నాన్సలము మెల్లనవంతెనను దాఁటిలోపలిద్వారమును జేరెను.

“ ఎవరు వారు? ”

“ ప్రభుసంకర్శనార్థిని. ”

“ స్వామీ! లోనికివిచ్చేయు ” డనిపలికి సైనికుఁ డెడఁదొలఁగె. అతఁడు ముఖవస్త్రమును సరిగనమర్చుకొని నిర్నిరోధముగ లోనికేఁగి ప్రభువు కూర్చుండినగదిలోని కేఁగెను. అప్పటికాప్రభువు కొన్నిముఖ్య పత్రములను జూచుకొను చుండెను.

అన్సలము వెడలిపోయి పందొమ్మిది వత్సరములైనది. ప్రభుని యాకారమునఁ జాలమార్పు కలిగినది. అతనిశరీరము కృశించినది. అతనిశిరోజములు పాండురములైనవి గాని యతని క్రౌర్యమును దౌర్జన్యమును గొంచెమైనఁ దగ్గలేదు. అతఁ డొనరించిన ఘోరకృత్యములకుఁ బశ్చాత్తాప మొక్కింతయును గలుగలేదు. అతఁడు అన్సలమును గుర్తింపనే లేదు.

స్వామీ! వందనము. తమరాక కేమికతమో తెలియదు. మత గ్రంథపారాయణము నొనరింపవచ్చితిరా? అట్లైన ననవసరశ్రమకుఁ బాలైతిరి. ఏలయన నీదుర్గమునందు నాపురోహితుఁ డెన్నిరేని వాక్యములచేఁ గరువు పెట్టఁగలఁడు. మద్యపానమువలె మహావాక్య ప్రవచనముగూడ నాతని కతిసులభము ”

“ ఈవృథావాచాలతఁ గట్టిపెట్టుము. నన్ను నీ వపుడే మఱచిపోతివా? ” అని యాతఁడు ముఖవస్త్రముఁ దొలఁగించి గద్దించి పలికెను.

“ ఇది నిజమా? నాచెంత పరిచారకుఁడవుగ నుండిన ఫ్రెడ్రిక్కు కిస్సు—కాదు. ఫెలిక్సు జట్టనుగదా నీవు పెట్టుకొనినపేరు. ”

“ ఔను. నేనే. గాని నా కిప్పు డారెండుపేరులునుగూడ లేవు. అన్సలముస్వామి అనుపేరు నీ వెపుడైన వింటివా? ”

“ ఆహా! వినకేమి. అతఁడు మహాసంఘమున గొప్ప యధికారి నీ వన్నాసంఘమున నీచభటుఁడవు. అట్టి మహనీయునిగూర్చి బోటి సేవకుని నొసగుట నేను ముచ్చటించుట యత్యాచారము. ”

"ఎప్పుడును నీవు దుడుకుతనమే. అనాలోచనయే. సంఘప్రధాన నియమాతిక్రమణముగూడ నొనరించుచున్నావు"

"ఏమి యీగర్వాతిరేకము" అని ప్రభువాగ్రహముతోఁ బలికెను.

"తొందరపడకుము. నేనిప్పుడు సంఘాధికారులలో నొక్కఁడను" అని పలికి యాన్సలము ప్రధానాచార్యు లొనరింపవలసిన కొన్ని సంజ్ఞల నొనరించెను. అంతట ప్రభువు సంతృప్తుఁడై

"సోదరా! నీ వీయాసనమునఁ గూర్చుండుము. నీవు నిశ్చయముగ మూర్ధాభిషిక్తులనుగూడ ముప్పతిప్పలఁ బెట్టఁజాలిన మహాసమర్థుఁడగుప్రధానసంఘాధికారివి. అటులైన నీ వావిఖ్యాతినాముఁ డగు నాన్సలముస్వామి నెఱుఁగుదువా? నీవాతని చెంతనుండియే వచ్చినచో నాకు మఱింత పూజనీయుఁడ వగుచున్నావు. ఎటులైనను మన మిరువురము నిప్పుడు సమానుల మైతిమి. గావున స్వామిభృత్యభేద మంతరించినది. నిన్ను సోదరునిగా నాదరించెదను."

"కాదు నీకంటె నున్నతాధికారి ననిగూడ నిపుడే గౌరవింపఁ గలవు."

"అది ఎటులనో నా కింకను దెలియలేదు"

"నేనే ఆన్సలముసన్యాసిని. ఈరాష్ట్రమున సంఘాధికారమును పెక్కువత్సరములనుండి నీవు దుర్వినియోగ మొనరించుచుంటి వని వెస్టుఫాలియా యున్నతసభవా రసంతృప్తిని జెంది యున్నారు. నీవు చేసినయక్రమముల నన్నిటిని నే నిప్పుడు పేర్కొనఁగలను గాని వానిని నీవు మరువఁజాలవు. ఇప్పుడుగూడ నీ వొకముఖ్యనియమము నుల్లంఘించి సంఘనాయకునినామమును నాయుదంతమును దెలుసుకొనకయే నాయెదుట పేర్కొంటివి. నీవు చేసినగొప్పయపరాధము, ఆర్చిడ్యూకులియపోల్డును నిర్బంధమున నుంచక యాతనివధింప నాజ్ఞాపించుటయే. అతఁడు మనవశుఁడై నసీడగులను బహిర్భ్రష్టులఁగావించి

యతని నాసింహాసనము నధిష్ఠింపఁజేసిన నతఁడు మన కెంతయుపకరించియుండును! నీ వట్లుచేయక యతని వధింప నాజ్ఞాపించితివి. నీయనుచరు లాతని పలాయనమునకు సహకారులైరి. ''

'' నే నాయుదంత మంతయు ప్రధానసంఘమున కప్పుడే నివేదించితిని. ''

'' నీవు వ్రాసిన చిత్రకథను వారు విశ్వసించిరా? లేదు; లేదు. ఎవఁడో యొకడు వచ్చి యార్గురు యోధుల నవలీల భయభ్రాంతుల నొనరించి యాతని నిర్భయముగఁ గొనిపోఁగలిగె ననిన నెవ్వరికి నమ్మకము కలుగును? ఎటులైన నేమి, వారు విశ్వసింపలేదు. ''

'' ఆయోధు లందఱునుగూడ నటులే ప్రమాణము చేసి చెప్పిరి. నే నొక్కొక్కరిని వేఱువేఱుగ నడిగినను నొక్కయక్షరమైనఁ మాఱకుండ నందఱొక్కరీతినే పలికిరి. ''

'' వా రందఱునుగూడ బలుకొని యుందురు లేక నీవే యీగాథ నల్లి యటులఁ దెలుపవలె నని వారికి బోధించి యుండరాదా? ''

'' దైవసాక్షిగా నేను ప్రమాణము చేసెదను. ''

'' వాగ్వాదము కట్టిపెట్టుము. నే నిపు డాజ్ఞాపింప వచ్చితిని గాని వాదింపరాలేదు. నీ వొనరించిన యీమహాపరాధమువలన సంఘమువారు మాక్సిమలను, సార్వభౌమునిపైఁ గుట్రను మానుకొనవలసి వచ్చెను. ''

'' ఆర్చిడ్యూకు నాయుదంతమును నేటివరకునుగూడ నెవ్వరికిని దెలిపి యుండలేదు. లేనిచో సార్వభౌముఁడు నాపై దాడివెడలకుండునా? ''

'' లియపోల్డు సార్వభౌమునికి సర్వమప్పుడే నివేదించెను. సార్వభౌముఁ డన్నిరాజ్యాంగముల నొనగించెను. గాని యనవసరముగ సంఘ

మువారి యాగ్రహమునకు బాత్రుఁడను గానేల యని యాతఁడు సంఘాధికారుల నెవ్వరిని బాధింపలేదు. ఏమియునెఱుఁగని వానివలెనే నటించెను. ఆవిషయములునులియపోల్డు తెలిపినందుననే యాతఁడపుడూరు పేరు లేనియొక కన్నియను బెండ్లియాడుటకు సార్వభౌముఁడనుమతి నొసఁగెను. పిమ్మట నాసతీమణిని రాజమందిరమున నివసించుటకుగూడ ననుమతించెను. ఆ సుదతినిగూర్చి గూడ నే నించుక ముచ్చటించవలసి యున్నది. దానినిగూర్చి రేపు తెలిపెదను. నీవు రాష్ట్రాధికారిగా నుండ నర్హుఁడవని తలంచి సంఘాధికారులు నిన్నిపుడు సామాన్యమండలాధికారిగ మాత్రమె నియమించిరి." అని గంభీరముగఁ బలుకుచు నాన్సలము ఆజ్ఞాపత్రమును జూపెను.

దానిని జూడ లోనఁ గినుక గదిరిన నాతఁడడంచుకొని యాపత్రమును ముద్దిడి "పరమపూజ్యమగుసంఘాధికార పత్రమును శిరసావహించెదను. వారియాజ్ఞ ననుసరించెద" నని కడువినయముతోఁ బలికెను.

"నీ విప్పుడే కొంతసేనను కెంబర్గుపాంథగృహమునకు బంపి యందున్న యిటలీ దేశీయుల నిరువుర బంధించి యందుఁగొనిరా నాజ్ఞాపింపుము. వారిలో నొకనికి గాయము తగిలి యున్నది. ఆలసింపకుము. ఇదియే నాయానతి" అని సఫలీకృత మనోరథుఁడనై తిననుమహాగర్వముతో నాన్సలము పలికెను.

"ప్రభువు వినమ్రుఁడై ఆజ్ఞను నిర్వర్తింప వెడలిపోయెను.

౬౨

గోసెంథాలుప్రభువు పాంథగృహమున కేఁగుటకు బూర్వమే మానుషద్రుయనుచరు లట కేఁగి సీజరును మిచెలాటోను బట్టుకొని పోయిరి. ఆసంగతిని లడ్విగు తెలుపగా బ్రభువునకుఁ జాలవింతగాఁ దోఁచెను.

"నా రంపులకు కారణ మేమియును దెలుపలేదా?"

దుర్గమును చేరగానే సేనాని యగుడమ్యాయిట్జాను పురోహితుని బిలువనంపి వారితో నేకాంతగోష్ఠి యొనరించెను. అదివఱకే ఓటో కొందఱు అనుచరులతోఁ నరణ్యమున కేఁగి చూడ నచట ఫ్రిట్జుశవము కనబడలేదు. ఆశవముపైన తాఁను కప్పినకొమ్మలు విడివిడిగఁ బడియుండెను. ఎవరో కొందఱచటికి వచ్చిన ట్లశ్వగుఱ్ఱములజాడలవలనఁ దెలియ వచ్చెను.

„ ఎవరో తీసుకొనిపోయిరి. వారే అంత్యక్రియల నిర్వర్తింతురు" అని యోటో తనవెంట వచ్చినవారి కెఱిగించెను. వా రందఱును మరల రోసెంథాలుదుర్గమున కేఁగిరి.

అప్పటికి సాయంసమయ మైనది. జరిగిన [illegible] న్నిటిని గూర్చి యాలోచించుటకు ఓటో దుర్గకుడ్యపరిభాగమున కేఁగెను. సాయంసమయ మెల్లజీవులకు భావసంచలనకారకము. కృషీవలులును గార్మికులును హలాదిసాధనముల వదలి కర్మక్షేత్రములనుండి ప్రేమ పరిపూర్ణ లగు సతీముఖమందహాసములతోను చిఱుతల హాస్యవచనములతోడ నొసఁగు స్వాగతము నందుకొన గృహాంతికమున కేఁగ గోరెడు వేళ యిదియే. దారుణకృత్యముల నొనరింపఁగోరు హంతకచోరాదుల కనుకూల మగుకాల మదియే. నౌకాపరియాణ మొనరించు నిజభర్తం దలఁచుకొని ఇదియేగదా తుపానువేళ యని యతని యిల్లాలు నిట్టూర్పు విడుచుసమయ మదియే. తెల్లవారిన నురి దీయబడుదు నని యెఱిఁగిన కారాగృహవాసి కనుక్షణమును సంతాపము నతిశయింపఁజేయు కాలసంధి యదియే. ఇదియే నీకు కడపటి సాయంసంధ్య యని ఆనిందితునకు కాలదేవత తెలుపు ముహూర్త మిదియే. మరలఁ దనివిదీర గాఢ మగు మదిరారసమును గ్రోలు తరి యెప్పు డని సురాపానరతుఁ డువ్విళ్లూరు సమయ మదియే. భగవానుఁడు తన కాహారపానీయాదులను సమకూర్చి తన్ను రక్షించి నందులకుఁ గృతజ్ఞతతోఁ బశ్చిమాభిముఖుఁడై యహస్కరుని రక్త

కిరణములు తనపాటల వదనముపై బ్రసరింపఁ బర్వతోపరిభాగము నందు పర్ణశాలయందలి గేహళసమీపమున నిలచి యోగిపుంగవుఁ డీశ్వరుని వినుతించుతరుణ మదియే. నవయౌవ్వన విలాసవతి యటు నిటు పరికించి యుద్యానవన సంచారమున కేఁగి మనోహర విహంగ రాజ విమలగానము నాలకింపఁగోరుతరి యిదియే. మరణశయ్య నొసంగియు స్మృతి యింకను దొలఁగకుండుటచేఁ దనచుట్టుఁజేరి పలవించు బంధుగుల యార్తనాదముల నాలకించుచు నపు డస్తమించు భాస్కరుఁడు రేపుదయించునంతలోనే నాయాత్మ యీశరీరమును వదలి శాశ్వతపథముం జేరునుగదా యని యాసన్నమరణుండగురోగి తలంచువేళ యదియే అని ఓటో పైకి వినంబడునట్లు పలుకుచుఁ దన్మయుఁడై యుండెను.

" నీకు జిత్రకళా చాతుర్య మొక్కటిమాత్రమే యిచ్చి కవిత్వ పటుత్వమునుగూడ సృష్టికర్త యేల యొసఁగఁ డయ్యెనో " అనుధ్వని యతనిచెంత వినంబడెను. ఓటో తిరిగి చూడ నానాఁడు వియన్నా నగరమున నమితధన మొసఁగిన శాంతమూర్తి యగు వృద్ధజనీయుఁ డతని కట్టెదుట నిలచియుండెను.

" ప్రకృతి మహిమాతిరేకము నిరంతరము న న్నిట్లు తన్మయుత్వమున ముంచివేయుచుండు " నని ఓటో పలికెను.

" ప్రకృతిధ్యానము సత్కార్యా చరణమునకు బురికొలుపుచుండును గాఁబోలు "

" నేను సత్కార్యములనుగూర్చి ప్రగల్భములఁ బలుకఁజాలను. కాని ప్రకృతి వైచిత్ర్యములందు దయామయుఁడును సర్వవ్యాపియు మహాప్రజ్ఞాన్వితుఁడు నగుసర్వేశ్వరుని దివ్య సందర్శనము నాకు గలుగుచుండును. నే నామహనీయుని కటాక్షమునకుఁ బాత్రుఁడను గాన లేనని యే నిరంతరమును బ్రయత్నించుచుందును.

" మంచి ప్రయత్నమే. మనము కలుసుకొని చాలకాలమైనది—"

,, మీ రప్పు డొసగించిన సమయమును మీరు చెల్లింపనే లేదు.''

,, నీకు నేను మఱియొక వేయి నాణెముల నీయవలసి యుండెను. నేను నిర్ణయానుసారము రాలేకని నీవు చింత నొందితివా !''

అట్టి స్వార్థైక దుర్భావము నా కెన్నఁడును గలుగ లేదు. నీవు నన్నొక్కటికముతోఁ గటిక దారిద్ర్యమునుండి యుద్ధరించి మహదైశ్వర్యమును నానందమును గలుగ జేసితివి. నీవానాఁడు ప్రశంసించిన చిత్రపటమును బూర్తి చేయుటకు నేనత్యంతదీక్షతో నహర్నిశములు పనిచేసితిని. ఇంతటి మహోపకార మొనరించిన మహనీయునకు నాకృతజ్ఞతను విన్నవింప—''

,, నేను మరల రాలేకని నీవిచిత్రపటము నితరులకు విక్ర—''

,, అయ్యా మీరు తప్పఁ గలఁచిరని మనవిచేయ సాహసించినందులకు క్షమింతురుగాక. నేను కృతజ్ఞతాదూరమును సమానితోషు నగు కార్యమును జేయుటకుగాదు—వినుటకైన సహింపఁజాలను. ఆ చిత్రపట మిప్పటికిని వియన్నానగరమున మీ రాకను నిరీక్షించుచున్నది. జెర్మనుప్రభువు భవనము నలంకరించియున్నది. ఆ ప్రభువును మీ రడిగినదే తడవుగ నొసంగును. మిగిలిన వేయి నాణెములును మీ రెంత చెప్పినను గూడ నేను స్వీకరించువాఁడఁగాను. మీ రిది వఱకే వేయిరెట్లధికముగ నాకు ధన మొసఁగి యున్నారు. మీ రానాఁ డాచిన్నగదిలో నను జూచి పోయిన పిమ్మట నే నెంతటి మహోన్నతదశనుబడయఁ గలిగినదియు మీకుఁ దెలిసి యుండదు. మీ రానాఁడు చేసిన ప్రశంసయు నొసఁగిన ధైర్యోపదేశమును జేత నిడిన విత్తమును నాయైశ్వర్యమునకుఁ బ్రాతిపదికము లయ్యెను. నేనటుపిమ్మట వినోదమునకొఱకు ఆలప్సుపర్వతప్రాంతప్రదేశమునఁ కేఁగి దైవసహాయమున జర్మనుప్రభువ కెన్యాని పర్వతమార్గమాంతర కారాగృహవిముక్తుఁ గావింపఁజూచితిని. ఆతఁ డిప్పుడు నాకుపరమమిత్రుఁ డయ్యెను. దీని కంతకును మూలకారకులు మీరే. అట్టి మోపట్లనే

నేట్లు కృతఘ్నతతో స్వార్థపరుఁడనై మెలఁగనేర్తును ? నా కిపుడట్టి ధనలోపమును లేదు.

నీకు నేను గొంతియుపకరించితి నని నీవు సంతోషించుచున్నా వని వినుటకుఁ జాల సంతసించితిని. నీవు కృతజ్ఞతను బలుకులతో నిపుడు వెల్లడించితివి. క్రియలోఁగూడ నాపవిత్రభావములను జూపగలవా ? ''

'' మీవంటిమహోదారస్వభావు లనుచితకార్యమునకు నన్ను నియోగించ రని నే నెఱుంగుదును గావున నానతిండు. ''

'' ప్రశంసావాక్యములు నాకసమ్మతములు. ''

'' సత్యకథన మెన్నటికిని బ్రశంస కాఁజాలదు గాని మీమాటలు కేమి రాఁడనేల ? కర్తవ్యము నెఱిఁగింపుడు. ''

'' ఈమందిరమున రాకుమారిక గలదు. ఆమె నాయనుగ్రహము నకుఁ బాత్రురాలు. ఆసతి యెవ్వరో నీ వెఱుఁగుదువా ? ''

'' ఒకరాకుమారి యీదుర్గమునం దున్న దని మాత్రమె నేను వింటిని గాని ఆమె నామమును వినలేదు. ''

'' అటులైన నామెపేరు తెలుసుకొనఁగోరకయే నిర్మలభావముతో నామెకుఁ దోడ్పడుము. విచారకరములగు కొన్నివిషయములను రోసెంథాలుప్రభు విపుడే ఆమె కెఱిగించుచున్నాఁడు. ఆమెకు సమర్థుఁడును విశ్వాస పాత్రుఁడు నగు మిత్రుఁడత్యవసరము. నీవట్టి మిత్రుఁడ వయ్యెదవా ? ''

'' నే నెట్లు తోడ్పడవలెనో మీ రానతిండు. నే నేమైనసంశయించినమీరు నిరసింపఁదగును. ''

'' ఆమెయే తనవృత్తాంతము నంతను నీ కెఱిఁగింపఁ గలదు, గాని కొన్ని ముఖ్యవిషయములను మాత్రము నే నిపుడు తెలుపవలసి యున్నది. ''

'' సావధానచిత్తుఁడనై యున్నాను. ''

“నేఁడు మన మిచటఁ గలుసుకొంటి మని నీ వెవ్వరియెదుటను పలుకఁగూడదు.”

“నా కింతటిమహోపకార మొనరించిన పూజ్యుని పేరైన నా కింకను దెలియ దయ్యెను.”

“నీవు దానిని తెలుసుకొన నవసరములేదు.”

“నేనుఁ బ్రార్థనావసరమున నాపవిత్రనామమును సంస్మరించుట సంతోషప్రద మగును.”

“నీవు నాకుఁ బ్రత్యుపకారము చేయఁగోరెద వేని నాయభిప్రాయానుసారము చేయవలెను. లేనిచో నే నంగీకరించువాఁడఁగాను. నీ వేమియును చేయ నక్కఱయే లేదు. నేను నీతో ముచ్చటించితి నని ఆరాకుమారికతోఁ గాని మరియెవ్వరితోఁగాని పలుకఁగూడదు.”

“నేను మీయిష్టానుసారమే చేసెదను గాని యిదివఱకు నేనా రాకుమారి నెన్నఁడుజూడలేదు. ఆమెతో నెన్నఁడును మాటాడి యెఱుఁగను. నే నామెకుఁ దోడ్పడ గోరుచుంటినని ఆమె యెట్లు తెలుసుకొనఁగలుగును? మీ రేమైనఁజెప్పినఁ గాని —”

“అంతయును సరిగా జరుగఁగలదు. ఆమెయే నీతో ముచ్చటింపవచ్చు నపుడు నీవు నీయానుకూల్యము నెఱిఁగింప నవకాశము కలుగును. నేటిరాత్రియే ప్రశాంతి కలిగినపిమ్మట నిఁక రెండుగంటలకు నారాకుమారి యీప్రాంతముననే సంచరించుచుండును. నీ వప్పుడిచటనుండుట నేమరకుము.” అని పలికి ఆవింతవ్యక్తి మహావేగమున వెడలిపోయెను.

అతఁడు మహానుభావుఁ డను గట్టినమ్మకము ఓంకారుఁ గలిగినందున నాతఁ డాతని యాజ్ఞను నెఱవేర్చుటకే నిశ్చయించుకొనెను. ఆ వృద్ధుఁడు పరోపకారశీలుఁడే గాని కొంచెము తలతిక్క గలవాఁడు. మఱియుఁ దనదానములు నుపకారములు పరుల కావంతయుఁ దెలి

యుగూడ గనునియమునగాంతని కుంచియుండు నని యూహించు కొనెను.

*　　*　　*　　*　　*

ఓటర్ వింతవ్యక్తితో నిచట ముచ్చటించుచుండ వేఱొకగదిలో లూక్రెజా రోసెంథాలు పతిభువుతో రహస్యాలోచన మొనరించు చుండి వింతవ్యక్తి వెడలిపోయిన మఱికొంతసేపటికి కామెయు నాగది లోనుండి వెడలిపోయెను.

ఆమె తన గదిలోని కేగి చూడ నచట బల్లపై చీటి కనంబడెను. పైవిలాసము తనదే, అవ్రాతమాత్ర మపరిచితము. అక్షరములు చాల స్ఫుటముగ నున్నవి.

" నీసోదరుని దుస్థితిని ప్రభుని భీరుత్వమును గమనింప నీరాగ్ర శేయుఁ జతురమతియు నగు నొక పురుషపుంగవుని సహాయము నీ కత్యావసర మని తోఁచుచున్నది. అట్టి వీరవరుఁ డిప్పుడీ దుర్గముననే యున్నాఁడు. అతని పేరు నీకు నేవల మపరిచితముగాదు. ఇఁక రెండు గంటల కాతఁడు దుర్గకు ... పరిభాగమునఁ బశ్చిమదిశయం దుండును. ఆతనితో నిస్సంశయముగ నీవు మాటలాడుము. నీవు మాటల సందర్భమున నీ సోదరుని దుస్థితి నెఱిఁగింపవచ్చును. శరణాగతరక్షణము వీరధర్మ మగుటచే నాశూరశిఖామణి నీ కభయ మీఁగలఁడు. మీ కుటుంబనామమును మాత్ర మేసందర్భమునను వెల్లడింపకుము. ఎలయున నోటర్ ధార్మికస్వభావుఁడు. నీవు రాకుమారి వనువిషయము తప్ప మఱే మియు నాతనికి దెలియదు. నీసోదరుని కెంబర్గుపాంథగృహమునం దాతఁడు చూచెను. రాకుమారుఁ డనిగూడ విని యుండెను. ఆతఁడు మీ కుపకరింపవలె నని కోరెనేని మఱే విషయమును దెలుపవలదు. దీనిని చదివిన వెంటనే కాల్చివేయుము. ఇట్టి లేఖ నిన్ను చేరె నని గూడ నీవు ఓటరుఁ దెలుపఁగూడదు—మిత్రుఁడు."

అని యాలేఖయందు వ్రాయబడియుండెను. “ మిత్రుడా ? నాకింకను మిత్రుడే కోరకున్నాడా ? అట్లయిన నాతడీరహస్యవిధానము నేల యవలంబించెనో ? పేరు తెలుపకుండ నిట్టివింతలేఖ నేల వ్రాసెనో ? ఏమైనను నేమి. అతని సూచన యనుకూలముగ నున్నది. ఓటోపియున్నాడు చాల ధైర్యశాలి, కార్యదీక్షగలవాడు, దృఢసంకల్పుడు, లేనిచో నాతడు పర్వతమర్గమునుండి జర్మను ప్రభుని విడిపింపజాలియే యుండడు. అతడు పవిత్రవర్తనుడు గావున మేము నీజగు కుటుంబమువార మని వినినంతనే పరాఙ్ముఖుడగు నని కదా యీలేఖరి వ్రాసెను. మనోహరకాంతాముఖ సందర్శనమున గూడ చలింప కుండునంతటి మనోవిజయ మాతనికి గలదా ? అట్టి జగన్మోహిని మాయావిలాసము లాతని లోబఱచుకొనజాలక విఫలము లగునా ? అదృష్టదేవత విముఖయై నా యధికారము నపహరించి నను పరదేశముల పాలు చేయగలిగినను నాసహజసౌందర్యలావణ్యావైభవములను మాత్రము హరింపగలిగి యుండలేదు. నాసౌందర్యమే నా కుత్తమ సాధనము. నా లావణ్యమే నా యుత్సాహమునకాదిశక్తి. ”

అని లూకేజియా సగర్వముగ బలుకుచు నిలువుటద్దమునందన యపూర్వమనోహరశృంగారస్వరూపమును దిలకించి యానందించెను.

“ నాసోదరుని విడపించుటకు ఓటో నా కుపకరణమాత్రుడగుగాక. నేడు మధ్యాహ్న మతనిం గనిన దాది నాకుగూడ నిట్టియూహయే కలుగుట కడునక్కజముగ నున్నది. వియన్నానగరన్యాయస్థానమునందు తొలిసారి నే నితని వీక్షించినపు డీతని సౌందర్యాతిశయము నాదృష్టి నాకర్షించెను. నే డీతనిని జూడగనే యాతని యౌవనవిలాస మప్పటి కంటె నిప్పుడు చాల హెచ్చుయ్యె నని గూడ గ్రహింపగలిగితిని. ఆతడుగూడ నచ్చోటు వీడలేక నావంక ననిమిషేక్షణుడై చూడసాగెను గాని నాపేరన ముక్కంటియు నాతనికి గన

బడలేదు. నాసమ్మోహము చూడకయే యాతఁడిట్లు చకితుఁడయ్యె నేని నాసుందరవదనసరోజమును దిలకించిన నాతఁడు సంపూర్ణముగ నాపాదదాసుఁడు కాకుండఁగలఁడా? అందులకుఁ గోడు స్త్రీలకు సహజ మగు మాయావిలాససమ్మోహనాస్త్రప్రయోగమున నేను పూర్ణపాండిత్యముఁ బడసినదానఁ గానా? అతఁ డికఁ నెందుఁబోఁగలఁడు? అపవిత్రప్రపంచము నపవిత్రవర్తనమున కెడ మెక్కడ నున్నది? అటులైన నితఁడొకయడవిమృగమే యగు. అట్లైననుగూడ నట్టి వనసత్త్వమును లూక్రెజా సాధుం జేయవలసియున్నదా? కానిమ్ము నీ నెట్టిభీకరమృగరాజమునైన మచ్చిక జేయజాలులూక్రెజా కిది యేమిలెక్క!" అని యామె స్వోత్కర్షతో మందహాస మొనరించెను. అట్టిచో నామె తర ననినదాని నమృతావాసమునకే ప్రత్యేకముగ సృష్టికర్త నిర్మించియుండె ననుభావము గలుగక మానదు గాని, ఆకుటిలస్వభావ వక్రజిహ్వాగ్రమునుండి మృదుమధురస్వనమున వెలువడినవాగ్జాలమున స్రవించినవిషధార లెంతదారుణములు!

౬౭

గగనభాగమున హిమాంశుఁ డమృతవర్షమును గురిపించుచు వెలుఁగుచుండెను. తారకాగణము చిఱుమబ్బైనలేక ప్రకాశించుచుండెను. పిండారబోసినట్టుల వెన్నెల కన్నులపండువుఁ గావించుచుండెను. అట్టితరుణమున లూక్రెజా నీలావకుంఠనవతియై వక్రకుడ్యపరిభాగమున దృగ్గోచరమయ్యెను.

తనసంకల్పమును తప్పక నెఱవేర్చుకొనఁజాలుదు ననుమహోధైర్యము ప్రతిపదమునను విదిత మగున ట్లామె తలయెత్తి కాలూని నడచి వచ్చుచుండెను.

పిట్టగోడ కానుకొని నిలచి యున్నఓటో చెంతి కట్టితఱి నరుదెంచుచున్నమానినీమణి ధైర్యవిహీనయు లజ్జావతియు నగుముగ్ధ గాదు. అసామాన్యసాహసకార్యసమాసక్తప్రేరితాసి యయ్యూ. గతసకర్య శేషించు

హృదయ యగు ప్రౌఢాంగన మేటిసౌందర్యమున నెంతటివారి నైన నవలీల లోఁబఱుచుకొనఁజాలు మోహనతంత్రప్రావీణ్యమును వచో నైపుణ్యమును తన కత్యధికముగఁ గల వని లెస్సగా నెఱిఁగి తనమా ర్గమునకు నిరోధకము లగువాని నన్నిటిని గొంకులేక తొలగించు దీక్ష గలమత్తకాశిని.

ఆమె సమయానుకూలముగఁ బలుకులను, జూపులను బ్రయోగించి పురుషుల భ్రమింపఁజేయఁగలిగిన నెఱజాణ. ఒకసారి ప్రణయముగ్ధ యుంబోలె నత్యధిక ప్రేమస్రవంతి నోలలాడించును. వేఱొకతఱి తన మహాసామర్థ్యమును వెల్లడించుగభీరతం జూపును. ఇంక నొకపుడు శోకదేవతయో యన నశ్రుపూరితలోచనయై మనసుకఱఁగఁజేయును. మఱియొకపుడు రౌద్రాభయంకస్వరూపిణియై యోష్ఠపుటము లదర నిప్పులఁ గురిపించును. ఒకసారి ప్రణయపయోధిం దేలించును. ఒకసారి నాగమృతమున నభిషేకించును. అంతలో మూర్తీభవించినప్రేమరసాధిదేవతయో యన శృంగారతరంగవీచికల నూఁగులాడును. ఉత్తరక్షణముననే మృత్యుస్వరూపిణియై యహంకారిణియై భయానకయై దురాలోక్య యగును.

ఇట్టిమహామాయాస్వరూపిణి యిపుడు సాధుశేఖరుఁడగు ఓటోపై దనథాటి చూపవచ్చుచున్నది. ఆమెనాతఁడు తిలకించి ముందుచూచిన కాంతయే యని గుర్తించెను.

„ ఈరాకుమారి యెవరు? ఆపూజ్యపురుషుఁ డెవరు? న న్నీమె పేమికోర నున్నదో! ఈ విషయము నింత గోప్యముగ జరుప నేమి కతమో'' ? అనుప్రశ్న లతని కపుడెన్నియో కలిగెను. అంతలో నామె చాల దాపునకు వచ్చెను. తోడనే యాతఁడు సహజవినయముతోఁ దల నున్న కుళ్ళాయిని చేఁబూని వందన మొనరించెను.

మౌనముతో "మీ రొనరించినవి నతిమహదాసంగ్రహము'' అని పలుకుచు నామె యాతని చెంత నిలచెను.

,, ఓ రాకుమారీమణీ మీరు నన్నిదివఱకే యెఱుంగుదురా ? ,,

,, నేఁ డిదివఱ కొకసారి మనము కలుసుకొని యుండలేదా ? యువజనుల రూపసంపద నభినందించుట మముబోటి మానవతులకు మానితము గాకున్నను మీముఖకమలము నొక్క సారి చూచిన వారు దానిని సామాన్యముగ మఱువఁజాల రని చెప్పక తప్పదు. మీరు కుల్లాయిని ధరింపుఁడు. మీకతిముఖ్యములగు కార్యము లేవియును లేకున్న నాతో నొక యరగంటసేపిందు సంచరింపఁ గోరెదను. ,, అని యామె సహజలీలనే పలికెను. పిమ్మట వా రిరువురును మెల్ల మెల్లగ నడువసాగిరి. ఆమోహిని యంతవఱకును ముఖవసనమును దొలఁగింపనే లేదు. ,,

,, ఆహా, యీచంద్రికావైభవ మెంతమనోహరముగా నున్నది! ఈవెన్నెలలో నీదుర్గ మెంత గంభీరముగ నున్నది. యోధపుంగవుల ప్రతాపాధిక్యమును జాటుస్మరణచిహ్నములో యనఁదగు నిట్టి దుర్గరాజములు జర్మనీసామ్రాజ్యమునం దత్యధికముగ గోచరించుచుండును. ఆహా, ఆవీరపుంగవులతోఁబాటు వీరధర్మముగూడ నీ ప్రపంచమున నగోచర మగుచున్నది గదా! ,,

,, వెనుకటికంటె నిపు డీజర్మనీదేశమున వీరధర్మమును వీరసుల ప్రోత్సాహమును శరణాగతావనతత్పరత్వమునను క్షీణించె నని యా మీయభిప్రాయము. అది చాల పొరబాటు. అవమాన ప్రతీకారమును దీనజనరక్షణమును జరుపవలసిన యత్నము గలిగినప్పు డెల్ల దుర్బలులు పరిత్యక్తులు బాధితులునగు మానవ సోదర సోదరీమణులు సంరక్షణమునకై మాత్రము నాలసింపక సంసిద్ధు లగుమహోదారస్వభావముగలవీరవరేణ్యు లిక్కాలమునగూడ లెక్కకు మిక్కిలిగనే యున్నారని మీరు నిక్కముగ నమ్మఁగను.

,, అయ్యో, మీ రిట్లనుచున్నారా ! ఇదియే నిజమని నాకు నమ్మకము కలిగినఁ జాల మే లగును. మీయుదారస్వభావమునుబట్టి మీ

దేశమున కంతకునుగూడ మీరావిమలభావమును వ్యాపింపఁజేయుచున్నట్టు లున్నది. లేక యెల్లవారు నట్టి యుదారభావులై యుండఁదగు ననుపవిత్రసాంఘను మీరు వెల్లడించుచుంటిరా ? జర్మనీదేశపుకాంతలు సౌందర్యమునకువలెనే జర్మనీదేశపురుషులు ధీరత్వమునకు విఖ్యాతులు విద్యాయశఃప్రతాపాదివిషయముల నాగరకప్రపంచమున మీదేశము మఱియే దేశమునకుఁగూడఁ దీసిపోవునది కాదని నేనే యొప్పుకొందును గాని ఆర్ద్రావనపరిశుద్ధ భావము మాత్రము నానాటికి క్షీణించుచుండుట లేదా ! అటులేగాకున్న కారణాంతరమున శరణార్థినై మీదేశమునకు వచ్చిన నాసోదరుని దురభిమాని యగు నొక సంస్థానాధిపతి నిష్కారణముగ బంధించికొని పోవ నాతని విడిపించగల కౌరవ గేశ్యు లొక్కరును లేక నే [illegible] వల సినగతికి పాలుగావలసి వచ్చునా ?




" ఇది నిజమా ? "

" నిజము. ముమ్మాటికి నిజము ! [illegible] గాకున్న కొంతకా రోసెంథాలుప్రభువు నిరీక్షించుచుండె నని మీరు విన్నలేదా ! "

" అది వినుట యే గాదు. కెంబర్గుపాంథగృహమున నేను సందర్శింపఁ గలిగిన రాకుమారుఁడు మీ సోదరుఁడే యగు ననిగూడ నేను నమ్ముచున్నాను. "

" ఎవ్వఁడో తస్కరాధముఁ డాతని క్షతగాత్రుం జేయ విశ్వాసి యగు ననుచరుఁడు నాసోదరు నాపాంథగృహమునఁ జేర్చెను. అచట నుండగనే ముష్కరు లగు లిన్నుర్గుప్రభుని యనుచరులు నారి నిర్దయిని బంధించి కొనిపోయిరి. ఏల కొనిపోయిరో దైవమునకే యెఱుక " యని సూసా బాష్పాకులలోచనయై కంపితగాత్రియై పలికెను.

" లిన్నుర్గుప్రభువే యీ దౌర్జన్యము నొనరించెనా? మీసోదరుఁ గొనిరా రోసెంథాలుప్రభు వీమార్గమును విడిపోయిన పిమ్మట మరల

నే నతని జూడ వీలుకలుగలేదు గావున నాకీయుదంత మేమియును దెలియదు. ''

,, నాసోదరుని విడిపించుటకై వెంటనే యెట్టి ప్రయత్నములను జేయ సాధ్యపడదని గూడ గోసెంథాలప్రభు వింతకుమున్ను నాచెంత పలికిన పలుకులవలన నేను గ్రహింపఁగలిగితిని."

,, ఆరాకుమారుఁ గాపాడుటకే గాక యీద్రోహిని శిక్షించుటకు గూడ నిజసైన్యమున ప్రభుశేఖరుఁ డాతని మార్గముపై నడపించుట ముఖ్యకర్తవ్యము కాదా ? ''

,, ప్రస్తుత మిట్టి కలహమునఁ జిక్కుకొనఁ జాలననిప్రభువు పలికెను. ఈ యుదంతమును సార్వభౌమునకు విన్నవింప నతఁ డింతకు ముందే యొక యాశ్వికుని వియన్నానగరమునకుఁ బంపెను. సార్వభౌముని యాజ్ఞానుసార మొనరింతు నని యాతఁడు తెలిపెను. నాసోదరుని విడిచిపుచ్చునది యని మాన్స్ఫెల్డుకు గూడ నతఁ డొక లేఖ నంపెను. గాని యాతఁడు దానిని లెక్కచేయకుండుటయే నిశ్చయము. సార్వభౌముని చెంత నుండి ప్రత్యుత్తరము వచ్చుటకు కనీసము కొన్నివారములైన పట్టును. అంతవఱకును నాసోదరుడు—నాప్రియాగ్రజుఁ డాదుర్గమున బద్ధుడై వారిచే నవమానితుఁడు కావలసియుండెఁగదా ? ఒక వంక నొకదురభిమాని యగు మేటిసంస్థానాధిపతి యక్రమముగ నొక విదేశీయుని బంధించియుండ వేఱొకవంకఁ బరాక్రమధనుఁడగు ప్రభువరేణ్యుఁడు వీరధర్మము మరచి యతిథి సంరక్షణమున నశ్రద్ధచేయుచుండె. ఇట్టిచో నీజర్మనీదేశమున నార్తావన ఋంకను ప్రబలుచున్న దని మీరు పలికినంత మాత్రమున నేనెట్లు నమ్మఁగలుగుదునో యోచింపుఁడు!

,, తన యింటి కతిథిగా వచ్చినవానిని నిట్లా దురభిమాని యగు మాన్స్ఫెల్డు బంధించి కొనిపోవ గోసెంథాలు ప్రభువు నుర్కులుని చం

-మున మిన్నకుండఁ గలఁచె నసిన నే నేమో నమ్మఁ జాలకున్నాను. అహో, నాకే యట్టి పలుకుబడియు సాధనములు కలిగియుండెనేని—''

,, మీ రిపుడే యచటికి కరిగి యుందురు. నా సోదరుని విడిపించి యుందురు. నాకై పనిచేసి యుందురు నిజమే. ఇది స్వకార్య మనియే నేను నిశ్చయించితిని. '' అని లూక్రెజా యూపదకుఁ బాల్పడిన భీత కురంగేక్షణ యాత్మసంరక్షణకయుఁ డగుపురుష వరేణ్యుని—మిత్రశే ఖరుని మాటున కోదుగు రీతిని—ఓటో మూపునఁ జేయివైచి— భయార్తియుంబోలె నతని ప్రక్క నొదుగ సాఁగెను.

,, రాకుమారీ! నే నెట్టి సంశయమును లేకుండ నీకుఁ దోడ్పడుటకు సంసిద్ధుఁడను గాని యశక్తుఁడను—''

ఇట్టి పవిత్రకార్యాచరణ దీక్షితుఁడవగు నీకుఁ గరుణామయుఁ డగు సర్వేశ్వరుఁడే సాధన సంపద నంతను సమకూర్చ గలఁడు. నీవు నా కించుక ధైర్యము గలుగఁ జేసితివి. మరల నాహృదయమున నాశాం కుర ముదయింపఁ జేసితివి. నా చిత్తమందు నందము ఘటిల్లఁ జేసితివి. మిత్రమా, కాదు సోదరా! నీహృదయమునఁ గనికరము కలదు. ఔదార్య మంతరింపలేదు. గాన నిజమూరసినమకుట ధాగు లగు ధరావరకుమారు లైన నీ కీడు గారు. సోదరా, ఓటో—నీవు నాకు సోదరుఁడవే''అని ఆమె తన పాణితలమున నాతని హృదయమును (గ) జేర్చి విలపింపసాగెను.

ఆకాంతామణి దుఃఖాతిరేకము గనినంతనే యాతఁడు సకరుణుఁ డయ్యెను.

,, సతీమణీ, ధైర్యమును బూనుము. అపులతఁ జెందకుము. నే వేఁడుకొనియెద, సాధనము చూపినఁజాలు. నేను నెఱవేర్చెదను. నా యందు సంపూర్ణవిశ్వాసముతో నీ వాజ్ఞాపింపవచ్చును. నేను నెఱ వేర్చెదను. ''

,,ఆహా, నీమహోదారస్వభావమునకు నేనేమి ప్రత్యుపకార మొన రింపఁజాలుదును.'' అని పలుకుచు నామె మొగ మెత్తుటతోఁ గరలాఘవమున ముసుగుఁ దొలఁగించెను. ఆమె కోమల వదనకమలమును దారామనోహరుఁడు తనసహస్రకరముల స్పృశించి యానందింపసాగెను. అశ్రుజలపూరితములగు నాతలోదరి నీలవిశాలలోచనములు చంద్రకిరణ ప్రకాశమున శ్రీమంతములై దనరారెను.

కఠిన పాషాణహృదయములఁగూడ నవలీలఁ గరంచివేయఁజాలు నా యపూర్వసౌందర్యముఁ గని యోగులుఁగూడ ముగ్ధులై పోవుచుండెను. అట్టి దివ్యభామిని తన బాహులతలము నానుకొని తన్నే రక్షకునిగాఁ భావించుసోదరిమణివలె తన మగ్గున నడఁగిపోవుచుండెను. క్షణకాలము క్రిందట నాసుందరాంగి నెమ్మోము తన హృదయ సీమను గదిసి యుండెను. ఇప్పుడా ముఖపద్మము తన వదనమును గదిసి యుంటచే నాసతీమణి శ్వాసము తనశ్వాసముతోఁ గలసి పోవుచుండెను.

అట్టి యసామాన్యసౌందర్య విరాజమాన యగు రాజవదనను బిగ్గఁ గౌగలించి యాతరుణీమణి ఫాలకపోలోష్ఠతలముల వేయిసారులు ముద్దుకొందునా యను భావ మాపలేంగనా పరాఙ్ముఖుని మానసమునందుఁగూడ నొప్పపాటుకాలమున మెఱపు మెఱసినట్లు తళుక్కున మెఱసి పోయెను.

అది రవంత సేపైన నిలువలేదు. వెంటనే ఆతని భావగగనమున సౌకోమలమూర్తి సర్వకళాపరిపూర్ణయై దర్శన మొసంగెను. ఆపత్కాలమున గష్టపరిహారపటిష్ఠ మని భక్తుఁడు గుహదేవతానామస్మరణమొనరించు రీతిఁ నాతరుణమున నాతఁడా పతివ్రతాతిలకమును తన ప్రాణప్రియయునగు నీనామమును స్మరించి ఘూహేసి మనోవికారాలమును నిర్జింపఁగలిగెను. ఆతఁడు మెల్లన నామె చేతిని సడలించి,

,, నే ననవసరముగు పరీక్షలు పలికి చిన్నతుకు గొంచమైనఁ జేయఁజాలిన స్త్రీలగుండను గాను. సాధనమును మీకును చూపఁ గలుగుదు

లేని మీకు సహాయ మొనరింప సంసిద్ధుండ" నని యాతండు మరి యొకసారి పలికెను.

"రేపు మరల మనము కలిసి కొందమని యతండు తన బాహుబంధమును దొలగించుటచేఁ గలిగిన కినుకచే నామె కొంత పరుషముగఁ బలికెను గాని యంతలోనే సౌమ్యస్వనముతో "పదకొండు గంటల వేళ నేను జిత్రపట మందిరమున సంచరించుచుండెదను. మీ రప్పుడచటికి రావీలగునా" అని పలికెను.

"మీ యాజ్ఞలకు బద్ధుండ" నని నే సదివరకే విన్నవించితి" నని యాతండు సవినయముగఁ బలికెను.

"అటులైన నో సోదరా, నే నిప్పటికి పనివినియెద" నని యామె తన పాణి నందియ్య సదాచారమును బాటించి యాతం డా పాణితలమును చుంబన మొనరించెను. అంతలో నామె యాతని కరతలమును కొంత గాఢముగ నొక్కి ముఖవసనము సమర్చుకొని వెడలి పోయెను.

నా పరిశ్రమ ప్రయత్న మాతని కలంచలేక పోయెను. అందువలన నామె కొంచెము కినుక గదిరెను. "అది సరిగాదు. కొందర పడు నేల, రేపుతప్పక యతండు నావలలోఁ జిక్కుఁగలండు—అతని పావనవర్తనమంతరింపక నిలువఁగలదా ?" అనుకొనుచు నామె నాఁగిపోయెను.

౬౫

నాటి రాత్రి కడు వేగముగనే యోటో తన కేర్పాటుచేఁబడిన శయనగృహమున కేఁగి కడుబడలియుండుటచేఁ బక్కపైఁ బరుండెను గాని యతనికి వెంటనే నిదుర పట్టలేదు.

నిజసోదరిని విడిపింప లారాకేరా తన సహాయమును బడయుట కెల యంత యాతురతను జూపెనో యతండు గ్రహింపఁజాలక పోయెను. "ఆమె యేమార్గమును గూడ నిర్ధారణ చేసుకొనినట్లు తోఁచదు. ఆమె సోదరుఁడు నిర్బంధములో మర్గమున బంధింపఁబడి యుండెను. సద్గాధసతో

చండశాసనుఁడు. దుర్గము సురక్షితము. నేను సామాన్యవ్యక్తిని. నా యధీనమున మేటిసైన్యము లేదు. కారాగృహ పాలకులకు లంచ మిచ్చి విడిపింత మన్నను నాచెంత నంత ధనము లేదు. అట్టిచో నే నెటుల నారాకుమారుని విడిపింప సాధ్యమగును ? ''

అని ఓటో యాలోచింపసాఁగెను. ఆతని కా రాకుమారిపై నైనఁ దెలియకుండుటచే నాఁడామె తనపట్లఁ జూపిన కోమల భావము దలంచుకొన నాతని కేదో అనిర్వచనీయముగ ననుమానము కలుగ సాఁగెను.

గాని యెవ్వరినిగురించియుఁ దగినంత గట్టి యాధారము లేకుండ హానికరమగు నభిప్రాయమును దీర్ఘకాలము కలిగియుండుట యాతని పవిత్రభావమునకు విలక్షణము. గావున నామెను గూర్చి కలిగిన స్వల్ప మగు ననుమానము వెంటనే తొలఁగి పోయెను. సంతాపకృతజ్ఞతాభావములు ప్రకోపించుటచేతనే యాసతి యిట్లింత చనువుగ మెలఁగి యుండవచ్చునని యాతఁడు నిశ్చయించుకొని గాఢనిద్రాముద్రితనేత్రుఁ డయ్యెను.

ఆతఁడు నిదిరించుసరికి నిశీథ మైనది. వెంటనే భూతనాథుఁ డాగదిలోనికి వచ్చి నిలచెను. తాను సంకల్పించిన ఘాతుకకార్యము నెఱవేఱినపుడు క్రూరస్వభావుని వదనమున గోచరించు నుల్లాసమాతని మొగమున గనఁబడెను. ఆతఁడు తన రెండుచేతుల వక్షస్థల సమీపమున నడ్డముగ జేర్చుకొని ఓటో శయనించిన మంచమును మెల్లన సమీపించి మంద మయ్యు నిబిడ మగు స్వనమున నేదో మంత్రమును జపించెను.

వెంటనే ఓటోను స్వప్నపరంపరాజాల మలముకొనెను. తా నొక మనోహరోద్యానమధ్యమునం దున్నట్లాతనికి దోఁచెను. అతఁ డొక కాలిదారిని నడచిపోవుచుండ నిరుప్రక్కలనుండియు పుష్పలతానికుంజములనుండి దివ్యసుగంధపవనము వీచుచుండెను. రాకాసుధాకర విసు

ర్మలచంద్రికానికరము వనాంగణమును వెలిగించుచుండెను. చంద్రకిరణములు చల్లఁదనమును కలిగించుటకు బదులుష్ణములై మోహవికారమును గలిగింపసాఁగెను. ఆవనవృక్షములపైనుండి పికాంగనలు శృంగారగీతముల మనోహరముగ గాన మొనరించుచున్నట్లతనికి వినఁబడసాఁగెను. బుల్బుల మధురమతములు చిత్తవికారము గలిగింపసాఁగెను. పోనుపోను మార్గ పరిసర పుష్పనికుంజము లున్నతములుగఁ గనఁబడసాఁగెను. కుసుమముల చిత్రవిచిత్రవర్ణాతిశయమును దివ్యవాసనావిశేషమును పారవశ్యమును గలిగింపసాఁగెను. క్రమక్రమముగ మార్గోపరిభాగమున లతావితానములును తోరణాద్యలంకార విశేషములును గోచరించెను. పల్లకదళములనడుమనుండి శీతభానుని కిరణము లాప్రదేశమును బ్రకాశింపఁజేయుచునే యుండెను. చిగురుజొంపములపై నమర్పఁబడిన చిత్రదీపకళికల వింతకాంతులు చంద్రికాప్రకాశమునఁ గలసి యపూర్వ శోభను గలిగించుచుండెను. ఈకాంతి క్రమక్రమముగఁ గెంపొంది చంద్రికాంతిని బూర్తిగా లోఁగొని యతని మానసమున విచిత్రవికారము నత్యధికముగఁ బ్రబలఁజేసెను. ఆకాంతి కనుల మిఱుమిట్లు గొలుపుట లేదు. ప్రశాంతమనోహరమై యొప్పుమీరుచుండెను. ఆతనికప్పుడు కలిగిన యానందము మానవుల కనుభవమున లేనిది. ఏగాంధర్వలోకముననో విహరించుచుంటినని యాతఁడు తలఁపసాఁగెను. మఱికొంతదూర మేగ నొక పూఁబొదరింట బల్లపై రుచ్యపదార్థములును పానీయములు సమర్పబడియె. ఆపాత్రలు స్వర్ణమయములో స్ఫటికనిర్మితములో తెలియకుండె. అతఁడామోదానందమును భరింపఁజాలక హంసతూలికాతల్పమును గీటునంబుచ్చు రమణీయమశయ్యాసనంబున నాసీనుఁడై దీపముల కాంతిని మనోహరములగు కెంపుచాయ నింపుమీఱు ద్రాక్షారసభాసుర మగు మణిపాత్రం గొని దాని నాస్వాదించెను. వెంటనే దివ్యగానము సహస్రకామినీ కోమలకంఠ వినిర్గత మొక్కటైన నాతని కర్ణపుటద్వా

రంబున మానసమర్గము నాక్రమించెను. కంటికొక్కరును గానరా లేదుగాని వా రపూర్వ దివ్యసౌందర్య విలాసభాసురలై యుందురని యాతనికి నిశ్చయము కలిగెను.

### గీతము.

ఖేచరకామినీనిచయ మొసంగెడుస్వాగతమునుగొనుమా పురుషోత్తమా
విశ్రమింపుమా కోమలహృదయా విమలదినోదయ మగువఱకున్
ఉత్తమనిర్మలవస్తుసంచయము నుర్వర యొసఁగెడు విపులముగన్
మదనమోహినీ మందహాసరుచి ప్రణయవాహినిం దేలించున్
సంతాపాందోళములకు నీయెడఁ దావులేదుసుమి ప్రియసఖుఁడా!
ప్రణయభోగములు సలుపుప్రభుత్వము సమభంగిని నీయమరభువిన్
ఆగుము త్వరపడి యరుగఁబోకుమీ! ఆనందింపుమి మాతోడన్
నీదుశిరంబునఁ బుష్పమకుటమును నిలిపి కొలిచెదము మిత్రవరా!
ముద్దు లిడుచు మధురాసవ మొసఁగుచు వద్దఁజేరి లాలింతు మికన్
ప్రణయస్వరూప యానందమూర్తి ప్రాణాధిక యోప్రాణసఖా.
మధురదివ్యగానము కఱగించదె నీమానసమును నీనిముసమునన్
కుసుమకోమలులు సలిపెదరిపుడె చిత్రనాట్యమును నీయెదుటన్
భోగలాలసత్వము నిన్నలముచు రాగరసనిమగ్నునిఁ జేయున్
ప్రణయప్రియమూర్తీ! పవ్వళింపుమా భామామృదుహాసము గనుమా
పూలపాన్పుకడు హాయి లొసంగును నిద్రఁబుచ్చుగానామృతమున్

అను మోహనగీతము స్ఫుటముగ వీనులం బడి యాతని నవశునిఁ గావించె. అంతలో భూతనాథుఁడు మరల నొక మంత్రమును జపించె. తోడనే యతఁడాశయ్యాతలమునఁ బన్నుండి యుండగనే యొక సుందరీమణిచెంత కేతెంచి నవ్వుల తోఁచె. ఆకామిని రాకుమారి నా యని యాతఁడు తలంచెను. ఆమె యతనిపై గాఢతమ ప్రణయదృష్టులఁ బ్రసరింపజేసె. ఆమె పెదవులు మోహనమంత్రము నుచ్చరింపసాఁగె.

ఆతని పాణి నిజపాణితలమున నిలిపి మెల్లన నామె యప్పళింపసాఁగె. నా కొక్క ముద్దొసఁగి నా ముద్దు చెల్లింపుమా యని యా ముద్దియ తద్దయు వేడుకొని యాతని యొద్దఁ జేరి మోము మోమునఁ గదియఁ జేర్చె. ఆసుందరమృదుల కేశజాలమాతని కపోలముల స్పృశింపసాగెను.

ఆ క్షణమునం దాతని కత్యధికమనోధైర్యము కలిగి నట్లయ్యెను. తన యోష్ఠసంపుట మామె పెదవుల స్పృశించునంతలో నాతఁడు తన నెమ్మోమును తటాలునఁ ద్రిప్పుకొనజాలెను. వెంటనే యాతఁడు సర్వేశ్వరుని స్మరించెను. తోడనే స్వప్నజాలము మహేంద్రజాలమువలె మాయ మయ్యెను.

ఆతఁ డీస్వప్నజాలమున దీర్ఘకాలము గడిపెను. ఏలయన నాతఁడు కనులువిప్పి చూచుసరి కుదయభానుని యరుణకిరణము లాకటిగెండు జాల రంధ్రములగుండ లోన సంచరింపసాఁగినవి.

౨౦

" ఇది స్వప్నమే. ఎంతవింతకలఁ గంటిని ? స్వప్నమందు నాకుగలిగిన భోగలాలసత్వమును, మోహవికారము నన్నింకను పూర్తిగ వదలి నట్లులేదు. ఆకామినిని నాహస్తమును బీడన మొనరించుటచేఁ గలిగిన గగుర్పాటు నాకింకను గోచరించుచునే యున్నది. ఆమె మృదులకేశములు నాగండస్థలమును స్పృశించి క్షణమైనఁ గాలేదు. ఆహా! ఏమి వింత! ఏమైన నేమి; ఇది వట్టికల! ఇది స్వప్నమాత్రమె యైనందులకు సర్వేశ్వరునకు వందనము. ఏదో దుష్టగ్రహ మదృశ్యముగ వచ్చి నా కిట్టిదుర్భావము గలిగించి యుండును. నాచిత్తమును జలింపఁ జేయుగోరి యేనిరాకారదైత్యమో పాపమతియై యీయద్భుతసృష్టిని గలిగించి యుండును. నే నేలతాంగికిఁ దోడ్పడ వచన మిచ్చితినో ఆ సతీమణినే సాధనముగాఁ గొని నన్నాగ్రహము పతితు నొనరింపఁ బ్రయత్నించి యుండును. సర్వేశ్వరునే నమ్మిన జీవు నిట్టిదుష్ప్రయత్న

సహస్రములైన నెన్నటికిని గలంపఁజాలవు. కావున నే నిప్పుడు నిర్మల భావముతో, నిశ్చలచిత్తముతో—నిర్వికల్పముగా సర్వేశ్వరుని భక్తి నిండారఁ బ్రార్థించెదను. అంతలోఁ గా అవడినమోహవికారము కూడ నిశ్శేషముగ నడంగఁగలదు.” అని పలికి ఓటో శయ్యా సమీపమున మోకరిల్లి తా నత్యంతభక్తితో నిరంతరమును సేవించు సర్వేశ్వరుని బ్రార్థించెను.

నిర్ణయానుసారముగ పదనొకండుగంటలు వినపడినంతనే యాతఁడు చిత్రపటాగారమున కేఁగెను. ఆగృహము కడుదీర్ఘము. అందు గోసెంథాలుప్రభుని పూర్వవంశజుల శిలావిగ్రహములును నిలువెత్తు చిత్రపటములు ననేకములు కలవు. యోధపుంగవులచిత్రములును విచిత్రవసనధారిణులగు లలనామణుల ప్రతిమలును మధ్య మధ్య గోడలకు దగిలించఁబడిన కవచములు, శిరోవేష్టనములు, ఖేటకములు, ముఖపట్టములు, బాహుబంధములును, ఈటెలు, కరవాలములు, భిండివాలములు మున్నగునాయుధ విశేషములుకూడఁ గనఁబడియెను.

ఓటో ఆమందిరమునఁ బ్రవేశించుటకు మున్నే ఆతనిమోహవికారము పూర్తిగా నడఁగిపోయెను. ఆతఁ డత్యంతవిశుద్ధమానసుఁ డగుటచే భూతనాథుని చిత్రకల్పనము జలబుద్బుదమువలె క్షణికముననే యడఁగిపోయెను. నిద్రావసరమున నాతఁ డామోహాతిరేకమునకు లొంగిపోయినను మెలఁకువ వచ్చినంతనే దాని నవలీలఁ బారద్రోలెను.

కలలో నాకలికి తనపై నత్యధిక మగుప్రేమను గనఁబఱచినపు డామెను ప్రత్యక్షముగ దర్శించుటయుం బట్టి చిత్తచలనమును దన మదిని గలుగ దనుధైర్యముతో నాతఁ డానతిరాకను నిశ్చలభావముతోఁ దిలకింప సాఁగెను.

ఇపు డామె మోమున ముసుగులేదు. ఆమె సహజసౌందర్యము సమగ్రముగ నాతని నరికట్టుచుండెను. ఆతఁడు మర్యాద ననుసరించి

తలవంచి వందన మొనరించెను. ఆకాంత మందహాసచంద్రికలం బఱి
పుచు నాతనిచెంత కేతెంచెను.

,, కొంచమైన నాలస్యము లేకుండ వచ్చితి ''రని పలుకుచు నామె తనచేతినందియ్య దానింగొని యతఁ డల్లన సోకియు సోకనట్లు స్పర్శఁ గావించెను. ,, మీ రిట్లు సకాలమున కరుదెంచుటయే మీమనోనిశ్చలతకుఁ బ్రబలనిదర్శనము. నాకుఁ దోడ్పడమీరు సంసిద్ధుల రైతి రనుట కెట్టిసంశయమును లే '' దని ఆమె పలికెను.

,, మీసోదరుని విడిపించుటకు మీ రేదైనసాధనమును నిర్ణయించి తిరా? ఏలయన నభేద్యమును సురక్షితము నగుదుర్గమునందు క్షణికమైన నేమరక కావలిగాయు భటజనమధ్యమునందున మీసోదరునెట్టుల నొంటరిగా విడిపించుకొని రాఁగలనో నా కించుకయు గోచరించుట లేదు. ''

,, ఇందుల కెట్టిసేనయుఁ బనిలేదు. బుద్ధిచాతుర్యమును యుక్తియు ముఖ్యసాధనములు. పర్వతదుర్గమునుండి జర్మనుప్రభుని విడిపింపఁ గలిగినధీరాగ్రణి నాసోదరునితో రాయబారములు జరుప నశక్తుఁ డగునా? మీ రా ఘనకార్య మొనరించితి రని నే నిదివఱకే విని యుంటిని. ''

,, అట్లు రాయబారము జరిపినంతమాత్రమున నాతని విడిపింప సాధ్యమగునా? ''

,, సాధ్య మగును—అగును. ఇదిగో యీ చిన్నపొట్లమును మీ రెటులైన నాసోదరుని కందఁజేయఁ గలిగితి రేని దప్పక నాతఁడు విముక్తుఁడు కాఁగలుగు'' నని పలికి యొకఅంగుళము చతురముగల చిన్న పొట్లము నామె ఆతనికిఁ జూపించెను. ''

,, దానిని నాచేతికిండు నేనుమీసోదరునకందఁజేయ నైనఁజేసెద. లేదేని యాప్రయత్నమున ప్రాణముల నైన నర్పించెద నని విశ్వసింపుడు. ''

అని యోలట్ పలుక లూక్రెజా ఆపొట్లము నతనిచేతి కందించుచు సముహమున నాతనిచిత్తమును స్థిరుజేయఁజాలినగాఢప్రమోహప్రవర్ధకావలోకనముల నాతనిపైఁ బ్రసరింపఁజేసెను. ఆచూపు లాతనికిఁ గలలోఁ గనఁబడిన గానానురాగవిలోకనములను స్మరణకుఁ దెచ్చెను. దానికతన నాతనిమనసు మఱింత గట్టిపడియెఁగావున నాతఁడు యుక్తోచితముగ వినతుఁడై దాని నందుకొనెను.

తనకు రెండవసారిగూడఁ బరాభవము గలిగినందులకామె నోఁడు గరచెను.

,, ఈచిన్నపొట్లమువలన పిశాచరుఁడు వెలికి రాగలఁ డనుసంపూర్ణవిశ్వాసముకలదా యని నే నడిగినందులకు మన్నింతురుగాక. దీని నేమున్నదో తెలుసుకొనవలె ననుచాపల్యమున నేను మి మ్మడుగుట లేదు. నే నీకార్యమున నాప్రాణమునే యర్పింపవలసి యుండుటచే నంతటిత్యాగము రిక్తమైయొనర్పఁదగినదిగాదు. గావున మిమ్మిటుల మరల నడుగ సాహసించితిని. ,,

,, ఈసాధన మెన్నటికిని రిక్తబోవునది గాదు. దానిరహస్యమును మీ కెరిగింపఁజాలనందులకు నను క్షమింపుడు. అది వంశపారంపర్యముగ వచ్చుకుటుంబరహస్యము. సామాన్యరహస్యము గాదు. పరమరహస్యము.

,, నా కింక నేమియును చెప్పబనిలేదు. ఇఁక నిస్సంశయముగ నా ప్రయత్నమునకు గడంగెదను. దాని నారాకుమారుని కందఁజేయఁగలుగుటయో లేక తత్ప్రయత్నమునఁ బట్టుబడి మానవకృపాణమునకుఁ బ్రాణమర్పించుటయో జరుగుట నిశ్చయము ,,

ఓ మహాశయా ! మీ రెవరికొఱకెట్టిమహాత్యాగమునకుఁ బూనుచున్నారో మీ కిప్పుడు తెలియదు. విధివశమున మే మిప్పు డజ్ఞాతచర్యజూపుచున్నను మరలశుభకాలము రాకపోదు. అప్పుడు నేనును నాషోకరుడును మాకృతజ్ఞత నత్యుత్తమరీతిఁ జూపఁగలుగుదుము.,,

,, నే నెట్టిప్రతిఫలము నపేక్షించువాఁడ గాను. నే నిందు కృతకృత్యుఁడను గాఁగలనేని యత్యనురాగబద్ధు లగుసోదరసోదరీమణులకు మరల నన్యోన్యసహవాసమును గలిగింపఁజాలితి ననునానందమే యుత్తమోత్తమమును మధురతమము నగుప్రతిఫల మగును. దానిఁగాక వేఱొద్దానినిఁగూడ నేగోరువాఁడఁగాను. ''

అట్టియైన మహోదారభావముతో మీ రీపరోపకారమున కేల గడఁగితిరో నే నెఱుఁగజాల కున్నదాన. మీరు నాసోదరు నెఱుఁగరు. అతఁడు మీకు మిత్రుఁడైనఁగాఁడు. మీరు నన్నుమాత్రమె చూచితిరి. నాతో ముచ్చటించితిరి. నేను ప్రియమిత్రమా యని మిమ్ము సంబోధించితిని. సోదరా యని పిలచితిని. ఓటో—మన కేటి కంకసీయరమణిక. నామానసమునకు జింతగలిగింపకుము. కొలఁదికాలమును డీ నామానసమునఁ గలిగినయుత్సాహమును నానందప్రద మగు శుభస్వప్నమును నిజముగ నది స్వప్నమేయని నీవుతలఁచినను—చెల్చివేయకుము.

నాకు నీవీపట్ల నీవు తోడ్పడుటకుగల కారణమువీరసుల ప్రోత్సాహము.

యోధవరేణ్యు లగుయువజనులుసామాన్యలావణ్యవతులకు తోడ్పడుభావముతో సాధారణముగ తోడ్పడెదరో అట్టిభావమునకు భిన్నమగు నేభావముతోనో నాకు వీరధర్మమన నెట్టిది? శూరశిఖామణుల స్వభావమెట్టిది? వీనినిగూర్చి నీవంటి యోధాగ్రణికి నేనా! బోధింపఁగలదానను! ఉన్నతపదవీవిరాజమాన యగునారీమణికి ఆమెకార్యమే తనకార్యముగ భావించి తోడ్పడనుదారభావముతో వీరశిఖామణి యగు నవయౌవ్వనుఁడు సంసిద్ధుఁడైనపు డాతడాతన్వీమణి ప్రేమయు నీలిపట్టాళ్ళచే బద్ధుఁ డగుచున్నాఁడు—ఆమెయాజ్ఞ తలఁదాల్ప బాధ్యుఁడగుచున్నాఁడు. ఆకొమెయంతసాహసమునే గాదు. ఆయేలనాగమ్మ్రదులహృదయమునే యాకర్షించుట కాతఁడు తనయర్హతఁ బ్రకటించినసర్వవిధములఁ

ప్రయత్నింపవలసిన వాఁ డగును. అసతీమణిగూడఁ దనవలెనే యుత్త మస్వభావ యగు నేని తన కత్యంతపూజనీయుఁ డగు నాయోధమూర్తి తనకంటె వంశమర్యాదయం దొకింత క్రిందుపడినను దానిని బరిగణింపక నేఁ యట్టివిరోధముల నవలీల నిర్మూలన మొనరించి యాతఁ డొనరించిన మహోపకారమున కుచితసన్మాన మొసఁగి యాదరించును. అతఁడు చూపిన నిర్మలాభిమానమున కనురూప మగు కృతజ్ఞత నాసతీమణి చూపవలసి యుండుటచే సాంఘిక తారతమ్యము లంతరించి వా రిరువురు సమానగౌరవమునకే పాత్రు లయ్యెదరు. అసతీమణి కృతజ్ఞతయే కడువేగముగ గాఢతమమును నిర్మలతమము నగుప్రణయపరిణామమును బొందును. ''

'' అవురా ! రాకుమారీమణీ— మీ రిట్టి —''

'' ప్రవిమల సుందరాగ్రగణ్యుఁడును, మహావీరశిఖామణియు నగు నీబోటియోధపుంగవు డెట్టిసంరంభముల నైనపాటింపక యెదుర్కొనఁ దగును—వినుము. సావధానుఁడవై నామనసు నిపుడు కలఁచి వేయు చున్నభావముల నాలకింపుము. కొంతకాలముక్రిందట నిన్ను నేను విజయనగరమున—నెపుడైన నేఁటి యెచటనైన నేమి చూడఁగలిగితిని. అప్పుడే నీమోహనమూర్తి నాహృదయఫలకమునఁ జిత్రిత మయ్యెను. ఎన్నియో నెలలుగడచినవి. నేను విదేశములం దుంటిని. అపరిమితము లగునాపదలకుఁ బాలుగావలసివచ్చెను. మహోన్నత పదవి గోలుపోయి అజ్ఞాతవృత్తి విదేశవాస మొనరింపవలసినదాన నైతి. కాని యెంతటిభయంకరము లగునాపదలపాలైనను, నీమోహనమూర్తి క్షణమైనను నాదృక్పథమునకు దూరముకాలేదు. దానిని నేనులాలించితిని. పోషించితిని. అర్చించితిని. అయ్యో! ఏలనిట్లు సంభ్రమించెదవు ? తొందరపడక సాంతముగ నాలకింపుము. నే నొక్క దినమున నైననీను మఱువకుండుట నిశ్చయము. గాననే మరల నీదుర్గమున నీసందర్శనము కలిగినంతనే లోన నిమిడియున్న ప్రేమాతి

శయ మొక్కసారిగాఁ బెల్లుబికినది. పొంగిపొరలినది. అమృతవాహిని యై ప్రవహింపసాగినది. నేను లజ్జితనై కొంతదూరమేగియు మనసు నిలుపఁజాలక తిరిగి చూచితిని. నీవుగూడ నావంక ననిమిష లోచనుఁడవై చూచుచుంటివి. అట్టి నీప్రేమావలోకన నిశ్చ లతను గనినపుడు నా మానసమున నుదయించిన మనోభావ మట్టి దని తెలుపుటకు శబ్దజాల మలభ్యమని తోఁచుచున్నది. పాశ్చా త్య దేశమునందలి నృపాలురలో మహాభిమానధను లగురాకు మారు లెందరో నాపాదపద్మములకు మకుటరత్నముల నీరాజన మొనరిం చిరి. సార్వభౌములు నాపీఁటలచెంతఁ జేరి వందిమాగదులు ప్రేమగీత ములఁ గైవార మొనరించిరి. అతిరథశ్రేష్ఠు లనఁదగువీరశిఖామణులు నామందహాసవేశముఁ బడయఁ బడిగాపులు పడి యుండిరి, గాని ఓటో నిన్ను మరల నెంతకాలమునకో తలపనితలంపుగ నాకస్మికముగ నీసుందరవదనసందర్శన మహాభాగ్యము నాకు లభించుతటి కలిగిన యనిర్వాచ్యదివ్యసుఖము నేను నాజన్మమునందెన్నఁడునుగూడ ననుభ వించి యెఱుఁగను. ఆవల మఱల మనము కలుసుకొంటిమి. నాభావ మును నీకు స్పష్టపరుపవలెనని నే సంకల్పించితిని. నాసంతాపకారణ మును విన్నవించితిని. నీవించుకయైనసంకోచింపక నాకుఁతోడ్పడెదనని వాగ్దాన మొనరించితివి. మరల నాభావము దానిచే మఱింత స్థిరపడ సాఁగెను. నామానసమునం దుజ్వల మగు ప్రేమజ్యోతి ప్రకాశమున నంతరంగమునగూడ, ప్రతిఫలించుచున్నదని నే నానందించితిని. అది నిజము గాదేని యట్టిదుర్భ్రమయే యగునేని పరమపవిత్ర మగునింతటి సుఖస్వప్నవిచ్ఛేదము—క్రూరనిర్మూలన మేనాఁడు నెవ్వారికిని తటస్థిం చియుండదు. ఇదిదుర్భ్రమగాదు. నిరర్థకస్వప్నమని నేను తలఁపఁజాల. ఓటో నాపై నీకు ద్వేషముకలుగఁగలదా? పరమమగునారహస్యమును వెల్లడించినందులకు నీవు నన్ను నీచకాంతయని నిరసింతువా? నీవిమల ప్రేమకు నేను పాత్రురాల నని భావించునంతటికటాక్షము నాపైఁగలు

గనున్నమానెగాక సామాన్యస్నేహితురాల నని నన్నైన భావింపనంతటి
నిర్దాక్షిణ్యము నీకు నాపైఁ గలుగునా ?'' అని పలుకుచు మెల్లమెల్లన
దరిఁజేసినల్లతాంగివలె నాపల్లవాధర యతనిని సమీపించి యతని
కరద్వయము తనపాణి సంపుటమున బిగియబట్టి మోహనదృగంచల
ముల నాతనినిర్మలవదనముపై బ్రసరింపజేయుచు నర్ధాలింగనవిధాన
మునఁ దనవదనము నాతనివక్షమునఁ జేర్చెను.

నిశ్చయముగ — నెమ్మదిగ, దృఢసంకల్పముతో, సౌకుమార్యము
తో ఫౌస్టు ఆమెకరబంధము నల్లనఁ దొలగించి యామె నొక శయ్యా
సనముచెంతకు గొనిపోయి కూర్చుండఁజేసి చెంత నిలిచెను.

'' ఓ కాంతామణీ ! మీరింతవఱకు నొసఁగిన ప్రేమోపన్యాసము
నాకు గాఢసంతాపమును గలిగించినది. నే నెట్లు ప్రత్యుత్తర మియ్య
వలెనో మీభ్రమ నెట్లు తొలగింపవలెనో గ్రహింపజాలకున్నాను''
అని పలికెను.

'' ఏమంటివి ? నాభ్రమను దొలగించుటయేనా — అంతయేనా
అయ్యో వలదు, వలదు. ''

'' సావధానముగ నాలకింపుము. నేనిపుడు పరమపవిత్రమగు ధర్మ
మును నెరవేర్పక విధిలేదు. నిన్నును నీవంక నే నటులఁ దిలకించుట
యనుచితమని నే నొప్పుకొందును. ఎంతటి నిర్లిప్తస్వాంతయునిగూఢ
పరికట్టఁజాలిన మేటిశక్తి మీగాంభీర్యమునందు గల దని నేను తెలు
పకుండఁజాలనుగాని యిది సౌందర్యప్రశంసయని మీరు భావింపఁబో
కుడు. మరల మనము కలుసుకొనినపుడు మీరట్లు ముచ్చటించుటకు
నేను కొంతప్రోత్సాహము కలిగించినది నిజమే గాని నాభావములకు
మాత్రము మీరు విపరీతార్థముఁ గల్పించితి రని దైవసాక్షిగాఁ దెలు
పుటకంటె నధికముగ నే నేమియును బలుకఁజాలను. మీసోదరుని
విడిపింపఁగోరినప్పు డెట్టిస్వార్థపరత్వము అన్యాభిలాషయు మనసున నుం

చుకొని నే నందుల కంగీకారమును దెలుపలేను. అప్పుడుగూడ మీ రన్యథా భావించితిరి. నాకంటె వేయిమడుంగు లున్నతస్థితియం దున్న మిమ్ము స్వాధీనపఱచుకొనవలెననియు నాపై మీకనురాగము కలుగు నట్లొనరింపవలెననియు నాకుమారిక లగుపించు చూపం దలచిన మిత్రి భావముకంటె నధిక మగుభావమును బడయవలెననియు నట్టిదానిని బడయు సామర్థ్యము మదధీనమనియు ప్రాణాపాయమునకు వెఱువక నే నీకార్యమును సాధించిన మిమ్ము వశపఱచుకొనుట సులభకార్య మనియు నూహించునంతటి పాపచింత త్రుటికాలమైన నాకుఁగలుగ లేదు. సహజ మగునావినమ్రభావము నట్టి దుశ్చింత యావంతయేని యాక్రమింపలేదు.

"అయ్యో యిట్టి నిర్హేతుకవాక్యములచే నాయాశ నేల భంగపఱచె దవు? నీకు నాపై సంపూర్ణానురాగము కలదు. నీకు నీచదాసినై యునుటగూడ మహాభాగ్య మని నే నానందించెదను. ఆమాత్ర మైనదయ జూడక నను గాలందన్నెదవా? నాకే నాపై నసహ్యమును గలిగించునంతటి దురవస్థకు పాలుచేసెదవా? నీకిప్పుడు నాపై ప్రేమ లేకున్నమానె నను ప్రేమించుటకుఁ బ్రయత్నించెద నని యైనఁ బలు కవా? ఆమాటయైన నీ వాడకున్న నేను దుఃఖభాజననై అగతికనై యంతరింపవలసి వచ్చును."

"హా దైవమా నే నిపు డేమిచేయుదును. ఏమనగలను" అని ఓంగో చాలఁ జింతిలసాగెను. ఏలయన నామె యొనరించున దంతయు మాయా నటనమే యను ననుమాన లేశమైన నాతని కప్పుడు కలుగ లేదు. కాన నిక్కముగ నాతన్వి తనకై ప్రాణ మర్పింప నున్న దని గాఢవిచారమున మునిఁగి యాతఁ డట్లనుకొనెను.

"ఏమిచేయుదు నేమనఁగల నని యడిగెదవా! అసామాన్యలా వణ్యధన్య యగుకామినీమణి నిజసౌందర్యాతిశయమును లెస్సగా నెఱింగినమానవతి తనమానప్రాణముల నర్పింప సంసిద్ధయై యుండ

నట్టి ప్రణయముగ్ధ నీపాదములపై బడునంతటికి ప్రేరేచుట కాఠిన్య లక్షణము కాదా? అని పలుకుచు నామె యతని పాదాంతికమున వ్రాలెను. అంతలో నాతని కంచుకాంతరముననుండి యేదో క్రిందఁ బడెను. అది సింహశిరోంగుళీయక మని ఓటో చూచెను. తటాలున నామె దానిని దీసుకొనెను. గాని నిజమునంతను తక్షణమే ఓటో గ్రహింప గలిగెను. గావున హా! యని యట్టె వెనుక కొదిగెను.

„ఓటో!"

„ఇపుడంతయును స్పష్టమైనది. నిన్ను నేను బాగుగా నెఱుఁగుదును. మీ రొనరించిన ఘోరపాతకములు లోకవిదితములు. ఆమహాపాతకములకు సాధనభూత మగుదానిని గూర్చిన రహస్యముగూడ వెల్లడి కాకపోలేదు. లూక్రెజా నీసోదరిని విడిపించుటకా నాచేత నిన్ను వాగ్దానము చేయించితివి.

నీవు వాగ్దాన మొనరించితివి. సత్యవాది వైన నీ వాశి తప్ప జాలవు" అని పరిణయప్రహసనము నంతటితో ముగించి యాతని యసహ్యభావమువలనఁ గలిగిన కటుభావముతో నామె పలికెను.

„నే నెన్నటికిని మాట తప్పువాఁడఁ గాను. మహా ద్రోహిని గారాగృహవిముక్తుని జేయవలసి వచ్చినను నేను వెనుదీయువాఁడఁ గాను. సీజరు కుటుంబమువారి యధికార మంతరించినవార్త వియన్నానగరమునందే నాకు దెలిసినది. ఆర్సినీలు నీసోదరుని గృహమును పరిశోధించి రనియు నందు మీ ఘోరపాతక నిదర్శనము లన్నియు వెల్లడి యయ్యె ననియుగూడ నేను వినియుంటిని. ఒకసారి జర్మనుప్రభువు వెనిసునగరమునం దొకమందిరమునఁ జూచిన చిత్రముల రహస్యములన్నియును గూడ నిపుడు విడిపోయినవి. ఇపు డప్రయత్నముగ నేలబడిన యుంగర మెందటి ప్రాణములనో హరించిన దని నే నెఱుఁగనివాఁడఁగాను.

,, నేను మరల మని నంతకాలము మనుదాన నైతినేని నే నొనరించిన ఘాతుకములలో నెద్దానినిగూడ నిక ముందైన మానుదానఁగా నని '' ఆమె వికటముగ నవ్వెను.

,, ఓ శాంతివిహీనా నీవు దైవము నేల స్మరింపవు? నీ కేల పశ్చాత్తాపము కలుగదు? సర్వేశ్వరు నేల ప్రార్థింపవు? ఈకఠిన శపథకలుషవాక్యముల నేలపలికెదవు. ఆహా! నీకు గలుగ నున్న ఘోరదుర్దశ నేల గమనింప కున్నావు? ''

,, నాపాపఫలము నీ వనుభవించెదవా? న న్నేల యూరక దూరఁ సాఁగితివి? ఇఁక నీ వృథావాగ్వాద మేల? నీవు వాగ్దాన మొనరించిన రీతిని నెఱవేర్తువు గాక. ''

,, నేను నీ సోదరుని బంధముక్తుని జేయఁ బ్రయత్నించెదను గాని కాలకూటవిషము గల యీపొట్లమును మాత్ర మతనికి నే నంపఁ జేయను. ''

,, దీని నాతని కందజేతు నని వాగ్దానముచేసి యున్నాను. ''

,, నా ప్రతిజ్ఞాభంగమున కైననోర్తుగాని మానవజీవితాపహరణపటిష్ఠ మగు నీ గరళమును మాత్రమాతనిచేత నిడఁజాల? ''

,, ఓ యసత్యవాదీ! నీవాఁడితప్పఁ జూచుచుంటివా! '' అని యామె యాతఁ డందిచ్చిన పొట్లమును దిరస్కారముతోఁ దీసికొనెను. ''

,, నే నసత్యవాదిని గాను. ప్రతిన నెఱవేర్పనివాఁడఁ గాను. నేను బ్రయత్నించెదను. సాధించెదను. లేదేని జీవితములనర్పించెదను. నేను సాధింపఁ గలిగినను కుతంత్రముల సహాయము నపేక్షించు వాఁడఁ గా''నని పలికి ఓటో బిరాన వెడలిపోయెను.

## ౨౧

ఓటో చిత్రపటశాలను వదలి తిన్నగాఁ బ్రధానద్వారమును వంతెనను దాఁటి విటెనుబర్గుమార్గము ననుసరించెను.

ఒక యర్ధమైలు దూరము నడచి మార్గమునకు దక్షిణభాగము నందున్న శ్మశానావరణముఁ జేరెను. దాని చుట్టును వృక్షముతో ప్రాకారముగా నేర్పడి యుండెను. ఆయావరణమునకు ముందుభాగమున నతిశుభ్ర మగు చిన్న యిల్లు గలదు. వెనుక భాగమున దానికి నూటిగఁ బ్రార్థనామందిర మున్నది. ఆ గృహమున శ్మశానాధికారి నివసించుచుండును.

ఓటో యచటి కేగగనే అయుద్యోగి వెలికి వచ్చి యాతని లోనికి కొనిపోయెను. ఓటో యాశ్మశానావరణమున నొక కోణమున నున్న యొక సమాధి చెంత కేఁగి విమలచిత్తుఁడై మోకరించి ప్రార్థింప సాఁగెను. ఆ సమాధి చెంత నొక దారు సిలువ మాత్ర ముండెను.

"మహాత్ములఁ గలసిన మాతృదేవతా స్వరూపిణి వగు నోజనమా! నీశరీరము స్థాపితమైన ప్రదేశమునకు నే నిప్పుడు మరల వచ్చితిని." నీవు గూడ మరల నిచటికి దయచేసి నన్నాశీర్వదింపుము. వెనుక నే నీ సమాధిచెంతఁ బ్రార్థించినపుడు తినఁ దిండియు నిలువ నీడయుఁ జెంతఁ జేర్చు స్నేహితుఁడును లేని దుర్దశయం దుంటిని. ఆశా లేశ మైన గోచరింపకుండెను. అట్టి ప్రబలదుర్దశయం దుండినను ధర్మమార్గమును బరిత్యజింపకుండుట కే నేను శపథ మూనితిని. దురాకర్షణమునకుఁ జిక్కకుండుటకును, సామాన్య మైనను, విమల మైన నా వంశ నామమును కళంకితముఁ గావింపకుండుటకును నిశ్చయించి నా కట్టి మనస్థైర్యము కలుగున ట్లాశీర్వదింపు మని నిన్ను వేడుకొంటిని. నీవు నా ప్రార్థనమును నాదరింపలేదు. నీవును నిను బోలు నుత్తములగు దేవతలును నన్ను గాపాడితిరి. నీకొఱకే సర్వేశ్వరుఁడు గూడ నాపై దయఁజూపెను. తల్లీ, పావనీ, మనోవాక్కాయములచే నే నే స్త్రీకి నట్టి చేటుగును సంకల్పించి పరికి చేసి యుండఁగ నని నాయెడఁ జేయుడి నీసమాధిచెంత నీపాదసన్నిధానమున నిశ్చయముగఁ

దెలుపఁగలను. నా ప్రజ్ఞ వెల్లడించుట కహంభావముతో నే నిటు పలుకుటలేదు. నీవు నిరంతరమును నను సంరక్షించుటకు నేను నాయర్హతఁ గోలుపోతి నని విన్నవించుటకే యిటులఁ బలికితిని. సంతాపసహనమైన నా సోదరి యుకా యాత్మశాంతికిఁ గూడ నిపుడు నీ సన్నిధానమున నేఁ బ్రార్థించెద నని యాతఁడు మోకరించి తలవంచి దీర్ఘకాలము—మౌనముతో—గాఢముగాఁ బ్రార్థన మొనరించెను.

మతోద్రేకముగల యజ్ఞానుల కుండు మూఢవిశ్వాసముచే ఓటో ప్రార్థింపలేదు. అతఁ డొనరించినది పవిత్రతమము, పురుషోచితము, ఉదారభావపూరితము, నగు నారాధనము. సర్వవ్యాపి, సర్వనియంత, సర్వాంతర్యామి, సర్వసాక్షి, సర్వశక్తుఁడు, స్థిరుఁడు, కరుణామయుఁడు నని విశ్వము శతకోటికంఠముల నే మహనీయుని పరాత్పరునిగూర్చి అస్తి అస్తియని మహోంకార నినాద మొనరించు చుండునో యట్టి లోకకర్తకు, జగద్భర్తకు, భువనహర్తకు, మతిమంతుఁ డొనర్పఁదగిన మహాదర్శనమునే ఓటో భక్తిపూర్వకముగ నొనరించెను.

ఇటు లతఁ డాపవిత్రవిధిని నిర్వర్తించి యధికారి మందిరమున కేతెంచెను. "మిత్రవతంసా, నాతల్లి నీ యావరణమున సమాధి నొనరించినపు డాపావనిసమాధిచెంత శిలాస్థాపన మొనరించుటకు నేను సమర్థుఁడను గాకుంటిని. ఇపుడు సర్వేశ్వరుఁడు నా కనుకూల స్థితి గలిగించుటచే నాయుత్తమధర్మము నిపుడు నిర్వర్తింపఁగోరుచున్నాను. ఇదిగో వలయు ధనము త్వరలో నీకార్యమును దయతో నెఱవేర్ప వేఁడెదను. ఆశిలాతలమునఁ జిత్రింపఁబడఁదగిన వాక్యములను బూజనీయుఁ డగు గురుపుంగవుఁడే తెలుపఁగలఁడు" అని ఓటో కొంతధనము నీయ నుద్యోగి దానిని గొని యాకార్యము నెఱవేర్తునని వాగ్దాన మొనరించెను.

అంతట ఓటో అందుండి మతబోధకగురుని విడిదికేఁ జనియెను. అతఁడు శతవృద్ధు. అతని శిరోజములు మిక్కిలి పాండురములై

యుండె. అతని పూతచారిత్రమునకును, పరోపకారశీలతకును, నిష్క-
ళంక ప్రవర్తనమునకును, ఆప్రాంతమునందలి జను లందఱు పరమ
పూజ్యుని దైవసమునిగా భావించి సేవించుచుందురు. ఆగురువరే
ణ్యుఁడు ఓటోను బసితనమునుండియు నెఱిఁగి యుండుటచే నిపు డా
తనిఁ జూడగనే శిష్యవాత్సల్యముతో మెండుగ నాదరించెను. ,,విలా
సయుతము గాకున్నను సౌఖ్యపదమై యొప్పు నా కుటీరమునందు
సూర్యరశ్మి సోకకుండ నల్లుకొని నవమల్లికాలతావితానము నీడ
చిన్న బల్లపై సమర్పఁబడిన యాహారపదార్థములను వారిగురువు నార
గించిరి. సాధుజనుల కుచితము లగు సాత్త్వికపదార్థములు తప్ప విలు
వగల భక్ష్యభోజ్యపానీయాదు లేవియును సిద్ధపఱుపఁబడ లేదు.

తాను శ్మశానోద్యోగికిఁ దెలిపిన విషయముల నన్నిటిని ఓటో
గురుపుంగవునకు విన్నవించెను. ఆతఁడు లాటినుభాషయం దావాక్య
ములను వ్రాసి యిత్తు నని సంతసముతోఁ దెలిపెను. దానపాత్రులగు
వారి కొసంగుటఁ గని సవినయముగ ఓటో కొంతవిత్త మాపావనచరి
త్రుని పాదసన్నిధిని సమర్పింప నటులే సద్వినియోగ మొనరింతు నని
యావిరాగి ప్రేమతోఁ బలికెను.

,, దరిద్రదశయందు పొందిన కష్టములవలన గలిగిన యనుభ
వములను మఱువక యందలి యుత్తమహితోపదేశములను గ్రహించి
మరల నైశ్వర్యవంతులైనపుడు వివేకముతో ధార్మిక చింతతోఁ
బరులమేలుఁగోరి లోకోపకార మొనరించువారి సంఖ్య యత్యల్పము
గదా ! వత్సా నీవు సచ్చరిత్రుఁడవు. సర్వేశ్వరుఁడు తప్పక నీకు
సతతైశ్వర్యముల నొసంగును. ,, అని పలికి తనదక్షిణపాణితలమును
తన పాదాంకితమున మోకరిలిన నోటో తలపై నిడి మనఃపూర్వక
ముగ నామహనీయుఁ డాశీర్వదించెను. అంతట నోటో యాతని
యనుమతిఁ గొని విటెనుబర్గునకు వెడలిపోయెను.

అచట తన బాల్యస్నేహితులయందు తన యాదరణమును బడయు

వస్థ లగువారికడ కొందు మూఁడు గంట లాతఁడుగడపెను. వారిలో సంపన్నులుగాక శ్రమపడుచున్నవారికి శక్తికొలఁది ధనసహాయము మొన రించెను. ఆమిత్రు లందఱును అతని కోమలహృదయము నుదారభా వమును పూర్తిగా గ్రహించినవారే యగుటచే నామిత్రరత్నమును మిక్కిలి గౌరవించి ప్రేమాదరణల జూపిరి.

చీఁకటి పడిన పిమ్మట నాతఁడు తన యేర్పాటును గొనసాగింప నుద్యమించెను. చిటికెనవ్రేలు లావున జాల పొడుగును గల గట్టి పట్టుత్రాఁడును మఱికొన్ని చిన్నచిన్న యాకురాళ్ళను, ఏదో యొకవిధ మగు రసాయనికద్రుతిని, ప్రాగ్దేశీయులు ధరించు వస్త్రములతో నాతఁడు కొన్ని దుకాణములందుఁ గొనెను.

వాని కత్యంత విశ్వాసపాత్రుఁడగు మిత్రుని మందిరమునకుం గొని చని తన ప్రయత్నము నాతని కెఱిగించెను. ప్రాణాపాయకర మగు నాప్రయత్నమును మాను మని యామిత్రుఁడు పలు తెఱంగుల బోధించెను.

“ మానఁజాలను నే నిరువురి యెదుట ప్రమాణముచేసి చెప్పితిని. నేను మాటతప్ప వీలులేదు. ఏమహనీయుఁడు నన్ను దారిద్ర్యమునుండి విముక్తు నొనరించి తొలుదొల్త నుద్ధరించెనో యాతఁడే యొక స్త్రీకి దోడ్పడుమని నాకాజ్ఞాపింప నేను సరి యని మాట యిచ్చితిని. ఆ స్త్రీ నాకు విధించిన కార్యము కష్టతరమే యైనను నేను దానిని మానువాఁడఁగాను. కావున నామానమును మరలింపఁ బ్రయత్నింపకుఁ” మని ఓటో పలుక నామిత్రుఁడు చేయునదిలేక మిన్నకుండెను. ఓటో గదిలోనికి పోయి తనయంగీనితీసి ఆ పట్టుత్రాటిని తనయొడలికి చుట్టఁ బెట్టుకొనెను. ఆరసాయనద్రుతితో మోఁగను మెడను జేతులను గడుగు కొనెను. వెంటనే యాభాగము నందలి చర్మము మిక్కిలి నీలవర్ణ ముగ మారెను. అంతట నాతఁడు క్రొత్తగాఁ గొనిన ప్రాగ్దేశపు

దుస్తులను ధరించి యాకురాళ్ళను లోన భద్రపఱచెను. ఆతఁడిట్లు లోపలిగదిలో మాఱువేషమును ధరించి తన మిత్రుఁడు కూర్చుండిన చెంతకేఁగ నెవఁడో నూతన పురుషుఁ డేతెంచెనని తలఁచి యాతఁడు రిచ్చపడసాఁగెను.

దానింజూచి ఓటో పక్కున నవ్వి మిక్కిలి గడసరియగు నాన్నలముకు గూడఁ గంట దుమ్ము గొట్టఁజాలుదునని సంతసించెను. అన్నలము లిన్నుడాఁపు దుర్గమునందున్నాఁడని ప్రశ్జావలన నాతఁడువిని యుండెను.

„ ఈధనము సంచిని యీ లేఖను నీ చెంతనుంచుము. నేటి కేడు దినములలోన నేను మరల రాకున్న నేను మృతినొందితి ననియో లేక కారాగృహబద్ధుఁడనైతి ననియో నీవు స్థిరముగా నమ్మవచ్చును. అప్పుడు ధనమ్మంతయు నీదిగానే భావింపుము గాని నీవు వెంటనే వియన్నానగరమున కేఁగి ఆలేఖను ఆర్చిడ్యూకులియుపోల్డు రాకుమారుని ధర్మపత్ని యగు మేరియాదేవికి తప్పక యొసంగవలయును. ”

అని ఓటో పలుక నామిత్రుఁడు తప్పక నెఱవేర్చెద నని పలికెను. మిత్రుఁ డట్టులొనరించుట కెట్టిసందేహము లేదని ఓటోకు గట్టి నమ్మకము కలదు.

పిమ్మట నతఁ డచటగూర్చుండి జర్మనుప్రభున కొకలేఖను దన ప్రియురాలగు నాకొక లేఖను వ్రాసెను, ఆరెండులేఖల నొక కవరు లోనే యుంచి దానిపైని జర్మనుప్రభునివిలాసమును వ్రాసెను.

„ నీ విట్లు వియన్నాకుఁ బోవలసిన యవసరమే కలుగునెడల నీవీ లేఖను గొనిపోయి జర్మనుప్రభున కొసఁగుము. అతని భవనమును నీ వనాయాసముగ గుర్తింపఁగలుగుదువు. దానిలో నింక నొకలేఖ వేఱొక వినయావతికి వ్రాయబడినది—దానిమాట కేమి ” అని కృ గంశలమున నురలు బాష్పకణములఁ గొనగోట మీటుచు—నేను

ఆతని కట్టిబలవన్మరణ మొందుటం గలిగియుండును. ''

'' ఓత్తోపియనల్లా అను యువకునకు మన సంఘమువారు మరణ దండనను విధించియున్నారు. ''

'' ఆయువకుని నే నెఱుంగుదును. అతండు పెక్కువత్సరము లీప్రాంతమునందే నివసించుచుండెను. ఆతనిసోదరి రోసెంథాలు ప్రభుపుత్రికపరిచారికలలో నొక్కతె యని జ్ఞాపకము. ''

'' నిజమే. ఆతనికే మరణశిక్ష విధింపంబడెను. నేను హెర్మను గృహమున నుండ [illegible] నీయువకుం డటకు వచ్చెను. హాన్స

పెక్కువత్సరములనుండి సంఘమ్

గణదండనను నెఱవేర్పుట

తం డీమార్గమునకు ర

నా కనుమా

యేమైన ప్రమాదమువలననో పసితనమునందే మూర్ఖత్వము తటస్థిం చియుండును. ఏమైన నేమి. ఒకవిధముగ మన కిది యుపయోగించు నని అన్నలము పలికెను.

,,ఎటుల ?" అని ప్రభువనుగ ఓటోను గొనివచ్చి పరిచారకు నొప్ప లకు బొమ్మని యాతఁడు పోయిన వెనుక .. మిచెలోకో సీజాస తేస పుకు నొక్కచో నున్నచో వారి కుట్ర కుతంత్రముల నైనఁ బన్నఁగల రనినా వారి నిరువురను వేఱువేఱుప్రదేశములం దుంచునట్లు నేర్పాఱ చితిని. వెనుక నెందరో సైనికులు కావలిగాయుచుండినను నత్యద్భు తముగ నీదుర్గమునుండి నొక యువతి తప్పించుకొని పోగలిగెనని నీవే చెప్పియుంటివిగదా " అని అన్నలము పలికెను.

,, నిజమే. ఆమెయే యువతి ఔరానాప్రభ్వియైనది. "

,, అమితధనమును లంచ మిచ్చుటవలననే ఆమెను వారు విడిచిపం పఁగలిగి యుందురు. నీసైనికు లందఱును విశ్వాసపాత్రు లని నే నమ్మియుండకుము. వెనుక ఆర్చిడ్యూకులియపోల్డు తప్పించుకొని పోఁగలిగిన విషయమునుగూడఁ దలఁపునకుఁ దెమ్ము. "

ఆరెండువిషయములు ననుమానకారణములే యగుచున్నవి. అవి రెండును నించుమించుగా నేకకాలముననే జరిగెను.

,, కావున నీపరిజనుల ధనమునకు లొంగని మహాయోధులు గారు. అట్టిచో వారిని సీజ రవలీలఁ దనవలలో వేసుకొనఁ జాలును. "

,, అట్లైన నేమిచేయఁగోరెదవు ? "

,, ప్రాణేశపు మూఁగవాం డత్యంతవిశ్వాసపాత్రులు " అని యాన్నలము పలికిన పలుకులు ఓటోకు మిక్కుటమగు సంతసమును గలిగించెను. అతని యెదుటనే వారు రహస్యముల నిర్భయముగ మాటలాడు కొనుచుండిరి. అతని మాఱువేషము నొక్కింతైనను వారు గుర్తింపఁ జాలకుండుటయే గాక యాతని ప్రయత్నముల కనుకూలమగు నేర్పాటులనుగూడఁ జేయుచున్నారు.

„ నిజమే. పాప మితనికి బంధుగు లెవ్వరును లేనట్లే యున్నది. ఈయనాథయువకుని నే నాదరించెదను. మూఁగవాం డెన్నివిధముల నక్కఱకు వచ్చెను” రని ప్రభువనెను.

„ మన దేశమున మూఁగవాండ్రసంఖ్య విస్తారముగ నుండకుండుట చాల విచారకరము! నీకును నాకును మనవంటివారికిని మూఁగ వాండ్రు మిక్కిలిగ నుపయోగింతురు. వారు చెప్పినపని చేసెదరు గాని పనులకు దానిని వెల్లడింపఁజాలరు. ఈమూఁగవానిని నీజనుపైఁ గాపుగా నుంచఁగోరెదను. ఇట్టిప్రాదేశపుమూఁగవాండ్రు చురుకుఁగాఁ గనిపెట్టఁగలుగుదురు. వారి కెన్నోగాని యుక్తులు తెలిసియుండును. ఇతఁడు క్రైస్తవుఁడు కాఁడు. ఇతఁ డేమతమునకునుగూడఁ జేరిన వాఁడో కాఁడో అనుమానాస్పదమే. ఇతఁడు చాల నమ్మకముగ సేవించుచు నిం దే పడియుండును. మన యభిప్రాయము నతనికి నేను బాగుగా బోధించెద” నని యాన్నలము పలికెను.

అన్నలము నన్నెన్నఁడునుచూచి యుండలేదు. పర్యాటనమార్గమునం దారాత్రి యొక్కసారిమాత్రమే చూచెను. గావున నతఁ డతని ముఖనైఖరి నిప్పుడు గుర్తింపఁజాలఁడు గావున నిప్పు డాతఁడు నాసమీపమునకు వచ్చినను గూడఁ గొంచమైనఁ బోల్చఁజాలఁ డని ఓటో యూహించుకొని ధైర్యమును జిక్కఁబట్టెను.

ఓటోయూహ యీవిషయమున మాత్రము పొరబడినది. అన్నలము వియన్నానగరమునఁ బెక్కుసారులోటోను జూచియుండెను. ఇటీవలనే హెర్మను గృహమునం దాతఁడు మరల ఓటోను జూచెను. గాని యిప్పుడు మాఱువేషమున నుండుటచేఁ గొంచమైనఁ బోల్పఁ జాలక పోయెను.

కావున నిప్పు డితఁడు పెక్కువిధము లగుసంజ్ఞలచేఁ దనసంకల్ప మును ఓటోకు బోధింపసాఁగెను. తాను సులభముగ నాతనియభిప్రా

యుకులను గ్రహింపఁగలిగిన వని యోటో సూచింపసాగెను. “అహో యీతఁడు చాలచురుకుతనముగలవాఁ” డని యాన్సలము మాన్ఫ్లష్టవంకఁ దిరిగి తెలుపుతెఱని ఓటోకు పట్టజాలని నవ్వు వచ్చినది గాని యతఁడు వెంటనే దాని నడఁచుకొనెను.

“మూఁగవాండ్రకు మాటలు రావు గావున వారు సంజ్ఞలను జురుకుగా గ్రహింతురు. ఇతఁడు చాల కృతజ్ఞతను తెలుపుచున్నాఁడు. మన కెంతయు నక్కఱకు వచ్చు” నని ప్రభువు పలికెను.

“నే నితని నిపుడే సీజ రున్నతావునకు గొనిపోయెద” నని పలికి తనవెంట రమ్మని ఓటోకు సన్నఁ జేసి యాన్సలము నడువసాగెను.

ఓటో ప్రభుని చెంత కేఁగి మోకరించి యాతనిచేతిని పై కెత్తి మెల్లనఁ బెదవులతో స్పృశించి కడువినయమును వెల్లడించెను. ఇట్లొనరించవలసి వచ్చుట ఓటోకు చాల కష్టముగా నుండినను వారికి గట్టినమ్మకము గలుగుటకును ముందట్టిప్రమాదమును గలుగకుండుటకు నాతఁ డట్లొనరించెను.

“ఆవినయమును గనినంతనే గర్వితమతియగు నా ప్రభువునకు గూడఁ జాల కసిని గలిగె.

పిమ్మట ఓటో లేచి అన్సలము వెంటఁ బోయెను. అటనుండి వారిద్దఱును సోపాన మార్గమునఁ గ్రిందకుఁ బోయి విశాలమగు నంగణమును దాఁటి చనిరి. అచట చిన్నద్వారము నతఁడు తెరచెను. వారు మరల వలయాకారముగ నున్నసోపానముల నధిరోహించి యొక తావుచేరిరి. అచట నొక యోధుఁడు సాయుధుఁడై నిలచి యుండెను. అన్సలము మరల నొక తాళముతో నాద్వారము దెరచి లోని కేఁగ మూఁడుగదులు కనఁబడెను. వాని కన్నిటికిని తాళములు వేయబడి యుండెను గాని యాతఁ డొక్కకదానిని దెఱచుచుఁ బోవ లోన ప్రార్థనాగృహము కనఁబడియెను. వా రందడుగిడగానే సుందర

మూర్తియగు కాంతామణి ఛాయాపటమును జూచి ఫౌస్టు విభ్రమము నొందెను.

మేరియాకుమారికిని యీచిత్రపటమునందలి కాంతామణికిని ఎట్టిభేదమును కనఁబడుటలేదు. కాని ఆతఁ డప్పుడు అన్నలము వెనుక నడుచుచుండుటచే వారిద్దఱిపోలు సామాన్యపాఠకుఁడు గుర్తింపజాలఁ డయ్యె.

పిమ్మట నాన్నలము గోడలోనియొకమీటను నొక్కఁగనే తలుపు తెఱువఁబడెను. పిమ్మట వారు సన్నని మార్గమున నేఁగ మఱియొక పెద్దద్వారము కనఁబడెను. అది క్రొత్తగా నమర్చబడిన ట్లుండెను. దానిని దెరచుటకు ముందు అన్నలము వాఁడిగలకరవాలమును జే బూనెను.

పిమ్మట వారిద్దఱును లోని కేగిరి. అది చాలచిన్నగది. గవాక్షము లన్నియు బలముగల గడియలచే బంధింపబడి యుండెను. అందవసర మగు సామానాదికము లన్నియుఁ గలవు. అందొకబల్లచెంత దీనవదనుఁడై పాలతలమును పాణితలమును జేర్చి సీజరు కూర్చుండియుండెను.

ఆతనివయసు ముప్పదియేండ్లకు పైఁబడినట్లున్నది. అతని నెమ్మోమున వెలవెలనై గాపించినగాయపుమచ్చ కనఁబడుచునేయుండెను.

అన్నలమును ఓటోయు లోని కటుల వచ్చినవెంటనే సీజరు తటాలున లేచి నిట్టనిలువున నిలచి వారి నిద్దఱి ననుమాననిర్లక్ష్యభావముతోఁ బరికింపసాగెను.

“ ఉరికంబములనుండి జారిన యోసీచుఁడా! నీవాకరవాలము లేకుండ నాయెదుటికి రాఁజాలవురా! ద్రోహీ ” అని సీజరు పలికెను.

“ ఏల నీవిట్లహంకారము లరచెదవు? నాచే జిక్కితివి. అత్యధిక మగుధన మొసఁగువఱకును నిన్నిందుండి వదలువాఁడఁగాను. ”

“ గోసింధాలుప్రభు వొంటరైన నన్ను విడిపింపకమానఁడు. నీ వా ప్రభునిశౌర్యాతిశయము నెంతసేచపరచినను నాకు నిరాశ కలుగదు. ”

,, నీయాశ నిరాశయే! నిన్ను విడిచిపెట్టవలె నని యాతఁడు లిన్స్ట్రాప్ప్రభువునకు వ్రాసెను. నీ మొగమైనఁ దా నెఱుంగ ననియు నిన్ను తాఁబట్టి బంధింపలేననియు నిట్లు వ్రాయుట చాలవింతగా నున్న దనియు లిన్స్ట్రాపు ప్రభువు రోసెంథాలుప్రభువునకు జవాబు వ్రాసెను. అనవసరవాదముతోఁ బనిలేదు. వినుము లక్షలీరల నిచ్చిన నిను విడచిపుచ్చెదను. ఇటలీదేశము నంతయు నిరంకుశత్వముతో నేలఁగలిగిన నీ కిది యొక లెక్క గాదు. ''

,, మిచెలొట్టోను విడిచిపెట్టుము. నేనాతని వియన్నానగరమునకు బంపెదను. అతఁడు మాకిజమిలను సార్వభౌము నర్థించి తెచ్చి నీకా ధనము నీయఁగలఁడు. ''

,, అతఁడు ధనమును దేక ప్రబలసైన్యమును దెచ్చినఁ జేయునది యేమి? ఇది సాధ్యపడదు. నీ వెంతో నీధనము నంతను నిక్షేపించి యుందువు. నీ వారహస్యమును వెల్లడించినగాని నిన్ను వదలుటకల్ల. ''

,, దైవమా! నే నిటలీదేశమును వదలుటకై ప్రయాణవ్యయము నకు చాలినంతధన మైన నాచెంత లేకుండెను. ''

,, చాలు చాలు. నీ ప్రల్లదము. త్వరలోనే నీవు దారికి రాఁగలవు. నీకుఁ దోడుగా నుండుటకు నే నీమూఁగవానిని దెచ్చితిని. ''

,, మూఁగవాఁడా? '' యని నీజ రనుమానముతో నోటో వంకఁ జూడసాగెను. ఏమిజరుగుచున్నదో సంభాషణముతో తన కెట్టిసంబంధమును లేనివానిచందమున నోటో తలవంచి నేలఁజూచుచుండెను.

,, మూఁగవాఁడే ప్రాగ్దేశములందు గూఢచర్యావిధానమున నారితేరినవాఁడు అతఁడు నీకు సన్నిధానవర్తియై జాగరూకతతో సకల కార్యములు నిర్వర్తించును. కాని సంభాషణమునందు మాత్రము సంతాపకారణుఁడే యగును. ''

అని పలికి యాన్సలము సరగున వెడలిపోయెను. అతఁడు తలుపు బిగించి గడియలఁ దగిలించి తాళముద్రిప్పి నడచిపోవు ధ్వనిని వారు బాగుగావినఁగలిగిరి.

## ౨౩

"ఎంతటిమహాక్రోధి! ఎటులైన నీ నిర్బంధమునుండి విముక్తుఁడఁ గాఁగలనేని, ఎటులైనఁ బగ దీర్చుకొనఁగలనేని— ఆహా! ఎట్టిదుర్దశ! స్వేచ్ఛగా నూపిరిపుచ్చుటకైన నెడములేని యిరుకు గదిలోఁ బడి నవయవలసినగతి పట్టెను. అతిదారుణ మతిదుస్సహము. నేనువిముక్తి మార్గము నారయఁ గోరుచుండఁ నాకీమూఁగ వానిని గావలిపెట్టిరే. ఆహా! నాకు మతిభ్రమముకూడఁ గలుగునేమో గదా?" అని ప్రలపించుచు సీజరు పాణిసంపుటముతో ఫాలతలమున మోదుకొన సాఁగెను.

"రాకుమారా!" అనుధ్వని అంతలో దాపుననుండియే వినఁ బడెను. ఎవ రట్లు పలికినవారు? మూఁగవాఁడే.

సీజ రనుమానముతోను నాశ్చర్యముతోను నాయువకుని వంకఁ జూడసాఁగెను.

"నావలన నీ కెట్టిభయము గలుగదు. నీకు హానిచేయుటకు నే నిందు రాలేదు. నీకొఱకే నే నీమూఁగవేషమును ధరించితి" నని మందస్వరమున నోటో పలికెను.

"పరమోదారస్వభావుఁడ వగు నోయువజన శిఖామణీ! నీ వెవ్వఁడవు? ఎందులకై నీరాక" అని సీజరుగూడఁ గడు రహస్యముగ నడిగెను.

"నాపేరు ఓటోపియనల్లా"

"జర్మను ప్రభుని పర్వత దుర్గమునుండి విడిపించిన—"

"వాడను నేనే. జర్మను ప్రభుని విడిపించినట్లే నిన్నుగూడ విడిపించుటకు నేనుపూనుకొంటిని. ఆన్సలము రోసెంథాలు ప్రభునిగూర్చి తెలిపిన సమాచార మసత్యముగాదు. అతఁ డిప్పుడు నిన్ను విడిపింపఁ బ్రయత్నించుటలేదు. అతఁడు చాలసమర్థుఁడయ్యెను. మాన్స్ఫడ్ప్రభువు నెసాముసంఘాధ్యక్షులలో నొకఁ డగుటచే భయపడుచున్నాఁడు.

" నీ వీటివల గోసంధాలు మార్గమున కేఁగితివా ? "

" నిన్నటి యుదయమున నే యంనుండి బయలు దేరితిని. నీసోదరికి మాట యిచ్చుటచేత నే ని న్నిపుడు విడిపింపఁబూనితిని. "

" లూక్రెజా సురక్షితముగ నాదుర్గమును జేరఁగలిగనా ? ఆమె బుద్ధికుశలత వలననేనా నీ కిట్టి మారువేషము లభించినది? "

" లేదు. ఆమె యొక్క పొట్లము నిత్తు నని పలికెను. దానిని మీ కందఁజేయఁగోరెఁ గాని నే నంగీకరింపలేను. నే నిట్టి మారువేష మును ధరించిన సంగతి యామె కించుకయైనఁ దెలియదు. "

" ఆపొట్లమును తెచ్చి నా కిచ్చుటకు నీ వేల సంశయించితివి ? "

" ఏలయన దానియం దున్న పదార్థములను గూర్చి నాకు సంశ యము కలిగినది. నాయభిప్రాయమును నీవు తెలుత స్పష్టముగ గ్రహింపవలసి యున్నది. నీసత్ప్రవర్తనమునకు మెచ్చి యించి గాని నీసో దరిసోయగమునకు భ్రమసిగాని నేను నిన్ను విడిపింపఁ బూనలేదు. ఆమె పేరు తెలుసుకొనుటకు ముందే నే నామెకడ నిన్ను విడిపించు టయైన లేక తత్ప్రయత్నమునఁ బ్రాణముల దొరుగుట యైన జరు పుట నిశ్చయ మని వాగ్దాన మొనరించుట చేతనే నే నిపు డిందు వచ్చితిని. "

" నీవు ధారాళముగ మాటలాడితివి గావున మఱింత విశ్వాసపా యుండ వైతివి గాని న న్నిపు డెట్లు విడిపింపఁగలఁచితి " వని యించుక పొడకట్టిన కినుక నడఁచుకొని సీజరు పలికెను.

" నాచెంత వాడిగల యాకురాళ్ళును బట్టుత్రాడును గలవు. "

" అనాధనములును దృఢసంకల్పమునుండిన సర్వమును సాధ్యమే యగును " అని నూతనోత్సాహముతో సీజరు పలికెను.

" నాపై నెవ్వారికి నెట్టి యనుమానము లేదు——నేను బందీని గాను. కావున దినమున కొక గంటయైన స్వేచ్ఛగాఁ దిరుగ నిచ్చె

దరు. అట్టివేళలం దీదుర్గరహస్యముల నన్నిటిని నేను బాగుగాఁ బరికించు చుందును."

"నే నీ ప్రత్యేకమందిరము నుండి తప్పించుకొనఁగలిగినను యీ దుర్గమును నిర్గమించుట యెట్లు సాధ్యమగును?"

"నాకు గూడ నీ సందేహమే కలిగినది. నే నింతకు ముందే ప్రాంగణమునుండి వచ్చినపుడు బాగుగాఁ బరికించితిని. దుర్గము సురక్షిత మనుట నిశ్చయము."

"ఆ స్వామి ద్రోహి యగు నాన్సలము నాకడ నమితధనసంచయము కల దని తలఁచుచున్నాఁడు. అది భ్రాంతి. నే నిటలీదేశము నుండి బయలుదేరినపుడు ప్రయాణవ్యయములకు సరిపడునంతటి ధనముమాత్రమె నాచెంత నుండె నని నేను ప్రమాణముచేసి చెప్పగలను గాని మరల నా కున్నతదశ లభింపఁగల దప్పు డుచితరీతి నిను సత్కరింతును."

"నా కట్టి బహుమానమును వలదు. నేను దీనిని గూడ స్వీకరింపను."

"నీచంద మత్యద్భుతముగ నున్నది. కానిమ్ము దానిని గూర్చి నేనిక నెన్నఁడు నీ చెంత ముచ్చటింపను. నాముఖ్యానుచరుఁడు గూడ నీదుర్గముననే బద్ధుఁడై యున్నాఁడు. అతని నిందు దిగనాడి పోవుట నా కెంతయు సంతాపకారణ మగును."

"నీవు మొదట తప్పించుకొని పోవఁగలిగితి వేని నీయనుచరుని నాన్సలము మాన్పఁగలుగు వదలి వేసెడిరు.

"తెన్నగా బలికితివి. నా రెట్లు చేయుచున్నను, నేనే యాతనిని గూడ విడిపింపఁ బ్రయత్నింపఁ గలుగుదును. ప్రస్తుత మన్నా మే మిద్దఱము గూడఁ జిక్కుకొని యుంటిమి. ద్రోహియగు నాన్సలము నిజవృత్తాంతమును నీ వెఱుఁగుదువా?"

"అతఁడు పవిత్రమగు వెహ్మాసంఘమున కధ్యక్షులలో నొక డని తలఁచెదను. మూఢులీ సంఘమును బవిత్రమని పలుకుదురు. అది మూఢవిశ్వాసమే."

"అది సరియే. దానిమాట కేమిగాని నీవు ఫ్రెడ్రికుకిన్సను పే రెప్పుడైన వింటివా?"

"పెక్కువత్సరముల క్రితము వియన్నానగరమునం దతఁడురితీయ బడెనని నేను వినియున్నాను. మఱియు వెలస్టను గ్రిగరీవిచారణ జరిగిన సమయమున వియన్నానగరమున ఫ్రెడ్రికుకిన్సను గొందఱు గుర్తించిరను వదంతులు గూడఁ జెలరేఁగెను."

"ఆ వదంతి గూడ నిజమే. అప్పుడతఁడు వియన్నానగరమునందే యుండెను. అస్సలమే ఫ్రెడ్రికుకిన్స."

"రాకుమారా!"

"నే నసత్య మాడలేదు. ఇది యథార్థము. అతని నురిఁ దీసిన మాట నిజమేగాని యతనిప్రాణ మప్పుడు కడబట్టెను గాని పోలేదు గావున నారాత్రి వైద్యుని యింట స్మృతిరాగా నాతఁడు పాఱిపోయెను. ఈ వృత్తాంతము నీ కెన్నటికైన నుపకరింపవచ్చు నని యెఱిఁగించితిని."

"అతఁడు నావధను సంకల్పించెను. అట్టిచో నాని యత్నమును భంగపఱుపఁ దగిన సాధనమును నీవు నా కొసంగితివి." అని ప్రీతితో పలికెను. అటుపిమ్మట వారిద్దఱును దప్పించుకొని పోవుటను గూర్చి సావధానముగా నాలోచింపసాగిరి. చివరకు వారి కొక్క యాలోచన మాత్రమే యనుకూలమని తోఁచెను. తలుపుల దెఱచుకొని పోవతెననినఁ బెక్కు ద్వారముల నిర్గమింప వలసివచ్చును. అది మిగుల నసాధ్యముగాన కృష్ణపక్షమునం దొకనాఁడు చీఁకటి గాఢముగ నున్నపుడు కిటికీ గుండ వెడలిపోవుటయే కర్తవ్యమని వారు నిశ్చ

యుంచిరి. అందులకు దాని యూచల నాకురాళ్ళతో నతనికి వేయఁ
దలంచిరి.

మధ్యాహ్నము మూఁడు గంటలకు ప్రభునిపరిజను లిద్దరు సీజ
రుకుఁ గావలసిన భోజనసామగ్రిల నన్నిటి నొక పళ్ళెరమునం దిడు
కొని తెచ్చిరి. అతఁడు భుజించువఱకు నా రావల నాగిరి. అతనిభో
జనము ముగియఁగనే ఓట్టో గూడ నచటనే కూర్చుండి భుజించెను.
పిమ్మట వా రాపళ్ళెరము గొని తలుపుల నన్నిటిని భద్రముగ మూసి
వెడలి పోయిరి. నటనకొఱకు, సీజరు భోజనము చేయుచున్నపుడు
సేవకుఁ భోజనపదార్థముల నందించు వాని వలె నతని చెంత నిలిచి
యుండెను.

అంబలనే మరల రాత్రి యెనిమిది గంటలకు పరిజనులు భోజనసా
మాగ్రిలను గొని వచ్చిరి. ఇంచుకసేపు వెలికి పోఁగోరిన బోవచ్చు
నని వారిలో నొకఁ డప్పుడు ఓట్టోకు సన్నఁజేసెను. అతఁడు దానిని
లక్ష్య చేయునటులే నటించెను. కాని అట్లు వెలికి పోవుట యాతనికిఁ
జాల నుత్సాహకరముగనే యుండెను.

అతఁడు వెలికి వచ్చి సంచరించుచు సీజరును బంధించిన గది
యెంత యెత్తున నున్నదో యని బాగుగా బరికింపనాఁగెను. పిమ్మట
దుర్గప్రాకారమును కాపలివా రున్నతావులను బాగుగా గమనించి
జ్ఞాపకముంచుకొనెను గాని చూచువారి కేపనియు లేక తిరుగు లాడు
చున్న వానివలెనే యాతఁడు కనఁబడెను.

అతని వృత్తాంత మంతటికిని దెలిసి యుంటచే నాతఁ డొకవిదే
శీయుఁ డగు మాగవాఁ డని యెల్లగును వింతగాఁ జూడ సాగిరే గాని
యెవ్వరును గూడ నతని ననుమానించి పరీక్షింపలేదు. నీ పీపాటికి
మరల సీజరు గదిలోనికి పోవలె నని గూడ నొక్కరును హెచ్చ
రింపలేదు.

పదిగంట లైనపిమ్మట నాతఁడు మరల గా ప్రత్యేకమందిరమున కేఁగెను. అచట నున్న కావలిభటుఁ డాతని సీజరుగదిలోనికి గొని పోయెను. మఱికొంత సేపటికి మాన్సల మచటికి వచ్చి పరీక్షించి చూచి బాగుగాఁ గనిపెట్టి యుండు మని ఓటోకు సంజ్ఞ చేసి మరల భద్రముగాఁ దాళములు వేసి తీసుకొని పోయి తన చెంతనే యుంచు కొనెను.

పిమ్మట ఓటో తన దుస్తులను విప్పి పట్టుత్రాడును నాకురాళ్ళను వెలికిఁదీసెను. వానిని గనినంతనే సీజరు నమ్మక మధిక మయ్యెను. ఆతఁడు కేవలము లోకతంత్రమున మునిఁగిన పాపచిత్తుఁ డగుటచే నెల్లరును దనవంటివారే యని భావించుటయందు వింత లేదు గావున లోకమునందు ఓటో వంటి స్వార్థత్యాగులును సత్యనిరతులును పరహితార్థాచరణ పరాయణులు కొందఱైన నుందురనిన నాతని కట్టి నమ్మకమును గలుగలేదు. ఇపు డాతఁ డాయుపకరణములను గన్నులార జూచుటచే నట్టి నమ్మక మిప్పటికిఁ గలిగినది. ఆ త్రాడు నిడివి బాగుగా సరిపడ నందున వా రిద్దఱును సంతసించిరి.

పిమ్మట వారు నిలువు టూచల నాకు ఱాళ్ళతో నఱకఁబూనిరి. రెండూచల నైనఁ దీసివేసినఁగాని వారు వెలికి పోఁజాలరు. కావున వాని నూడదీయువఱకును గోయఁబడిన ట్లితరులకుఁ గనబడకుండునట్లు క్రిందను మీఁదను నఱుక నిశ్చయించిరి.

ఆకురాళ్ళు చాల పదును గలిగి యుండుటచే నాకార్యము చక్కఁగా నెఱవేఱినది. అట్లు నఱుకుటలో రాలిన పొడిని జాగ్రత్తగా నెత్తి వెలుపలకు విసరివేసిరి. ఆరాత్రి సగము పనిని బూర్తి చేసి వారు పండుకొనిరి

అచట నొక చాపపై నోటో పండుకొనెను. మఱునాఁ డుదయమున మాన్సలము వచ్చునప్పటి కాతఁడు మేల్కొనియే యున్నను

నాతలుపు కిరకిర చప్పుడు విని లేచిన వానివలె నటించెను. అట్లు లేచి యాన్సలమునకు వందన మొనరించెను

„ ఈ మూఁగవాని సహవాసము సరిపడినదా " అని యాన్సల మపహసించుచు సీజరు నుద్దేశించి పలికెను.

ఆన్సలమును వంచించుటకు ఓటో వంక ద్వేషపూరిత మగుదృష్టిని ప్రసరింపఁజేయుచు „ మూఁగవాఁడు కాడు. గూఢచారి యని పలుకు" మని సీజరు బదులిడెను. ఆతఁడు ఓటో నట్లు చూచుటయంతయు నటనమే.

„ ఆతఁడు నిను గనిపెట్టుచున్నాఁడని నీ కిప్పుడే తేటపడెనా ! ఆతఁడు తన విధిని సరిగా నిర్వర్తించుచున్నందులకు నా కధికముగు సంతోషము కలుగుచున్నది. పాద్దేశీయులకు సహజమగురీతి నాతఁడు ద్వారమున కడ్డుగా చాపపైననే పరుండెను. ఒక వేళ నీ వెట్లైనఁ గవాటము తెఱువఁగలిగినను నాతని దాఁటకుండ పోఁజాలవు. "

అని యాన్సలము నుడువ సీజరు మిన్నకుండెను. అంతట పరిజను లాహారపదార్థములం గొనివచ్చిరి. ఆన్సలము తాళము చెవులను నాని కిచ్చెను. పగలంతయు నవి వారియొద్దనే యుండును. రాత్రివాని నాన్సలము భద్రపఱచును.

ఈ రీతిగా నిత్యకృత్యము జరుగుచుండెను. ఓటో దుర్గమున బ్రవేశించిన నాల్గవనాటికి నేర్పాటు లన్నియును బూర్తి యయ్యెను. ఆనాఁడు కారుమబ్బు గ్రమ్మి గాంఢాంధకారము గవిసి యుండెను. ఉఱుములు మెఱుపులు విపరీతముగ నుండెను. ఆ రాత్రి పదుకొండు గంటలైనంతనె గొప్ప వానకుఱియ నారంభించెను. సంతతధారగా జోరున వర్షము కుఱియుచుండెను. పిడుగులు పడుచున్నరీతి నుఱుముల ధ్వని నభోభాగమును జీల్చివేయుచుండెను. అనుక్షణమును తటిల్లతలు దుర్నిరీక్ష్యములై వియత్తలమున గోచరించుచుండెను.

ఇదియే మన సాహసమునకుఁ దగిన యుత్తమావకాశము. దీని కంటె వేమడుంగులు భయంకరము లగు నాపదల యందు స్థైర్యము నేను నిలువగలిగి యుంటి ” నని సీజరు పలికెను.

“ధైర్యము నిశ్చయవివేకములు తోడుగా నున్న నసాధ్యమే లేదని ఓటో పలికెను.

“వా రిరువురును వెంటనే క్రిందిభాగము త్రాళ్ళ నూడఁదీసిరి. ఆపట్టు త్రాడు నొకకొనను ఓటో నడుమునకు జుట్టుకొని రెండవకొన వనుకూల ప్రవేశమున గట్టిగ ముడివేసెను.”

“నేను ముందు దిగెద” నని సీజరు పలికెను.

“వలదు. నేను నీకంటెఁ దేలికయైనవాఁడను. నేను దిగి క్రింద నీత్రాటిని బలముగ నీకొఱకు పట్టియుంచెద” నని ఓటో పలికెను.

సీజ రింక నేమియు బలుక లేదు. ఓటో యినుపయూచల నందు నుండి దూరి కిటికీకి జల్లుకొట్టకుండ నేర్పఱచఁబడిన వంపుగల కఱ్ఱ సరంబీపై నెక్కసాఁగెను. వేఱొక దారిలేదు. అతఁడు దానిపై నెక్కి భూమ్యాకాశములకు మధ్య భూతలమునకు నేఁబది యడుగుల యెత్తున వాయుపథమున వ్రేలాడుచుండెను.

దాని నంతను పరిబాలాందోళనముతోఁ దిలకించుచు సీజరు కిటికీ ప్రక్కనే నిలిచి యుండెను. కొంతసేపటికి తన చెంత నున్న త్రాటియ ర్ద్దపు వగు లిచ్చినట్లు కనఁబడెను. దాని నాతఁడు లాగగాఁ క్రింద నుండి ఓటో యిగకట్టెను. అతఁడు సురక్షితముగ క్రిందకు దిగె నని సీజరు గ్రహించుటకు ఓటో యేర్పఱచిన సంజ్ఞ అదియే. పిమ్మట సీజరు కూడ నారీతినే పాశసహాయమున పదినిముషములలో ఓటో నిలువ గలిగెను.

ఆక్షణమునందే కావలి భటుఁడు మెట్లపై దిగుచుండఁగఁ బెద్ద మెఱుపు మెఱసి వెంటనే గాఢాంధకార మయ్యెను. ఆమెఱుపువెలు

తురున వారి నాతఁడు చూచి ,, ఎవరు మీరు కదలకుఁ '' డని పలికెను గాని వారిని గుర్తింపఁ జాలకపోయెను.

మహాసాహసికుఁ డగు సీజ రొక్క-దాఁటున నాయోధుని పైఁబడి నేలఁ గూలఁ ద్రన్నెను. ఆతఁడు నేలఁ గూలుచు ,, ప్రబల మగుమోసము ! మోస మని పెద్ద యెలుఁగున నఱచెను. ఆ భీకరధ్వానము క్షణికమున దుర్గమునం దంతటను బ్రతిధ్వనిత మయ్యెను.

దానిని సైనికు లందఱు నాలకించిరి. ఎందుజూచినఁ గరదీపికలు కదులాడుచున్నట్లు కనఁబడుచుండెను. మోసము మోస మ॥ను నినాదము నలుదిశల వినఁబడుచుండెను. పదధ్వానమును ఖడ్గముల చప్పుడును సైనికనినాదముతో మేళవించెను. పలువురు పలు వంకలనుండి దీపములఁ బూని కడువడిగ వచ్చుచుండిరి.

,, రమ్ము. మన మిపుడు పలాయనము కాకున్న మరణము తప్ప'' దని ఓటో పలికి మలుపు తిరిగి సీజరుతోఁగూడఁ గటికచీఁకటిలో గలిసి పోయెను.

## ౨౮

ఓటోపియనల్లా సీజరు లటు లాయంధకారమునఁబడి నడువసాఁగిరి. ఓటో కామార్గములన్నియు బాగుగాఁ దెలిసినట్లు తోఁచుచుండెను. సీజ రంధప్రాయముగా నాతనివెనుకఁ బోవుచుండెను.

ఆలసించిన నపాయము తప్పదు. మన మిటులే త్వరపడి నడువవలెను. వా రందఱును మనవంకకు వచ్చునంతలో మనము వారి కందకుండఁ బోఁగలుగవచ్చును. ప్రాకారకుడ్యములనుండి క్రిందకు దిగి కందకమును సీది దాఁటి పోవుట తప్ప వేఱుసాధనము లే '' దని ఓటో రహస్యముగఁ బలికెను.

,, పద పద. తప్పించుకొని పోవుటయో, ప్రాణమును వదలుటయో జరుగవలెఁగాని మరల వారివశమగుటకల్ల '' అని సీజరనెను.

"ఆహా! దీపము లీవంకకే వచ్చుచున్నవి. యోధభటు లపుడే ప్రాకారకుడ్యముపై కెక్కిరి. రమ్ము."

అని పలికి ఓటో సీజరు చేతిని విడువకుండఁ బ్రాకారమార్గమునఁ బోవుట మాని దీపములు కనఁబడుతావునకు దూరముగ నింక నొకచోఁ బ్రాకారకుడ్యమును జేరఁజనెను. అట కేఁగినంతనే మహావేగమునఁ జేతనున్న పాశము నొకశిలాశకలమునకు గట్టి ఓటో దాని సహాయమున నిర్గమింపసాఁగెను. తోడనే సీజరుగూడ నతని ననుసరించెను. వా రిరువురును జాలలోతుగ నున్న కందకమున దిగి యీదుకొని పోవుచుండిరి.

అంతలో వంతెనను బిరానవ్రాల్చిన పెద్దచప్పుడు చెవులఁబడెను. ఆసారథి వారి కనతి దూరముననే యుండెను. చాలమంది యోధు లొక్కసారి వంతెనపైఁ బరుగిడుచున్నధ్వని వినఁబడెను. వెంటనే యావలిగట్టున వడివడిగ దీపములు కదులాడసాఁగెను.

అప్పటికి వారు లోతునీళ్ళనుండి యవ్వలిగట్టున కతిసమీపమున నిలచి యుండిరి గావున సైనికులచేతి దీపములకాంతి వారిపైఁ బ్రసరింప దయ్యెను.

మన మిపుడు వంతెనకడకేబోయి దాని కమర్పబడిన కమ్ముల సహాయమున పై కెగబ్రాకుటయే గతి. దుర్గముఖద్వారమునకు లోన యోధులు కావలి యుండుటచేనే ప్రాంతమును బరికించు టనవసర మని భటులు తలంతురు గావున నది మన కనుకూల " మని ఓటో పలుకగ సీజరుకూడ నంగీకరించెను.

ఆకందకపుగట్టు తిన్నగా నిరువదియైదడుగుల యెత్తు గలిగియుండుటచే వారు దానినీడనే నడువసాఁగిరి. నీటిలో నడుచుచుండుటచే నీరుకదులాడిననుమానము కలుగునని వారు చాల నెమ్మదిగ నడుగుదీసి యడుగుఁబెట్టుచుఁ బోసాఁగిరి. వారు వంతెనను జేరినాడఁ బైనొక్కరును గనఁబడలేదు. దుర్గద్వారములు మూయఁబడియే యుండె.

భటులు లోపలితట్టునఁ గావలియుండిరి. గావున నీవలనెవ్వరును లేరు.

„ మన కింక భయము లే '' దని పలుకుచు ఓటో వంతెనపైకి కమ్ములసహాయమున నెగఁబ్రాకసాగెను. సీజరుగూడ నతనితోడనే పై కెక్కెను. వారు వంతెనపై నడుగిడినంతనే దుర్గద్వారములు తెరువబడెను. కరదీపికను జేఁబూని యొకఁడు కడునురువడిన్బైకగిడి వచ్చుచుండెను. వెంటనే ద్వారములు మరల పెద్దధ్వనితో మూయఁబడెను.

ఆతఁడు సన్న్యాసి యంగీని దొడుగుకొనెను. గాని ముఖవస్త్రమును ధరింపలేదు. గావున దీపపుకాంతి నాతనిమోము తేటస్పష్టమయ్యెను.

„ అన్సలము—ప్రక్క కొనుగుము. మన కితఁడీపుడె చిక్కగలఁడు '' అని సధైర్యముగ ఓటో పలికినపలుకులు పరమసాహసికుఁడగు సీజరు కమితోత్సాహమును గలిగించెను.

„ ఆహా ద్రోహులు తప్పించుకొని పోఁజూచిరి వారెటులఁ బోగలరు ? మూఁగవానివలె నటించిన యాబాలిశుఁడుగూడ సీజరు వర్గమువాఁడే యైయుండును. ''

అనుమాట లాన్సలమునోట వెడలునంతలో ఓటో యొక్కయురక నాతనిపైఁబడి కుత్తుకను బిగించి „ నో రెత్తితివఁ బ్రాణములు నిలువ '' వని కఠినముగఁ బలికెను. అన్సలము కరదీపికను జారవిడచి పెనగసాఁగెను. గాని ఓటో అతని కంఠమును గట్టిగ నొక్కియుంచుటచే నోట నొక్కమాటయైన వెడల దయ్యెను.

అంతలో సీజరు తనకాలితో దీపమును ద్రొక్కి యార్పివేసి వెనుకనుండి యాన్సలమును బొక్కిపట్టెను. ఆయదననే ఓటో యొక్క కరవస్త్రము నాతనినోట గ్రుక్కెను. తోడనే వా రాతనిఁ దమతో నరణ్యములోని కీడ్చుకొని పోయిరి. వారు కడువేగమున నడుచుటచే నపాయమును దప్పించుకొనఁగలిగిరి. కావున వారచట నిర్భయముగ నిలచిరి.

„నిన్ను కూపిరియాడుటకు నీనోట నున్న చేతిరుమాలును దీసివేసెదను గాని నీ వేమైన కేకలు వేసిన నీకు మృత్యువు సిద్ధము ”

అని ఓటో పలుకుచుఁ గరవస్త్రమును దీసివేసెను.

„ ఆహా! ఓటో పియనల్లా నీవా! యింత చేసితివి ” అని యూన్సలము రహస్యముగఁ బలికెను.

„ ఔను నేనే. నేను మూఁగవానివలె నటించితిని. నీ ప్రియసాధనము లగు కాపట్య దౌర్జన్యములనే నేనుగూడ నవలంబించి నిన్ను వలీల జయింపగలిగితిని. దుర్మార్గులచేత నెప్పటికైన వారినే కట్టి కుడుపఁగలవు. ”

అని ఓటో పలికి యూన్సలము కటిసూత్రమును విప్పి సీజరుసహాయమున నతని చేతులను విఱిచి కట్టెను. అనేక వన్నెపులిని ఓటో యతని రజ్జువుతోడనే బంధించుట కిది రెండవసారి. తొలిసారి పర్వతదుర్గమున నీసారి యీయరణ్యమునను దారిద్ర్యవినయ సూచకముగ నావంచకుఁడు ధరించినపాశము తదీయహస్తబంధన సాధనముగా ఓటోకుపకరించినది.

„ మరల నీవు నన్ను జయించితివి. మరల నేను నిచేఁజిక్కితినిగాని కాల మెన్నటికైన మాఱకపోదు. నీవు నాయధీనుఁడవై నాకటాక్షమునకు బాత్రుఁడవు కావలసినగతిగూడ నచిరకాలముననే కలుగవచ్చు ” నని యూన్సలము ఆగ్రహద్వేషముల నడఁచుకొనఁజాలక పలికెను.

„ న్యాయము మఱియొకసారిగూడ వచింపఁబడుట తటస్థమగునేని అది నాయపరాధమే యగును ” అని ఓటో నిష్కర్షగాఁ బలికెను.

„ ఆరహస్యవృత్తాంతమును సీజరు నికెఱిఁగించనా ” అని పండ్లు పటపటకొఱుకుచు నా యూన్సలము పలికెను.

,, సీజను నీవంటి స్వామిద్రోహితో సంధినియమముల నిలుపువాఁడు గాడు. వదరకుము. లేనిచో నీకండమున స్మృతి తప్పి నేలఁబడగలవని తా నానాడాయరణ్యమునఁ జేఁబూనిన ప్రబలయష్టి నూగులాడించుచు ,, నీప్రాణములనుమాత్రము నేనిపుడు హరించువాఁడఁ గాను నీవెన్నటికైన ఉరికంబముల నూగులాడినఁ స్మృతి నొందవలయు '' నని సీజరు పలుక నాన్సలము రౌద్రమూర్తియై ప్రత్యుత్తర మియ్యఁబూనెను గాని కోపావేశమున సీజరతని బాహువులబట్టుకొని గట్టిగ నూచి విసరివేయుటచే క్రోధాతిరేకమున నొడలెఱుఁగక సీజరు తనప్రాణములం గొనునేమో యని యాన్సలము మిన్నకుండెను.

సీజ నొకప్రక్కను ఓటో యొకప్రక్కను నాన్సలమును గట్టిగఁ బట్టి యుండి రోసెంథాలుదుర్గమువంకకు నడువసాఁగిరి. చాలదూరము సాఁగినపిమ్మట నాన్సల మాకస్మికముగనిలిచి ,, నే నొక సూచనఁ జేసెద వింటిరా '' అని యడిగెను.

,, నిన్ను విడిచి పుచ్చుటకుమాత్రము మే మెన్నటికి నంగీకరింప '' మని ఓటో పలికెను.

,, నే నొకరహస్యము నెఱిగించెద. దానిసహాయమున నీవు మహాధనసంపన్నుఁడవు కావచ్చును. ''

,, అనుచిత మగు నేర్పాటువలన లాభమును బడయుటకు నే నెన్నటికి నంగీకరింప '' నని ఓటో పలికెను.

,, మేరియూరెంకుమూరికినీవుమహోపకార మొనరింపఁజాలుదువు. ''

,, నాసోదరికి నెచ్చెలియు నారాజ్ఞాప్రభ్వికి ప్రియసఖియు నగు నా సాధ్వీమణి కట్టిమహోపకార మొనరింపగలుగుట నాకు సంతసప్రదమే కైనను న్యాయమును విడుచుటకుమాత్రము నే నంగీకరింప '' నని ఓటో పలికెను.

" అది యెంతటిగొప్పవిషయమో గ్రహింపక నీ విట్లను చున్నావు. నీవు నా యనుచరుఁ డగుక్రీస్తును వధించితివి. ఇఁక నా రహస్యము నెరిఁగిన వా రిద్దఱుమాత్రమె కలరు. వారిలో నొకఁడు తన కదిప్రమాదకర మగుటచే దానిని వెల్లడింపఁజాలఁడు. రెండవవాఁడను నేనే. "

" నీవు రెండువిధములఁ బొరఁబడుచున్నా " వని ఓటో కొంచె మైనఁగినియక పలికెను.

ఆక్షణికమునందే యూన్నలము క్రీస్తు పే రెత్తుటచే ఓటో మఱి యొకయూహ పాటినది.

" నేనుక్రీస్తును. ఆత్మరక్షణార్థమై నను జంపలేదు. ఆతఁడాకస్మికముగ నాపై నుఱికెను. నాయశ్వము బెదరి క్రిందఁబడినవానిఁజితుక ద్రొక్కినది. ఆరహస్యమును మీరిరువురును దప్ప నితరు లెఱుఁగరనుకొనుట రెండవ పొరబాటు. క్రీస్తు మరణసమయమునఁ బశ్చాత్తాపము జెంది—"

" నన్నును—ప్రభువునుగూడ వంచించెనా? మారహస్యముల వెల్లడించెనా?" అని కోపాతిశయమునఁ దొందరపడి యూన్నలముపలికెను.

" ఔను. నిజమే. నాచెంత నాపత్రము లున్నవి. వానిని నే నచిరకాలముననే మీరియూసకుఁ గంపఁజేసెదను. "

అని ఓటో పలుక నాన్నలము ప్రకంపితుఁ డయ్యెను. తన కిఁక సర్వాశావినాశన మయ్యె నని యాతఁడు గ్రహింపఁగలిగెను.

" నీవు కాకులకును గ్రద్దలకును నాహార మైతి వని వినగలసంతోషము నా కింకను గలుగ నవకాశ మున్న " దని ద్వేషపూరితుఁడై సీజరు పలికెను.

" రాకుమారా లొంగిపోయినవాని నోనాడుట నీవంటివాని కనుచిత " మని ఓటో పలికెను.

"ఇంతటిమహాపాతకిపట్లనా కనికరమా !" అని సీజరు పలికెను.

"ప్రభువా! నీ ప్రవర్తనముగూడ నిర్దుష్టముగా దని నేను హెచ్చరింపవలసినవాఁడ నగుచున్నా" నని ఓటో పలికెను.

అందుల కాగ్రహముతోఁ బ్రత్యుత్తర మియ్యవలె నని సీజరు తలంచెను గాని యంతలోనే ఓటో చేసినమహోపకారము స్మరణకు వచ్చుటచే నాతఁడు పెదవిగఱచుకొని కినుక నడఁచుకొని మిన్నకుండెను. చాలసేపటివఱకు మరల నెవ్వరును మాటలాడలేదు.

"నే నింక నొకనియమమును సూచింపఁగోరెదను. నన్ను వదలి వేసెద నని నీవు—ఓటో నీవు వాగ్దానము చేయుము. నీ వట్లుచేసితి వేని విహామసంఘమునుగూర్చియు సంఘాధ్యక్షులనుగూర్చియుఁ బరిపాలనవిధానములనుగూర్చియు సభాసమావేశములు జరుగు నెలవులంగూర్చియు వారిహత్యలీజర్మనీదేశములం గంతట నేయేపాంథగృహములందు ఘోరముగ జరుగుచుండునో వానింగూర్చియు, నేను సత్యముగ, సంపూర్ణముగ, నీవుసకలవిషయములను మేక్సిమిలను సార్వభౌమునకు సాకల్యముగ వివరింప వీలగునట్లు ఆసంఘమును సమూలముగ నిర్మూలింప వీలగునట్లు నీకెఱిగించెద" నని అన్సలము పలుక.

"మహాద్రోహీ!" అని సీజరు పలికెను.

"నిజమే. నీవు కృతఘ్నుఁడవు. ద్రోహివి. కావున నీపై నా కట్టి గౌరవమును లేదు. నీచతస్కరాధముఁడుగూడఁ దనతోడిదొంగల రహస్యములను వెల్లడింప నొల్లఁడు. మహాపాతకీ! నీకును నాకును సంధిసాధ్యపడదు. అట్టిదారుణసంఘనిర్మూలన చణమగుసంశయమును గ్రహించి నాస్వామికి విన్నవించుట సంతసప్రదమే యగును గాని నీవలనవినుటకు నే నంగీకరింపను—అంగీకరింపఁజాలను—నిన్ను విడిచి పుచ్చుట కంగీకరించి యారహస్యము నెఱుఁగుట కడునీచము. నీవు

బద్ధుడవు. సార్వభౌముని యాజ్ఞ ప్రకటింపఁబడువరకును నీకీబంధము తొలఁగ" దని ఓటో పలికెను.

కడసారి యాశగూడ విఫలమగుటచే నాన్సలము నిరాశఁజెంది ఘాతుకమృగము రీతి మూఁకత్వమును వహించెను.

మరల నాగు గోసెంథాలుదుర్గమును జేరువఱకు నతఁ డేమియును బలుకనే లేదు. రాత్రి మూఁడుగంట లగుసరికి వా రాదుర్గమును జేరిరి. పిమ్మట నాన్సలమును భటులయధీనముచేసి అతనిని సురక్షిత స్థానమునం బంధించి కాపు గాయవలె నని ఓటో నియమించి సీజనును దనశయనగృహమునకు గొనిపోయెను. వారు మిక్కిలి అలసి యుండుటచేఁ గొన్నిగంటలసేపు నిద్రించి శ్రమదీర్చుకొనిరి.

ఓటో యిట్లాకస్మికముగ వెడలిపోవుటచేఁ బ్రభువు చాల నాందోళనమును జెందుచుండును. అతఁడు మరల వచ్చె ననియు రాకుమారుని విడిపించుకొని రాఁగలుగుటయే గాక యాతని నాదుర్గమున్నం బంధించిన ద్రోహినిఁగూడ బద్ధుని గావించి తేఁగలిగె ననియు, ఆద్రోహి యిపుడు గోసెంథాలుదుర్గమునందే నిరోధమం దుంచఁబడె ననియుఁ బ్రభువు నిదురనుండి లేచినవెంటనే వినఁగలుగుటచే మహదానంద భరితుఁ డయ్యెను.

ఓటో రసాయనిక ద్యుతి వలనఁ గలిగినమాఱుమోమును దొలఁగించుకొని సహజ శరీరకాంతితో నిత్యమును ధరించువసనముల ధరించి ప్రభునిసందర్శించి యానన్సలము నిజవృత్తాంతమునంతయువిన్నవించెను.

మఱునాఁడే వియన్నానగరమునకు అన్సలమును గొనిపోఁగోరెద నని ఓటో విన్నవింప నతని కాపాడుటకును నాన్సలము తప్పించుకొని పోకుండ గావలియుండుటకును వలయు సైన్యమును వెంట బంపెద నని ప్రభువు శెలిచ్చెను.

అందులకు ఓటో సంతోషమును గృతజ్ఞతను వెల్లడించెను. సీజనను

విడిపించిన మహోపకారమునకు తన మనఃపూర్వక మగునానంద మును వెల్లడింప మిక్కిలివెలగల మణిమయకాంచనాంగుళీయకమును బళిభువు ఓటోకొసంగెను. అతని నిర్బంధమున మాట దీసివేయజా లక ఓటో దాని నంగీకరించెను. బహుమానముగఁ గాక ప్రభుని మైత్రికి నిదర్శనము గదా నిర్ధరించుట కెట్టకేల కాతఁ దొడఁబడెను.

ఈలోన సీజరు లూక్రిజామందిరమున కేఁగ నాకస్మికముగఁ దన సోదరు నట్లు చూడగలిగినందుల కామె యెంతయు విస్మిత యైనది. జరిగినవృత్తాంతము నంతయు నాతఁ డెఱింగింపఁ దన ప్రేమను నిరాక రించినందులకు ఓటోపైగల యాగ్రహము నడంచుకొని ఆకుటిల స్వభావ అతని వేలీలల బ్రశంసింప నారంభించెను.

ఆనాఁడె ఓటో మరలఁ దనతల్లిసమాధిని సందర్శించి యచట చక్కగా నమర్చిన శిలాఫలకమును గని చాల సంతసించెను.

అనంతరము పూజ్యుఁ డగు నాగురుపుంగవుని దర్శించి అనుమతి బడసెను.

వెటనుబర్గనందలి తన మిత్రునియింటి కేఁగి యాదరణ పూర్వక ముగ నాతఁ డొసంగిన యాతిథ్యముతోపాటు తా నాతని కిచ్చిన లేఖ లను ధనమును మరలఁ గైకొని యాతనిచే ననుజ్ఞాతుఁడై గోసెంథాలు మార్గమున కేఁగెంచెను.

## ౭౫

వెనుకటి ప్రకరణమున వివరింపఁ బడిన విషయములు జరిగి యాఱు వారము లైనది. మరల రంగము వియన్నానగరమునకు మాఱినది.

వేకువ యైనది. అన్సలము నిదుర లేఁచెను. ప్రబలారిష్ట సూచక మగుస్వప్నముంగని మేల్కొనినవానికి జాగ్రదవస్థయందుగూడ స్వప్న విషయములు మనస్తాపము గలిగించుట సహజము గావున తా నట్టియ వస్థయం దుంటి నని యాతఁడు నిదురమత్తున నూహింపసాగెను. వియ

న్నానగరమునందలి కారాగృహమున చాలసురక్షితమగు బందిగీము నం దాతని నిర్బంధించి యుంచిరి.

ఆర్చిడ్యూకులియపోల్డు జననసమయమునందు వైద్యుని కుట్రకు లోనైనపు డీతనికి మరణ దండన విధింపఁబడెను. ఆసమయమునం దతని నీయరలోనే యుంచిరి.

అతఁ డటుల నిదుర లేఁచి వసనముల ధరించి బోనులో నున్న క్రూరశార్దూలమువలె హుంకరించుచు వడివడిగ నటునిటు తిరుగ సాఁగెను.

మఱికొంత సేపటి కొక యుద్యోగి యాహారపదార్థములం గొని వచ్చెను.

,, మిత్రమా ! ఆల్ప్సుపర్వత మర్గమందు చాలధనమును నేను నిక్షేపించితిని. దానిని నేను తప్ప యితరు లెవ్వరు నెఱుఁగరు. నన్ను దప్పించఁ గలిగితివేని నీ కం దర్ధభాగ మిచ్చెదను. ''

అని అన్సలము పలుక నాయుద్యోగి అసమ్మతి దెలుపుచు శిరః కంపము గావించెను.

,, ఇదిగో ! విను సగముగాదు. అంతయును నీకే యిచ్చెద '' నని యూరక అన్సల మతని బ్రతిమాల సాగెను.

,, నీమాటల నమ్ముటకు నే నంత మతిమాలినవాఁడ నను కుంటివా ? ''

,, నేను ఘోరప్రమాణ మొనరించెదను. ''

" నే నటులే యందు నేని మార్గమధ్యమున నీవు నను గడతేర్ప కుందువా ? చాలు నీయసంగత ప్రలాపమును గట్టిపెట్టుము. తెలికి కిన్ను నాసంగతి తెలియకుండ మాటలాడుచున్నావు. శీఘ్రముగా భోజనము ముగించి నావెంటరమ్ము. కొందఱుగొప్పవారు నీతో మాటలాడఁ గోరుచున్నారు. "

"నా కిప్పుడు భోజన మక్కఱ లేదు. నడువుము."

"నేను ముందు నడువను నా వెనుక నీవంటివాఁ డుండుట చాల ప్రమాదకరము."

అని యుద్యోగి పలుక ఉల్రికుకిన్సు లేక యాన్సలము కోపపరవశుఁ డయ్యు మాఱుపలుకక నడువసాఁగెను. ఉద్యోగి యాతని వెనుకనె నడుచుచు మార్గము నెఱిగింపసాగెను. "ఈస్థలము నీ కపరిచితము కాదు. వెనుక నీ విందు విడిసి యున్నపుడు నే నీయుద్యోగమున లేను. ఉండినచో నపుడుగూఁడ నీచెంతనే వేచి యుందును. ఆశిలా సోపానముల నధిరోహించి పైనున్న ద్వారముఁ దెఱువుము."

అని యుద్యోగి పలుక నాన్సలము తలుపు తెఱచి లోని కేఁగెను. అందు ఆర్చిడ్యూకు లియపోల్డును మేరియాయును జోరానా ప్రభువు ధరన్నాయును జర్మిను ప్రభువును ఇరీనును ఓటోపియ పల్లాయును గూర్చుండి యుండిరి.

వారిం గని యాన్సలము మొగము చిట్లించుకొనెను. గాని ఓటో వంక ఘోర రాక్షసునివలె జూచెను.

"ఉల్రికుకిన్సు, నీవు నా ప్రశ్నలకు సమాధాన మిత్తు వని సమ్మెదను. నీనిర్ణయమువలన నిజజనకుని జనని నిగూడ గోల్పోయిన యా సతీమణికి నీ వొనర్పగల పరిహార మింతకంటె మఱియొండు కనఁబడదు. గావున దీనినిగూడఁ దిరస్కరించు నంతటి కాఠిన్యము నీకు గలుగ దని నేను తలఁచెద" నని లియపోల్డు పలికి మేరియావంక దయార్ద్రదృష్టిఁ బ్రసరింపఁజేయ నాకరుణామయి కన్నీటిఁ గొనగోటి మీటుచుండెను.

"అట్లు నేను ప్రత్యుత్తర మొసఁగిన గలుగులాభ మేమి" అని యాన్సలము నిర్లక్ష్యముగ బలికెను.

"నిక్కము నేను నిర్ణయములకు గడఁగువాఁడ గాను. గాని ముం

సంఘర్షణమున నీప్రవర్తనమునుబట్టియే నీకు న్యాయాధిపతులు విధించు శిక్ష యేర్పడగలదు."

"మీకుఁ గొంత వృత్తాంతము తెలిసి యుండును. దాని నిప్పుడు సాకల్యముగ వినఁగోరుచున్నాను. దాని నంతను నేను వివరించిన మరణదండన లేకుండఁ జేసి, నాప్రాణముల గాపాడెదరా ?"

"నీవు తెలుపువిషయములు సత్యము లని ధ్రువపడినచో నీకు యావజ్జీవకారాగృహవాస శిక్షను మాత్రమే విధించునట్లు నేను సార్వభౌమునికి విన్నవించెదను. ఇంతకంటె నే నేమియు జెప్పఁదగినది లేదు" అని లియపోల్డు పలికెను.

"అటులైన నడుగఁడు. నేను సత్యమునే తెలిపెదను."

"భగవదనుగ్రహమున ఘోరరహస్యము చాలవఱకు విడిపోయి నది. ప్రతీకారము ప్రతీకార మను విజ్ఞప్తి భూతలమునుండి నిజసింహా సనాంతికమునఁ బ్రతిధ్వనింప నాసకలభువనాధినాథుఁ డాలకించె నని గ్రహింపుము. ఎన్నఁడో జరిగిన మహాఘోరముల వెలిఁదీయఁ దన ముఖ్యభృత్యుల నియోగించె ననుటకు నిదర్శనము లగు ముఖ్యవిష యముల శ్రద్ధగా నాలకింపుము."

౧౮౯3 సంవత్సరమున నౌరానా ప్రభ్వని రోసెంథాలు దుర్గము నుండి బలిమిని లిన్సుట్రాపు దుర్గమునకు గొనిపోయిరి. అచట నామెను నిర్బంధించిన మందిరమునం దొక ప్రార్థనాగృహము గలదు. ఆ గృహమున రెండు చిత్రపటము లామెకుఁ గనబడెను. అవి యిటీవలవఱకుఁ నందే యున్నవి. అవి సిగిస్మండు ప్రభువు [illegible] ప్రభురాణుల చిత్రము లగుగా కాదా ! అని రాకుమారుఁ డడిగెను.

,,ఔను. వారివే ''

" ఆప్రభురాణి చిత్రమునకును మేరియాకును గలరూపసాదృశ్య మును థెరిస్సానతి యపుడె గుర్తించెను. కాని యప్పటికామె యా విషయమున కంతప్రాముఖ్యత నొసంగలేదు. ఆమె [illegible]

యొకరహస్య కారాగారము నా మందిర సమీపమునఁ జూచుట గూడఁ దటస్థించెను ఆకారాగారమునఁ గొంతవరకు శిథిలమైన కాగితపుచుట్ట యామెకుఁ గనఁబడెను. నీవు సిగస్మాండుప్రభ్వి వ్రాత వైఖరి నెప్పుడైనఁజూచి యుంటివా? ''

" నేను జూచితిని. నిస్సంశయముగా గుర్తింపఁగలను ''

" అటులైన జేసువకు వచ్చి దీనిని బాగుగాఁ బరికింపుము. ''

,, ఈవ్రాత యాప్రభురాణిదే. ఆమె చాలవిద్యావతి. చాలబాగుగా వ్రాయఁగలదు. ''

అని అన్నలము నుడువ మేరియాదుఃఖ మాపుకొనలేక పోయెను. కాని ఆవిషయముల నాలకించు తత్పరతచే నందుండి వెడలిపోవ నంగీకరింపలేదు.

,, ఆలేఖను ధరస్నానతి చూచి దానిని వ్రాసిన దాప్రభురాణియే యని నిశ్చయించెను గాని ఆమెయే మేరియా జనని యని మాత్ర మపుడు గ్రహింపఁజాలక పోయెను. మేరియా తలిదండ్రులు నిరుపేద లని ధరస్నానతి నమ్ముచుండెను. కొంతకాలమునకు ధరస్నానతి యాలేఖను దన తండ్రికి జూపింపగ మరల ననవసరముగ లిన్సుడ్రాపు ప్రభునితో విరోధము కలుగు నను భయమున నాలేఖను బహురహస్యముగ నుంచినది యని రోసంధాలు ప్రభువు తన పుత్రికకు బోధించెను.

ఎట్లైన నేఁడు యాలేఖ వెల్లడియైనది. దానివలన చాలరహస్యములు విడిపోయెను. ఇటీవల ఓటో లిన్సుడ్రాపు దుర్గప్రాంతమున నగుచుండ నొక ద్రోహి యాతని జంపఁబోయి తానె మృత్యుముఖమునఁ బడెను. కాని యాతఁడు ప్రాణముల విడచుటకు ముందు తన కటిబంధమునందు భద్రపరపఁబడిన లేఖను మేరియా కంపఁ జేయు మని ఓటోను వేడుకొనెను. ఆలేఖ యందలి విషయములఁ జదివెద వినుము.

,, జేనీ! యీలేఖ నీకంటఁ బడుసరికి దీనివ్రాసినవాఁడు సజీవుఁడై యుండఁడు. తాను బ్రతికియుండిన నీవృత్తాంతమును నీ కెఱిఁగించిన నాతఁడు చాల నాపదలకు బాలుపడును. గావున నాతఁడు దీర్ఘనిద్రం జెందినపిమ్మట అతనికి నిరంతరసంతాపకారణ మగు నీరహస్యమును నీవెఱుఁగఁ గలవు. నీవును యితరులును దలంచుచున్నట్లు నీజననీ జనకులు నిరుపేదలుగారు.

నీజనకుఁడు సిగస్మండు ప్రభువు. నీజనని ఇడ్రాగడ సతి. ఇపు డాన్సలము సన్యాసి అనబడునుబ్రికుకిన్సే నీతండ్రిని వధించెను. భాగ్యహీన యగు నీజననికి విషము పెట్టిరి. నీపితృవ్యుఁ డగు మాంటుఫ్గ్డ ప్రోత్సాహమునసే యీరెండు ఘోరములును జరిగెను. నీవు పసికూనవుగ నున్నపుడేల మాంటుఫగ్టు నినుగూడ వధింప నాకాజ్ఞాపించెను. అంతటి కసుగందును జంప జేతులాడక కడుబీద లగు నాబంధుగులకు నేను నిన్నొసంగితిని. వాడే ఆకృషీవలుఁడు. నాతని సతియు వాడు నిను బెంచిరి.

,, విషజ్వరము వలన వారిద్దఱు కొంచె మెంచుమించు నేకకాలమునసే మృతి నొందిరి. నే నాప్రాంతమును విడిచిపోయినందున నీవృత్తాంతము నాకు కొలఁది కాలము క్రిందటివఱకును దెలియదయ్యెను. అపుడు నీవు లియపోల్డు ప్రభురాణి నైతివని యాన్సలము సన్యాసిచే నా కెఱిఁగించెను. అతఁ డెట్లు గ్రహింపఁ గలిగెనో నాకుఁ దెలియదు.

,, జేనీ! నేను పాపకార్యముల నెన్నిటినో జేసియున్నాను గాని వానిలో నా మానసము నధికముగ వేధించుచున్న దిదియొక్కటియె.

,, నే నిప్పు డీజన్మరహస్యమును నీ కెఱిఁగించితిని గావున మదాత్మశాంతికి నీవు ప్రార్థనలను జరిపించెదవుగాక. నామేనఁ బ్రాణము లున్నంత కాల మీలేఖ నీకుఁ జేర దనిమాత్రము నమ్ముము.

హ్యూగో వీలాండు 16_6-1497 ,,

అని ఆలేఖయందు వ్రాయఁబడిన విషయములను తనభర్త చదువుచుండ మేరియాసతి గాఢసంతాపమున మునిఁగిపోయెను. ఆవృత్తాంతమదివఱకే ఆమెకు దెలిసి యున్నను, తన్ను గన్నవారికిఁ గటస్థించిన ఘోరదుర్గతి యామె మానసమును జింకరవంకర చేయసాఁగెను. కాని ప్రియసఖి యగుధెరస్సా చెంతనుండి యామె నెంతయు నోదార్పుటచే గొంతవడి కామెధైర్యాన్విత యయ్యెను.

,, ఈ లేఖలోని విషయము లన్నియును సత్యమేనా?'' అని లియపోల్డడిగెను.

,, అంతయును సత్యమే ''

,, మీ రందఱును వింటిరా? ఇందులకు మీ రందఱును సాక్షులు. మేరియాసతి లిన్సుగ్రాసు ప్రభుకంపతుల పుత్రిక యని యాతఁ డొప్పుకొను చున్నాఁడు. ద్రోహియగు సోదరుని దుస్తంత్రమున నాప్రభువు నాతని పత్నియు ఘోరమరణములకు పాలైరని యాతఁడు స్థిరపఱచెను.

,, కినిసు యిట్టి ఘోరకృత్యములను గూడ వెల్లడింపఁ జేయజాలిన సర్వేశ్వరుని మహిమ మగణ్యము. సజ్జనాగ్రణి యగు ఓటోగూడ నాచిత్రపటములఁ దిలకించెను. ఆప్రభ్వి యాకృతికిని మేరియా రూపమునకును, గలసాదృశ్యము నీతఁడుగూడ గ్రహించెను. కావున నిప్పు డీహత్యలను గూర్చిన వివరముల నన్నిటిని నీవు వ్రాసి యియ్యవలయును. దానిసహాయమున సార్వభౌముఁడు మాన్యస్థను శిక్షాపాత్రుని గావింప వీలగు '' నని లియపోల్డు పలికెను.

,, అటులే వ్రాసి ఱేపటి యుదయమున మీ కందఁజేసెదను. ''

,, ఇటుచూడుము. సచ్చరిత్రుఁడగునీ జర్మినుప్రభుని దీర్ఘకాలము నీవు ఆలప్సుపర్వత దుర్గమున బంధించుటకుఁ గారణ మేమో దెలుపుము. ''

“అలెగ్జాండరుకు పోపుపదవి లభించుటకు పూర్వ మాతని పుత్రుండు సీజరును బుత్రిక యగు లూక్రెజాయును వెనిసునగరమునందు నివసించుచున్న మందిరములోని కీలం డొకనాండేగి కొన్ని రహస్యముల జూచుట తటస్థించెను. వాని నీతండు వెల్లడించి యున్నచో నాకుటుంబమునకుం జాలహానికరము లగు ననుమానములు కలుగుట కవకాశ మున్నది. ఆకుటుంబమువా రప్పటికే యలెగ్జాండరుకు పోపుపదవి లభించుటకు గాను కుట్రల నారంభించిరి. విరోధుల రూపుమాపందగిన విషములను వారు సిద్ధపఱుచుచుండిరి.

అందులకే వారు తాత్కాలికముగ వెనిసునగరమున నివసించుచుండిరి. అందులకే వారికారహస్యముల గూర్చి అంతటిభీతి నేనిపుడు వారిచేం బోషింపబడుచుండుట వలన వారి యాజ్ఞానుసారము నిస్సంశయముగ జర్మినుప్రభువును నాదుర్గమున బంధించితి నని యాన్సలము తెలిపెను.

“ఇట్టి యనుమానము వీరికిగూడ నిదివఱకే కలిగినది. కాని యాసీజరు కుటుంబమున కిపుడు సార్వభౌముడు తన సామ్రాజ్యమున నీడ నొసంగి యున్నాడు. వారికాపట్యమునుగూర్చిన రహస్య నిదర్శనముల నన్నిటిని బూర్తిగాం దెలిసుకొనుట ముఖ్యావసర మని లియుపోల్డు అన్సలము నుద్దేశించి పలికి జర్మినుప్రభునివంక దిరిగి,

“లిన్స్‌డాఫుప్రభుని నిర్బంధించుటకును సీజరును నతని సోదరిని జర్మనీనుండి పాఱంగొలుటకును గూడ నాజ్ఞాపత్రము లొక్క రాయబారిచేతనే రోసెంథాలు ప్రభువునకు పంపంబడును. ఈ విషయమును గూర్చి సార్వభౌముని సంకల్పము నే నిదివఱకే తెలుసుకొంటి” నని లియుపోల్డు పలికెను.

“రాకుమారా లిన్స్‌డాఫుప్రభువు కడు సాహసికుండు. రోసెంథాలు ప్రభువునకు లొంగకుండం గడవఱకు నతండు కాపాడుకొనం జూచు” నని ఓటో పలికెను.

"ఆతని బట్టుకొనుట కతిసుకరమును నిస్సంశయమును నగు మార్గ మొండు గలదు. ఆతనిపై నా కెన్నటికిని గనికరము కలుగదు గావున నాతని బట్టియిచ్చుటకు నేనే కారణభూతుఁడ నైనను నా కెట్టి చింతయును గలుగదు." అని అన్సలము పలికెను.

"అది యేమో తెలుపు" మని ఆర్చిబ్యాల్డు ప్రశ్నించెను.

అందుల కాతఁ డెట్టి ప్రత్యుత్తరము నీయక బల్లచెంతఁగూర్చుండి

"హెర్మను! ఖడ్గపాశములు సాక్షిగా నీ కాజ్ఞాపించున దేమన నీవు మాంటుఫర్డును పాంథగృహమునకు రావించి యీ లేఖను గొని వచ్చిన వారి వశము చేయుము. దీని నతిక్రమింపకుము.

అన్సలము"

అని వ్రాసెను.

"రాకుమారా! దీనిం జదువుము. యీ హెర్మను పాంథగృహ యజమాని. నాయాజ్ఞ నుల్లంఘింపఁ జాలఁడు. వెహముసంఘునాయకుఁడు కారాగృహబద్ధుఁ డయ్యున్నను నాతని యాజ్ఞ యమోఘము గావున నీసాధనము వలన నాప్రభుని కడు సులభముగాఁ బట్టుకొన వచ్చు" నని యాన్సలము పలికెను.

"నే నా హెర్మనును నా బాల్యమునుండియు నెఱిఁగి యున్నాను గాని యాతఁ డీసంఘమునందు సభ్యుఁ డని మాత్రము నా కిప్పటి వఱకును దెలియ" దని ఓటో పలికెను.

"ఈ సంఘమున సభ్యత మహాగౌరవమని యాతఁడు వెల్లడించు కొనునా? నేను వ్రాయవలసిన విషయములు చాలఁ గలవు కావున నీక నన్నడుగవలసిన దేమియు లేనిచో ననుమతి నొసఁగవేడెద" నని యాన్సలము పలికెను.

ఆర్చిబ్యాల్డు కనుసన్న గ్రహించి యుద్యోగి అన్సలమును మరల కారాగృహమునకుఁ గొనిపోయెను.

మఱునాఁడు మరల నామందిరమున నే వా రందఱును సమావేశ

మైరి. అన్సలము తన యపరాధముల నన్నిటిని సవివరముగ వ్రాసి యిచ్చెను.

౨౮

వియన్నానగరమహోన్నతన్యాయస్థానమువారు నాకు నిరువది యేఁడు వత్సరములక్రిత మురిశిక్షవిధించిరి. ఆ యపరాధమును, విచారణను, శిక్షను గూర్చి నేనిపు డేమియును వివరింపనక్కఱలేదు. ఆవిషయము లందఱికిని వెల్లడి యైనవే. ఆనాఁ డుదయమునం దురికంబముల కైదుగురిని వ్రేలాడ దీసిరి. వైద్యుని, నాతని భార్యను, సోదరిని, నాసోదరిబిడ్డ నారాత్రి రాజమందిరమునకు గొనివచ్చిన స్త్రీని, నన్ను గూడ నురిదీసిరి. నాకు స్మృతి తొలఁగెనే గాని ప్రాణములు పోలేదు. నేను గూడ దక్కిన వారితోపాటు మృతి నొందితి ననియే యెల్లరును భావించిరి. ఆరాత్రి వైద్యునింట నా శవముల మధ్య నున్న నాకు మరల స్మృతి వచ్చెను. కొంచెము కొంచెముగా విషయములన్నియు స్మరణకు వచ్చి కుడిప్రక్కకుఁ దిరుగ నచట నొకశవము కనఁబడెను. ఎడమప్రక్కకుఁదిరుగ నచట వేఱొక శవముకనఁబడెను. నన్నుగూడ నొక శవముగ భావించి రని గ్రహించి లేవఁ బ్రయత్నించి కొంతసేపటికి లేవఁగలిగితిని. నాతల తిరుగసాఁగెను. కనులు పచ్చబడుచుండెను. నాలుగు శవములు నాప్రక్క నుండుటనుఁగనియు విధిలేక మరల నచటనే పరుండి కనులు మూసుకొంటిని. మఱియొక గంటకు నాకు నాలోచనా శక్తి పూర్తిగా మరల కలిగినది.

మఱియొక గంటకు లేచి నడువఁగలిగితిని. బలమును ధైర్యమును గలుగ సాఁగెను. వెడలిపోవుట సుకర మని తోఁచెను. తలుపు చేరవేయఁబడియుండుటచే దానిం దెరచి ప్రక్కగదిలోనికి పోతిని. అచట నొక అంగీ కనఁబడినది. అప్పటికి సాయంతన మగుచుండెను. చీఁకటి పడగనే శవములను బరీక్షింతు రని నే నెఱుఁగుదును. ఇఁక నచట నిలువఁగూడ దని తలంచితిని. అచట నొక చిన్నయలమారులో శస్త్ర

సాధనము లుండెను. నే నింక నొక కొంత కాలము స్మృతిలేకుండ నున్నచో విగతజీవుఁడనని తలంచి వైద్యుఁడు నా శరీరమును ఛేదించి చంపి యుండును గదా యని తలఁచినంతనే నాకు జాల భీతి కలిగినది. వానియం దొకముఖపట్టము దొరికినది. యంగీని ముఖపట్టమును ధరించి సులభముగ చెరసాల నుండి వెలికి పోగలిగితిని. ఏలయన వైద్యుని యింటిచెంతఁ గావలి భటులు లేరు.

వియన్నానగరమును దాఁటినతోడనే నా కానాఁ డపరిమిత మగు నానందము కలిగెను. కాని నా కధికమగు క్షుద్బాధ కలిగి మూర్ఛ రాసాఁగెను. నా చెంతి నొక్క కాసైన లేదు. ఆ అంగీని అమ్మివే యవలె నని తలఁచితిని. లోన నాకుఁ దొడిగింపబడిన జీర్ణవసనము లుండెను. నన్ను జెఱసాలయం దుంచిన వెంటనే నా కాదుస్తుల నిచ్చిరి. వియన్నా కనతిదూరమున నొక గ్రామ సమీపమునం దొక చెట్టునీడ విశ్రమించితిని. తూర్పురేఖ లారువఱకు నే నచటనే యుంటిని. అంతఁ నే నాయంగీని దీసి చూడ దాని జేబులలో నొకదాని యందు గొన్నినాణెములు కనఁబడినవి కావున నే నాయంగీ నపుడు విక్రయింపక యాధనముతో నాహారమును బడయఁగలిగితిని.

భావికర్తవ్యము నా కేమియును గోచరింప దయ్యె. సోమరినై దారిద్ర్యము ననుభవించుచు నడఁగి యుండుట • నా స్వభావమునకు విరుద్ధము. నే నెందరి పేరులనో స్మరించితిని. మాన్ఫ్రెడ పేరు నాకు జ్ఞాపకమునకు వచ్చినది. అతని తండ్రి వృద్ధుఁ డగు 'లిన్సుగ్రాఫ్ప్రభు వప్పటికి సజీవుఁడై యుండెను. అంతకు రెండేండ్ల క్రితము మాన్ఫ్రెడ డాన్యూబుసేనయం దైచ్ఛికసైనికోద్యోగిగాఁ బనిచేసెను. నే నతని యధికారమునకు లోనైన సైనికుఁడనై యుంటిని. అతఁడు మద్యపాన మొనరించినపుడు రహస్యముల నన్నిటిని వెల్లడించుచుండును. ఇతర వేళలలో మౌనము వహించుచుండును. ఒకనాఁడు నే నతని కత్యల్ప మగు నుపకృతి నొనరించితిని. గావున మద్యమును గ్రోల న న్నా

తఁడు పిలచెను. సంస్థానాధిపతిపుత్రుఁ డగునతఁ డొక సామాన్యసైని కుఁడ నగు నాయం దట్టి గౌరవమును చూపినందులకు నేను కృతజ్ఞ తను దెలిపితిని. ,, నేనును నీవలెనే ధన గౌరవములకు దూరుఁడనై యున్నాను. సంస్థానాధిపతి పుత్రుఁడనైనను నేను జ్యేష్ఠుఁడను గాను. కావున నా కెట్టి లాభమును గలుగదు. ఆ ప్రభుత్వము నా సోదరుని వశ మగును. నే నాతని దయాధర్మభిక్షార్థినై యాశ్రయింప వలసి యుండును.'' అని మాంటుఘ్యు కడు విచారముతోఁ బలికెను. నానిం బట్టి యాతని యూహలు నా కించుక సొడగట్టెను. మఱికొంతకా లమున కాసేన నిలిపివేయబడెను. నన్ను వియన్నానగరమున కంపిరి. మాంటుఘ్యు తన తండ్రి చెంత కేఁగెను. ఆవల నాతని వృత్తాంత మేమయ్యెనో నాకుఁ దెలియదు.

ఈ యవస్థయం దాతని పేరు జ్ఞాపకమునకు వచ్చెను. ఇట్టితెరి నాతఁడే నావంటివాని నాదరింపగలవాఁ డని తలంచితిని. కావున నేను వెంటనే లిన్సుడ్రాపుకు బయలు దేరితిని. దీర్ఘప్రయాణ మగు టచే చాల శ్రమపడి యాదుర్గము జేరితిని. ఆ దుర్గమున వృద్ధుఁడగు ప్రభువును నాతని యగ్రసుతుఁడు సిగిస్మండును నివసించు చుండిరి; మాన్టఘ్యు వారితోఁ గలహించి అనతిదూరమునం దొక చిన్న గృహ మున నివసించుచున్నాఁ డని విని నే నచటి కేఁగి యాతనిఁ జూడఁ గలిగితిని. ఆతఁడు నన్నుచూడగనే యానందోళనముతో ఉలికికిన్నను వానిని వియన్నానగరమునం దురిఁదీయ లేదా యని నా మొగమువైపు వాలుపట్టి పలికెను. నేను నాయుదంతము నంతయు నెఱిఁగించి నన్ను పోషింప వేడితిని. తాను ధనహీనుఁడ ననియుఁ బోషింపజాల ననియు నాతఁ డనెను. ధనహీనుడవు గావుననే, పరాధీనుఁడవుగా వుననే ధనమును బడవిని గూడ బడయఁ బ్రయత్నింపఁ దగు నని నేను పలికితిని. నీకు సాహస మున్న నేను తోడ్పడెద నంటిని. అం

తట మాకు భావసమ్మేళనము కలిగినది. ఫెలిక్సుజెట్టరను పేరుతో నే నతనిచెంత నుంటిని.

అతని పట్ల నత్యంత విశ్వాసముగల యనుచరుండు హ్యాగో యనువాఁ డొకఁ డదివఱకె యుండెను. అతఁడే పిమ్మట ప్రెట్జను నాఁటు పేరు పెట్టుకొనెను. హ్యాగోకు మాన్ఘుపై నత్యధిక మగు భక్తి యున్నను దుష్కార్యముల నొనరించి యతనికి ధనమును వదవిని చేకూర్చవలె నను తలంపు హ్యాగో కెన్నఁడును గలుగ లేదు. గాని మే మతని సులభముగ నతనిని త్వరలోనే మా కనుకూలునిగా జేయగలిగితిమి. సిగస్మండును పరిమార్ప మేము నిశ్చయించితిమి. అందులకు మాన్ఘునకు సంశయమేమియును లేదు గాని తన తండ్రి జీవించి యుండగా నట్లాచరింప నతఁ డిష్టపడ లేదు. మాన్ఘుని దుస్స్వభావము నాతనితండ్రి పూర్తిగా నెఱుఁగును గావున సిగస్మండట్లు చనిపోయినచో నది మాన్ఘుని దుష్కృత్యమే యని యా వృద్ధుఁడు తప్పక నిశ్చయించు నని మాన్ఘుఁ డంగీకరింపలేదు. కాలము నడచుచుండెను. మాన్ఘుఁడు సందేహమున నూగులాడుచుండెను. ఇట్లు రెండు వత్సరములు గడచెను. పరమోదారస్వభావుఁ డగు సిగస్మండు ప్రయత్నము వలనఁ దండ్రికిని మాన్ఘునకును మరల సమాధానము కుదిరినది. మాన్ఘుఁడు మరల దుర్గముననే నివసింప నేఁగెను. ఆతనితో మే మిద్దఱమును గూడ వెళ్ళి యుంటిమి.

మాన్ఘునను మరల నతనితండ్రి దుర్గమునకు రాపించినను నాతనికి సిగస్మండు పైననే ప్రేమ మెండు. తఱచుగ నావృద్ధుఁడు మాన్ఘుని ననాదరము నొనరించుచుండెను. సిగస్మండు సజ్జనుఁడు, ఉదారుఁడు, మాన్ఘు డన్ననో స్త్రీలోలుఁడు, దుర్వ్యసనాసక్తుఁడు, క్రూరస్వభావుఁడు. ఏమైన నేమి తండ్రి తన్ను సరిగ నాదరించుటలే దను నాగ్రహ మత్యధిక మయ్యెను. కావునఁ దన జనకుని నోడించిగూడఁ గడతేర్పవలె నని యాతఁడు నిశ్చయించెను. వెంటనే గాక నింపా

దిగాఁ గృశింపఁజేసి ప్రాణములఁ దీయఁజాలు విషమును గొని యొక నాఁ డాతఁడు దానిని పానపాత్రిలందు గలిపి తండ్రికిని సోదరునకు నొసఁగునట్లు చేసెను. వా రాపానీయము నించుక గ్రోలి దాని యందలి యరుచిచే ననుమానపడిరి. దానింగని మాన్ఫ్రడ్డు కలవరము జెంది వివర్ణుఁడై ,, ఇదియేమో చాల వింతగా నున్నది. నాపాత్రిము నందలి పానీయము చాలరుచ్యముగనే యున్నది '' ననెను. ఆతఁడు గూడ నగుచిని నటించిన వారి కనుమానము కలుగకపోయియుండు నేమో గాని యాతఁ డట్లనగనే తండ్రికతనిపై ననుమానముతీవ్రమై ,,అంతపనియా? అంత సాహసమా? అసంభవము. ఏమో. ఈరెండు విషపాత్రిములను భద్రపఱుపు'' మనియావృద్ధుఁడు తన ముఖ్యానుచ కునితోఁ దెలిపెను. ఆరాత్రి మానుఫ్రడ్డా యనుచరుని గని ఆపాత్రిల లోని మద్యమును పాఱఁబోసి క్రొత్తమద్యమును నింపు మని చాల ప్రోత్సాహపఱచెను. ఆపరిజనుఁ డంగీకరింపకపోవుటయే గాక మఱి నాఁ డావిషయము నాతని తండ్రి కెఱిగించెను. దానితో నాతని సంశయము ప్రబలమయ్యెను. విటన్బర్గునుండి విషపరీక్షకుని రావించిరి. ఆతఁడు పరీక్షించి దానియందు విషము కలుపఁబడె నని స్పష్టపఱచెను. వెంటనే మాన్ఫ్రడ్డును తండ్రి దుర్గమునుండి వెడల గొట్టించి మరల నెన్నటికి నతని మొగము చూడ నని యొట్టుపెట్టుకొనెను.

అతనితోపాటు నేనును హ్యూగోయును గూడ వెడలి పోతిమి. మేము దుర్గద్వారములను దాఁటగనే సిగన్మండు వడివడిగ నేతెంచి ,, సోదరా నే నిన్ను క్షమించితిని. ' సుసంపూర్వకముగ క్షమించితిని. నీకు సద్భావమును గలిగించునట్లు సర్వేశ్వరుని బ్రార్థించెద. నీ పి ధనమును గొనుము ఈ సంచిలోఁ జాల ధనమున్నది. నీ వప్పుడప్పుడు నీపోకడల దెలుపు చుండిన నీ కెట్టి యిబ్బందియును గలుగకుండఁ జూచెద ,, నని పలికి కడువేగముగ లోని కేఁగెను. ,, నాతండ్రిజీ

వించి యున్నంతకాలము నాప్రియత్న మేమియును సాఁగదు. ఆవల—'' అని మాన్ఫర్డు క్రోధహాస మొనరించెను. ''

'' నేను సార్వభౌముని సేనయందు చేరెదను. అందువలన నాసోదరునికి నాపై ననుమానము పూర్తిగాఁ దొలఁగి యతఁడు ప్రమత్తుఁడగును. నేను సన్మార్గమున నవలంబించితి నని విశ్వసించును. మీరిద్దఱు నీప్రాంతముననే యుండి దుర్గమున జరుగు ముఖ్యవిషయముల నెప్పటి కప్పుడు నా కెఱిఁగింపు '' డని అతఁడు వియన్నానగరమున కేఁగెను. నేనును హ్యూగోయును విటెనుబర్గునందు నివసింప సాఁగితిమి.

అప్పు డప్పుడు సిగిస్మండు ప్రభువును సందర్శించుచు నే నపుడే వియన్నానుండి వచ్చితి ననియు మానుఫర్డు సైనికోద్యోగిగా నున్నాఁడనియుఁ జెప్పుచుండువాఁడను. ప్రతిపర్యాయ మాతఁడు నాకధికమగు ధన మొసఁగుచుండెను. నేనును హ్యూగోయును హాయిగా జీవించుచుంటిమి. మానుఫర్డు వియన్నాకు బోయిన మఱిరెం డేండ్లకు సిగిస్మండు యిడ్రెగ్రడాలకు వివాహము జరిగినది. మఱియొక వత్సరమున కతని తండ్రి చనిపోయినందునఁ బ్రభుత్వముగూడ సిగిస్మండు వశ మయ్యెను. హ్యూగో వియన్నాకుఁ బోయి యావర్తమాన మెఱిఁగింప మానుఫర్డ తనితో రహస్యముగా విటెనుబర్గుకు వచ్చెను.

మానుఫర్డు వియన్నానగరమునం దున్నపుడే వెహముసంఘమున సభ్యుఁ డయ్యెను. పిమ్మట సంఘాధి కారులలో నొకఁడుగా నేర్పడెను. నతఁడు విటెనుబర్గుకు రాఁగనే నన్నును హ్యూగోను గూడ సభ్యులను గావించెను. పిమ్మట నతని లేఖ ననుసరించి సంఘమువారతని విటెను బర్గుకు మండలాధికారినిఁగా నియమించిరి. మాఏర్పాటులు పూర్తి యయ్యెను. నేనును హ్యూగోయును విటెనుబర్గునందుంటిమి. మానుఫర్డు లిన్సుడ్రాపు దుర్గమున కేఁగెను. అప్పుడే ఇడ్రెగ్రడాప్రభ్వీకి సుఖప్రసవము కలిగి కన్య జనించెను. మానుఫర్డును

జూడగనే సిగస్మం డత్యాగరమును జూచి దుర్గమునం దాతనికి విడిది నొసంగి అతనికిం గొంత యాదాయమును గూడ నేర్పఱచి సర్వవిధ ముల నాతని సౌఖ్యము నారయుచుండెను. కొన్ని వారముల వఱకును సిగస్మండు ప్రభువు దుర్గమును విడచి రాలేదు. ఆతని సతీమణికి సం పూర్ణారోగ్యము కలిగిన పిమ్మట మరల నాతఁ డేవ్యసనమునకు దాసుఁడో అట్టి మృగయావినోదమును మరల ప్రారంభించెను. ఈ లోన మానుష్గు తరుచు నా చెంతకు వచ్చి కర్తవ్యమును బోధించు చుండెను. సిగస్మండుప్రభుని వధించుటకుఁ దగిన యవకాశమును కనిపెట్టుటయే మాముఖ్య కర్తవ్యముగా నుండెను.

ఒకనాఁడు మాన్డ్గు చేసిన సూచన ప్రకారము నేను దుర్గమున కనతిదూరమున నొకచో పొదలమాటునఁ బండుకొని యుంటిని. కుం టుచున్నగుఱ్ఱమును నడిపించుచు నొక పురుషుఁ డాదారిని నడచుచుం డెను. అతని గుఱ్ఱమున కేదో ప్రమాదము కలుగుటచేఁ బరిజనులు ముందు వెడలిపోవుటచే నాతఁడు వెనుకఁబడి వారిని గలుసుకొనలేక యొంటరిగా వచ్చుచుండెను. అతఁడు పలుసారులు బిగులు నూదెను. ఎవరైన గనఁబడెదరేమో యని గుట్టనెక్కి చూచెను గాని వారి జాడ యేమియును గనబడలేదు. అతఁడు మెల్లన నే నున్న తావు నకు రాగానే పెద్దపులివలె నే నొక్కయురక నతనిపైబడి కైజా కత్తితో బొడిచితిని. అతఁడు హా యని నేలఁగూలెను. కాని నన్ను గు ర్తించి తన సోదరుని ప్రోత్సాహమున నే నేను తన్ను పొడిచితి నని నిశ్చయించి ప్రాణముల విడచెను. నేను వెంటనే ఆఖడ్గమునకుఁ బాశ మును జుట్టి దాని నాశవముప్రక్క నుంచి పోతిని.

పిమ్మట నతని యనుచరులలో వెనుకబడినవా రచట నాశవమును గని దుర్గమునకు గొనిపోయిరి. ఇక్కడ్రగ్డా సతి దుఃఖ మపారము. ఆ మరణవార్త వినఁగనే ప్రబలదుఃఖభారమున నామెకు మతి చెదరిపో యెనని అప్పుడచట నున్న వారివలన నే నావల వింటిని. ఆమెను

స్వీయమందిరమునకు గొనిపోయి వినుఫ్రఢుసతి నామెకు పరిచర్యచేయ నియమించుడని మాన్ఫర్డాజ్ఞాపించెను. వినుఫ్రఢుసతి కడుమాయావిని. ఏయవస్థయందును దన మనోభావ మొక్కింతయు గోచరింపకుండ మెలఁగ జాలునైపుణ్యమా స్త్రీకిఁజాలఁగలదు. ఆమె కొన్నివత్సరముల నుండి యీ దుర్గమునం దున్నది. మానుఫర్డుకు వశవర్తిని. సిగిస్మండు చనిపోయిన మఱికొన్ని దినములకు నేనును హ్యూగోయును మరల దుర్గమున బ్రవేశించి అందే నివశించుచుంటిమి. కన్నియకు తానే సంరక్షకుఁడ నని మానుఫర్డు సర్వాధికారమును వహించెను. సిగిస్మండు పట్ల నభిమానముగలవారి నందఱిని తొలగించి ఆ ప్రాంతమునఁ గల వైహాముసంఘసభ్యులను వారికి బదులుగా నియమించెను. కావున నతని కభ్యంతరము లేకుండ పోయెను. ఒకనాఁడు రాత్రి యిల్డిగ్రెడాప్రిఖ్విని కారాగృహమందిరమునకు గొనిపోయిరి. ఆమెకుఁ గావలిగా హ్యూగోను మానుఫర్డు నియమించెను. పసిపిల్లను జంపివేయుట కతఁడు హ్యూగో కాజ్ఞాపించెను. కాని హ్యూగో శిశుహత్య కొడఁబడక యాకసుగందును దన బంధుగులకుఁ బెంచ నిచ్చెను. ఆసంగతి నాతఁడు మే మిరువురమును మానుఫర్డు కొలువు వదలిన పిమ్మటఁ గొంతకాలమునకు నాకుఁ దెలిపెను.

„ మానుఫర్డు, ఇల్డిగ్రెడాను దుర్గాంతర కారావారమందిరమున బంధించెను. ఆతఁ డామె శిశువు వధింపబడె నని నమ్మి దుఃఖాతిశయమున నామెయే తన శిశువును వధించి తా నాత్మహత్యఁ గావించుకొనె నని వెల్లడించెను. పిమ్మట రెండంత్యక్రియలుజరిగెను. మొదటిదానిలో సిగిస్మండుశవమును పేటికయందుంచి కుటుంబ స్మశానమున సమాధిచేసిరి. రెండవ పేటికలో నాతని భార్యాసుతల శవములకు బదులు కొన్ని రాళ్ళను నుంచి సమాధిచేసిరి. ఈ రీతిగా మానుఫర్డుకు ప్రభుత్వము లభించినది.

ఇడ్లెగ్రిడాప్రభ్వి చాల సౌందర్యవతి. మానుఫ్రడ్డు మొదటినుం డియు నత్యంతవిషయవిహ్వలుఁ డగుటచే నామె సౌందర్యమునకు భ్రమఁ జెందెను. అతఁడు స్త్రీల బలిమిం బట్టుటయే యతని తండ్రికా తనిపై సంతతి యాగ్రహము కలుగుటకు మూలకారణము. కొన్నివా రముల వఱకును మానుఫ్రడ్డు తన మరభిప్రాయము నామెకు వెల్ల డింపఁజాలక మిన్నకుండెను. ఆమె దైన్యమునకు లొంగి హ్యూగో యామెకు వ్రాతపరికరముల నంద జేసెను. గాని మానుఫ్రడు డచటికి వచ్చునెడల వానిని జూపవల దనియు నాతఁడు వానిని జూచినఁ దనకు హానికలుగు ననియు మానుఫ్రడ్డు తన్ను వేవిధములఁ గనిపెట్టు చున్నాఁ డనియు హ్యూగో యామె కెఱిఁగించెను. శిశువును వధించిన యుదంత మెఱిఁగింపవల దనియు, నామె దుఃఖమును మరచి మాను ఫ్రడ్డుని కోరికల కనుకూలముగ మెలఁగిన నాశిశువు నామె కొసఁగెడ రని తెలుపు మనియు మానుఫ్రడ్డు హ్యూగో కాజ్ఞాపించెను. ఎట్లయిన నామెకు దుఃఖోపశమనకరము లగు వార్తలను తెలుపుట కాతురప డుచున్న హ్యూగో కీ యాజ్ఞ చాల ననుకూలముగా నుండెను. హ్యూగోనుగూడ మానుఫ్రడ్డు నమ్మఁజాలక యతఁ డామెచెంత కేఁగి నపు డేమిపలుకునో విను మని నన్ను గూడఁ బంపసాఁగెను. అత్యంత విశ్వాసపాత్రులను గూడ నాతఁడు నమ్మఁజాలఁడు.

ఆమెభర్త చనిపోయిన రెండు నెలలకు మానుఫ్రడ్డు యిడ్లెగ్రిడా ప్రభ్విచెంత కేఁగెను. ఆనాఁ డేమిజరిగెనో నాకుఁ దెలియలేదు గాని ఆతఁ డమితాగ్రహముతోఁ దన గదిలోనికి వచ్చి యాకోప మునంతయు నాపైనను హ్యూగోపైనను వినుగ్రహుసత్తిపైనను జూపిం చసాఁగెను. అది ఎల్లప్పుడు నాతని స్వభావము. ఆతని రహస్యముల నన్నిటిని బూర్తిగా నెఱిఁగినవారము మేము ముగ్వురమే యగుటచే మాపట్ల నాతఁ డడఁకువను జూపవలసి యుండినను గూడ నాతఁడు దాని గమనింపఁజాలకుండెను. మఱిరెండు దినములకు మరల నాతఁ

డాపట్రిష్వ మందిరమున కేఁగెను. ఆమె నన్ను బరిహసించినది, నిం
నించినది, తిరస్కరించినది. మూఁడు దినములు గడువిచ్చితిని. ఆమె
యాలోచన లొంగనిచో నామెగూడ మృతినొంద నేనలయు" నని
యాతఁడు నాతో ననెను. ఆ తృతీయదినము వచ్చినది. కూర్యాగో
కేదో వ్యాధి యాకస్మికముగాఁ గలిగెనని నన్నాపట్రిష్వ చెంతనుండ
మానుష్యు నియమించెను. ఆనాఁడు మధ్యాహ్నము మానుష్యుఁడు కడ
పటి సారి యామె చెంత కేఁగి యొకగంటసేపుండి మరల నాచెం
తకు వచ్చెను. నే నతనికొఱకు దారిలో నొక గదిలో నిలచి యుం
టిని. అతని వదన మతిభీకరముగ నుండెను. ఆమె చావక తప్పదని
యాతఁ డేదో భస్మమును నా కిచ్చి దానిని భోజన పదార్థములందు
గలిపి సాయంకాల మామె కిమ్మని యాజ్ఞాపించెను. నే నాపదార్థ
ముల నామె గదియం దుంచి వెడలి వచ్చితిని. ఆమె నేమేమో
ప్రశ్నింపసాగ నే నచట నిలువలేను. మఱునాఁ డుదయమున నేను
బోయి చూచుసరి కామె మృతిజెంది యుండెను. ఆనాఁడు సాయం
కాలమే మానుష్యును నేను నాశవమును ఆ కారాగృహసమీపమున
నందే పాతిపెట్టితిమి.

అదిమొదలు లా కారాగృహము మూసివేయబడెను. మున్నటి సీజ
రును బంధించుటకు తప్ప నది మరల నుపయోగింపబడలే దని మాను
ష్యు తెలిపెను. సీజరును బంధించుటకో కారాగారమును నేను
నతఁడును బోయి చూడఁ దలుపులు శిథిలమై యుండెను. ఆమె భోజ
నము చేసి వదలిన పాత్రములు మున్నగునవి యటులనే కనఁబడెను.

తన తండ్రియు సోదరుఁడును నాతని పత్నియు నామె పుత్రికయు
గూడఁ జనిపోయిరని యాతఁడు తలఁచుటచే సహజమగు నాతని క్రౌ
ర్యము సమీపవస్తు లగువారి నంటేని గూడ బాధింప సాఁగెను.
అతఁడు దేహానుసంఘమున ముఖ్యాధికారి యయ్యెను. ప్రభుపదవికి
తో డీయధికారము గూడ లభించుటచే నాతఁడు ప్రజలను బీడించు

టకు నిరంకుశాధికారము నుపయోగింప వీలుచిక్కెనది. అతనిదుర్న యమును లోభమును సహింపక ఇన్గ్రిడొసతి వధింపబడిన స్వల్పకాలముననే నేనును హ్యూగోయును అతని కొలువు వదలి పోతిమి. మే మట్లు వదలి యిరువదియొక్క వత్సరములు గడచెను. ఈలోప నాజీవితమున నెన్నియో మార్పులు కలిగెను. వాని నన్నిటిని వివరించు టనవసరము. మేరియారాకుమారి ఇన్గ్రిడొప్రభ్వి పుత్రిక యని నే నెటుల గ్రహింప గలిగితినో దానినిమాత్రమె వివరించెదను.

ఈవత్సరారంభమున నేను రోమునగరమునం దుంటిని. నే నచట హెర్మనను వాని గలుసుకొంటిని. ఆతఁడు జర్మనుప్రభుఁడ నని నటించిన గ్రిగరీవెలస్టే ననువానితోఁ గొంత కాలము వియన్నానగరమునం దుండెను. ఆ హెర్మనే నాకు మేరియారాకుమారిని గూర్చిన వివరముల నెఱిఁగించెను. ఇతని వలన గ్రిగరీ వానిని గలుసుకొని తన కెఱిఁగించె నని హెర్మను నాకు దెలిపెను. ఆమె తలిదండ్రులు నిరుపేదలని యతఁడు వారి పేరుల నెఱిఁగించెను. ఆమె పసితనముననే వారిద్దఱును జనిపోయి రనియు రోసెంథాలు ప్రభ్వి—థెరస్సాసతి జననియీ యనాధబాలికను బోషించె ననియు హెర్మను దెలుప నాకుఁ జాలవింతగాఁ గనంబడెను. సిగస్మండుపుత్రిని దన బంధుగుల వశము చేసితి నని అంతకు పూర్వమే హ్యూగో లేక ఫ్రిట్జు నా కెఱిఁగించెను. ఆబంధుగులపేరులనే యిపుడు హెర్మను వివరించెను. వారికి వేఱు బిడ్డలులే రనికూడ నే నెఱుఁగుదును. అందు వలన మేరియారాకుమారి లిన్సడ్రొప్రుప్రభు పుత్రికయో యని నే నూహించితిని. నేను మేరియారాకుమారి వయసును విచారింప సరిగా సరిపోయెను. ఇది నా కతిముఖ్య మగువిషయ మగుటచే నేను స్వయముగ మాఱువేషమున వియన్నానగరమునకు వచ్చి యొకనాఁడు రాకుమారి తనభర్త భుజమున వానుకొని రాజమందిరము వెడలు సమయమున స్వయముగఁ జూచితిని. ఇన్గ్రిడొప్రభ్వియే పుత్రికారూపమున మరల ప్రత్య

వించె నని ఆకారసాదృశ్యమున నేను వెంటనే గ్రహింపగలిగితి "నని యాన్సలము తెలిపెను.

## ౨౨

సాయంసమయమున నాన్సలము కారాగృహమునందు తన యరలోఁ గూర్చుండి యుండెను.

ఒక్క చిన్నదీపము మాత్రము మినుకు మినుకు మనుచుండెను.

ఆన్సలము వదనము దారుణాకృతిగ గోచరించుచుండెను. నేను మానుష్యమెపైఁ బగసాధించితిని. 'కృతఘ్నతతో నన్ను బాధించిన ఫలము నాతఁడు దారుణముగ ననుభవించఁగలఁడు ఫౌస్టేలరాలేదు? కారాగృహపాలకుఁడు నను వంచించి యుండఁడుగదా ? అతఁడు నా సందేశమును ఫౌస్టుకు దెలిపెనో లేదో ? ,,

,,అని యాతఁ డనుకొనుచుండఁగాఁ గారాగృహపాలకుఁడు తలుపు దీసి ఫౌస్టును లోని కంపి మరల నెంతలో రావలె ,, నని యుడిగెను.

,, మన సంభాషణము దీర్ఘకాలము పట్టునా? నన్నింత యవసరముగా రావించుటకు గల యవసర మెయ్యదియో నా కింత వఱకును గోచరింప లేద,,ని ఫౌస్టుపలుక,

,, పరిభువా నీవు త్వరలోనే వెడలి పోవచ్చు ,, నని యాన్సలము నుడివెను.

,, త్వరలోనే వచ్చెద ,, నని తెలిపి యుద్యోగి వెడలిపోయెను.

,, నీవే దానిని సంపాదింపవలె ,, నని యాన్సలము ఫౌస్టును సమీపించి పలికెను.

,, ఈ యహంభావ ప్రవర్తనమున కర్థ మేమి ,' యని ఫౌస్టు కఠినముగను నిరసనభావముతోను నాన్సలమును జూచుచు తటాలున వెనుక కడుగిడెను.

,, ఓ దురభిమానీ, నీవే యిపుడు నీయహంభావము నడఁచు కొన
వలెను. నాఁడు నీవార్సనీలయెదుట నన్ను పరాభవించిన విషయ
మును నేను మరువలేదు. అపుడే నేను దారుణ మగురీతిని ప్రతీకార
మొనరింపఁ జాలి యుండియు సైరించుటకుఁ గారణము స్వప్రయోజ
నోపయోగమే. నీకు సార్వభౌముని చెంతఁ గల చనువంత నుపయో
గించి నన్నీకారాగార బంధవిముక్తుని గావింప వలయును.''

,, ఓ ఘోరసర్పమా! విషపన్నగమా! చేతనైన నిన్ను నాపా
దహతి భిన్నాభిన్న మొనరింతును గాని నరహంతకుఁడ వగు నిను
విడిపించుట కల్ల!''

,, నీవుకూడ నరహంతకుఁడవుగావా? నీకును యిడాకును గలిగి
నశిశువునకు విష మిచ్చి చంపుటకు నీవు యిడా కనుమతి నీయలేదా?
స్వయముగ హత్యచేయకున్నను ప్రోత్సాహమొనరించువాఁడు గూడ
హంతకుఁడే యగు నని తెలియదా?''

,, నీచుఁడా! ఏల యిట్టి నిరర్థక గాథలచే నను బెదరింపఁజూ
చెదవు?''

,, ఇది నిరర్థకగాథగాదు. పరమార్థ మని నీవే యెఱుఁగుదువు.
అందులకు నాచెంతఁ బ్రబల నిదర్శనము లన్నియు నున్నవి. నీవు
ఇడాకు వ్రాసియిచ్చిన లేఖాప్రయోగమున కంగీక రించుచు
వ్రాసిన లేఖ మున్నగు లేఖలన్నియు నాచెంత నున్నవి. నీ వెంతటి
మహోన్నతపదవియం దున్నను, నిన్నీ కారాగారమునకు నానోటి
తుంపర నిముసమున నీడ్వజాలి యున్నది.''

అని యాన్సలము సగర్వముగఁ బలుక ఫాస్టు తృణీకారసూచక
ముగ చిఱునవ్వు నవ్వెను.

,, నీకు నమ్మకము గలుగుటలేదా? నీయుపపత్ని యగు యిడా
చెంతనుండి గ్రిగరీవెల్స్టేను హరించిన లేఖల నన్నిటిని నేను చదివితిని

ఇదిగో చూడు ” మని అన్సల మొక యుత్తరముల కట్టను దీసి చూపెను.

“ నాకు దుర్యశమును ఘటింపజాలిన లేఖలు నీచెంత గలవని నేను దెలుసుకొంటిని. వాని యాధారమున నీవు పెంచుకొనుచున్న యాశావిశేషములను గూడ నేను గ్రహించితిని. కాని నేను వానిని లెక్క చేయను. నేనాయుత్తరములకట్ట నొక్క నిముసమున భస్మీభూతమొనరింపగలను. పసిబిడ్డ చేతిలోని మధురపదార్థము బలశాలి అవలీల హరింపగలుగునట్లు క్షణీకమున నీ చెంతనున్న కాగితముల కట్టను నేను హరింపగల ” నని ఫాస్టు నిర్లక్ష్యముగ మాటలాడెను.

“ కారాగృహవాసమున నాకుం జిత్తభ్రమ కలిగిన దని భావించి నీ విట్లు పలుకుచుంటివి గాంబోలు. నీవిషయమున నతివిచిత్రము నత్యాద్భుతము నగు చందము కొంత గలదు. ఎన్నండో అతిరహస్యముగ జరిగిన నామరణదండన వృత్తాంతమును నీ వానాండు రోమునగరమున నెట్లు తెలుపగలిగితివో నా కిప్పటికిని సుబోధము కాలేదు గాని నీ విపుడు పలికిన ప్రగల్భముల మాత్రము నేను విశ్వసింప ” నని అన్సలము క్రోధముతోం బలికెను.

“ నే నట్లు కల్లప్రజ్ఞ లపచరించువాండం గాను. ” అని కొంచెమైనం జలింపకుండ ఫాస్టు పలికినంతనే యొక యద్భుతతేజ మాయుత్తరములపైం బ్రసరించెను. తోడనే యవి బూడిదె యయ్యెను.

“ ఆహా ! ఏమి యింద్రజాలమిది ? ఏమైననేమి ! నీవాపత్రముల భస్మ మొనరించిన నేమి. నేను నోటజాటి నిను పాపవలకు పాలుజేయక విడుచువాండంగాను నీవు ఇతా నుపపత్నిగా నుంచుకొని నీ బిడ్డ వధకు సహకారి వైతి వను వృత్తాంతమును నీయం దత్యంత ప్రేమాన్వితయగు థెరిస్సాకే మొదట తెలియజేసెదను. నీ విట్టి భయంకరమగు నపవాదమునకు పాలుగా గోరెదవో నీకతిసులభకార్య మగునావిమోచనమున కంగీకరింతువో యోచించుకొనుము. ”

,, ఓసి మహాపాతకీ, కటకాధమా! నిన్ను నే నావంతయైన లెక్క చేయను. చేయఁగలదానిని జేయుము. ''

,, ఈదురాగ్రహమున కావల పశ్చాత్తప్తుఁడవు కాఁగలవు. ఉన్నతపదవియందుండి ప్రజలఁ బీడించువారి నపఖ్యాతికి పాలుజేయుగాథలను బ్రజ లతిసులభముగ విశ్వసించుట సహజముగాన నావృత్తాంతము నెల్లవారును దప్పక నమ్మగలరు. ఇకానతని యాకస్మిక మరణమునకుఁగూడ కారణము నీయందే యారోపింపఁబడును. ఆసమయం దాగరము తప్పి యూసెకు వెడలి జోరానా ప్రభువు తనయుపపన్నిని సంహరించె నని ప్రజలు నీపై నింద మోపెదరు. ''

,, నేఁదలఁచిన నొక్కచిటికలో నీజీవము నెటుల హరింపగలనో అటులనే ప్రజలవాక్స్తంభనమునుగూడ గావింప గలను. ''

,, నీవు నానోరు మూయఁజాలవు. అదుగో యుద్యోగి వచ్చుచున్నాఁడు. ఏమందువు నన్ను విడిపింప-''

,, నేను బ్రాయశ్చిత్తపను '' అని ఫాస్టు పలుకునంతలో నుద్యోగి తాళము దీసెను.

,, అటులైన నేను నిను లెక్కచేయువాఁడఁగాను. ప్రపంచమున కంతకీకిని జోరానాప్రభువు హంతకు-''

అని యాన్సలము పలుకునంతలో ఫాస్టుభయంకరదృష్టి నాతనిపైఁ బొఱిచేయ నాన్సలము వెంటనే నోటమాట లేకుండ చెంతనున్న కొయ్యబల్లపైఁ గూలబడెను.

ఉద్యోగి లోనికి రాఁగా ఇతని కేదో యాకస్మికవ్యాధి కలిగినట్లున్నది. వైద్యుని బిలువనంపుడు నని ఫాస్టు పలికెను.

అటులనే చేసెద నని యాయుద్యోగి యాన్సలము చెంత కేఁగి చూడ నాతనితల యాబల్లపై ముందునకు వ్రాలియుండెను. కొన్ని

నిముషము లతఁడు పరీక్షించి ,,ఇతఁడు మృతి నొందెను. ఉల్రికుకిన్సు నామావశిష్టుఁ డయ్యెను. చివరకు భూతనాథుఁడు తన ప్రియభృత్యుని దన చెంత జేర్చుకొనె'' నని యుద్యోగి పలికెను.

ఫౌస్టేమియును బలుకక సావధానముగా నడచిపోయెను.

౨౮

మేరియాసతి యుత్తమవంశ సంజనిత యని వెల్లడియగుటచే నావృత్తాంత మామెకును నామె భర్తకును మిత్రులకునుగూడ సంతసమును సంతాపమును గూడఁగలిగించెను. ఆమెప్రభు పుత్రి యనివెల్లడి యైనందులకు సంతసమును ఆమె జననీజనకులు బలవన్మరణములకుఁ బాలైనందులకువిచారమును గలిగెను.

,,నాజననీ జనకుల యాత్మలకు సర్వేశ్వరుఁడు శాంతి నొసఁగుగాక'' అని ఆమె నిర్మలభావముతో సర్వేశ్వరుని బ్రార్థించెను.

,,ఈవృత్తాంతమును విన్నవారిలో జింతావేశమైన నెఱుఁగక యపరిమితానంద భరితుఁడైనవాఁడు మార్గిమిలనుసార్వభౌముఁ డొక్కఁడే. అది మొదలు రాజకుటుంబమువారి కందఱికిని మేరియాసతిపై గౌరవము హెచ్చయ్యెను.

క్రిష్టినుబ్రాసిన లేఖయు నాన్సలము వ్రాసిన వివరములు గల పత్రమును ఇర్దెగ్రడా ప్రభ్వి స్వయముగా వ్రాసిన యుత్తరమును బలిష్ఠము లగు నాధారములుగ నేర్పడుటచే వుల్రికుకిన్సు ఆకస్మికముగ మృతినొందినను లిన్సుడ్రాఫు దుర్గమునుగూర్చి మేరియాసతి హక్కున కెట్టిభంగమును గలుగలేదు.

కాని తనపితృవ్యుఁ డగు మానుఫర్డు విషయమున మేరియా యతనికనుకూలముగఁ దనభర్త కెంతయో విన్నవించెను. అతఁడు నాగలి చంద్రుల నిరువురనుగూఁడ హంతముొనరించిన మాటనిజమే,

అట్టివానిపై నాకెటుల కనికరము కలుగఁగలదు? నేను జీవించియుండుటకుగూడ నాతని కనికరము కారణముగాదు. అయిన నాతఁడు నా బాంధవుఁడు, నాజనకుని సోదరుఁడు ''

,, నీయుదార భావమునకు నే నెంతయు సంతసించి ప్రశంసించు వాఁడఁగాని యాతఁ డొనరించిన ఘోరకృత్యము లపరిమితము లతి దారుణములు గావున మానఫర్డును శిక్షింపక విడచుట జర్మనుసామ్రాజ్యధర్మసూత్రములకును న్యాయస్వరూపుఁ డగు నాపితృవ్యుని సింహాసనమునకునుగూడ నవమానకర మగును. ఆతని బందీనిగాఁ బట్టుకొనక తీరదు గాని ప్రాణమును మాత్రము కాపాడవచ్చును. ఆతఁడు జీవిత శేషమును పశ్చాత్తాపప్రార్థనలతో గడుపవలెను. అందులకు గారాగారమే యుత్తమస్థానము''

అని యామెభర్త పలుక నామె మఱియేమియును జెప్పజాలక యూరకుండెను. కొంతసేనతో ఓటో మానుఫర్డును పట్టుకొనుటకు బయలుదేరెను.

ఆన్సలము తెలిపినసంగతులును వెల్లడియైన యితర రహస్యములును కెంబర్గుప్రాంతమువారికి తెలియుటకు ముందే అచటికి చేరవలె నని వా రహర్నిశలు విరామములేకుండ ప్రయాణమును సాగించిరి అవృత్తాంతమును మానుఫర్డు వినఁగలిగెనేని యాతఁడు దుర్గద్వారమును బంధించి కడవరకును దానిని గాపాడక విడువఁ డనిఓటోకుఁ దెలియును.

ఆకాలమునవార్తాపత్రికలు లేవు. ముద్రాయంత్రము లసమగ్రములుగా నుండెను. టపాకార్యాలయముల యేర్పాటు లేనేలేదు. కావున నప్పు డిట్టివార్తలు ప్రయాణీకుల వలన మాత్రమే తెలియవలసి యుండెను.

కావున నావృత్తాంత మావంతయు కెంబ్లం ప్రాంతవాసులకుఁ దెలియుటకుముందే ఓటోయను నాతని సహాయు లగుపన్నిద్దఱు యోధులను హెర్మనుపాంథగృహమును జేరగలిగి రన్ననాశ్చర్యముకలుగ బనిలేదు,

ఓటోను యోధులును అన్సలమువ్రాసిన యాజ్ఞాపత్రిమునుగని హెర్మను చాల విస్మితుఁ డయ్యెను.

,, అన్సలముస్వామి యాజ్ఞను తప్పక నెఱవేర్చెదను గాని యీ ప్రయత్న మేమో నేను గ్రహింపఁజాలకున్నా ,, నని హెర్మను ఓటో తోననెను.

,, ఏమియు నడుగవలదు. నీకా యాజ్ఞాపత్రమున విధింపఁబడిన కార్యము నతిశీఘ్రముగ విశ్వాసముతో నెఱవేర్పుము. త్వరలో వదంతులు వేయివిధముల వ్యాపింపఁగలవు. నీవీవిషయమున నేదైన దుస్తంత్రమునకు గడఁగితివేని ప్రాణములగోల్పోయెద వని మాత్రము హెచ్చరించుచున్నాను. దీర్ఘప్రయాణమున గడుబడలి విశ్రాంతి గొనుచున్న యీయోధులు నాయాజ్ఞానుసార మొనరింప సంసిద్ధులు. అన్సలము పంపిన యాజ్ఞాపత్రి మనుల్లంఘనీయ మని నీవు తలఁపనిచో దిరస్కరింపఁజాలని యాజ్ఞాపత్రము వేఱొండు నాచెంతగల ,, దని ఓటో మార్గ్రిమిలను సార్వభౌముఁ డొసఁగిన యాజ్ఞాపత్రముగూడ హెర్మనుకుఁ జూపెను. అత్యంతవిశ్వాసపాత్రుఁ డని మేము పరీక్షించి నిర్ధారణచేసిన ఓటోపియనల్లాను లిన్సుగ్రాఫు మాన్స్ఫెల్డును బంధించు విషయమున సంపూర్ణాధికార మియ్యఁబడెను. అతఁడు కార్యసాధనమున కవసరమును బట్టి యెవరి నైన బంధింపవచ్చును. అతఁ డీవిషయమునఁ గోరినసహాయమును స్థానికసంస్థానాధిపతులు మండలాధికారులు మున్నగువారు తమ సేనలతోఁగూడ నొసంగవలెను. అని యాయాజ్ఞాపత్రమునందున్నది.

„ అసలముసామి యాజ్ఞాపత్ర మొక్కటియే నాకు చాలు " నని యేదో అనిర్వాచ్య మగు భీతివలన వదనము వాడు బాఱ హెర్మను నుడివెను. అతఁ డెన్నియో ప్రశ్నల నడుగఁ గోరుచుండెను. గాని ఓటో వెనుకటిసారివలె నిపుడు స్నేహభావమును జూపకుండుటచే హెర్మను వెఱచి యూరకుండెను.

హెర్మనుగూడ వెహముసంఘాను చరుఁ డని యిపుడు ఓటోకు దెలియుటచే నతఁడు హెర్మనును నిరసనభావముతోను ననుమానము తోను జూడసాఁగెను.

హెర్మను వెంటనే లిన్నుఁగాపు దుర్గమున కేఁగెను. అతఁ డచట మానుషస్తుతో నెట్టిగాథను గల్పించి చెప్పెనోగాని మరల కడువేగము నే మానుషస్తుతోగూడ నిజపాంథగృహమున కేతెంచెను.

మానుషస్తు లోన నడుగిడినంతనె ఓటో అతని యెదుట నిలచి "సార్వభౌముని యాజ్ఞానుసారము నీవుబంధి వైతి " వని పలికెను.

„ ఏమి యీకాండకావరము " అని మానుషస్తు కరవాలమును స్పృశించుచు కోపముతోఁ బలికెను.

వెంటనే మధ్యద్వారమును దెఱచి లోన నున్నయోధులను మానుషస్తుకు చూపి నీ వెదిరించిన ప్రయోజనములేదు. నీకరవాలము నిచ్చి వేయు మని ఓటో పలికెను.

అతఁడు ఖడ్గము నొసఁగుచు „నాపై మోపఁబడిననేర మే " మని యడిగెను.

„ నే నావిషయమును నీకు రహస్యముగా నెఱిఁగించెద " నని ఓటో పలుక మానుషస్తు సౌధోపరిభాగమునకు దారితీసెను. ఓటో అతని ననుసరించెను.

„ మానుషస్తు నీవు నీయగ్రజుని అతని సతీమణినిగూడఁ జంపించితివి. ఆ నేరములు నీ దుష్టసంకల్పమువలన సంభవించె యుంత్యు[illegible]. అభియోగ్యా[illegible]

లియు గోష్ఠిన్నాశి యగు మేరియాసతిని లిన్సు గ్రాఫు దుర్గమున కధి కారిణి. నీవు వంచకుఁడవు. ఆమెను వంచించి ఆమె సంస్థానము నాక్ర మించితివి. ఈ దారుణ కార్యములందు నీకు సాధనభూతులైన దురిత మతులే దైవసంకల్పమున నీరహస్యమును వెల్లడించుటకుకూడ హేతు భూతులైరి. వారే హూంగోయును ఉల్రికుకిన్సును. ”

“ఉల్రికుకిన్సు — అసంభవము! ఆమూఁగవానితో నీజరు పలాయనమైన రాత్రినుండియు కిన్సునాకు మరల కనబడకుండనే పోయెను ”

అని మానుష్టు చిత్తస్థైర్యము నంతను గోలుపోయి తత్తర పాటుతో మాటలు తొట్రుపడఁ బలికెను.

“ ఆయెడ మూఁగవానివలె నటించినది నేనే. ఆరాత్రి కిన్సును గూడ బంది నొనరించిగొని పోయినదియు నేనే. అతఁడటుపిమ్మట తన దుశ్చరితము నంతను వెల్లడించి తనువు దొరఁగెను ”

అను పలుకులు మహాశని సన్నిభములై మానుష్టుని స్తంభింపఁ జేసెను. అతఁడు చైతన్య విరహితుఁడయ్యెను. దుర్నయుఁడు అతి సాహసికుఁడు ధీరుఁడు నోత్సాహియు నగు మానుష్టు క్షణమున దుర్బలుఁడు నధీరుడునై కృంగిపోయెను. అతని కావలియందుంచుట కు యోధుల నిద్దఱిని ఓటో నియమించి మేరియాసతి నియమించిన పవిత్ర కార్యనిర్వహణార్థము వెడలిపోయెను.

అతఁడు అగ్గురుయోధులతో లిన్సుగ్రాఫు దుర్గమున కేగి ముఖ ద్వారము చెంత నిలిచి మాయజమాని సార్వభౌముని యాజ్ఞాను సారము బంధింపఁబడితివి. ఈదుర్గమునకు సత్యముగ యజమానురా లగు మేరియా రాకుమారి పక్షమున దీనిని వశపఱచుకొన నిందు వచ్చితిని. ఆసతీమణి సిగస్మండు ప్రభువునకును యిద్దెగ్రడా ప్రభ్వీకిని గలిగినయేకపుత్రిక యని ఓటో యచటనున్న కోటోద్యోగుల కెఱిగించి కొన్ని పత్రములను నిదర్శనముగ జూపవారు నిర్నిరోధముగ ఓటో ను యోధులను లోనికి జొనిచ్చిరి.

లోని కేఁగినవెంటనే విస్హ్వాంసతిని నిర్బంధమున నుంచుట కాతఁ డాజ్ఞాపించెను. పిమ్మట నతఁ డాయోధులతోను అనుచరులతోను ప్రార్థనాగృహమున కేఁగెను. అనుచరులు గునుపములు మున్నగు పనిముట్లు నాతని యాజ్ఞానుసారము కొనివచ్చిరి.

అచట ప్రభుకుటుంబము వారిశవములను సమాధిచేసిన స్థానమున కేఁగి సిగిస్మందు. ఇల్డిగ్రెడాలశవ పేటికలకొరకు కాగడాలవెలుగున ఓటో వెదకించెను.

ఆస్థానము చాలవిశాలముగ నున్నది. ఆకుటుంబమునకు జేరినస్త్రీలును పురుషులును సుమారు నూటనేబదిమంది యచట సమాధిచేయబడిరి. ఆశవపేటికలు వరుసగా నుంచబడెను. అందు చాలభాగము శిథిలమై బూదిగలసెను. కొంతదూర మేగ మంచిస్థితియం దున్నశవపేటికలు కొన్ని కానబడెను. వానివెనుక సిగిస్మందు ఖడ్గఖేటకములమర్పబడిన శవపేటికయు దానిప్రక్క మఱియొక శవపేటికయుఁ గనఁబడెను.

ఆకడపటిపేటికను ఓటో పగులగొట్టించి వారి కందఱకిని జూపెను చూచితిరా దీనియందు గులకరాళ్ళను మట్టిపెల్లలును తప్ప మఱేమియును లేవు. దీనిపై ఇల్డెగ్రెడా ప్రభ్వియు నామెశిశువగు బాలికయు నని వ్రాసిరి. అని ఓటో తెలిపి అందున్న రాళ్ళను మన్నును బాఱబోసి దానిని ప్రార్థనామందిరమునకుఁ గొనిరండు. దానితోఁ బనికలుగునని అతఁడు వారి కాజ్ఞాపించెను.

పిమ్మట వా రందఱును ప్రత్యేకమందిరమున కేఁగిరి. అందొక ప్రదేశమును జూపి యచట త్రవ్వుఁడని ఓటో నియమింప వారు చాల మెలఁకువతో గడువేగమునఁ ద్రవ్విరి. కొంతసేపటి కొకయస్థిపంజరము గోచరించెను.

,, ఇదియే ఇల్డెగ్రెడాప్రభ్వి శరీరమున మిగిలినది. భాగ్యహీనయగు నీసాధ్వీమణియు నీమె భర్తయు మానుషఘ్నునాజ్ఞానుసారము

వధింపఁబడిరి. అతఁడక్రమముగ నింతకాలము నీసంస్థానమును వశపఱుచుకొని యనుభవించెను. అని ఓటో పలుక దుర్గమునందలి యనుచరులు చింతాకులులై భగవన్నామము స్మరించిరి.

అంతట నాయస్థిపంజరమును మొగములుబట్టలఁ జుట్టి వారచటికి గొనివచ్చి శవపేటికయం దుంచిరి.

అనంతర మాతఁ డొకయాశ్వికునిచేతికి లేఖ నిచ్చి రోసెంథాలు దుర్గమున కంపి తానును నివసింప సాఁగెను.

నాఁడుసాయంకాలము రోసెంథాలు ప్రభువు పరివారముతోను దనపురోహితునితోడను దీర్ఘకాలమునుండి తన ప్రబలశాత్రవుని వశమునం దుండిన లిన్సుగ్రాఫు దుర్గమును జేరవచ్చెను.

ఓటోవలన యావద్వృత్తాంతమును వినినపుడు మానుషఘ్నుఁడొనరించిన ఘోరకృత్యముల కాతఁ డబ్బురము నొందలేదు గాని మేరియాసతి సిగస్మండు ప్రభుపుత్రిక యని నిర్ధారణ యయ్యెనని వినినపుడు మహాత్ముఁడుచాల వింతజెందెను.

ఆరాత్రి పండ్రెండు గంటలప్పుడు ఇద్దఱుగ్రాఫుప్రభ్వుల శవపేటికను విధ్యుక్తముగా సమాధిస్థానమునఁ జేర్చిరి. రోసెంథాలు ప్రభునిపురోహితుఁడు నిర్మలభావముతో ప్రార్థనాదికములగు నంత్యక్రియల నిర్వర్తించెను.

మఱునాఁడు థెరస్సాసతి వ్రాసిన లేఖలను ఓటో రోసెంథాలుప్రభున కొసఁగెను. తనభర్త యిప్పు డెచటికని పోవుటచే ననియు తన కిపుడు చాలసౌఖ్యముగ నున్న దనియు నామె వ్రాసెను. పిమ్మట ఓటో మాక్సిమిలను సార్వభౌముని యాజ్ఞాపత్రము నాప్రభుని కందఁ జేసెను. దానిం జదివి నీ కిందలివిషయములు తెలియునా ” అని యాతఁడు ఓటో నడిగెను.

"ఆయాజ్ఞాపత్రము సీజరునకును యాతని సోదరికిని సంబంధించిన దని తలంచెదను. అతఁడు నాసహాయమున నీదుర్గమునుండి తప్పించు కొనఁ గలిగినపు డాతని పరిజనుఁ డిందు—"

"మిచెలొటో సంగతియా? అమఱునాఁడే యాతనిని మానుఫ్యాస్కు నకలివేసెను. సాధ్యమైనంత త్వరలో సీజరుమున్నగువారు నీదేశ మును వదలిపోవలె నని వారి కాజ్ఞాపించుమని యని సార్వభౌముఁడు నా క్షాత్రమున నం దాజ్ఞాపించెను. ఇందులకు నే నెంత మాత్రమును చింతించుటలేదు. సీజరు నా మందిరమునకు వచ్చిన దాది యాతని రసాయని కౌషధములంగూర్చి నేనా తాతఁడు నాపానపాత్రమున నెట్టి విషము గలిపెనో ప్రాణముల హరించునో యనుభయము నన్న నవరతమును బాధించుచునే యున్నది. అతనిపోకరిం గని యువకు లందఱును మోహావికారమున మైమఱచుచున్నారు. వారి యనుచరుఁ డునిత్యమును సైనికనైపుణ్యములనుగూర్చి నాసేనానితో కలహించుచు నేయుండును. ఇంతయేల? మిత్రమా నా రాదుర్గమును వదలినదినము నాకు బండుగదినమే యగు" నని పలికి ప్రభువు ఓటోను గరస్పర్శ మున గౌరవించి వెడలిపోయెను.

వియన్నానుండి వచ్చిన యుద్యోగిని లిన్సుఫర్గు దుర్గపాలకునిగా నియ మించి ఓటో ప్రార్థనామందిరమున నున్న ఇట్లిగ్రాజ్ ప్రబిల్వ్ సిగస్మండు ప్రభువుల చిత్రపటములను భద్రముగా వెంట గొని రాజపరిచారకులను నియమించి మగల హెర్మను పాంథగృహమున కిద్దరు యోధుల తో మరలివచ్చెను. తక్కిన వలుగురిని విసుఫర్గు దుర్గముననే యుండ నియమించెను. విసుఫర్గుసకునిగూడ నాతఁడు బందీగా పట్టి తెచ్చెను. ఆమె తనమనోభావము వెలిబుచ్చకయు వెల్లడింపక మౌనవతియై నుండెను. కాన హంతకుఁ డగుమానుఫ్యాస్కు నీవు సహకారిణివి" వని ఓటో పలుకుటచే లోలోన నామె చాల వగఁజెందుచునే యుండెను.

"అయ్యో! మానుఫర్డు బలవంతముగఁ బ్రాణములఁ దొరఁగె" నని యోధులలో నొకఁడు ఓటో లోనికిరాగానే తెలిపెను.

"ఎవరు, మాన్సుఫర్డా!"

"మాన్సుఫర్డు మృతి నొందెను. అతనిచెంత మిక్కిలి వాడిగలచిన్న కైజారు గలదు. పదినిముషములక్రిత మాతఁడు దానితో పొడుచుకొని ప్రాణముల వదలెను."

అని యోధుఁడు తెలుపగనే ఓటో మానుఫర్డును నిర్బంధించిన గదిలోనికిఁ బోయిచూడ నాతఁ డచట విగతజీవుఁడై పడియుండెను.

## ౭౯

౧౮౯౭ వ వత్సరమునవంబరు నెలలో ఓటోపియనల్లాయును ఎనమండుగురు యోధులును నిర్బంధిత యగువిన్సుఫర్డుసతియును వియన్నా నగరమును చేరిరి.

ఆమె నాతఁడు కారాగారమున కంపి యార్చి డ్యూకు మందిరమున కేఁగ నాదంపతు లాతని నత్యంతప్రీతితో గౌరవించిరి.

ఓటో వారికి లిన్సుడార్ఫుమార్గమున జరిగిన వృత్తాంతమంతయును విన్నవించెను. ఇల్డిగ్రిడాప్రభ్విశవమును తీసి సమాధిచేసిన విషయము నెఱిఁగించినపుడు మేరియాసతి ధైర్యమును నిలుపజాలకపోయెను. పిమ్మట నాతఁ డామె జననీజనకుల చిత్రపటముల నందజేయ నామె సంతాపము కొంతప్రశాంత మయ్యెను.

ఆపటములు కేవలము నిర్జీవములే యైనను మాతాపితల సహజాకృతులను నిరూపించుచుండుటచే వానిని దిలకించుటవలన నామె ప్రశాంత చిత్తయు భక్తిభరితయు నయ్యెను.

ఆమె భర్తవంకజూడ నాతఁడు ప్రేమాన్వితము లగు లోలలోచనముల నామెపైఁ బ్రసరింపజేయుచుండెను. ఆముద్దియతలిదండ్రుల లాలనము నేనాఁడును బొంది యెఱుఁగకున్నను గాఢతమానురాగ

భరితుఁ డగు ప్రాణనాథుఁడు తన్నుఁ బ్రాణాధికగా నాదరించుచుండుటచే నాతనిప్రేమాతిశయ మన్నిటిని గూడ మరిపింపజాలినదిగా నుండెను. అదియే యామెకు సర్వేశ్వరుఁడు కటాక్షించిన వరరాజము.

వినుఘ్గ్స సతిని న్యాయస్థానమున విచారణచేసినపుడైన నామె యావిషయమును నోట వెల్లడింపదయ్యె. ఆమె నెమ్మోమునం దెట్టి మార్పును గలుగదయ్యె. ఆమెకు యావజ్జీవ మఠనివాసశిక్ష విధింపఁబడెను.

ఓటోపియనల్లా యొనరించిన మహత్కార్యములకు సార్వభౌముఁడు చాల ప్రీతిఁజెంది యాతని నుచితరీతిని గౌరవింప గోరెను. కాని ఓటో తానట్టి బిఱుదమును ఆదాయమును గూడ గైకొనజాల నని సవినయముగ విన్నవించెను. ఆతని చిత్రలేఖానైపుణ్యము జగద్విదితమైనది. ఉన్నత పదవియందున్నవా రందఱు నతనిచే వ్రాయఁబడిన చిత్రముల నపరిమితముగ బడయగోరుచున్నారు. అట్టి స్వాతంత్రజీవనమువలన వచ్చు నాదాయమే యుత్తమోత్తమ మని ఓటో తలఁచుచుండెను.

కాని యాతఁడు వెంటనే వియన్నానగరమునఁ జిత్రలేఖనమునకుఁ బూనలేదు. ఆతఁడు మరల నిటలీదేశమున కార్నియోలా కేఁగి యచటఁ గొన్నినెల లుండెను.

ఆతఁడు మరల ౧౮౭౨ వత్సరమున వచ్చినపు డాతఁ డొంటరిగ రాలేదు. మజినీపుత్రిక యగు నీనా నాతఁడు పెండ్లియాడెను. ఆతఁడు తన యౌవనవతి యగు తన భార్యతో వియన్నానగరమున నివసించుచుఁ జిత్రలేఖనానైపుణ్యమున నత్యధికవిఖ్యాతిని గడించెను. అమితధనము నాతఁ డనతికాలముననే గడింపఁజాలి యుండెను. ధర్మమార్గమున లభించిన యైశ్వర్యము నాతఁడు నిరసింపలేదు. లోకోపకారమునకు వినియోగించుచుండెను. దానపాత్రులైన యాపదలకుఁ బాల్ప

డినవారిలో నాతని ధనసహాయమును బడయని వారు వియన్నానగరమునందే గాక తత్పరిసరమునందుగూడ నొక్కరును లేకుండిరి. ఆర్చిఢ్యూకులియపోల్డురాకుమారుని మందిరమునను జర్మనుప్రభుని మందిరమునకు ఓటో సీనాలకు నిరంతర మత్యంతప్రియపూర్వకస్వాగతము లభించుచునే యుండెను. ఓటోకును ఫాస్టుకును స్పృహసౌహృదయము లేకున్నను ఓటో సీనాలపట్ల ఫారన్నాసకు నత్యంతస్నేహభావము కలదు.

౧౮౦౮వ వత్సరమున రోసెంథాలు ప్రభువు పెద్దల నెన్నునఁ బోయెను. అతఁ డప్పటికాఱు మాసములనుండి తన ప్రియకుమారి మందిరముననే నివసించుచుండెను. అతఁడు స్వల్పకాలము వ్యాధిగ్రస్తుఁడై తన యనుంగుపుత్రిక చెంత నుండగనే ప్రాణముల విడచెను. ఈ రీతిగా రోసెంథాలు సంస్థానము గూడ నొరానాక్రిభుకంపతుల నశ మయ్యెను.

ఆవత్సరముననే సీజరును స్పెయినుదేశీయులు మరల బందీని జేసి సెవిలీలో నొక దుర్గమున బంధించిరి. ఆదుర్గపాలకుఁ డాతనిఁ జాల బాధలకు పాలుజేసెను. అతఁడు సహింపఁజాలక తప్పించుకొని పోఁ జూచెను. ఒక పురోహితుని దన చెంత కంపవలె ననియు నాతని చెంతఁ దానొనర్చిన పాతకముల నొప్పుకొని పశ్చాత్తాపమును వెల్లడింతు ననియు నాతఁ డుద్యోగులకు విన్నవింప వా రొక మహోద్యోగిని బంపిరి. అతఁ డొకముష్టిఘాతమున నాపురోహితునిఁ బరలోకమునకంపి యాతని వసనములధరించి (ఆదేశమున బురోహితులకుఁ బ్రత్యేకపు దుస్తులు ముఖపట్టములు నుండును.) నిర్నిరోధమునఁ గారాగృహము నుండి వెడలిపోయెను.

కొంతకాలము క్రింగట మిడ్వెగోలి సీడనులు విడిపోవుటచే సీజరుని కాలోచన చెప్పువారు లేకుండిరి. అతఁ డేమి చేయుటకును దోఁచక యల్లాడుచుండఁ గొలఁది కాలమునకే మరల నాతనిఁ బట్టుకొని బలిష్ఠమగు మెడీనా కెల్కాంపో దుర్గమున బంధించిరి. కాన

నాతనికి సాధుహత్యా మహా పాతకమే గాని స్వాతంత్ర్య లాభము మిగుల లేదు.

ఆదుర్గమునం దాతఁడు రెండు వత్సరములు నవసెను. వెనుకటి మిత్రులందఱు నతనిఁ బూర్తిగా మరచిరి. ఉన్నతదశయం దున్నపుడు సార్వభౌములచేతఁగూడ దాస్యముఁ జేయించుకొనిన సీజ రిపుడు చూడచుట్టమును మ్రొక్కుదైవమును లేక యేకాకియై యెల్లరచేఁ బరిత్యజింపఁబడి కారాగారబద్ధుఁడై నవయుచుండెను. ఎల్లవారు నతని త్యజించిరి గాని మిచెలోటో మాత్రము కృతఘ్నతను జూపలేదు. సీజ రాకారాగృహమునం దున్నాఁడని మిచెలోటో తెలుసుకొనెను. ఎటులైన సీజరును విడిపింపవలె నని మిచెలోటో దీక్షఁబూనెను.

మిచెలోటో యాప్రాంతమున నున్నాఁడని ౧౫౦౬ వ సంవత్సరమునం దొకనాఁడుదయమున సీజరుకుఁ దెలుపఁబడెను. ఆతనిమొదట నుంచబడిన రొట్టెను విరువ నం దొక చిన్నసేనాయును సన్నని ఆకురాయియును గనఁబడెను. ఆయుపకరణము లాతనికి మహోపకారకములు. పగటిపూట సీజరు ఇనుపయూచలను నాకురాయితోఁ గోసివేయుచుండును. ప్రతి సాయంకాలమును దుర్గాధికారి దాను మాన్యులు సీజరుగదిలో నతనితోఁగలసి భుజించుచుండును. ఏలనో యాతనికి సీజరుపై నట్టి స్నేహభావము కలిగినది. సీజ రాతని కనుబ్రామి యొకనా డాతని పానపాత్రమునందు విషము కలిపెను. వెంటనే దుర్గపాలకుఁడు మృతి నొందెను.

ఆరాత్రి పక్కదుప్పటులు మున్నగు వస్త్రముల నన్నిటిని చింపి బలముగఁ బేనివేసి దాని సహాయమున నిశీథమునం దాతఁడు దుర్గము నుండి వెలి కేఁగి మిచెలోటోను గలుసుకొనెను. అదివఱకే మిచెలోటో రెండు గుఱ్ఱములను సిద్ధపఱచి యుంచుటచే సీజరు మిచెలోటోతోఁగూడ నవరేదేశమునఁ బ్రవేశింపగలిగెను. ఆదేశపురాజగు జానుడీ అల్బ్రెట్టువారి నెంతయు నాదరించెను.

౧౫౦౭ వత్సరమున నేవరేదేశపురాజు సామంతులలో నొకఁడు ప్రతికూలుఁడై సమరమునకు గడగ సీజరు సైన్యాధిపత్యమును వహించి వియానాగ్రామమునకు సమీపమున రణరంగమునబోరి వధింపఁబడెను. అంతట మిచెలోటో సేనాధిపతియై శత్రువులనిర్మూలన మొనరించి పగఁదీర్చుకొనెను.

ఈరీతిగా సీజరు ౧౫౦౭వ వత్సరము మార్చి నెల ౧౦వ తేదీని సామాన్యసమరమున నామావశిష్టుఁడయ్యెను.

లూక్రెజా ఫెరారాప్రభువును బెండ్లియాడి యానగరమున నివసింపసాఁగెను. ఈ ప్రకరణము ౧౪౯౭వ వత్సరము నవంబరునెలతోఁ బ్రారంభమై ౧౫౧౨వ వత్సరాంతముతో నంతమైనది. ఈ రీతిగా ఫౌస్టుకు భూతనాథుఁడొసంగిన యిరువదినాలుగేండ్ల పరిమితిలో ౧౫ వత్సరములు గడచిపోయెను.

## ౨౦

౧౫౧౨వ వత్సరము ముగియవచ్చుచుండెను. ఫెరారాప్రభుని మందిరమున విలాసభాసుర మగు నొక గదిలో నొక యెలనాగయు నొక నవయౌవనుఁడును గూర్చుండి యుండిరి.

ఆ పురుషుఁడు కొంచెము పొడగరి. బక్కపలచనివాఁడైనను బింకముగలవాఁడు. అతని సౌందర్యమునం దొక్క లోపమైన నెంత విషమపరీక్ష చేసినను గనుపట్టదు. అతని వదనవిలాస మతిమనోహరము. దంతకాంతి నలరారు నాతని చెక్కులపై వినీలకుంతలములు నృత్య మొనరించుచుండెను. అతని విశాలలోచనములు శ్రీమంతములై యొప్పమీరుచుండెను. అతని విలోకనములు మృదులములై తనశక్తిని వెల్లడించుచుండెను. అతని మోము తీరు వర్తులమనియే చెప్పనగును. అతని కంఠశోభ తదనుగుణముగనే యొప్పమీరుచుండెను.

ఆతని కింకను మీసక ట్టేర్పడ కున్నను నాతని వదనము గంభీరముగనే యుండెను. అణుమాత్ర మగు విచారభావమును నాలోచనాశక్తియు గోచరించుచుండెను.

ఆతని చెంతనున్న యాలనాగ అసామాన్య లావణ్యధన్య లగు కన్యామణులలో నొక్కరిత. ఆకన్యకామణి కూడఁ గొంచెము పొడగరిగా. దివ్యాంగనల ధిక్కరింపఁజాలిన యాతన్వంగి సర్వాంగసౌందర్య విరాజమానయై జగన్మోహినియో యన నొప్పుమీరుచుండెను. ఆమె దీర్ఘాలోచనా పరతంత్రయై యున్నపు డామె వినీల నేత్రములు ప్రణయ పరిపూర్ణములును బరిశాంతములునై గోచరించును. ఆకన్యకామణి భావోత్సాహోద్వేగ యైనపు డాకలికిమిన్న నేత్రద్వయము విలక్షణ పరిభాపూరితమై ప్రేక్షకునిపై యవలతారలంబోలె నిడదీప్తింబరపును. కోమలస్నిగ్ధ, మనోహరవదనకమలమును, గోటజిమ్మినఁబాలుగారున ట్లొప్పుమీరు చెక్కుటద్దములును, మధుపసంకాశ నీల కుటిలకుంతలజాలమును, వర్ణనాతీతముగ నొప్పుమీరుచుండెను. ఆ మందయాన సుందరవదన సౌకుమార్యాతిశయమున నంతర్గతసూక్ష్మ నీలరక్తనాళములు ప్రస్ఫుటముగ గోచరించుచుండెను. సుపక్వమై చీలి చీలికలైన దాడిమఫలాంతర్గతస్నిగ్ధబీజపఙ్క్తి నపహసించుచుఁ గెంపువన్నె నింపుగులుకు నారమణీమణి ముఖాంతరమున నొప్పారు తెల్లని పలువరుస యాజవ్వని మందహాస మొనరించినపుడు గోచరించుచుండును.

ఆమందయాన వింతసోయగము నంతయు లోగొనజాలు ననామాన్యవదన తేజము దేవకాంతలకు గాక మానవకామినులకు సామాన్యముగ లభించునదిగాదు. ఆయలౌకిక ప్రియదర్శనము కన్యకామణులం దత్యంత వినయ సౌకుమార్యవిలాసభాసుర లగు నారీమణులం దుమాత్రమే గోచరించుచుండును. ఆచారుమతి విలాసిని గాదు— నిజసౌందర్యాతిశయమును గ్రహించి గర్వితయై విఱ్ఱవీగు స్వైరిణి

గాదు, ఆమె మరాళిగమనమును, గంబుకంఠవిలాసమును, సౌంద ర్యము నతిశయింపజేయు హావభావములును బ్రయత్నపూర్వకముగ నభ్య సించు కృత్రిమనటనాకలాపము గాదు. ఆలీలావతి సుశీలయగు నమా యిక యని యామె పలుకులంబట్టియు చేష్టలను బట్టియు సులభ ముగా గ్రహింపవచ్చును. ఆమె తనూవిలాస మత్యంత మనోహర మయ్యు తినయపూర్వసౌందర్యాతిశయ మెల్ల వారి ప్రణయముగ్ధుల నొనరింపజాలియున్న దను నూహా లేశమైన నాకన్నియ కెన్నడును గలిగి యుండలేదు.

వారిర్వురును సమవయస్కులు పదునెనిమిది వత్సరములు దాటి నవారు. వారిర్వురును నేకకాలముననే జనించినను యమలసోదరీసోద రులు గారు. సన్నిహితబాంధవ్యులైనం గారు. గాని యత్యంత సన్నిహిత బాంధవ్యపాశమున నచిరకాలముననే బద్ధులు కావలెనని కోరుచున్న వారు. వారు ప్రణయనీప్రణయనులు.

వారి ప్రేమ పవిత్రితమము, స్వార్థవిరహితము. అట్టి విమల ప్రేమ మత్యంతపరిపూరిత మగు పరిణయపాశముల వారి హృదయముల బం ధింపజాలెను. ఏనాడు నొక్కకటువాక్యమునైన వారుచ్చరించి యెఱుగరు. బాలయల్క వలన నావల కలుగు మహదానందము ననుభవించుటకు సాధారణముగ ప్రణయనీ ప్రణయను లొనరించు ప్రణయకలహమును గూడ వారెఱుగరు. ఆకన్యకామణి చెక్కు ముల కేనాడు నాతని విమలఫాలతలమున భ్రూభంగమైన గోచరింప లేదు. అతని వక్త్రమున కెత్తైనను గూడ నాచంద్రిసకన బింబోష్ఠ ములు కంపితములు కాలేదు. ఈర్ష్యాశబ్దమును మాత్రమె వారు వినియుందురుగాని త ద్భావము వారిపట్ల నభావమే. వారిండొరుల నిర్మలానురాగములగూర్చి సంపూర్ణ విశ్వాసముతో మెలయుచుండిరి.

ఈయువతీ యువజను లుత్తమవంశసంజాతు లగుటచే విజయనా నగరమున సాటివిభు కుటుంబములందేవేని వేడుకలను వినోదములు

నుత్సవములు మున్నుగునవి జరుగునపుడు తఱుచుగ వా రాహ్వానింపఁ బడుచుండుటయు వా రాహ్వానముల నంగీకరించి యట్టి విందులకు పోవుచుండుటయు జరుగుచునే యుండెను. అట్టి సందర్భమునందు నృత్యములు జరుగుచుండును. అవి వాహితులు వివాహితులు నగుయువతులు లాతిపురుషులతోఁ జేతుల గలిపి నృత్యముచేయుట యచటిదేశాచారము. దానిని ద్రోసివేయుట నాగరకతాధర్మముగాదు. గావున నీప్రణయముగ్ధు లట్టి సందర్భముల విడిపోయి యువకుఁడు వేఱొక యువతితోను యువతి వేఱొక పురుషునితోను నృత్యము చేయునపుడైన వారి చిత్తము లెన్నఁడు నన్యాయత్తములు కాలేదు. అట్లితరులతోఁ జేరి నృత్యముచేయుటయుముచ్చటించుటయు సంఘాచార నియమము నుల్లఘింపజాలమినే గాని ప్రేమావిశేషమునఁగా దని వా రిద్దఱును లెస్సగా నెఱిఁగి యున్నారు. వారి యాత్మలు వినీతములు. వారి తలంపులు పావనములు వారి. వాక్యములు పవిత్రములు. వారి చెయిదములు ఉత్తమములు. ఆహా వారి ప్రణయ మహిమ యెంత ధన్యము!

చిఱుతప్రాయమునుండియు ,, వా రొక్క కంచమున దిని యొక్క మంచమునఁ బండుకొనిరి. '' అను సామెత సిద్ధించునట్లు వారు నిరంతరసాహచర్యమున పెరిగిరి. ఒక్క మందిరమున నివసించుచు నొక్కచో నాడుచు నొక్కచోఁ బాడుచు నొక్కచో ముచ్చటలాడుచు వారు దినదినప్రవర్ధమానులైరి రెం డేండ్ల ప్రాయముననే— మాటలురాని యీడుననె—వారికి జోడు కుదిరెను. అప్పుడైన వారే నాఁడు నెందులకును జగడమాడి యెఱుగరు. పరస్పరదుఃఖోపశమనమునకే యంతటి చేఁబాల్యమునగూడ వారు ప్రయత్నించు చుండిరి. వారిలో నొక్కరశ్రుపూరిత లోచనులైన రెండవవారుగూడ వెంటనే కన్నీరు నించెడివారు. తమచిన్న యంగీల యంచులతో నొండొరుల కన్నులం దుడిచి యూఱడించుకొను వారు.

ఈరీతిగా వయసుతోఁ బాటను రాగముగూడఁ బ్రవర్ధిత మయ్యెను. పంచాబ్దప్రాయమున వచ్చియు రాని ముద్దుమాటలతో వారు నిరంతరమును సంభాషించుటయే మహదానందముగా భావించుచుండువారు. ఒండొరులు బుజములపైఁ జేతులు వేసుకొని వియన్నాయందలి రాజమందిరోద్యానమునను నౌరానాలోని ప్రభుమందిరోద్యానమునను వారు సదా చరించుచుండువారు. అట్టిచో నాముద్దుబాలుఁడు మృదుఫలములను, దివ్యకుసుమముల నేరి తెచ్చి యాబాలామణి కొసంగుచుండును. అట్టి పసితనముననైన వా రేజంతువునకును బీడ గలిగించి యెఱుఁగరు. ఆకుచిలుకల నలయించి యెఱుఁగరు. తూనీగలఁ గారియిలం బెట్టినవారు గారు. బంగారుపిచ్చుకల బంధించి యుండలేదు. చీమలబారు దారి కడ్డమైన నెడ దొలఁగి పోవువారు.

ఈరీతిగా వత్సరములు పైబడుకొలఁదిని ప్రేమ హెచ్చు కాసాఁగెను. పొలములందు మెలఁగునప్పుఁ డాతఁ డామందయానను తిన్నని స్నిగ్ధమగుమార్గముల నడిపించుచుండును. దారిలో జిన్నకాలువలును ముండ్లపొదలును గనఁబడినప్పు డాతఁ డాకన్నియను జేతులపైనిడుకొని భద్రముగ నావలకుఁ గొనిపోవుచుండును. రమ్యస్థలము నారసి యందామె నతఁడు గూర్చుండఁ జేసి పూఁబొదలఁ జేరి చిత్రవిచిత్రపుష్పజాతులం దెచ్చి యిచ్చుచుండును. వాని నామె గుత్తులు గుత్తులుగా నమరింప నాగుత్తుల నాతఁ డామత్తకాశిని చికురబంధమున నమర్చుచుండును. వారి నిష్కపట హాసములు నుల్లాసస్వనములును రజతఘంటికానినాదములువోలె విశాలోద్యాన స్థలముల చెలఁగి విమలనదీమర్మరధ్వనులయందు లీన మగును.

విద్యార్థిదశయందు వారు సహపాఠులైరి. గణితము మున్నగు వానియం దొకరికిఁ దోఁచని విషయము నింకొకరు విప్పి చెప్పుచుం

దురు. అందు తరుచుగా సంశయనివారణము నాయువకుఁడే యొనరిం చుచుండును.

ఈరీతిగా నాబాల్య ప్రవర్ధమాను లగునాయువతీ యువకులకుఁ బసితనమునాటి యాటకోటితనమును విద్యాభ్యాసదశ యందలి సాహ చర్యమును గాఢమైత్రియు క్రమక్రమముగ సంపూర్ణయౌవన వికాస ముతోఁ బరిపూర్ణప్రణయాకృతి దాల్చెను. ఆరహస్యమును గూడఁ దొలుత గ్రహింపఁ గలిగిన దాయువకుఁడే. సహజసరళస్వభావుఁ డగు నాభావజోపముఁ డారహస్యమును మిక్కిలి నేర్పుతో నాపాటలాధర కెఱుఁగజేసెను. పరస్పర మనోభావములఁ బోల్చి చూచి వారు నిర్ధార ణజేయగలిగిరి. పరస్పర నిర్మలాను రాగభరితు లగువారి పవిత్ర ప్రణయమును ప్రతిఘటించు శక్తులు సర్వేశ్వరుని సృష్టియం దుండ జాల వను నిర్మలభావముతో మననెయ్యమునకు మనజననీ జనకులు తప్పక యంగీకరించి మన కిరువురకును బరిణయము గావింతురు. ఇఁక మన కెన్నటికిని వియోగము ఘటిల్లదని వారు తలఁచిరి.

వారి ప్రణయమును నిరసించి వారి వివాహమున కంగీకరింప కుండుట కెవ్వరికి నెట్టి కారణమును గనఁబడను. అభిజాత్యశీలవయో రూపసంపదల నసమాను లయ్యు సమాను లగు నాసుదతీసుందరుల ప్రేమ దుత్తమోత్తమము కాని యొక్క వ్యక్తిమాత్రము మౌనముద్ర వహించెను. ఆప్రస్తాపనకే యాతఁ డవకాశ మీయక కాలయాప నము చేయసాగెను. ఆయుదాసీనత కెట్టి కారణము నాతఁ డొకఁగింప లేదు. వారి నెడబాపవలె ననుతలఁ పతని కావంతయును లేదు. కాని వెల్లడింప నలవిగాని భయంకర కారణములముచే నాతఁ డట్లొనరించు చుండెను.

ఆసుందరాంగుఁ డగుయువకుఁడే సూర్యమిలను. యథార్థముగ పాస్టు ధైర్యాలకు జనించిన పుత్రుఁ డయ్యు లియుపోల్డుమేరి సూల ముస్సు

బిడ్డఁ డని భావింపఁబడు చున్నాఁడు. ఆమోహనాంగి గాడీలాకస్య రాకుమారునికిని మేరియాకును బుట్టినబాలిక యయ్యు ఫాస్టుధరస్సాల పట్టిగాఁ బెరుఁగుచున్న నారసాకు.

వీరి వివాహమున కనుమతి నొసఁగక యూరక కాలము బుచ్చుచున్నవాఁడు ఫాస్టే. ఆతఁ డావివాహమున కనుమతించిన వివాహసమయమున దేవతానికేతనమున కేఁగకుండఁ దప్పించుకొనుదారి లేదు. ఆ ప్లేఁగుట కాతఁడు భూతనాథుని కొసంగిన వాగ్దానము ప్రబలనిరోధకముగ నున్నది. అందుల కాతఁ డాభూతనాథుని యనుమతిఁ గొనవిచో వెంటనే భూతనాథుఁ డాతని నరకలోకమునఁ గూలఁద్రోయును.

౧౯౧౨ వ సంవత్సరాంతమున నాయువతి మన్మథుఁడును మదనసుందరియు నిట్టిక్షితిలో నాగదియందుఁ గూర్చుండి యుండిరి. సూర్యాస్తమయ సమయ మాసన్నమైనది.

ఆతఁ డాచిన్నారి కన్నియ కెంగేలు కేలబూని గవాక్షముచెంతకేఁగి కట్టెదుట నున్న పర్వతరామణీయకమును గనుపరుపసాఁగెను. " ఆవృక్షరాజమును దిలకించితే వత్సరమున గొంతకాల మదియొక్కయాకైనలేక మోడుబాఱి యుండును గాని మరల వసంతకాల మాసన్నమైనంత నేనవనవలాడుచివురుజొంపములతో నొప్పుమీఱును. మానవుని యాశావళులుగూడ నాకురాలుకాలపు నందలి యాకులవలెనే నేలరాలును గాని జీవవృక్షమునందు మాత్రము వనవృక్షమునకువలె వసంతసమయనూతన పల్లవశోభ మరల కలుగు టరుదు. అని యాతఁ డనెను.

" ప్రియా నేఁడు నీవు చింతాకులుఁడ వైనట్టు లగుపడుచున్నావేల? అని యాతని మనసు పరీక్షించునదివోలె నాలాపర్యావతి పలికెను.

„ ప్రాణధనమా! లేదు. లేదు. ఈసంధ్యాకాల ప్రభావ మట్టిది. చీఁకటులు క్రమ్మ నారంభించుటతోనే క్రమక్రమముగ నాయికులు సంతాపము వెంటగొని వచ్చున ట్లగును. కాన ముందు రానున్న అశుభసూచన యిప్పుడే యించుక కనఁబడసాఁగెను ”

„ అశుభసూచన యననేల? కొంతకాలము చీఁకటి ధంతిలము నలముకొనినను మరల వెలుతురు రాకుండునా? అటులనే దైవస్వరూపుఁ డగు జీవునిఁ దాత్కాలికముగ నాపద యను గాఱుమబ్బు క్రమ్ముకొనినను గడుశీఘ్రముగనో కొంచె మాలస్యముగనో తాత్కాలిక మగునా ఘనాంధకారము దొలఁగింప స్వీయప్రకాశమాన కిరణములను బంపి కరుణామయుఁడగు సర్వేశ్వరుఁ డాజీవుని సంతాపమును దొలఁగింపఁడా? ”

అని అడిలాకన్య పలుకునంతలో మందిరద్వారము తెఱవఁబడెను. పరిజనులు దీపకళికలఁగొని వచ్చిరి. అంతట నాప్రణయముగ్ధులు గవాక్షము చెంతనుండి వెడలిపోయిరి. పరిజనులు కిటికీల తెరలను భద్రపఱచిరి. కొంతసేపటికో లియపోల్డు రాకుమారుడును మేత్రియూయును, ఫాష్టును థెరిస్సాయు నాగదిలోనికి వచ్చిరి.

## ౨౧

పదునేను వత్సరములు గడచినను ఫాష్టు రూపమునం దెట్టిమార్పును గలుగలేదు.

ఆతని వదన సౌందర్యము కొంచెమైనఁ దగ్గలేదు. ఆతని పసిఁడికుంతలములం దొక్కటియును బలితము కాలేదు. ఆతని దృగంచలకాంతి సముజ్జ్వలత కొఱతపడలేదు. ఆతని శరీరసౌష్ఠవము థెరిస్సాసతి యాతనిఁ బ్రేమించిననాఁ డెటులుండెనో నేఁడుగూడ నటులే యుండెను. అతిలలితమగు సంతాపరేఖ యొకింతమాత్ర మాతని సమున్నతఫపిరాజితవిశాల ఫాలభాగమున గోచరించు చుండెను. ఆతఁ డెప్పు

డవు డన్యకాంతాగాఢ పరిరంభణాది విషయభోగముల నోలలాడినను ఆవిషయానుభూతిని సౌఖ్యమనజాలము. ఏల యన నహర్నిశలు తన్నత్యంతము పీడించుచున్న ఘోరసంతాపమును మరచుటకే యాతఁ డిట్టు లన్యకామిని సాంగత్యవినోదములఁ గాలము బుచ్చుచుండెను- ఆతఁ డత్యధిక మగు మనక్షోభము ననుభవించెను.

ఆతఁ డింకను నిండుయౌవనమున నలరారుచు నత్యధికోత్సాహభరితుఁడై యుండెను, గాని యింక నాల్గువత్సరములలోనే యాతనికి మృతికలుగఁ గలదు. ఆతఁడు తన దుర్గతికి బాలుగాక తప్పదు. అహో! ఎట్టి దుర్మరణము ఎట్టిదుర్గతి.

ఏనాఁడు సూర్యోదయ సూర్యాస్తమయ మధ్యకాలమునఁ దా నొక్కసత్కార్యము నైనఁ గావింపఁ జాలకుండునో యట్టిదినమున నాహా! నా కొకదినము వృథ పోయె నని యొక సార్వభౌముఁ డనుకొనుచుండె నని మన మొకానొక చరిత్రయందు చదివి యుంటిమి. అటులే ఏనాఁడు నూతనానంద వినోదములను నూతన భోగములను బడయఁజాలకుండునో యానాఁ డొకదినము గతించె నని ఫాస్టుగూడ చింతించుచుండువాఁడు.

ఆతని కిప్పు డొకగంట గడచిన యుగము గడచిన ట్లుండెను. అతఁడు గడియల యామముల దినముల వారముల మాసముల పక్షముల లుబ్ధుఁడు ధనమును లెక్కించుకొనురీతిని నిరంతరమును లెక్కింప సాగెను. ఆసన్నమృత్యువున కాతఁడు కడుదూరముగఁ బఱుగిడఁగోరుచుండెను. గాని అమ్మృత్యు వాతని క్షణమైన విడిచి యుండక నిరంతర మాతని వెన్నాడుచునే యుండెను.

భూతపతి సహాయమునఁ దనకుఁగల యౌవనశక్తి విశేషమున నాతఁడు వివిధము లగునానందముల ననుభవించుచుండెను. తన ప్రియకాంత యగు ధరస్సా నాతఁ డుపేక్షింపకయే అన్యకాంతా విహారమున సొక్కి సోలుచుండెను. సంకల్పమాత్రమున క్షణికమున

నెంతటి దూరదేశమునకైన నేఁగి యచటఁ గొన్నిగంటలలోఁ గొన్ని దినములలో నిచ్ఛానుసారము భోగముల ననుభవించి మరల నాసంకల్పప్రభావముననే రెప్పపాటువేళలో నిజమందిరమునకు వచ్చి చేరుచుండును.

తనభర్త యిట్లు నిరంతర మన్యకాంతా సాంగత్యమునఁ జిక్కి భోగైకలాలసుఁడై యున్నాఁడనుసంశయలేశ మైన నీరజాక్షికి లేదు. అట్టి యనుమాన మామెకుఁ గలుగుట కైన నవకాశము లేదు గాని యామెకు సౌఖ్యముమాత్ర మసమగ్రముగనే యుండెను. అతని కేదో గొప్ప విచారకారణము కలదని ఆమె పెక్కువత్సరములక్రిందట గ్రహించెను. దానికతన నాతఁడు పగటిపూట మౌనమువహించి యుండును రాత్రివేళ భయంకర స్వప్నములం గని దద్దరిల్లును.

అతఁ డెన్నఁడును బ్రార్థించి యెఱుఁగఁడు. ఎన్నఁడు నేదేవళమునకును బోయి యుండలేదు. ఆవిషయములనుగూర్చి యతని నెవరైన బ్రశ్నించిన నాక్షణమే నేదో గొప్పబాధ కలిగిన రీతి నాతనిముఖలక్షణము మాఱిపోవుచుండు నని యామె గ్రహించెను.

అర్ధాంగికి బ్రణయప్రపూర్ణ యగునిల్లాలికి సహజమగు నిర్మల ప్రేమతో నాతని రహస్యమును దెలిసికొనుట కామె చాలసారులు ప్రయత్నించెను. ఆతని యాత్మను దైవమునకు వశపఱుప్ర మని వేలసారు లతని కైస్తవసహజమైన యాస్తికతతో హితము చెప్పెను. కాని యావిషయములపట్ల నాతఁడు గ్రాహ్యముగు నసూయ గనుపఱుచుటచేఁ బెక్కు వత్సరములనుండి యామె వానిని గలుపెట్టటనో మానుకొనెను.

ఆమె యట్లతనిచెంత వానింగూర్చి తలపెట్టకున్నను నొంటరిగా నున్నపుడు వానింగూర్చి దీర్ఘాలోచన మొనరించుచు జింతిలుచునే యుండెను. కాని తనచింత వెల్లడి యైనచోఁ భర్తకును మిత్రులకును

మున్సహాముగఁ దోచు నని దాని నంతయు లోన నిముడ్చుకొని హాసన్ముఖియై మెలగుచుండెను.

ఫౌస్టుకు గలఘోర సంతాపమున కాతనికి భూతపతి యద్భుతశక్తి తోడ్పడకున్నచో నాతఁడేనాఁడో కృశించి వంగి శిరోజము లన్నియుఁ బండఁబాఱి శతవృద్ధుఁడో యననుండువాఁడే.

ధెరస్సాకును సౌందర్య మేమియును కొఱంత పడలేదు. గాని ఆమె వదనకాంతి పాటలచ్ఛవి నొప్పారి సంతాపమును సూచించుచుండెను. యౌవన మతిశయించిన కొలఁది నొడలు పుష్టిజెందుటకు మాఱుగా నామె శుష్కింప సాఁగెను.

ఆర్చిడ్యూకులియపోల్డు సౌందర్యము శరీరసౌష్ఠవమును బెంపొందెను. ఆతనియెడ లించుకలావు బాఱినను అంగసౌష్ఠవ మేమియును కొఱత వడలేదు. మేరియాసతి తనూవిలసన మత్యధికముగ వికసించి ఆమె ప్రౌఢాంగ సహజలావణ్యముతో నొప్పుమీగుచు నిర్విచారముగ నుండెను.

మేక్సిమిలను అడీలాలనుగూర్చి మాత్రము మేరియా ధెరస్సాల విలక్షణప్రేమ మించుక యైన మాఱలేదు. గాని నారిరహస్యముల నాలకించిన మతస్వాములు నారికి మనశ్శాంతిని గలిగింపఁ గలిగిరి. భగవంతుని అద్భుతసంకల్పమును మనము గ్రహింపఁ జాలము. అతఁడీయువతీ యువకుల విషయమున నిట్టి వింత భావములను మేరియా ధెరస్సాలకుఁ గలిగించుట కేదో గొప్పకారణ ముండునని ఆస్వాముల వారి గెఱిఁగించుటచేఁ జిన్నప్పటినుండియు దైవవిశ్వాసముతోఁ బెంచబడినవారు గావున నారమణీమణులు దాని నతిసులభముగ విశ్వసించి సంతుష్టి జెందిరి.

పైని వివరింపఁబడిన రీతిని ఔరానాప్రభువు మందిరమున నొక గదిలో యువతీయువకులును వారి జననీ జనకులు నొకబల్లచెంత

గూర్చుండిరి. పరిజనులు దానిపైఁ పానీయములు నుపాహారాదికముల నమర్చి వెడలిపోయిరి.

" మిత్రమా నీవీ యువజనుల పరిణయము నాలసించుట నాకు సమంజస మని తోఁచకున్నది. వారి కింకను బ్రాజ్ఞత రాలే దనువాదము యుక్తియుక్తము గాదు. వారు తమతమ మనోభావముల నెఱుంగఁజాలనివారు గా రని లియపోల్డు ఫాస్టు నుద్దేశించి పలుక నాప్రణయను లొండొరులఁ బరికించి లజ్జితు లైరి.

దానింగని చూచితివా? ఇంతకంటె వినిర్మల మగుగాఢానురాగము పడజాలదు. సర్వేశ్వరుఁడే వారిని దంపతులనుగా సృజించి యున్నాఁ డనుట నిశ్చయ మని మరల లియపోల్డు పలికెను.

" జనన మాదిగా వారు క్షణికమైన నెడఁబాసినవారు గారు. వారి నెయ్యమే నిర్మలానురాగముగాఁ బరిణమించినది. ప్రభువా వారి యానందమున కభ్యంతరమును గల్పింపవల దని మేరియా పలికెను. అట్లు పలుకుచు నామె యాప్రణయినులపై ముఖ్యముగా అడీలాపై సుకుమార వీక్షణములఁ బరపెను.

" జీవితేశ్వరా! వీరి ప్రార్థనము గాదనరాదు. తనపుత్రునికి మన కన్నియ నర్థించుటయం దీమహారాజు మన కత్యంత గౌరవమును సమకూర్చుచున్నాఁడు. చిరకాలమునుండి మనకుటుంబములకు బ్రబలుచున్న మైత్రి యీసంబంధమున గాఢతమము కాఁగలదు. కాన నింక నాలస్యము చేయవలదని వేఁడుదాన నని పలికి థెరస్సా కూడ నాప్రణయినుల వంక ముఖ్యముగా మాక్సిమిలనువంక ప్రసన్నమాల వీక్షణముల బఱపెను.

" మే మిందఱ మిట్లు గోరుచుండ నీ వెట్లు నిరాకరింపఁ గలవో నేను గ్రహింపఁజాలకున్నను కన్యాజనకుఁడ వగు నీకు సంశయము లుండవచ్చును. కాని అవి యెంతమాత్రమును సహేతుకములు కా వని నేను నమ్ముచున్నాను. వారిద్దఱు నమ్ప్రష్టవంతులు వారి

సంపద శాశ్వతము మాపిన్నేఁగూడ నీకు సంతృప్తికరము గాదేని యాపరిణయనులగాథాను రాగమును నీవే పరికించి గ్రహింపఁగగును. ఇందులకై నేనీ విషయమును వీరియెదుటనే చర్చింపతలపెట్టితి నని లియపోల్డు నుడివెను.

వారి మాటలను మౌనముతో వినుచున్న ఫాస్టు పాదసన్నిధానమున నాపరిణయినులిగపురును మౌకరించిరి. ఆతఁ డపుడు తత్తరపడసాగెను. తనతో బాంధవ్యమును నెరపగోరిన లియపోల్డు నభిమతమును నిరాకరించుట యాతని నవమానించుటయే యగును. వివాహమున కింత యాలస్యము కలిగించుటకు సహేతుకములగు కారణము లెవ్వియును గనఁబడుట లేదు.

ఇటులుండ నాపరిణయినులు తన పాదములచెంత వినతులై ప్రార్థనాపూర్వకముగ పులకితములగు కపోలములపై కెత్తి తనవదనమును దిలకించుచుండిరి. మఱియు నతనికి మాక్సిమిలనుపై గాఢతమమగు ననురాగము గలదు. దాని నాతఁడు వెల్లడింపజాలక లోన నడచుకొనుచుండెను.

,, లెమ్ము మాక్సిమిలను—అడీలా లెమ్ము. రేపు మధ్యాహ్నము నాసమ్మతిని తప్పక యొఱఁగించువాఁడ. నామైత్రిని పాటించి లియపోల్డు గారుమారుఁడు నా కీపుత్రిము గను వాసంగునని నమ్మెద ,, నని పలుకుచు మిక్కిలి కలకబారిన తన మనోభావముల నడచుకొని ఫాస్టు తటాలున లేఁచి వెడలిపోయెను.

,, భగవతీ! ఏల నానాథుఁ డిట్లు వికలచిత్తుఁ డయ్యెనో గదా! ఆతని కేదో అస్వస్థత కలిగి యుండును. నేనుగూడ నేఁగి విచారించెద ,, నని థెరిస్సాగూడ నాతని వెంటనే జనెను.

## రాత్రి

ఫాస్టు ఎట్లో యాగదిలోనుండి వెలుపలకు వచ్చెను. దీపికాసహస్రకాంతి భాసురము లగునాకసౌధాంతరముల నెటుల దాటెనో యాతఁడే

మెఱుఁగడు. ఆతని తల తిరిగిపోవుచుండెను. దీపికల ప్రకాశమాత్ర నికి పైత్యభ్రమ కలిగించుచున్నట్లు తోఁచెను

ఆతరుణమున గాఢాంధకారమే మనశ్శాంతి నొసఁగజాలు నని యాతఁడు తలఁచెను. ఆతఁడు దాటిపోవు మార్గమున గదులలో నమర్పఁబడిన నిలువుటద్దములవంకఁ దిరిగి దీపముల వెలుగునఁ దన స్వరూపమును ముఖలక్షణమును తిలకించుట కైన నాతనికి స్థైర్యము కలుగ లేదు.

కాన నతఁడు తన వెనుక నెవరైన వచ్చుచున్నా రేమో యను దృష్టి యైన లేక తటాలున నొక వంకకు మరలి చీఁకటి గదిలోనికి పోయి సోఫాపయి కూలఁబడెను.

,, ఘోరపాతకిని! ఘోరపాతకిని! నా ఘోరపాతక స్వరూప మిప్పుడు కనఁబడినంత స్పష్టముగ నిదివఱ కెన్నఁడును గనఁబడలేదు' అని ఫాస్టు బిగ్గఱగనే పలికెను.

ఆతని వెనుకనే థెరస్సా గూడ బయలుదేరి యుండుటచే నామె గూడ నాగదిలోనికే వచ్చెను. నీసంతాపకారణ మేమో తెలుపు మని యామె యడుగబోవునంతలో నాశ్చర్యభయసూచకము లగు నాతని యాత్మనిందావాక్యము లామె వీనులఁ బడెను.

పిడుగుపాటునంబోలెఁ దత్క్షణమే యాపతివ్రతాతిలకము మోకరి లఁబడి నిర్మలమానసముతో సర్వేశ్వరుని ప్రార్థించెను.

ఆగదియందు మిక్కిలి దళసరియగు రత్నకంబళము పఱవబడి యుండుటచే నామె యట్లు మోకరిలబడిన ధ్వని ఫాస్టునకు కొంచ మైన వినబడ లేదు. ఆమె యాగదిలో నున్న దనియే యాతఁ డెఱుఁగడు.

ఆతని మానస మత్యంతసంతాపమున నవశమై యుండుటచే నట్టి ధ్వని హెచ్చుగా వెడలి యుండినను గూడ నాతఁడు వినఁగలిగి యుండఁడు.

పొంచివినుస్వభావము ఘరిస్నా కొంకించుకలుగను లేదు. ఆమె మనసు చెదరక పోయి యున్నచో నామె యట్టి కార్యము నెంతయు నిరసించియుండును. గాని యిపుడు తన భర్తనోట వెడలిన దారుణ వాక్యము లామెకు వాగ్బంధనము కలిగించెను. ఆమె స్తంభితయై పోయెను.

“నిజమే. నేను మహాపాతకినే. భూతలమునం గాలికునధమా ధమక్రమికంటెను గూడ నేనే ఘోరపాతకిని! మానసంరక్షణము నకు లొడితెడు గోచిపాత యైన లభింపక యల్లాడు కటిక దరిద్రుండు గూడ నారానా ప్రభునికంటె సౌఖ్యభాజనుండే. నాకంటె వేమడుంగు లధికమగు సౌఖ్యమును బడయునాడే యగును. అట్టి యవకాశమే నాకున్నచో నాయీపదవి నంతయు నట్టివాని కొసంగి వాని దారిద్ర్యమును నేను సంతోషపూర్వకముగ స్వీకరించియుందును నే నేమి చేయను? ఇపు డేమిగతి? నామనసు చెదరియున్నది. నా కొక్క స్నేహితుడైన—నిట్టిచో నాలోచన చెప్పదగినవాడు నా ఘోరరహస్యమును వినదగినవాడు లేడాయె గదా. నాతో సంబంధముగల వారందఱును గూడ నాతోపాటు దారుణదుష్కీర్తికి పాలుగా వలసినదేనా? అంతటి ప్రేమాపరిపూర్ణులగు ప్రణయినులకు నేను సంతాపకారకుడను గావలసినదేనా? వారి వివాహ సమయమునందచట నిలువంజాలని నేను వారి వివాహమున కెట్లనుమతింపనేర్తును. ఆహా! ధరస్నా, ధరస్నా, నిను నాయర్ధాంగిగా నొనరించుకొనగలుగుటకు నే నొనరించిన త్యాగ మెంతటి దారుణమో నీ వెఱుంగవు గదా!” అని ఫౌస్టు దుర్భరసంతాపముతో నుచ్చైస్స్వరమున బన్లు దీటుచుం బలికెను.

అంతలో హా! ప్రియతమా, జీవితేశ్వరా! అను మృదుమధురవాక్యము లాతని వీనులం బడెను. ఒక్క యబలామణి కోమలబాహు

వల్లుపు లాతిని కింతమును వెనివేసుకొనెను. ఆతిన్వ సుందరివదనార
వింద మాతని వదనమునకు పోకెను. ఆరామామణి వేడికన్నీటిబిం
దువు లాతని చెక్కుల పై రాలెను.

,, ధరన్నా, ధరన్నా, నీవేనా, నీవేనా, '' అని యాతఁడత్యంత
సంతాప వినాదముతోఁ బలుకుచు నాసతి బాహువుల గట్టిగఁ బీడింప
సాఁగెను.

,, నాథా! నేనే. సర్వమును వింటిని. నీకు సౌఖ్యలేశమైనను లే
దని నాకిపుడు స్పష్టమయ్యెను." అని ధరన్నా మందస్వరమునఁ
బలికెను.

,, అంతియు వింటివా. ఏమి వింటివి? నేనేమంటినో నాకే తెలి
యుట లేదు. నాకు పిచ్చిపట్టినది. మనసు చెదరినది. నీవేమి వింటివో
చెప్పుము ధరన్నా చెప్పు మని యాతఁడున్మత్తునివలెనే తటాలున
లేఁచి ఎడదొలఁగి నిలచి తర్కింపసాగెను.

నే నసౌఖ్యమునకు గురియైతిని—నా ప్రాప్తి కడు దారుణము. నే
నావివాహసమయమునం దచట నుండఁజాల గాన నాయువకుల పరి
ణయమున కంగీకరింపజాల నని నీవు పలికితివి. నన్ను బెండ్లి యాడు
టకు నీ వొనరించిన దారుణత్యాగ మెయ్యదియో నేను గ్రహింపఁ
జాలకున్నదాన "నని ధరన్నా పనుపస్వనమున నతివేగముగఁ బలికెను.

,, ఇంతేనా? ఇంకేమియు వినలేదా? నే నింకేమియు ననలేదా?
ఈ సౌఖ్యమున కేమికారణమో నేను తెలిపితినా?''

,, ఇంకేమియును బలుకలేదు. ఆహా! నీవు పలికిన వాక్యము
లెంతదారుణములు. తెలుపుము. నీప్రియపత్ని నగు నాయొద్ద గూడ
నీకీదాపుర మేటికి—నీయసౌఖ్యకారణ మేమో నా కెఱిఁగింపుము.
నీగతి కడు దారుణమగుటకు గల రహస్య మెట్టిదియో నా కెఱిఁగిం
పుము '' అని యానిర్మల ప్రేమ స్వరూపిణి దుర్భరసంతాప విదారిత

స్వాంతయై యాతని యెదపై వ్రాలి బిగ్గ గౌగలించుకొని దుఃఖాశ్రువుల నభిషేకించుచు వేడుకొనెను.

ఘోస్టుకుగూడ హృదయము నీరై పోయినది. అవిమల చరిత్రనిర్మలనిశ్చలానురాగ ప్రపూర్ణత నాతఁడిపుడు సమగ్రముగ గ్రహింపగలుగుటచే నాతని చిత్త మవశమయ్యెను. ఆమెపైఁగల ప్రేమ నాతని కెన్నఁడును కొఱవడలేదు. అంతటిగాఢనిర్మలానురాగముతోఁ దన్ను ప్రేమించిన సతీమణి యాత్మార్పణమందుగల మహోచ్చత్త యందుగల ప్రభావాతిశయమునాతని కపుడు స్వానుభవమునకు వచ్చెను

“ చెప్పఁజాల, చెప్పఁజాల, థరస్సా—నన్నేమియు నడుగవలదు నన్ను వేడుకొనకుము! ఆ దారుణరహస్యమును నీకైన నే నెఱిఁగింపఁజాల ”

“ అయ్యో! ఏల నిట్లు దాచెదవు. ఏల సంతాపమునకు పాలయ్యెదవు. నిన్ను నేను ప్రాణాధికునిగాఁ బ్రేమించుచుండలేదా? నీ రహస్యమును వినుటకు నే నర్హురాలను గానా? నాప్రేమ క్షణికమైన కొఱవడెనా? నమ్ముము, నామాట నమ్ముము. నీయందు నాకు గల మహోత్తమ మగు ననురాగము కొంచమైన కొఱంతవడలే దని నిశ్చయముగ విశ్వసింపుము. ”

“ థరస్సా నా కిఁక మతిపోవును ” అని యాతఁడు విడిపించుకొని పోఁజూచెను.

“ అయ్యో నన్ను విడనాడి పోవలదు, వలదు, వల ” దని యామె చకితస్వాంతయై యాతని నింతగాఢముగఁ గరపాశముల బంధించెను. “ నేనిఁక నీరీతి నీసంతాపమును చూచుచు మనఁజాల. నీవు సౌఖ్యమునకు దూరుఁడ వైతి వని పెక్కు వత్సరములక్రితమే నేను గ్రహింపగలిగితిని. నే నేకాంతమందిరమున నొంటరిగనే పొగులుచుంటిని. నా దుఃఖమును నీకడ మఱుగుపఱచితిని. ఇపు డున్నదో భయంకరవాక్య

ములు నీనోటనే వెలువడెను. నన్నిసందిగ్ధావస్థకు పాలుచేసి పోవలదు. నిజముగ నీకు గల దురవస్థకంటె నత్యధికముగ దురవస్థను భావించుకొని నేను దుఃఖభాజన నగుట తటస్థించును. ''

'' నీ వెంతటి దురవస్థను భావించుకొన్నను నాకు గలుగ నున్న దురవస్థ కీడుకాఁజాలదు

'' హా భగవతి నే నేమి వినుచున్నాను ! అయ్యో మరల నిదేమి! భగవతి యని నే నన్నంతనే నీ వి ట్లులికిపడెద వేమి ? పవిత్రనామములు నీచెవులకు దుర్భరములుగ వినఁబడునా ? ''

'' లేదు. లేదు. కాని వాని నుచ్చరింపకుము. నన్ను పోనిమ్ము. థెరస్సా—పోనిమ్ము. ''

'' మనమిటు లెడబాయగూడదు. మనమప్పుడే యెడబాయగూడదు. నీవు నన్నిట్టి ఘోరసంశయావస్థకు పాల్జేసి పోవుట దారుణము గాదా ? నాకు మతిపోవదా ? రహస్య మెట్టి దైనను సరే—నాకు నీభార్యనగు నా కెఱిగింపుము. నీవు దుఃఖభాజనుఁడ వైన నిన్ను నే నూరడించెద. నీవు మహాపరాధ మొనరించిననే పాపపరిహారమునకు నేనును దైవమును బ్రార్థించెదను.

'' థెరస్సా—థెరస్సా—నీ వర్థములేని మాటల నాడుచున్నావు. నీవు నాకొఱకు ప్రార్థింపఁబూనెదవేని వెంటనే వాగ్బంధము కాకుండునా ? '' అని ఫాస్టు వికటహాస మొనరించెను.

'' హా ! ఇదేమి. ఇట్టి భయంకరహాసము ! ప్రార్థన మనిన నీ కింతటి పరిహాస మేల ? నీ కొఱకు నే నేల ప్రార్థింపరాదు ? నీ వెంతటి మహాపాతక మొనరించినను సర్వేశ్వరుఁడు కరుణామయుఁడు గదా. కరుణజూపకమానడుగా ? ''

'' థెరస్సా, నీ ప్రేమాతిశయమునకు నామనసు కరిగిపోవుచున్నది. కాని నే నీ రహస్యమును మాత్రము నీ కెఱిఁగింపఁజాల, తెలుపఁజాల. పలుకఁజాల. ''

అని పలుకుచు నాతఁడామె బాహుబంధములు తొలగింపఁ గలిగెను. ఆమె హా! యని యాక్రందన మొనరించుచు స్మృతిఁ బాసి వెనుక కొరగెను. ఫాస్టు మహావేగమున నుపవనమున కేఁగి శీతల సమీరకుమార సంస్పర్శనమున దురంతతాపము నుపశమింపఁ జేసికొనుచుండెను. కొంతసేపటి కాతనికి చిత్తశాంతి కలిగినది.

ఆప్రణయినుల వివాహమున కభ్యంతరము కలిగించుట కాతని కెంతమాత్రము నంగీకారము లేదు. తా నావివాహవిధి కేఁగుటకు భూతపతి యనుమతిని వేఁడిన నతఁడు మరల నేగోదారుణ మగు నియమము నేర్పఱచును. తన కట్టితఱి నుపదేశింపఁ దగినవాఁ డెవ్వఁడని ఫాస్టు యోచింప ఓఁగోపేగు జ్ఞప్తికి వచ్చెను.

కాన నాతఁడు తక్షణమే ఓఁగో మందిరమున కేఁగెను.

## ౨౩

వియన్నానగరమునఁ బ్రభుకుటుంబముల వారు నివసించువాడయందు గాదు గాని—మిక్కిలి యారోగ్యకర మగు ప్రదేశమునయున్న కడు పెద్దదియు మిక్కిలి చిన్నదియుగాని సుందర మందిరమునఁ దొంగి చూతము.

ఆగదియందు సౌఖ్యమున కవసరము లగు నుపకరణము లన్నియు సొంపుగను బరిశుభ్రముగ నమర్పఁబడిన చందము గృహాధికారిణి యుచితజ్ఞతను గాంభీర్యనిరతిని వెల్లడించుచుండెను.

ఆగదియందు గోడలకు చాల చిత్రపటములు తగిలింపఁబడి యుండెను. దానిలో నొకదానియందు జర్మనుప్రభువు నాతని ప్రియయగు యిరీను వారిముద్దుబిడ్డయుఁ జిత్రింపఁబడిరి. ఇరీనుకన్య గ్రీసుదేశపు వసనములనే ధరించి తన ఏకశిశురత్నము నంకతలమున నిడుకొని యుండెను. ఆ చిత్రము ౧౮౯౭వ వత్సరమున వ్రాయబడె నని దానియందు వివరింపబడెను. ఇంకొక చిత్రమున లియపోల్డు మేరియా

లును వేఱొక దానియందు గృహాధికారిణియు ఓటో యర్ధాంగియును నగు సీనాయును నాహో శిశుద్వయమును మఱియొక దానియందు నేక్సిమిలను రాణుమాఁగుమును ఆర్కిలాకస్యకయును, చిత్రింపఁబడిరి. రెండు మూఁడు చిత్రములు గొప్పగదిలోను కడపటి చిత్రము ఇంకొకగదిలోను వ్రాయఁబడెను.

ఆగదిలోనే ఓటో తన పుత్రుల కిరువురకును విద్య గఱపుచుఁ గూర్చుండి యుండెను. ఆబిడ్డలలో నొకనికి పదుమూఁడేండ్లు రెండవ వానికిఁ బదిరెండేండ్లును వయసు. ఆతని వదనమున నపార మగు సంతృప్తి దృశ్యముగ గోచరించుట తప్ప కాలము కలిగింపగలిగిన యితర మగు మార్పేదియును గనఁబడుట లేదు.

ఓటో సౌఖ్యవంతుఁడును భాగ్యశాలియునై యలరారుచుండెను. ఆతఁడు సద్వర్తనుఁడు గాన సౌఖ్యవంతుఁడును ఐశ్వర్యమును నను రాగవతి యగు నర్ధాంగి యోగ్యు లగు పుత్రులను గలిగి యుండుటచే భాగ్యశాలియునై యుండెను.

సూర్యాస్తమయమై గంటదాటినది. విద్యాభ్యాసము ముగిసినది గాన ఓటో తన పుత్రులతో వేఱొకగదిలోని కేఁగెను. అచట సీనా స్వయముగ నిలచి పరిజనులచే భోజనభాజనముల సిద్ధము చేయించుచుండెను. అట్లు ప్రాణనాథుఁడును నందనులు నాగదిలోనికి రాగ నత్యంతప్రేమపూర్వక మందహాసముతో వారి నాసతీమణి యాదరించెను. సంతుష్టియును సద్వర్తనమును గలిగి యలరారు నాకుటుంబమునకుఁ జెందినవా రందఱును నత్యంత నిర్మలానురాగ ప్రపూర్ణులై యుండిరి. అదివఱకే యొక పురుషుఁడు కొంచెము వయసు గడచిన వాఁడచటఁ గూర్చుని యుండ నాపిల్లలిద్దఱును తాతా యని పిలచుచు నాతనిఁ గౌగలించుకొనిరి. ఆతఁడు సీనా జనకుఁడగు మఱియు ఓటో బలవంతముచే నాతఁ డిటలీదేశమును వదలి వియన్నానగరము

నందే తనకూతు నల్లుని మనుమలం గని సంతసించుచునల్లుని యింటనే నివసించు చుండెను.

వా రండఱును భోజనము చేయ నారంభించిన తోడనే పరిజనుం డొకండు వచ్చి జౌరానాప్రభు వేకో రహస్యముగా మాటలాడగోరు చున్నాం డనియు నాతఁడు చిత్రపటము లున్నగదిలో నిలచియున్నాం డనియును నెఱింగించెను.

జౌరానాప్రభువు తన సోదరిని మోసగించి యామెను దుశ్చరిత్రను గావించె ననుకినుక ఓటోకు ఫాస్టుపై నిప్పటికిని గలదు. కాన నతనిపట్ల నెట్టి సానుభూతియును లేదు. అతఁ డట్లాకస్మికముగ వచ్చినందులకు ఓటోకు కొంత యచ్చెరువు కలిగెను.

ఓటో ఆగదిలో నడుగిడునరికి ఫా స్టటు నిటు నస్తిమితముగాఁ దిరుగుచుండెను. అతఁడు ఓటోను జూచి తటాలున సమీపించెను '' నారాక నీకు చాల వింతగా గనఁబడ వచ్చును. గతము నంతను మఱచి నింకొకమిత్రుఁ డవిశ్వసనీయుఁ డగు మిత్రుఁడవై ఇతరులకెట్టి సద్భావముతో నుపకరించితివో, ఎట్టి సద్భావము నీకు సహజప్రకృతియో—అట్టి సద్భావముతో నాకుగూడ నుపకరింపగలవా ? ''

'' ఏ మి ట్లనెదవు ? మానవులగువారి కెవ్వరి కైననరే యాపి నంతవఱకుఁ దోడ్పడుటకు నేను నిరంతరమును సంసిద్ధుఁడను. నా కెవఁడైన గర్భశత్రు వొకఁ డుండి యాతఁడే నాయింటికి వచ్చి నా సహాయము నర్థించినను నేను తప్పక మిత్రభావముతో నట్టివానికి గూడ తోడ్పడెదను. క్రైస్తవుఁ డగు వాని కాధర్మ మనుల్లంఘ్యమని నేను విశ్వసించెదను. ''

'' నే నీకడ నింకొకరీతిఁ బ్రత్యుత్తరము రాగల దని నేను తలప నేలేను. కాని నేను నీ సహాయము నర్థించుట కతికష్టము మీఁదఁ గృతనిశ్చయుఁడ నైతిని. ఏలయన వెనుక—''

,, గతమును దలపెట్టవలదు. నీకొఱకు గాకున్నఁ బరమపతివ్రతా శిరోమణి యగు ధరస్సానతి కొఱకైనను బరిశుద్ధమానస యగు అడీలాకన్యకామణి కొఱకైనను నీకుఁ దప్పక సహాయమొనరించువాఁడనే. వారిపట్ల నా కట్టి పూజ్యభావము గలదు. ''

,, వారిపట్ల నీ కట్టి పూజ్యభావము కలదు గాననే నాకును వారికిని సంబంధించిన విషయముల నన్నిటిని నీ వెఱుఁగుదువు. కాననే నీ సహాయము నే నపేక్షించితిని. నీవు కడు నుత్తముఁడ వనియు, నే నిపు డెఱిఁగింపనున్న విషయముల నెన్నఁడును బయల కెఱిఁగింప వనియు నేను లెస్సగా నెఱుఁగుదును.

,, ప్రభువా, నిస్సంశయముగఁ దెలుపవచ్చును. ఆ రహస్యము లెన్నటికిని నా పెదవి దాటజాలవు. ''

,, మాక్సిమిలను రాకుమారునికిని నా పుత్త్రిక యగు అడీలాకును గాఢానురాగముకల దని నీ వెఱిఁగియే యుందువు'' అని ఫాస్టు పలుక ఓటో ఆయువజనుల చిత్రపటమువంక వే లెత్తి చూపెను.

,, ఆహా! సరిగ నచ్చున గుద్దిన ట్లొటుల చిత్రించితివి. నేను దీని నిదివఱ కెన్నఁడును జూడనే లేదు. నీ వందుచిత్రించినట్లే వా రొండరులపై నత్యంతానురాగావలోకనముల నిరంతరమును బ్రసరింపఁ జేయుచునే యుందురు. వారిసౌఖ్యమునుగూర్చియే నే నిపు డాలోచించు చుంటిని. ''

,, వారిసౌఖ్యమున కెట్టి నిరోధము నుండ నవసర మగుపడదు.

" కలదు. కలను. ప్రబలనిరోధమే కలదు. అంతటి ప్రణయపరిపూర్ణుల కట్టి నిరోధము నావలననే కలుగుట తటస్థించినది. ''

"నీవలననా! ఏమి యాశ్చర్య మిది. నీ పుత్త్రికను రాకుమారుఁడు వివాహ మాడఁగోరుట నీ కానందప్రదము కాఁదగియుండ—''

" నిజముగా నా కానందప్రద మేల కాకుండును? కాని యతిదారుణ మగు నాభాగధేయము వలననే వారి సౌఖ్యమున కంతరాయ

మును గలుగఁజేయవలసినవాఁడ నగుచున్నాను.”

“నా కేమియును బోధపడుట లేదు. నీ కంతయు గూఢార్థముగాఁ గనఁబడుచున్నది. అమితైశ్వర్యమును అమితశక్తియుఁ గలిగియున్న నీవు”

“నా కంతయునుఁ దెలియును అట్లయ్యును, నేను స్వతంత్రుఁడను గాను. కేవలము పరాధీనుఁడ నైతిని. అతిభయంకర మగు భాగధేయము నన్ను బద్ధునిఁ జేయుచున్నది. అతిదారుణ మగు నా దుర్గతి నా కొక దారిని నిర్ణయించెను. దాని ననుసరింప నాతో సంబంధము గలవా రందఱి సౌఖ్యమునకుగూడ నిరోధము కలుగుచున్నది.”

“ఇది కడుంగడు వింతగా నుండుటచే నా కెన్నియో అనుమానములు కలుగుచున్నవి. కాని వాని నిర్ధారణమాత్రము సువ్యక్తముగా లేదు, నీ కసౌఖ్యముగ నున్నచో నిన్ను నేనూరడించెదను. నీకుపరస్పృష్టము చేకూరిన నేను నీకుఁదోడ్పడఁ బ్రయత్నించెదను. నీ వపరాధివైన నిన్ను నేను సన్మార్గమునకు మరలింపఁ బ్రయత్నించెదను.

“లేదు. లేదు. నా కేక సెట్టి యాశయును లేదు. నా కొఱకు గాక యీ యువతీయువకుల సౌఖ్యమున కంతరాయము కలుగునని నే నింత పరితపించుచుంటిని. నేఁడు సాయంకాలమున వారి వివాహమున కనుమతింపవలెనని లియపోల్డు మేరియాంథరస్సాలు నన్ను వేడిన పుత్రీప్రణయముగ్ధులు నా పాదసన్నిధానమున మోకరించి జాలిగ వేడుకొనిరి. నేను సంతాపభాజనుఁడనుగాన రేపు మధ్యాహ్నములోపునఁ దెలిపెద” నంటిని.

“నీ పరిష్కారము వారి కంతయు ననుకూలమే కాఁగలదు. నీవిఁక మతసంఘనియమముల ననుసరించి పవిత్రవేదికా సమీపమున వారిని నీపుత్రికి నా యువకున కర్పించుట సముచితము సౌఖ్యతమ మగు నంశ మని నేను భావించెదను. ఆయువకుఁ డాకన్నియ కన్ని విధములఁ దగిన వరుఁడు.”

"నీకడపటివాక్యము తీవ్రాశుగమువలె నాటినది. సమహోత్కృతము నెంతటి నిపుణుఁడైన భూలోక వైద్యుఁడును గూడ మాన్పఁజాలఁడో భూలోక మననేటికి పరలోకమునందలి యెట్టి శక్తియును గూడ మాన్పఁజాలనో అట్టి భయంకర మగు గాయమును వ్రేలుబెట్టి యుడుగంట కలిపితివి. నేను పవిత్ర మగు దేవనికేతనమున వేదికాసమీపమున నిలిచి కన్యాదాన మొనరింపరాదు అని నీ వంటివి. నే నా పవిత్రస్థానమును సమీపింపఁజాల నంతయేల? ఆ దేవాలయ గృహాళిని నిర్గమించి లోన నడుగిడుటకుగూడ నా కసాధ్యమని తెలుసుకొనుము" అను నీవాక్యములు హృదయఫలకమును జీల్చివేయఁజాలు నత్యంత గాఢసంతాపస్వనముతో ఫాస్టు నోట వెడలుటచే ఓటోగూడఁ జకితుండై పోయెను. అందులకుఁ బ్రత్యుత్తర మొసఁగుటకుగూడ నతఁ డశక్తుఁ డయ్యెను.

"నిజమే. నేను శాపతప్తుఁడను. ఎట్లని మాత్రము నన్నడుగకుము. పశ్చాత్తాపమున్నగు సాధనములను బోధింపకుము. ప్రపంచమునం దెంతటిఘోరపాతకులకైన నాశ కలదని తెలుపుటకు పవిత్రగ్రంథమునుండి ప్రమాణవాక్యముల నెత్తి చదువకుము. నే నందఱిమానవులవంటి వాఁడను గాను. కాన సామాన్యముగ మానవుల కుపకరించు సాధనము లెవ్వియు నా కుపకరింపఁజాలవు. నేను శాపతప్తుఁడను. నాకెట్టి యాశయును లేదు. ఎట్టిప్రార్థనలును, ఎట్టి పశ్చాత్తాపమును, ఎట్టి కఠిననియమాచరణములుగూడ నాదుర్గతిని దప్పింపఁజాలవు. ప్రపంచమునందలి సన్యాసు లందఱు నేకకంఠ్యముగాఁ బ్రాయశ్చిత్త సూక్తములను బఠించినను నా కీషన్మాత్రమైన మేలు గలుగదు. కాన నాయెదుట నట్టి సాధనములను వేనిని బేర్కొన వలదు. నేను శప్తుఁడ నైతిని" అని ఫాస్టు ఓటోను సమీపించి కఠోరహాస్యముగాఁ బలికెను.

"ఓ ప్రభువా, నన్నేల నీ విట్లు కలఁచి వేయుచున్నావు? ఏమా

నవ్యుఁడైన కరుణానిధియగు సర్వేశ్వరుని కటాక్షమున కెట్లు దూరుఁ
డగునో నే నెఱుఁగఁ జాలకున్నను ఏహాసవ్యుఁడైన—"

,, అదిగో నీ కిపుడు నిజము మనసునకుఁ దట్టినట్లున్నది. అటులే యైనచో నారహస్యమును. విన నర్హుఁడగువాఁడవు నీవు తప్ప మఱి యెవ్వఁడును లేఁడు. నీవాక్యములు గాఢమైత్రిని సూచించినవి. నీకు నాపట్ల నిట్టి పవిత్రభావములు కలుగగలవని నే నెన్నఁడు నాశించి యైన నెఱుగను నాహృదయమువలె సర్వాశలఁ గోల్పోయి దహింపఁ బడుచున్న మానసమునకుగూడ నిర్మలగాఢానురాగ పరిపూర్ణయగు మానినీమణి విమలప్రణయమునకు రెండవదిగా నిక్కపుమిత్రుని మైత్రివిశేషము బాధానివారక మగు నమూల్యదివ్యమణిరాజమై యలరారుగదా. కాన నేను అంతయు ఇప్పుడే నీ కెఱిఁగించెదను. "

,, ఆహా నీ వత్యంతసంతాపకర మగు న సౌఖ్యమునకు బాలై యుంటి వని స్పష్ట మైనది. నీ వపరాధివని మహాపరాధివని గ్రహించితినిగాని పరమపాతకులఁ బావనులఁ జేయఁజాలు పవిత్రవేదికా సన్నిధానమునకుగూడ రాఁజాలకుండుటకును. నీ కాశ లేశమైన లేకుండుటకును నీ వెట్టి ఘోరకృత్యమును నొనరించితివో మాత్రము నేను గ్రహింపఁజాలకున్నాను "

,, అటులైన దాని నెఱుఁగ గోరకుము, ప్రయత్నింపకుము. ఆయువకులసౌఖ్య విషయమున నేను తెలిపిన విషయములను గూర్చి మాత్రమే యాలోచింపుము. పురోహితుఁడు పవిత్రమగు వివాహవిధిని నిర్వర్తింపవలసి యున్నది. కాని నేను వారితో దేవాలయమునకు రాజాలను. నే నట్లు రాకుండినచో లియపోల్డు రాకుమారుఁడును మేరి యానతియును తమ్మవమానించితి నని భావించుట నిశ్చయము. నా భార్యకు గూడ నది చాల వింతగాఁ గనఁబడును. వారి కందఱికిని నే నెట్లు సంతృప్తిని గలిగింపఁ జాలుదును ? "

,, అయ్యో! ఈ మహావిషమపరిస్థితులందు నేను నీకుతోడ్పడఁజాలుదు నని నీ వెట్లు భావించితివో గదా ? ”

,, నీ వేమైన నుపాయమును తెలుపఁ జాలవా ? నేను రానందుల కెట్టి యనుమానమును గలిగింపని సాధనమును గూర్చి నీవు బాగుగా నాలోచింపరాదా ! నాకు బదులుగా నీవు కన్యాప్రదాన మొనరించు నట్టి ఏర్పాటుసమంజసము. ఎట్లైన నన్నీ దురవస్థనుండి దరిజేర్చెద వని పుట్టెఁడాసతో నే నీచెంతకు వచ్చితిని. నీయందెల్ల వారికి నత్యంతమగు పూజ్యభావము గలదు కాన నీ నోట నేదైన సముచితమగు సమాధానము వెలువడినవారి కందరికి గూడ సంతృప్తి కలుగును. నీవు సత్యవాది వని వారికి గాఢవిశ్వాసము గలదు. ,,

,, ఆవిశ్వాస మెన్నటికిని దొలఁగఁగూడదు. ఈ యువకుల వివాహావిధి కొనసాఁగుటకైనను వారిపై నా కత్యంతానురాగముండినను గూడ నట్టి పవిత్రసమయమున పవిత్రస్థలమున నే నసత్య మాడు వాఁడ గాను. ,,

,, అట్లైన నా కిఁక నథోగతి గానా ? నేను జెడితిఁ జెడితిని ! నీమైత్రిని విశ్వసించుటలోఁ బొరబాటునకు లోనైతిని. ,,

,, అదిగో నీ వనవసరముగ నన్ను నిందించు చున్నావు. అక్రమముగాని సాధన మేదైన నున్నచోఁ దెలుపుము. నాకెంతటి ప్రమాదము కలుగ నున్నను గూడ నీకు మేలు కలుగునేని నీకు సంప్రాప్తమైన యసౌఖ్య మణుమాత్రమైనఁ దొలఁగునేని నే నెట్టి సంశయమునకును లోనుగాక దానిని దప్పక నెఱవేర్చెదను. కాని నాకుఁ గళంకముఁ దేజాలుకార్యమును మాత్రము నే నొనరింపఁజాలను. ,,

,, చాల సంతసించితిని. కాని నే నట్టి మార్గమును దేనిని గూడఁ జూపింపఁజాలి యుండలేదు. ఈ రహస్యము నతిభద్రముగఁ గాపాడెద వని నమ్మెదను. ,,

„ నీవు నిర్భయుఁడవై యుండ వచ్చును.” అని ఓటో పలుక ఫాస్టు వెడలిపోయెను.

## ౭౪

ఈ సంభాషణమువలన ఓటో మానసము చాలచింతాకుల మయ్యెను, ఫాస్టు విశేషబుద్ధి చెరసాలనుండి యత్యద్భుతముగఁ దప్పించుకొని పోవుటయు లిస్బ్రాపుదుర్గమునుండి ధరస్పా నవలీలఁ గొని రాగలుగుటయు, రోసెంథాలుదుర్గమున నొంటరిగా శత్రువుల పాలఁ దోలుటయు, నాకస్మికముగ మహైశ్వర్యమును మహోన్నతపదవిని బడసి ధరస్పాను బెండ్లియాడఁగలుగుటయు ఆతఁడప్పుడప్పు డమితచింతాక్రాంతుఁ డగుచుండుటయు దుస్స్వప్నములం గని దుఃఖించుచుండుటయు దేవళములు మున్నగు పవిత్రస్థలముల కెన్నఁడును బోకుండుటయు ఓటో యిదివఱకే యెఱిఁగియు వినియు నుండెను. తన పుత్రిక వివాహసమయమున గూడఁ దాను దేవాలయమునకు రాజాలననియు శాపగ్రస్తుఁడ ననియు నిపుడే ఫాస్టు తెలిపి యుండెను. వాని నన్నిటిని ఓటో బాగుగా నాలోచించి చూడ నాతని కొక యనుమానము ప్రబలము కాసాఁగెను.

„ ఒక్కటే కీలకము నాకు గోచరించు చున్నది. కాదు, కాదు, అంతటి దారుణము జరిగియుండునా ? కాని యట్టి దారుణావస్థయం దుండువారు కొందఱు అన్నిటికిని దెగించి తమ యాత్మలను భూతనాథునికి వశపఱచిరను కథలు లేక పోలేదు. అట్టిభూతములు తమశక్తిని మానవులపై వినియోగించుటకు సర్వేశ్వరుడు వానికట్టి శక్తి నిచ్చియుండునా ? ఆహా ! ఎంతదారుణము. నా కిప్పుడు కలిగిన కడుభయంకర మగు ననుమానము కల్లయగుగాక ! సతీతిలక మగు ధరస్పాకొఱకును విమలస్వాంత యగు అడీలాచకన్యకొఱకును—ఫాస్టు కొరకును గూడ నీ యనుమానము నిరాధారమగుగాక !” అని ఓటో తం

పోయుచుఁ గిటికీచెంత నటునిటు నడయాడుచుండు నంతలో ఓటో గృహ సమీపమున రాజమార్గమున నెవరో యిద్దఱు ప్రాణములకు దెగించి యొండొరులతోఁ బోరుచున్న ధ్వని వినఁబడియెను. రక్షింపుడు రక్షింపుడని యెవరో పెద్దయెలుంగున నఱచిన కేకగూడ వినఁబడెను.

తత్క్షణమే ఓటో యొక్క యుఱుకులో వీధిలోని కురికి కరవాలమును ఝళిపించుచు ముందునకు బోవ నేలబడి యున్న మానవశరీర మాతని పాదములకుఁ దగిలెను.

వెంటనే ఆ వ్యక్తిని చేతులపై నిడుకొని లోనికి గొనిపోయి ఓటో తన యనుచరులను బిలిచెను. వారు శీఘ్రముగఁ గరదీపికలం గొని వచ్చిరి. ఆవ్యక్తికి యూపిరి యాడుచుండుటఁ గ్రహించి ఓటో కొంత స్వస్థతఁ జెందెను. అంతలోఁ బరిజనులు దీపముల చేరువకుం గొనిరా లియపోల్డు రాకుమారిని కుటుంబవైద్యుఁ డగు హోరెనుబర్గే ఆవ్యక్తి యని గ్రహించి ఓటో వింతఁజెందెను.

ఆతనికి బలమగు గాయము తగిలినది. ఆతని వక్షోభాగమునుండి రక్తము స్రవించుచున్నది. ఓటో పరిజనులలోఁ గొందఱు వెంటనే వైద్యుని కొఱకు పరుగిడిరి. మఱికొందఱును ఓటోయు హోరెనుబర్గును మఱియొక గదిలోనికి గొనిపోయి వస్త్రాదికములఁ దీసివేసి శయ్యపై బరుండఁజేసిరి. ఓటో పంపిన వార్తవలన భోజనగృహమునుండి నీనాగూడ నాగదిలోనికి వచ్చెను. వారిరువురును హోరెనుబర్గునకు సర్వోపచారముల నొనరింపసాఁగిరి.

త్వరలోనే ఓటో కుటుంబవైద్యుఁ డేతెంచి గాయము పరీక్షించి ప్రాణభయమును సూచించునట్లు తల యూఁచెను.

" గాయము ప్రాణోపద్రవకరమా " అని ఓటో యడిగెను.

" గాయము ప్రాణోపద్రవకరము కాదు కాని, రక్త మధికముగ స్రవించినది. హోరెనుబర్గు వృద్ధుఁడు కాన గొంచె మపాయము

కలదు. దానికి మనము నిరాశఁ జెందఁ బనిలేదని" పలుకుచు వైద్యుఁడు గాయమును శుభ్రపఱచి నిపుణతతోఁ గట్టు గట్టసాగెను. అంతలో డోరెనుబర్గు కనులువిప్పి చూచెను. ఆతనికి కొంచెము స్మృతివచ్చుచున్నట్లు కనఁబడెను. అతనిచే నౌషధము త్రాగించిరి. మరల గాయమునుండి రక్తస్రావము కలుగకుండ నేర్పాటులఁ జేసిరి. మరల రెండు గంటలలో వచ్చెద నని వైద్యుఁడు వెడలిపోయెను.

ఆరాత్రి ఓటో నీనా లాగదిలోనే యుండి యావృద్ధునిఁ గని పట్టుటకు నిశ్చయించుకొనిరి.

వైద్యుఁ డర్ధరాత్రివేళ వచ్చి చూడ వృద్ధుఁడు గాఢనిద్రయం దుండెను. ఉదయమునఁ దాను రాకముందే వృద్ధుఁడు లేచునెడల జేయవలసిన వైద్యోపచారముల కొన్నిటిని సూచించి వైద్యుఁడు వెడలిపోయెను.

"ఇఁక నీవు పోయి పండుకొ" మ్మని ఓటో బలవంతపెట్టుటచే విధిలేక నీనా వెడలిపోయెను. ఓటో యొక్కఁడు మాత్రమే యా గదిలో నుండెను. వృద్ధుఁడు గాఢనిద్రయం దుండెను. ఓటో కంటిపై రెప్ప వేయనే లేదు. కొంచెము నిదురమత్తు కనఁబడగనే యాతఁడు లేచి అటునిటు మెల్లనఁ దిరుగుచు నిదురఁ బోగొట్టుకొనసాగెను. ఆతఁ డంతసేపును ఫౌస్టును గురించియే యాలోచించుకొనుచుండెను. అటులే సూర్యోదయ మైనది.

రోగి తలవైపున నొక పడకకుర్చీపై ఓటో పండుకొని బాలార్కద్యుతిరామణీయకము నానందముతోఁ దిలకించుచుండ, "నే నెందున్నాను, నా కేల యింతనీరసముగా నున్నది. ఇదియేదైన దుస్స్వప్న మా యేమి" అను పలుకు లతిమంద మగు స్వరమున ఓటోకు వినఁబడెను.

,, మీరు శాంతముగఁ బండుకొనుఁడు మీకు బలమగుగాయము తగిలినది. మీ రెంత శాంతముగ నుండిన నంతత్వరలో నయమగు'' నని ఓటో తెలిపెను.

,, ఈ కంఠస్వరము నాకు పరిచితమే. ఓటోపియసల్లా స్వరమనుట కెట్టి సంశయమును లేదు. ''

,, ఔను నిజమే. మీరు మిత్రుల సమీపముననే యున్నారు. కాన మాటలాడకుండఁ బండుకొనుఁడు. మిము నే వేడుకొందును. ''

,, ఓటో, నేను గొన్నిమాటలను చెప్పక తప్పదు. దైవానుగ్రహమున నీయింటఁ జేరఁగలిగితిని. నా రహస్యము వినఁదగిన వారలలో మతాచార్యుని కంటెఁగూడ నీవే యుత్తముఁడవు ''

,, అయ్యో! ఇదేమి మీ రిట్లనుచున్నారు? ప్రజ్ఞావిశేషమునను వలెనే సద్వర్తనమునకుఁగూడ వాసిగాంచిన మీకు సంతాపకారణ మెయ్యది యుండగల '' దని ఓటో పలికెను.

,, ముఖభావాదులను బట్టి మనోనిర్మలత్వమును నిర్ధారణచేయుట సాధ్యమని యెన్నఁడును దలఁపకు. దైవమునుసైతము దూషునిగావించుటకు బాపపురుషునికిఁగూడ 'బానిస నొనరించుటకును నెన్నియేండ్ల నుండియో యలవరచుకొనిన సద్వర్తనమును విమలభావమును క్షణికమున నిర్మూలించుటకును జాలినదై మానవుల నవలీలలోఁ బఱచుకొన జాలిన యాకర్షక మహాశక్తులు రెండున్నవి' ,,

,, అవి యేవి?

,, కాంతాకనకములు కొందఱొకదానికిని గొందఱు మఱియొక దానికిని గొందఱు రెండింటికినిగూడ నీచదాసులై పోయెదరు. నేను గనకమును రాక్షసికి నాయాత్మ నమ్ముకొనిన నీచుఁడను. చిరకాలము నుండి యలవరచుకొనిన సద్భావసద్వర్తనములను తృణప్రాయముగ నాబంగారు రక్కసి పరముఁ జేసితిని స్వర్ణాపేక్షవలన నాకు సర్వస్వనవినాశనము కలిగినది '' అని స్టోరినుబర్గు పలికెను.

ఈపాపవృత్తాంతమును మఠాచార్యుని చెవిని వేయకుండనే ఫౌర నుబర్గు ప్రాణముల విడుచు నేమో యటుపైన నాతని యాత్మ పునీత ముగా దని ఓటో సంభ్రమముతో మఠాచార్యుని బిలువ బో గిడ సాగెను.

" వలదు పోవలదు. నీకుఁదప్ప—మఱియెవ్వరికిని నే నారహస్య మును వెల్లడింపను. నీ కెఱిఁగించినచో నది వెల్లడిగా ననుమనశ్శాంతి నాకుఁ గలుగును. కాని నేను జనిపోయిన పిమ్మట."

" చిత్తము నుత్తలపరుపకుఁడు తొందర లేదు. నింపాదిగాఁ గొన్ని గంటల కావల నేదో కొన్నిదినముల కావల "

" కొన్ని దినములా? గొన్ని గంటలా? కల్ల, నాకు మరణ మాసన్న మగుచున్నది. నిన్న నొక రోగికి చికిత్సచేసి నే నింటికి పోవుచుండ దారిలో నాపైబడి తస్కరుఁడు పొడిచినకత్తిపోటు త్వరలోనే నాపనిని తీర్చినది."

" కట్టుకట్టిన వైద్యుఁడు గాయములను బరీక్షించి ప్రాణాపాయము లే దని తెలిపెను. మీరు నెమ్మదిగ నలసటబడకుండ నున్నచో—"

" నే నీరహస్యమును నీ కెఱిఁగించు వఱకుఁ నాకెట్టి మనశ్శాంతి యగును. పరలోకమున నెట్టిముక్తియునుగూడఁ గలుగ నవకాశము లేదు. చేరువకు వచ్చి సావధాన చిత్తుఁడవై వినుము. నేను దానిని బిగ్గరగఁ దెలుపఁజాలను. ఈవార్త నామాత్రము వెల్లడియైన జీర్ణప ర్ణకుటీరమున పాచకాగ్నివలె తక్షణమున వియన్నానగరము నలము కొనును. అట్లు జరుగు నేని నన్నును మఱియొకనిని ప్రాణము లుండగనే శత్రువులు క్రూరమూర్తులై ముక్కలు ముక్కలుగ జల్చి వేయుట నిశ్చయము."

అని ఫౌరెనుబర్గు పలుక ఓటో మహోత్కంఠతతో నతనిచేరువ కేఁగి ఆతనినోటిచెంతఁ దనచెవిని జేర్చి వినసాగెను.

,, ఏమనెనిమి దేండ్లక్రితము లియపోల్డు రాకుమారుని మందిర మున నొక్క కాలమున నొక్కదినమున నొక్క మూహూర్తమున నిద్దఱుత్తమవంశజు లగునారీమణులు ప్రసవించిన యుదంతము నీకు జ్ఞాపకమునం దున్నదా ?

,, లేకేమి అపుడు మీరు మేరికూరాకుమారి ప్రసవమునకుం దొప్పడినదిగూడ నే నెఱుఁగుదును ''

,, ఔను నన్నందులకు రాజు నియమించియుండిన నెంతయో మే లయ్యెడిది. దాని కేమి అపుడిద్దఱు శిశువులు జనించిరి. ''

,, మాక్సిమిలను రాకుమారుఁడును అడీలా కన్యయును ''

,, ఇపుడు ఆలనే వారిని పిలుచుచున్నారు. గాని యథార్థమున అడీలా రాకుమారిని మాక్సిమిలను ప్రభుకుమారియని యే పిలువఁ దగును''

ఏమి, ఏమి. స్పష్టముగా దెలుపుము.

,, ఒలికామందిరమునం దాశిశుశువులను మార్చుటకు గొప్పకుతం త్రము పన్నఁబడియెను. ''

,, ఆహా నాకిపు డంతయును సుబోధ మగుచున్నది. ఎంతదారుణ మగు రహస్యమును వినవలసి వచ్చెను. ''

,, నిజమే దారుణరహస్యము గాన నే దానిని నాతోఁబాటు నేను సమాధిలోనికి గొనిపోఁజాలక పోతిని. ఆశిశువులు పుట్టిన కొన్నిగం టలలోనే ఆమార్పు జరిగినది. ''

,, నిజము నిజము. మేరియూరాకుమారికి అడేలాకన్యపైనను థర న్నాపతిభుజానికి మేక్సిమిలను రాకుమారుని పైనను గాఢానురాగ ముంచుటకు సహజ మగు మాతృప్రేమయే కారణ మని యిప్పటికి స్పష్టమైనది. దానిని ధ్రువపరచుట యెట్లు ? ''

" థరన్నాపతిభార్య ప్రసవసమయమునఁ దోడ్పడిన డాక్టరు లబ్జమును మేరికూరాకుమారి చెంత నుపచారిణిగా నుండిన సౌధ్యనసతియును

జపించినేయున్నారు. వారిచే నిజమును జెప్పింపవచ్చు" నని వారను బస్సు హీనసత్త్వుండై కడు హీనస్వరమునం బలికెను.

"ఒక్కమాట ఎవరి ప్రోత్సాహమువలన—"

"ఫౌస్టు—జోరానాప్రభువు నా ప్రాణము—పోవు—వఱకు నీ రహస్యము—కాపాడు—శాంతముగ జీవముల విడువ నిమ్ము" అని వైద్యుండు గ్రుడ్లు తేలవేసెను.

"అయ్యో అయ్యో మహాచార్యుండు మహాచార్యుండు—ప్రాణముపోవుచున్న" దని ఓటో కలవరపడి కూవలకుంబోయి మహాచార్యునికొఱ కొక పరిజనుని వైద్యునికొఱ కొక పరిజనుని బంపి మరల లోనికి వచ్చునరికి ప్రాణోత్క్రమణసమయ మయ్యెను. డాక్టరు వారే నుబస్సు తనువుం దొరంగెను.

## ౧౫

కాలెనుబర్గు పర్వతోపరిభాగమున రెండు స్వరూపములు మానవాకృతులతో గోచరించెను. ఫౌస్టు పాపపురుషుండు.

"నన్నేల పిలిపించితివి ?"

"కొన్నివారములవఱకు కొన్ని నెలల వఱకు ప్రజలు సుఖభోగముల మఱవంజాలునంతటి ప్రణయపరిపూర్ణు లగు యువజనులు గూడ ప్రేమప్రసంగములను గట్టిపెట్టి జాలునంతటి భయానకస్థితి వియన్నానగరమున గలుగవలెను. ప్రజలందఱును ప్రాణముల నరచేత నిడుకొని మెలంగవలెను. రాచకార్యములు వివాహములు వినోదములు మున్నగున వన్నియు నిత్యకృత్యములును ముఖ్యకార్యములును గూడ కట్టుంబడి పోవలెను."

"లెస్సగా నాలోచించియే ఆజ్ఞాపించితివి గదా వెనుక నీయాజ్ఞననుసరించి వాయుప్రకోపనమును గలిగించినపు డెంతటి జనక్షోభము కలిగెనో మఱవలేను గదా ?"

" లేదు. నా కిది యిష్టము గాకున్నను విధిలేదు. నీ వట్టి సాధన మును వెంటనే ప్రయోగింపక తప్పదు. ఎంతటి సంక్షోభము కలిగి నను సరే నేను లెక్కచేయను. ''

"అటులైన నేనిపుడే నీయాజ్ఞ నెఱవేర్చెద'' నని పాపపురుషుఁడు పాగు రమంత్రములఁ బఠించెను. తోడనే నీమతలయంత మబ్బు దూర్పున దోఁచి క్రమక్రమముగ నాకసము నంతయును గ్రమ్మి సహింపరాని దుర్గంధముతో వియన్నానగరము వంకకుఁ గాలి రాసాగెను. ఇటు లామాయమబ్బు పది నిముషములలో వియన్నానగర పరిభాగము నాక్రమించి మరల నగోచరమై పోయెను.

" నీవు ప్రయోగించిన సాధన మేమి ?

" నేను మహామారిని బ్రయోగించితిని. దాని నిపుడు పారిశ్యదే శమునుండి ఆకర్షించితిని. అపుడే ఆ మహామారి వియన్నానగరమున జాతర సాగించుచున్నది. ''

,, హా! హా! క్రూరగరాతుసాధనమా! పాపభూతమా! వలదు. వలదు. దాని నుపసంహరింపుము. ''

,, అది యిపుడు నాకు సాధ్యముగాదు. బాగుగా నాలోచించుకొ మ్మని నేను మొదటనే తెలిపి యుండలేదా ? ఇందు నాదోష మేమియును లేదు '' అని పలుకుచు పాపపురుషుఁ డటనుండి వెడలి పోయెను. హా! హా! నే నంతటి ఘోరపాతకిని ఎంతటి దారుణమున కొడిగట్టితి నని ఫాస్టు తనచేతులతోఁ గల్పై మోదుకొనుచుఁ బిచ్చి వానివలె వియన్నానగరమువంకకు పరుగెత్తెను.

౮౯

పాపపురుషుని పాచురము వృధ యగునా ! ఆకస్మికముగ నాఘోర వ్యాధి వియన్నానగరము నలముకొనెను. ఫాస్టు మరల వచ్చుసరికి వీధులలోఁ గనఁబడిన పౌరు లందఱును భయవిహ్వలులును దీనవద నులు నై గోచరించిరి.

పౌరు లొక్కరును రాజమార్గములం గాలూని నడచుట లేదు. ఏదో మహాభూతము వెనుకఁగిలిన నోడ లెఱుంగక పరుగిడువారివలె నటునిటుం దిరుగులాడుచుండిరి. దేవళముల చెంతను పుణ్యపురుషుల శిలామూర్తుల సన్నిధానములందును మాత్రమే వారించుకసేపు నిలువజాలుచుండిరి. ఎచ్చట జూచినను వైద్యులకొఱకు పరుగిడువారే కనంబడుచుండిరి.

భార్యయో, జననియో, కన్నబిడ్డయో, మఱియొ సన్నిహితబాంధవుఁడో అకస్మికముగ దారుణవ్యాధికి పాలైనపుడు వైద్యుని కొఱకు పరుగిడినవానికి ఆలస్యముగ నావైద్యుఁ డింటఁగనంబడి వెంటనా నంగీకరించినఁ గలుగు మనశ్శాంతి ఘనతమముగదా ?

ఆ క్లేశంత వేసట బడినను వైద్యులు కనబడకుండుటయు కనంబడినను మహామారిసోకిన రోగికి చికిత్స చేయరాకుండుటయును సంభవించినపుడు నాప్తబంధుల సంతాప మెంతతీవ్రముగ నుండును ?

పాపపురుషునిచే నాకర్షింపఁబడిన మాయమబ్బు యూరోపుఖండ వాసులందఱితోపాటు వియన్నానగర వాసులకునుగూడ గోచరించెను. ఆమబ్బువిడిపోవుటకు ముందే నగరమున వ్యాధిపొడచూపెను. మబ్బు విడిన యొకగంటకు నగరమునం [illegible] వ్యాధిగ్రస్తులైరి.

ఈవ్యాధి మారణపటిష్ఠము, జనవినాశనము నందు దానికి సాటి యగువ్యాధి యింకొకటి లేనేలేదు. ఇట్టివ్యాధి వియాన్నానగరవాసులకు సోకుటకు పూర్వము నూటయిరువదియేండ్ల క్రిత మొకసారి యూరోపుఖండమునం దంతటను వ్యాపించి సగముమందికి పైగా నాశనము చేసెను. కాన నీ వ్యాధి యనినఁ బ్రజల కత్యధిక మగుభీతి కలుగసాగెను. పదునాల్గవశతాబ్దమం దీదారుణవ్యాధి యూరోపుఖండమునఁ దలచూపినపుడు దీని భయంకర లక్షణములం జూచినవారు చేసిన వర్ణనలను తరతరములనుండి యొక్క పొల్లైనపోకుండఁ బ్రజ

లిప్పటికి స్మరించుచునే యున్నారు. ఆశతాబ్దమం దున్నవారిలోఁ బలువురు మరల నావ్యాధి యెన్నటికిని యూరోపుఖండమునఁ దలచూపకుండుట కెన్నియో ధర్మకార్యముల గావించిరి. నిర్మలభక్తితో నిరంతరమును గొందఱు దైవప్రార్థనలు గావించుచుండిరి. అట్టి ప్రార్థనల నెడతెగకుండ జరుపుటకు సంపన్నులు పలువురు తమసంపద నంతను మఠాధిపతులవశము చేసిరి. కొందఱు మూఢవిశ్వాసులు సంసారమును బరిత్యజించి విరాగులై పర్వతకుహరముల కేఁగి తపము లొనరించిరి.

కాన నిపుడీ వ్యాధి మరల తలచూపె నని ప్రజల కత్యధిక మగు భీతి కలిగెను. మొదట నా వార్త నెవ్వరును సమ్మఁజాలరైరి. ఆమాట యొప్పుకొనులకైన వారికి ధైర్యము చాలకుండెను.

ఫాస్టు సంకల్పానుసారము నిత్యకృత్యము లన్నియును నిలిచిపోయెను. వినోదములు, వ్యవహారములు, వ్యాపారములు, కుటుంబవిషయములు, వృత్తిధర్మములు, సర్వమును కృతికాలమున నిరోధింపఁబడియెను.

క్రిస్తుమసు పండుగ దినములలో విం దారగించుచు బంధుమండలి భోజనగృహమున నుల్లాసముగ బ్రొద్దుపుచ్చుచుండ నగ్రభాగమునం దాసీనుఁడైన గృహయజమానుఁ డాకస్మికముగ మృతినొందినచో నాయుల్లాస మెంతలో ఘోరసంతాపముగఁ బరిణమించునో అట్టి పరిణామమే యిపు డాకస్మికముగ వియన్నానగరవాసులకు తటస్థించెను.

ఇట్టి దారుణవిషవ్యాధి లోకపట్టణమున వ్యాపించినపుడు పట్టణమంతయు నేకకుటుంబమే యగును. ఎల్లరును దుఃఖితులే యగుదురు.

నాఁ డుదయమున నెప్పటి యటులే దినమణి సమగ్రశోభతో గగనసీమ నుదయించెను. ఎల్లరు నుల్లసిల్లిరి. మఱియొక గంటకే మహామారణస్వరూపిణి యగుమహామారి పట్టణమునఁ బ్రవేశించి నుగ్గునూచగా జనసంఘమును నుసుమాడసాఁగెను.

ప్రజ లటులోప తెలియంగక భయబ్రాంతులై వీధుల వెంబఁడి దిగగులాడు తరుణముననే ఫౌస్టుచటికి మరలి వచ్చెను. పురుషు లటు నిటుఁ బరుగు లిడుచుండిరి. స్త్రీలు సౌధోపరిభాగములందుఁ గచబంధములు వీడఁ బయ్యెదలు తొలఁగిన చందమైన నెఱుఁగక రక్షింపుడు రక్షింపు డని ఆక్రందన మొనరించుచుండిరి.

మేలిముసుగు సవరించుకొనక యెన్నఁడు నీవలకు వచ్చి యెఱుఁగని యాభిజాత్యసంపన్న లగు నన్నులమిన్నలు గూడ నుపరిచేలాంచలమునైనఁ జక్కఁజేయక కంచుకములు తొడుగ లేకను జ్ఞాపక మైన లేకుండ వైద్యులు వైద్యు లని వీధి గుమ్మములచెంతఁ జేరి మొఱ లిడుచుండిరి.

ఈ వ్యాధిచిహ్నము లతిభయంకరములు. వ్యాధి సోకిన యొక గంటలో రాకాసుధాకర బింబమును బోలు సుందర వదనారవిందము గూడ నతిభయంకరస్వరూపమును దాల్చును. నాల్కఁగూడ నల్ల బడును. విదాహము కలుగును. శ్వాసము భరింపరాని దుర్వాసనతో వెడలుచు వ్యాపకశీలమగు నావ్యాధిని విస్తరింపజేయుచుండును. దుస్సహమగు శరీరపీడ కలుగును. కొందఱు మాటకూడ నుడిగి త్వరలో మృతి నొందెదరు.

పెక్కుమంది సంపూర్ణస్మృతితో జాలబాధల ననుభవించి ప్రాణముల విడిచెదరు. అరణ్యమార్గమున సంచరించు వారి నాకస్మికముగఁ గొండచిలువ పైఁబడి పట్టి తన తోకతోఁ జుట్టఁబెట్టి శల్యాశల్యమును విరచుచు బలవన్మరణమునకు పాలుచేయునపుడు కడవఱకును స్మృతి తొలఁగక ఆజీవుఁ డెట్టి బాధ ననుభవించునో యట్టి వేదన కంటెను గూడ మహామారి వలన కలుగు బాధ మిక్కుటముగ నుండు.

అట్టి బాధను భరింపజాలక మృత్యుదేవతా వడిగ గొనిపొమ్మని పెక్కండ్రు మొఱక్క లిడెదరు. కొంద ఆత్మహత్యలగూడఁ గావించుకొందురు.

పిల్లల కీవ్యాధి సోకిన భీతిలి వారి నింట దిగనాడి తమప్రాణముల దక్కించుకొనఁగోరి పరుగిడెదరు తలిదండ్రులను తలిదండ్రులు మరణావస్థయం దుండఁ జూడలేక మిక్కుట మగు భీతిచేఁ బరిగెత్తి పోవు పిల్లలును ప్రియమిత్రుల నెడబాసిన స్నేహితులును తా మంత వఱకును ప్రాణాధికలనుగా భావించిన భార్యల దిగనాడి పోయిన భర్తలును క్షణకాలమైన భర్తృవియోగమును సహింపజాలకుండెడి వా రయ్యు మహామారిధైర్యసారమున గలింప నిజనాథులఁ జూడ జాలక వెడలిపోవు పడతులు ఎవ్వరిప్రేమకొఱ కట్టి సాహసకార్యమున కైన వెనుదీయకుందురో యట్టి యుపపత్నుల నట్టె విడనాడి పోవు ప్రియులునై పట్టణము భీభత్సముగ నుండెను.

వైద్యులుగూడ నిజౌషధములు నిరుపయోగము లని గ్రహించి చేయునది లేక చింతాకులురై యుండిరి.

ఈ మహామారి మానవులను మాత్రమేగాక పసువులు పక్షులు కుక్కలు పిల్లులు గుఱ్ఱములు మున్నగువానినిగూడ వినాశన మొనరింపసాఁగెను.

కొందఱు వ్యాధి సోకిన వెంటనే ప్రాణముల వదలిరి. కొందఱు కొన్ని గంటలలో మృతినొందిరి. మూఁడుదినములకంటె నెక్కువగా జీవించినవా రొక్కరును లేరు.

మూఢవిశ్వాసములు ప్రజలలో మెం డయ్యెను. ఎంతటిధైర్యశాలులకునుగూడ మనసు కుదురులేకుండెను. భయంకరము లగు వదంతులు ప్రబలసాగెను. వ్యాధి సోకినవారిదృష్టి తగిలినంత మాత్రమున నావ్యాధి తమ్ముగూడ హతమొనరించు నను మూఢవిశ్వాసము ప్రబలమయ్యెను.

౭౨

వియన్నానగరమునం దిట్లు మహామారి కడుభయంకరముగఁ బ్రబలి
యున్నకాలమునం దానగరవాసు లందఱును భయంకర వ్యాధి కించు
కయు జంకక ఆవ్యాధి తనకుగూడ సోఁకు నేమోయనుభీతి గో
రంతయు లేక నిర్భయస్వభావుఁడై తిరుగఁగలిగినవాఁ డొక్కఁడుమా
త్రమే యుండెను. ఆవ్యాధి తనకు సోఁకఁజాల దనుగట్టిసమ్మకము కల
వాఁడు ఫౌస్టొక్కఁడే.

నగరవాసులలో నీచతమకృత్యముల నిర్వర్తించువారు, కడు
పుమంటచే మలమలమాడుచు బ్రతుకునందు రోఁతఁ జెందినవారు, నవ
నాగరకభానుమండలమున నల్లడాగులవలె సంఘమును గళంక మొన
రించుచు ధనికుల కవమానకరముగ జీవించునిరుపేదలు — దారిద్ర్య
మునకును దుస్థితికిని ధనికులకాఠిన్యమునకును గుఱియై హతాశులై
యుండి తెగువకు దిగినసాహసికులు కొందఱు ఇదివఱకే నగరపాలకుల
కొలువునఁ జేరి వీధులలో బ్రాణముల వీడనున్నవారిని నగరబహిఃప్ర
దేశమునం దున్నవిశాలభవనమునకు చేర్చుటకును చనిపోయినవారి
నిండ్లలోనుండి తీసుకొనిపోయి కలెనుబగ్గన కావలనున్నబయలునఁ
బూడ్చివేయుటకును సంసిద్ధులైరి. వ్యాధి కనఁబడిస్వల్పకాలమే యైనను
నాయల్పకాలమునందే పెక్కండ్రు మృతినొందిరి.

కాన ఫౌస్టు రాజమార్గమున నడుచునప్పటి కప్పుడె శవశకటములు
గూడ సాఁగుచుండెను.

అప్రయత్నముగ తనసంకల్ప మేమియు లేకుండ ఫౌస్టు ఓంటఁగ
ుంటివంక కేఁగసాగెను. తన యాజ్ఞవలన నగరమును వ్యాపించి
ఘోరదుర్దశఁ గలిగించుచున్న యాదారుణవ్యాధిని గని ఫౌస్టు మన
స్థైర్యమును గోల్పోయి — నివ్వెరపొంది భయభ్రాంతుఁ డయ్యెను.
కల్లు ద్రాఁగిన వాని వలెఁ దుళ్ళిపడసాఁగెను.

భయంకరములగు నూహ లాతని చిత్తమును గలంచివేయుచుం డెను. అతఁడు కాల్పనికప్రపంచమున భయంకరదృశ్యములఁ గాంచుచుండెను. తన చండమును గూర్చి యాతని కంతకు పూర్వమే కలిగియున్న నసహ్యభావ మిపు డత్యధిక మైపోయెను.

అతని కమానుషశక్తు లెన్నియోచించినను దారుణసాధనము లపారముగ నాతని కరగతములై యున్నను, నిరంతరమునుతన దుశ్చరితమును స్మృతికిదెచ్చుచు నిందించుచుండు నణుస్వరూపమగునంతరాత్మ నోరు నొక్కుట కాతఁ డశక్తుఁ డయ్యెను. కాన నట్టి వ్యాకులదశయం దాతఁడు—స్వగృహమును, కుటుంబమును, ప్రియజనుల నందఱినిగూడఁ బూర్తిగా మరచి పోయెను. లేనిచో వారు మహామారి పాలు గాకుండ దూరముగ నెటకేని గొనిపోవుట కాతఁడు ప్రయత్నింపకుండు వాఁడు గాఁడు.

ఈ రీతిగా నాతఁడు కడువడిగ ఓటో గృహ మున్న వీధియందుఁ బ్రవేశించెను. ఓటో సందర్శనము వలనఁ దన కేదో శాంతి గలుగగల దనునాశ యస్పష్టముగనాతని మదినిగోచరించి యతని నాయింటికాకర్షించినది. అప్పటికాగృహమున డొరెనుబర్గ మృతినొంది రెండు గంటలు మాత్రమే యయ్యెను.

పరిజనుఁడు ఫాస్టు నతిథిగృహమునకు గొనిపోయెను. వెంటనే ఓటో యచట నతనిని గలిసికొనెను.

,, నీరాక చాలవింతఁ గొలుపుచున్నది. ఏలయన నిన్నుజూచుటకే నేను చాల తత్తరపడుచుంటి '' నని ఓటో పలికెను.

,, నన్ను జూచుటకా ?

,, అతిదారుణ మగు రహస్య మింతకుముందే నాచెవినిబడినది.''

,, అతిదారుణ మగురహస్యమా ? ''

,, డాక్టరు డొరెనుబర్గు తన మరణసమయమున దానిని స్వీకరించెను. ''

,, హా డాక్టరుహో రెనుబర్గు నన్ను వంచించి మృతిఁ జెందెనా ? యాతఁడు నీ కీ లిశాగృహ రహస్య వృత్తాంతమును నీకు వెల్లడించెనా ? జరిగిపోయినది. దానిని మరలింపఁజాలము. కాని ఓటరీ వినుము. నీ వా రహస్యము నొరుల కెఱిగింపకుండ నీనిముషముననే నిన్ను నీరుచేయు శక్తి నాకుఁగల దని తెలుసుకొనుము. క్షణములో నీవు మృతుఁడవై నాపాదాంతికమునఁ బడిపోవునటుల నేను జేయఁగలను. ,,

,, నీశపథము లతిదారుణములు. అతివిచిత్రములు. కాని సర్వశక్తి సంపన్నుఁ డగు సర్వేశ్వరునే నేను నమ్మియుంటిని. ఈరహస్యమును నీవినాశనమునకు నే నెన్నటికి నుపయోగించువాఁడను గాను. నీకు మర్యాశమును గలిగించుట నాయభీప్సితము కాదు. నీశపథోక్తులవలన నీ కట్టి యమానుష శక్తులు కల వనియు డారెనుబర్గు తెలిపిన విషయము కల్పితము కా దనియు స్పష్టమగుచున్నది. ,,

,, నిజమే. అతిదారుణ మమానుషము నగుశక్తి నావశమున నున్నది. ఆశక్తిని బడయుటకు ననంతమగు నాయాత్మను గుదువఁ బెట్టితి ,, నని యంతలో చెవినిబడిన శవశకటధ్వానముచేఁ జిత్తము త్తలముఁ జెంద ఫాస్టు పలికెను.

" ఓభాగ్యహీనుఁడా ! ఆమాటపలుకకుము. అదియే నిజ మని తెలుపకుము. అయ్యో. అదియే నిజ మని నేను వినఁజాల. నిజమై యుండదు. అంతటిపని జరిగి యుండదు. కాని నీ కాకస్మికముగ మహదైశ్వర్యమును మహోన్నతపదవియును లభించుటకు నీవత్యద్భుతకార్యముల నొనరించి యుండుటను దలంచిన— "

" నిజమే, నిజమే. నిస్సంశయము ! ఇపుడు నీకు నాపై సంపూర్ణమగు విరసనము కలుగలేదా ? నన్ను స్పృశించుటకుగూడ నీ కసహ్యత గలుగుటలేదా ! నేను దేనిచూచినమాత్రమున నిన్ను దహింపఁజేయ గల ననుభీతి నీకుఁ గలుగుటలేదా ?,,

,, నేను మానవుఁడ నగుటచే నీపై నసహ్యాభావము కలిగియుండుట కవకాశము లేదు. అది మానవధర్మము కాదు. నేను క్రైస్తవుఁడ నగుటచే నీయద్భుతశక్తికి నా కావంతయును భీతి కలుగనేరదు. నేను దైవరక్షితుఁడ నను సంపూర్ణవిశ్వాసము నాకుఁ గలదు. కాని ఆహా! నీ వెంతపని జేసితివి! ఐన నేను నిన్నిపుడు నిందించుట నిష్ప్రయోజనము. నీకుఁ దటస్థించిన ఘోరదుర్దశ సర్వేశ్వరునికే విదితము. నే నాపవిత్రనామమును స్మరించినంతమాత్రమునే నీవిట్లు తూలిపోవుచుంటివేల? నిజమే. నీవు మహాదారుణకార్య మొనరించితివి. కాని దానిని మార్చ నవకాశము దాటిపోలేదు. సర్వేశ్వరుని కరుణ యపారము. నీకొఱకై — నీతో — నేనా దేవదేవుని నేఁడు ప్రార్థించెదను.

,, అయ్యో! ప్రార్థనావాక్యాక్షర మొక్కటి నానోట వెడలినతోడనే నీవు మృతిఁబొందుదువు. పాపపురుషుఁడు దారుణస్వరూపమున నేతెంచి నిన్ను గొనిపోవును. ''

,, ఆహా! నే నేమిచేయనేర్తును? నే నిట్లుగతికునిగతి నిన్ను విడనాడఁజాల. లోకులందఱును నిన్ను బరిత్యజించినను నేనుమాత్రము నిన్ను బరిత్యజింపఁజాల. నీకు హితబోధ మొనరించువాఁడ. నిన్నోదార్చువాఁడ. ఈ మహాదారుణమును దొలగించుటకు సాధనాంతరము నారయునచో నీ యాలుబిడ్డలు మున్నగు సన్నిహితబంధు మండలి మహాపకృతికి బాలుగావలసి వచ్చునుగదా! ఆలోచించుము. సాధనాంతర మేమైన నెఱింగింపుము. మేరియానకు నీపుత్రిక యనఁబడు కన్నియపై ధరస్సాను రాసుతుఁ డనఁబడు యువకునిపై గాఢానురాగము మాతృసహజ మగు నిర్మల ప్రేమప్రవంతి సంతతవాహినిగా ప్రవహించుచుండ నీకపట నాటక మిఁకెంత కాలము కొనసాగఁదగును? నిన్ను నే నపయశము పాలు చేయఁ గోరను. కాని ఎటుల? ''

,, కాని ఎటుల అంతరాత్మను దిరస్కరింపఁజాలుదు నని యడుగు చున్నావా? నే నెంతటి దుర్దశయం దున్నను నీ సద్వర్తనమును, నీవిమలచరితమును గ్రహించి యభినందింపఁజాలని వాఁడఁగాను. నీ కెన్నివిధములనో యపకారి నైన నీ విపు డిట్లు మహోదారమతివై చూపిన సానుభూతి, నెయ్యము, నాకు ఏకాకియగు నాహృదయమున కెంతటి శాంతిని గలిగింపజాలి యున్నది. ఇఁక నీకడ నే నేవిషయము నైన నేల మఱుగుపఱుప వలయు? వినుము. మహాదారుణవృత్తాంతము నాలకింప సంసిద్ధుఁడవు గమ్ము. ''

అని పలికి ఫౌస్టు కొంచ మాఁగి తన వదనమున దొప్పఁదోగిన చెమ్మట నల్లనఁ దుడుచుకొనసాఁగెను. ఒక పాత్రిమున ద్రాక్షారసమును జలమును చేర్చి ఓటో యాతని కందీయ నాతఁడు సంతసముతో దాని నాస్వాదించెను.

అంతట ఫౌస్టు తన పూర్వవృత్తాంతము నంతయును ఓటో కెఱిఁగించెను. థెరస్సాపైఁ దనకు గలిగిన మోహాతిశయము నామె జనకుని ప్రాతికూల్యము, పాపపురుషసంకర్షనము, ఆత్మసమర్పణము, దేవాలయాది పవిత్రస్థలములకు పాపపురుషుని యనుమతిఁగొనకుండఁ బోకుండుటకుఁ దాను సమ్మతించి ప్రమాణ మొనరించుట, యావల థెరస్సాను బెండ్లియాడుటకు దేవాలయమున కేఁగవలసి వచ్చినపుడు తన జ్యేష్ఠపుత్రునిఁగూడ పాపపురుషునికి వశపఱచుట కంగీకరించి యాతని యనుమతినిఁగొనుట, అందులకా పాపపురుషుని వంచించి తన సుతుని నాతని బారినుండి కాపాడుటకే హోలికాగృహమున శిశువులను మార్చుట మున్నగు విషయముల నన్నిటిని ఫౌస్టు ఓటోకుఁ దెలిపెను.

,, ఆహా! పరమ సుకుమారుఁ డగు మాక్సిమిలను కెంతటి దురవస్థ తటస్థించినది. ఆతని జననవృత్తాంతమును వెల్లడించి జననీ తనూజాతుల నిపుడైనఁ గలిపెద మన్న నాసుకుమారుఁడు పాపపురుషుని

పాపపాశములఁ జిక్కువడుట తటస్థించునే. ఆహా యిప్పుడుగూడ నీ రహస్యమును వెల్లడింపరాని దురవస్థనే తటస్థించెనే. "

"నేను దేవళమునకు రాజాలకుండుట వలననే నేను వారి పరిణయము నాలోచింపవలసినవాఁడ నైతినని నీకిపుడు తెల్లము కాగలదు. ఇపుడు నగరమున మహామారి వ్యాపించి యుండుటచేఁ బ్రస్తుతము వివాహవిషయక మగు నాందోళనము తీరినది. ఈ తరుణమున వేఱు కల కెడములేదు.

"అహా! నిజమే. ఈక్రూరవ్యాధి చాల నపాయకరము. దైవాను గ్రహమున నాయువతీయువకులు మహామారి కాహుతి కాకుండుట తటస్థించునేని యావల నీ వేమిచేయఁదలఁచితివి?"

"ఇప్పటినాయవస్థయందుఁ గొన్నివారములు విరతి గాగుట గూడ విశ్రాంతికరమే యగును. ఈవ్యాధి యంతరించిన పిమ్మట గూడఁ గొన్నినెలలు గడచినగాని ప్రజలచిత్తములు సౌఖ్యాయత్తములు కాఁజాలవు. అప్పటిమాట చూచుకొందము.

"అట్లనరాదు. శిశువులను మార్చుటయందు నీ వవలంబించిన రహస్యవిధాన మాపాపపురుషునకుఁ దెలియకుండెనని యెట్లు విశ్వసింప దగును?"

"ఆసందేహమే నన్ను తరుచుగా బాధించుచుండును. కాని దాని నెఱిఁగియు నెఱుఁగనివానివలె నాపాపపురుషుఁడు నటించుచున్నాఁడని నేను విశ్వసింపఁజాలను."

"అటులని మన ముపేక్షింపఁగూడదు. పాప మాయువమిథు నము నెడబాపుట క్రూరకృత్యము. కాని యిట్లొనరించిన నీతనిమాఱుని ఆధ్యాత్మికజీవనమునకు శాశ్వత మగుహాని తటస్థింప నుండెగాన వారు పెండిలియాశను వదలుకొనక తీరదు. నీ వనుమతింతువేని నే నీదాగు

నిరహస్యము నీసుతుని కెఱిగించెద. ఆతఁడు సన్యాసియై కాంతారవాసియై యేపర్వతకుహరముననో వసించి తప మొనరించి దైవకటాక్షము బడసి పాపపురుషుని ధిక్కరింపఁగలుగుగాక."

"అది కేవలము నిష్ఫలారంభము. మేక్సిమిలను సర్వసంగపరిత్యాగ మొనరించి విరాగియై నిర్మానుష్యప్రదేశమునఁ దపుతలవాస మొనరించుచుఁ గందమూలాశనుఁడై కఠినతపశ్చర్య నవలంబించి శల్యావశిష్టుఁడైననుగూడ నాతఁడీపాపపురుషుని బారినుండి తప్పించుకొనఁజాలఁడు. కాల మాసన్న మైనంతనే దైవ సన్నిధానమునం దున్ననుగూడ నాయువకునిఁ బాపపురుషుఁడు బలిమినిగొని పోవఁజాలును. ఒక్క సాధనము మాత్రమే మానవులకు సాధ్య మగునది కలదు కాని యందులకు గల యపారకష్టపరంపరల కెవ్వ రోర్వఁగలుగుదురు? ఎవ్వరు సాహసింపఁ గలుగుదురు?"

"నే నెందులకైన సంసిద్ధుఁడనే. ఆసన్మార్గము గాని సాధన మే దైనను సరే నేను దాని నవలంబించెద నని యిదివఱకే తెలిపియుంటిని కాన దాని వివరింపుము."

"ఇది సాధ్యమా? నీ వీయసాధ్య కార్యమునకు బూనుటయే సత్యమగునేని పాపపురుషుని యాహ్వానము వచ్చినపుడు నే నతనివశ మగుటలో నాచింత చాల కొంతవఱకు తగ్గు నిశ్చయము."

"నీవు నిశ్చయముగ నామాట నమ్మవచ్చును. అది యేదో తెలుపుము."

"అరారాటుపర్వతాగ్రభాగమునఁ బవిత్రనౌక మంచులో బిగిసికొనిపోయి యున్నది. మహాప్రళయసమయమున నేను దలుపజాలసి నొకని యాదేశమున పునీతు లగు నుత్తము లొక నావలో నామహాసముద్రముపై నిర్భయముగ సంచరించిరి. ప్రళయాంత్యమున నానౌక యరారాటుపర్వతాగ్రమునం దట్లు నిలిచి పోయెను. అది

యిప్పటికి నచట నటులే నిలిచి యున్నది. పెక్కు యుగములు గడచి నను నానౌక యటులే మంచుతో నిండి నిలచి యున్నది. కాని ప్రళ యపయోధి విజృంభణముతో నంతయెత్తునకు లేచి యచట నా నౌక నిలచిపోయినదిమొదలు నేటివఱకును మానవుఁ డెవ్వఁడును గూడ నాప్రదేశమునం గదుగిడి యెఱుంగఁడు. పర్వతపాదము నుండి తత్రభాగమును జేరులోపల నెన్నియో భయంకరము లగు నఖాతములును నరకములును దుర్గమప్రదేశములును గాలూన వీలు లేని జారుడుప్రదేశములును గలవు. కాని యత్తివినిర్మల ప్రవర్తనము ను నిష్కళంకాత్మయును గల పావనమూర్తి యగు మానవశేఖరుఁ డుత్కృష్టమించునేని—సహాయమున నాపవిత్రనౌక నన్నే జేరగలుగును. అతఁ డట్లు చేరి ఆనౌకకు చెందినదారుశకల మొందుగొని వచ్చి మేక్సిమిలనుకు దాని రక్షరేకుగాఁ గట్టినచోఁ బాపపురుషుఁ డతనిఁ దేరిచూచుటకైన వీలుండదు. ఒక్కని జననమునకు మున్నే వానితలి దండ్రులలో నెవరైన వానిఁ బాపపురుషు నధీనమొనరింప వాగ్దాన మొనరింతు రేని యట్టి సంతానమును బాపపురుషుని బారినుండి కా పాడుట కిదియొక్కటియే మానవులకు సాధనము. ''

,, ఆనాధానము నిన్నుమాత్రి మేలకాపాడఁ జాలదు ? ''

,, నేను స్వేచ్ఛవలన బుద్ధిపూర్వకముగ నన్నతని కర్పించుకొంటిని గాన నన్నారక్ష కాపాడఁజాలదు. కాని నా పుత్రినిఁ దప్పక కాపాడఁ గలుగును. ఈ భయంకర ప్రయత్నమునకు గడంగు సాహ సము నీకు కలదా ? ''

" నాకుఁ గలదు. నేను జేసెదను. నేను గృహమేధినైనను, ఆలు బిడ్డలపై ననురాగముగలవాఁడ నైన నొకయాత్మను శాశ్వత నరకా వాసమునుండి యుద్ధరింప నవకాశము లభించినప్పు డైహికవిషయము లాప్రయత్నమున నన్నడ్డగిని నాటంకములు కానేరవు. నేఁ డే నేను

ప్రయాణము సాగించెదను. నేను కుటుంబముతోడనే ప్రాచ్యదేశమున కేఁగి అందు గాకచో మహామారీమారణ సన్నాహములేనిచోట సురక్షిత ప్రశాంతస్థలమున నాకుటుంబమునుంచి పిమ్మట నాపర్వతారోహణమునకు సర్వశక్తుల వినియోగించెదను.''

“నీవు కృతఘ్నుఁడ వయ్యెదవేని ఒకపవిత్రాత్మను గాపాడుమహాఫలితము నీకుఁ జేకూరదు'' నని బాష్పాకులలోచనుఁడై ఫాస్టు పలికెను. ఆతఁ డట్లు కన్నీరు నించుట కడునరుదు.

పరమేశ్వరానుగ్రహమున నే నెట్టి పాపకార్యము నొనరింపలేదనునదియే నా కమిత ధైర్యము నొసఁగుచున్నది. నాయంతరాత్మ పరిశుద్ధ మనుతలంపె నా కధికశక్తి నొసఁగుచున్నది. ఆత్మరక్షణ మహాఫలమే నా కధిక సాహసము నొసఁగుచున్నది. పరిశుద్ధాత్మను పరిరక్షింప గలుగుటయే యమూల్య మగు ప్రతిఫలము.''

“నేనుగూడ నిటుల నీవలెనే పలుకఁగలిగియుందునేని యెంతటి యానందమునకు పాలయ్యెందును. లేను. నా కాభాగ్యములే” దని దుఃఖాతిశయమున స్తంభితకంఠుఁడై ఫాస్టు హస్తస్పర్శనముననే తన కృతజ్ఞతను వెల్లడించుచు నటనుండి వెడలిపోయెను.

౨౨

ఈరీతిగా మహామారి యూఱుమాసముల వఱకు యూరోపుఖండము నంతన్ని దేశములను మూడ్చివేసెను. వర్షములు లేవు. పంటలు లేవు. కాటకము ప్రబల మయ్యెను. భూకంపము లత్యధిక మయ్యెను. వర్షములు లేకున్నను వరద లపరిమితమై నదు లుప్పొంగి దేశములు ముంచివేసెను. భూగర్భమునందు భయంకర ధ్వనులు మొదట వినఁబడి తోడనే నదు లత్యధికముగ నన్ని దేశములందును బొంగి పొరల సాఁగెను. అనిలతి దుర్గంధనాయుత నెల్లెల్ల పీడఁదొడఁగెను.

ఆకస్మికముగ జనపదములం దఖాతము లేర్పడి వానిలోనుండి భరింపరాని దుర్వాసన వెలువడి కడుదూరమునకుగూడ వ్యాపింప సాఁగెను.

కన్‌స్టాంటునోపిలులోఁ బెక్కువేలమంది మహామారి కాహారమైరి. దైవ ప్రార్థనాహ్వానమును బాటించువారే కనఁబడలేదు. అంతటి యాస్తికు లగుమహమ్మదీయులుగూడఁ గష్టములకు సహింపఁజాలక దైవమును నిందింపసాఁగిరి.

మనోహర మగుమాల్టాదీవి మీఁదికి సముద్ర ముప్పొంగి సర్వ నాశన మొనరించెను. గ్రీసుదేశమున మహామారికితోడు భూకంపము లుగూడ మెండై ప్రాచీనదేవాలయముల నన్నిటిని భూగర్భమున ద్రోసివేసెను.

ఇటలీదేశమున జనపదము లెన్నియో నామరూపములు లేకుండ ధరణీగర్భమున నంతరించినవి. అన్ని నగరములందును మహామారి విపరీత మారణము సాఁగించెను. జర్మనీదేశమునఁ బర్వతములుగూడఁ గుంగిపోయెను.

మధ్యధరా సముద్రమునందు వేలకొలఁది నౌకలలోని నావికు లందఱును మహామారిచే మృతి నొంద నిర్జనములగు నానౌక లూరక వాయువశమున సముద్రోపరిభాగమునఁ దిరుగులాడుచుండెను. రష్యా, ప్రష్యా, డెన్మార్కు, ఫ్రాన్సు, స్పెయిను, పోర్చుగలు, ఆంగ్లదేశము మున్నగు నన్నిదేశము లందునుగూడ మహామారి విపరీతముగఁ బ్రబలెను.

ప్రతిపట్టణమునను నగరమునను వేలకొలఁది ప్రజలు మృతి నొందుచుండుటచే హతశేషులు గుండెపగిలిచత్తు రేమోయని మృతుల సంఖ్యను బ్రకటింపరా దనియు సంత్యక్రియలలో ఘంటానినాదములు సపలురా దనియు నధికారు లుత్తరువులు చేసిరి. మొత్తె మూఁడూఱు

నెలలోను యూరోపుఖండమునం దంతటను ౨౫౦ లక్షలమంది మృతి నొందిరి.

వియన్నానగరమున నిట్టి దారుణ మరణముల వలనఁ బ్రజలు దైవవిశ్వాసమును బూర్తిగాఁ గోలుపోయి మొండితెగువకు బూని స్వార్థపరులై కృత్రిమ సన్యాసమును బూని ప్రజల వంచింపసాగిరి. స్త్రీలును పురుషులును పిల్లలును వందలకొలఁది గుంపులుగ నేర్పడి నల్లని వసనముల ధరించి, ఇనుపముక్కలు కొనలకు గట్టబడిన పెక్కు-దుగు పతాకిస్సుగల కొరడాలను జేతులఁగొని సన్యాసినులము సన్యాసులమని చెప్పుకొనుచు సర్వసంగ పరిత్యాగ మొనరించితి మని ప్రగల్భములఁ బలుకుచు నీమహాదాగుణమును దొలఁగింప భగవంతునికిఁ గరుణ కలుగుట కిట్టి కఠినతమవిషయమును బూనితి మని వెల్లడించు భయంకర సంతాప స్వనముల నేవో వాక్యములు పఠించుచు వీధులవెంట దిరిగి మూఢజనుల నవలీల నాకర్షింపసాగిరి.

చతుష్పథములందును దేవాలయముల సమీపమునను వారం గఱు నిలచి యేకకాలముననే మోకరించి సంతాపస్వరములతో నా వాక్యముల నేకకంఠముగఁ బఠించుచు వెన్నులను వసనములఁ దొలగించి యా కొరడాలతో నచట మోదుకొనగ నా యినుపముక్కలు గీచుకొనుటవలన రక్తము నమితముగ స్రవించుచుండెను.

దానిని గనినంతనే యా మహానుభావులు భూతకరుణాపూర్ణులై కఠినతమవ్రతాచరణములను బూని మహాత్యాగ మొనరించుచున్నారని ప్రజ లత్యంతభక్తిభరితు లగుచుండిరి. ఎల్లవారును బంధువియోగ పరితప్త చిత్తులును ప్రాణముల నరచేత నిడుకొని నేక్షణమో తమకు గూడ మరణము తప్పదను మహాభీతి నొడ తెలుఁగక మనోధైర్యమును బూర్తిగాఁగోల్పోయి యుండువారు నగుటచే నీకృత్రిమసన్యాసులకుతంత్రములు వారిపై సమ్మోహనాస్త్రముల వలెఁ బనిచేసెను.

కూలివాఁడు మొదలు సార్వభౌమునివఱకు కార్మికులు, వణిజులు, ఉద్యోగులు, ప్రభువులు మున్నగువా రందఱును యథాశక్తిని కాంచనరాసులను, మణిమయాభరణములును, గడు భక్తితోఁ గొనివచ్చి యాకృత్రిమసన్యాసి బృందమునకు సాగిలి మ్రొక్కి సమర్పించి మనశ్శాంతిని బడసి మరలిపోవుచుండిరి.

రాత్రులయందీ వంచకస్వాములు కరదీపికలఁ జేఁబూని యథారీతిని దేవాలయములచెంతఁ జేరి యీ యెడలికోల చిత్రనాటకములు ప్రదర్శించి ధనము నార్జించుచుండిరి.

వ్యాధి మఱింతప్రబలమగుకొలఁది నీమోసగాండ్రపన్నాగములును మూఢస్వభావుల యవివేకము గూడ మెండయ్యెను. ఏసుక్రీస్తు స్వయముగాఁ దన కొక లేఖ నంపె నని కపటసన్యాసి సంఘప్రధానాచార్యుఁడు ముద్ర వేయఁబడిన యొకలేఖఁ జూపు నంతటి సాహసమునకు గడంగినపుడు గూడ నెల్లవారును జేతులఁ గట్టుకొని తలలువంచి కనులుమూసి వినతి యొనర్చిరేగాని యిది సాధ్యమా యని యాలోచింపఁగలవా రొక్కరైన లేకపోయిరి.

“ఆలేఖపై ముద్ర వేసిన దెవ్వారని యొక మహోద్యోగి యడుగఁ “పవిత్రమతగ్రంథమును వ్రాసిన మహాప్రభువే” అని యావంచక సార్వభౌముఁ డించుక మైనఁ గొంకక ప్రత్యుత్తరమిచ్చెను. “మానవసంఘము పాపభూయిష్ఠమైనందులకు నాకు వారిపై నత్యధికమగు నసమ్మతి కలిగినది. కాని నన్ను పవిత్రశీల యగు కన్యామణియు నితర దేవతలు నెంతయు బ్రతిమాలుటచే నేను మరల నొకించుక కరుణ వహించి మానవుల కీసాధనమును కనబఱచుచున్నాను. ముప్పదినాల్గుదినము లిటులీసన్యాసవ్రతమును బూని కొరడాదెబ్బలఁ గొట్టుకొను వారందఱును భగవదనుగ్రహమునకు బాత్రు లగుదు” రని యావంచకప్రధానాచార్యుఁడు చదివెను.

ఆలేఖ విద్యుత్ప్రసారమువలెఁ బనిఁ జేసినది. సంశయాత్ము లెల్లరు నుగూడఁ దక్షణమే సన్యాసి బృందమునఁ జేరిరి. వేలును లక్షలుగను సన్యాసు లేర్పడిరి. పరిసరగ్రామములవా రందఱునుగూడ వియన్నా నగరమున కేతెంచి యీమందలో గలిసిరి.

క్రమక్రమముగ నీసన్యాసుల యధికారము నిరంకుశము నిరాఘాటము నయ్యెను. వారిలో హస్తలాఘవము నెఱిఁగినవా రద్భుతకృత్యముల నొనర్చ దైవశక్తి యని ప్రజలు నమ్మి వారికిఁ బాదాక్రాంతు లగుచుండిరి. మహామారి వ్యాధిచే మృతి నొందినశవములున్న యిండ్ల లోనికిగూడ నీసన్యాసులు నిర్భయముగఁ జొరఁబడి ధనమును గాంచ నాభరణములను హరించుకొనిపోవుచుండిరి. మోసమునఁగాక నిర్మల త్యాగశీలతచే గార్హస్త్యమును ద్యజించిన సన్యాసినులుండు మఠములఁ బవిత్రతగూడ వీరివలన నిర్మూలన మయ్యెను. యౌవన మదమున గన్నుగానని కపటసన్యాసులు సన్యాసినుల మఠములలోఁ బ్రవేశించి సన్యాసినుల మానభంగము గావింపసాఁగిరి. వ్యభిచార మత్యధిక మయ్యెను.

ఈవంచకులు చేసిన మహాపాతక కార్యమునకు పారము లేదుగాని యన్నిటి నతిక్రమించిన ఘోరపాతక మొండు గలదు.

,, అయ్యో మీ రెంతటి యవివేకులు. మీకు కన్ను లుండియుఁ జూడఁజాలని బుద్ధిహీనులు. మీరు త్రాగునీరు, కూపములు, తటాకములు, నదులు నన్నియుగూడ విషమిశ్రితము లయ్యె నని మీ రెఱుఁగజాలకున్నారే '' అని కపటసన్యాసి ప్రధానస్వాములు కల్లగేకలు వేయసాఁగెను.

ఆవాక్యముల నాలకించినప్రజ లందఱును పిడుగుసోకిన వారివలె నిశ్చేష్టులైరి. ,, ఎవ రాద్రోహులు—విషము కలిపిన మహాపాతకు లెవ్వ '' రను నినాదము సహస్రకంఠముల నొక్కసారి వెడలెను.

,, యూదులు, యూదులు, యూదులు '' అని పాపమున కొక్కంతమైన పేరువని యాకృత్రిమసన్యాసిరూపధారు లగుఘోరపాతకమతులు స్పష్టముగ నుడివిరి.

ఆవాక్యము ప్రజలలోఁ గలిగించిన దురాగ్రహ మవర్ణ్యము. అదియే యూదజనమహాసంహారప్రధాన మారణమంత్ర మయ్యెను. మహామారిబాధఁబడక మనజాలినయూదుల వేలకొలఁదిగ నిష్కరుణులై యాక్రైస్తవులు బలిమినిబట్టివధించిరి. బాలుర, వృద్ధుల, యువకుల, యువతుల, శిశువుల, బాలింతలఁ, జూలింతల నావంతయైనఁ గనికరము లేకుండఁ గ్రూరవ్యాఘ్రములవలె నీయూదజనులు ఘాతుకలీల హతము చేసిరి. అంతటనైన తనివి నొందక వందలకొలఁది యూదులఁ బట్టియొకభవనమున బంధించి దాని కగ్ని రగులుకొలిపి లోన నున్నవారు వెలికిరాకుండఁ జుట్టును జేరి వారిని మట్టుపెట్టుచుండిరి. ఆయనపరాధభయంకరార్తధ్వానము హృదయవిదారక మయ్యు నాహంతకుల కావంతయును గనికరము కలిగింపఁజాలదయ్యెను.

లియపోల్డు రాకుమారుఁడును మేక్సిమిలను సార్వభౌముఁడును ఈ ఘోరకార్యమును నివారింప నెంతయో ప్రయత్నించిరి గాని నగరవాసు లందఱు నొక్కసారి యున్మత్తులై యుండ వా రేమి చేయగలుగుదురు? దైవాజ్ఞయే తిరస్కరింపఁబడినప్పు డిఁక రాజాజ్ఞ నెవ్వరు పాటిరి?

ఈబాధలు బడఁజాలక యూదు లెందరో యాత్మహత్యఁ గావించుకొనిరి. సన్నిహితబాంధవు లీ క్రైస్తవక్రూరమృగముల బారిఁబడకుండఁ దామే తమ పాలుబిడ్డల యసువులఁ గొనిరి.

మహామారి, కాటకము, భూకంపములు, వరదలు, ఉప్పెనలు, వంచకసన్యాసివర్గముల దుర్బోధనలు, బంధువినాశనము మున్నగు బహుళకారణములచేఁ బ్రజ లందఱును ఘోరరాక్షసులైరి, దయా

శూన్యులైరి. ఎందఱో మరణభీతిని మఱచుటకు విషయవిహ్వలులై నిరంతరకామభోగపరాయణత నొడ లెఱుఁగకుండిరి. మద్యపానకామినీసాంగత్యముల మైమఱచుచుండిరి. రేపు మనము బ్రతుకముగాన నేఁడే సకలభోగముల ననుభవింతము. రమ్ము, మద్యముం గ్రోలుము. వినోదములఁదేల్పుము.. క్రీడలఁదనుపు''మనునదియే యట్టివారికి గురుమంత్రమై యుండెను.

నగరము ఘోరవ్యాధికి పాలుపడి దుఃఖభాజనమై యున్నతఱి నీ జ్ఞానశూన్యు లిటులవిషయవిహ్వలులై భోగముల నోలలాడుట శవమునకు రత్నాభరణసుగంధకుసుమాలంకార మొనరించురీతి నేయుండెను.

## ౨౫

వియన్నానగరమున మహామారి తలచూపిన మఱిమూఁడు నెలలకు ౧౬౧౩ వ వత్సరము ఫిబ్రవరి నెలలో నొకనాఁడు సంధ్యాసమయమున నిరుపు రాశ్వికు లగుపురుషులు అరారాటుపర్వతప్రాంతసీమను గోచరించిరి.

వారిలో నొకఁ డాటో. రెండవవాఁ డతనిచే మార్గదర్శిగా నియమింపఁబడినతురుష్కానుచరుఁడు.

ఆనాఁ డుదయముననే కడుదూరమున నాపర్వతాగ్రము వారికి గోచరించెను. వారువడివడిగఁ జేరువకు రాను రాను దానిసంపూర్ణరూపము సమగ్రముగ గోచరించెను. దాని యగ్రద్వయమును దట్టముగ మంచుచేఁ గప్పఁబడి కాంచనమణిమయమకుటముల ధరించెనో యన సూర్యరశ్మియందుఁ బ్రకాశించుచుండెను.

మధ్యాహ్న మగుసరికి దానియందుగల యఖాతములు చిఱుకాలువలు పొడుచుకొని వచ్చినశిలాగ్రములు, దుర్గమమార్గములు మున్న

గున వన్నియుఁ గనఁబడెను. దాని నధిరోహించుట మానవసాధ్యము కా దనునిరాశ సామాన్యముగా నాప్రాంతవాసుల కంతటికిని గలదు.

సాయంకాల మగుసరికి ప్రతిభాగమును జాల స్పష్టముగఁ గనఁబడ సాఁగెను. అయ్యది భూభాగమునుండి పదివేల యడుగుల యెత్తున నున్నది.

పర్వతసమీపమునను పర్వతోపరిభాగమునను బాదము మొదలు శిఖరమువఱకు నెన్నియో యఖాతములు స్థూల సూక్ష్మ రూపముల గోచరించుచుండెను.

ఆప్రాంతము నామార్గదర్శి లెస్సగా నెఱిఁగినవాఁ డగుటచే నాతఁ డావివరము లన్ని[illegible]కుఁ దెలుపసాగెను. ఆతనిపేరు మురాదు. ఆతఁడు జర్మనుభాష బాగుగా మాటలాడఁ గలఁడు.

„ ఈ పర్వతాధిరోహణమసాధ్య మని గదా నీవు తెలిపితివి ? ”

„ ఆభయంకర పర్వతమార్గమునం దడు గిడుట కేమానవుఁడు సాహసింపగల గలఁడు ? దానిని దేరిపాఱఁ జూచుటకు దల యెత్తిననే కనులు గిఱ్ఱునఁ దిరుగుచుండ నిఁక దాని నధిరోహించుటయా ? అడుగులొట్రుపడిన నధోగతియే గాని మఱి బ్రతుకు గలదా ? క్రింది గట్టునుండి మీఁదిగట్టునకు జేరనడుమనున్న యఖాతముపై కుప్పించి యెవ్వఁ డెగురఁజాలును ? పైకి పోను బోను దుస్సహమగు చలిబాధ కేమానవుఁడైన సహింపగలఁడా ? అసాధ్యము. అసాధ్యము ! ”

„ ఇదివఱ కెవ్వరును దీని నధిరోహింపనిచో నీ వి ట్లిన్నివిషయములను వివరించి చెప్పఁ గలిగితివి ! ”

„ కొందఱు సాహసికులు కొంతవఱ కెక్కిరిగాని యంతటితోనే వెనుకకు మరల వలసినవారైరి. మానవులకే పర్వతారోహణము సాధ్య మగుటయే యల్లాసంకల్ప మగునేని ధనమునకు గాదు ప్రాణములనైన నర్పింప వెనుదీయనివా రెందరు లేరు ? ”

„ నీ వన్న దేమో నాకు బోధపడలేదు. ”

“నోవాసుల్తాను వారిపడవ యారెండగ్రములలో నున్నది మఱియు దానిపై నిలచి యున్నది. ఆపడవకు చెందినశకలమును గొని రాగలిగినవారికి కోట్లకొలంది ధన మొసంగెద నని కాన్‌స్టాంటునోపిలులో నున్నగ్రీసు దేశీయుండగు ప్రభువు ప్రకటించెను. ఎందరో ధనాశచే గొండపై నెక్కిరి. వారిలో గొందఱు మరల రానే లేదు. మఱికొందఱు సగముదూరమువఱకైనపోలేక మరలి వచ్చి మార్గ మతిదుర్గమ మని తెలిపిరి గాన మరల నెవ్వరు నీపిచ్చిప్రయత్నమునకుం బూనుకొనరైరి. పర్వతలక్షణమువలననే గాక పాపపురుషుని అనుచరుల ప్రయత్నమువలనగూడం పర్వతారోహణమున కభ్యంతరము కలుగుచున్న” దని ఖురానులో వివరింపంబడినది. పెద్దలవలన వినినవారు గూడ నటులే చెప్పుచున్నారు.”

“ఇంకను వివరముగ మఱియొకసారి చెప్పుము.”

“ఆపర్వతమునందలి యఖాతములలో బాపపురుషుని యనుచరు లున్నారు. ఆయఖాతములలో భయంకరకౄరసత్వము లున్నవి. పర్వతమార్గములందు మడసినవారుభూతములై యందుసంచరించుచు దాని నధిరోహించువారికిం గనంబడుదురు. శ్మశానముల కర్ధరాత్రమున నేగి శవములం ద్రవ్వి తీసి తిను భయంకరగ్రహముల కీపర్వతమునందలి యఖాతములే నిలయములు. పర్వతము నెక్కజాలక మరలి వచ్చినవారిలో పలువు రట్టిభయంకరాకారములంగని యున్మాదులై పోయిరి. మఱికొందఱకి మూకత్వము తటస్థించినది. మఱికొందఱు వ్యాధిలేకనే కృశించి యకాలమరణంబులపాలైరి. మరల వచ్చినవారిలో నాధియో మనస్తాపమో లేక వ్యాధియో లేనివాం డొక్కండును లేడు.”

“నీవర్ణిన మతిభయంకరముగ నున్నది గాని యవి యన్నియు నతిశయోక్తులై యుండంగూడదా? మఱి యెవ్వరైన నెక్కగలిగి

నచో మరలివచ్చిన వారిని అస్లైక్కఁ గలిగినవారు జూచి వారు ధైర్యహీనులై వెనుకకు వచ్చిరని యపహసింతు రను సంశయమున మరల నెవ్వరును బ్రయత్నించుటకైన సాహసింపకుండ వా రిట్టియతిశయోక్తులను దెలిపి యుండఁ గూడదా ? ,,

,, అది నమ్మఁదగిన సంశయము కాదు. కోట్లకొలఁది ధన మొసఁగె దనని గ్రీసుప్రభువు ఘోషించుచుండ ధైర్యసాహసనైపుణ్య సామర్థ్యములు గలవారు మిన్నకుందురా ? అది సాధ్యము కాదు. ,,

,, నోవాయును నతని కుటుంబము వారును సురక్షితముగా దిగి వచ్చిన మాట సత్యము కా దన వీలులేదుగదా ? వారి కిట్టి యద్భుతదైవసహాయమును గలిగిన ట్లెచటను దెలుపఁబడలేదే. వారు దిగి వచ్చుట కొక మార్గమున్నచో పర్వతము నెక్కుటకు మాత్ర మా దారి యేల యుపయోగింపదు ? ,,

,, వారు దిగివచ్చినది నాఁడు నేఁడు గాదు. ఎన్ని శతాబ్దముల క్రితమో జరిగిన విషయము. ఈ లోన నెన్నియో మార్పులు ప్రకృతి యందుఁ గలిగి యుండుట నిశ్చయము. భూకంపములవలనఁ గ్రొత్త యఘాతము లేర్పడును. నాటి యాకృతియు నేటియాకృతియు నొక్క రీతినే యున్న దని పలుకనగునా ? ”

,, నీ పలుకులు యుక్తియుక్తము లని యంగీకరింపక తప్ప దని ఓటరు కొంత విచారముతోఁ బలికెను.

తా నెందుల కాపర్వతాధిరోహణమును సమకట్టెనో ఆ విషయమును వెల్లడింపఁ గూడదు. దైవసహాయమునఁ గృతకృత్యుఁడై యాతఁడు మరల రాఁగలిగె నేని పర్వతప్రాంతవాసు లాతని మనస్వియను, మురాదు స్వామిద్రోహి యని కాదు. ఆతఁడు మార్గమునందుఁ దన విశ్వాసమును బలుతెరఁగుల ఓటరుకు ధృవపఱచెను. ఆతనికి గొంచెము వాచాలత కలదు గాన నేనేమన్నను నాతఁడు దానిని

వెల్లడింపవచ్చు నని ఓటో తన రహస్యము నాతని కెఱిఁగింపఁ డయ్యెను.

అతఁ డీవృత్తాంతము నంతయు సీనాకడ దాపకుండఁ దెలిపి యుండెను. సీనాయును పుత్రులిద్దఱును స్విర్జాలో నున్నారు. ఆమె పతిహితైకజీవన. అతని సద్వర్తనమును నాతఁడు పూనినమహత్కార్యమును లెస్సగా నెఱిఁగినసతీమణి గాన నెట్టి యభ్యంతరమును పలుకలేదు. కాని వారివియోగముమాత్ర మత్యంతసంతాపకరమై యుండెను. ఆయుదంతమంతయు నాతని కిపుడు స్మృతికి వచ్చుటచే నాతనిచిత్త మొక్కింతచింతాకులమయ్యెను.

,, మరల నేను వారిని జూడఁగలనా ? లేక యూపర్వతమార్గముల మృతి నొందుటకే సర్వేశ్వరుఁడు విధించెనా ? జెర్మనుప్రభునివిడపించుటకు ప్రయత్నించినపుడు ఆలప్సుపర్వతదుర్గమునందు తన్నుఁ గాపాడిన మహనీయుఁ డెవఁడు ? లిన్సుద్రాపుమహారణ్యమున క్రిస్టు ఖడ్గము బారినుండి నన్ను రక్షించినదయాశాలి యెవ్వఁడు ? ఆకరుణామయుఁడగు పరమేశ్వరుఁడే నాకు దిక్కు. '' అని యాతఁ డనుకొని గుఱ్ఱము దిగి నిమీలితనేత్రుఁడై మోకరించి నిర్మలమానసముతో నాసర్వేశ్వరు నొక్కసారి ప్రార్థించెను. అతఁడును మురాదును నాలుగుమైళ్ళ దూరముననుండి బయలుదేరి పర్వతసమీపముననున్న కుటీరములకు వచ్చిరి. ఆప్రార్థనముతో నాతనికి చింతాప్రశమనమును నూతనోత్సాహమునుగూడఁ గలిగెను.

ఆకుటీరమున నమెరికాదేశీయులగు క్రైస్తవులు నివసించుచుండిరి. వారతని సంప్రీతితో నాదరించిరి. మంచిభోజనమును వెంటనే సిద్ధపఱచిరి. ఆవల బడలికదీర నాతఁడు తృణశయ్య నొరగ గాఢనిద్రం జెందెను. ఆతృణశయ్యయే హంసతూలికాతల్పముకంటె మిన్నగాఁ గనంబడియెను. సహజముగ నాతఁ డట్టిభోగముల నెన్నఁడు నాదరించువాఁడు గాఁడు.

నిద్రయందు శుభస్వప్నములు కనఁబడెను. తన యర్ధాంగి నగు మోమును తన ముద్దుకుమారుల హాస్యవదనముల నాతఁడు చూడఁగలిగెను. తా నొనరించిన మహోపకారమునకుఁ దమ కృతజ్ఞతను దెలుప నడీలా మేక్సిమిలనులు తన శయ్యాసమీపమున సాకరించి వేలీలలఁ బ్రశంసించుచున్న ట్లాతనికిఁ గనఁబడియెను.

కాన నాతఁడు సుఖనిద్రనుండి అరుణోదయమున నూతనోత్సాహముతో మేల్కాంచెను. కాల్యకృత్యములఁ గడువడి నిర్వర్తించి భుజించి పరిసరప్రాంతమును జూడఁబోయెద నని పలికి యొంటరిగా వెడలి పోయెను.

ఆతఁడు మరల సాయంకాలమువఱకు రా డని యాతని మాటల వలన గ్రహించి యా వృద్ధదంపతులు కొన్ని ఆహార పదార్థముల నొక సంచిలో వేసి యాతని కిచ్చిరి. "నీవు సాయంకాలమునకు మరలి రానిచోఁ బర్వతారోహణసాహసమునకు పాల్పడితి వని భావింపవలసివచ్చు" నని మురాదు పలికెను.

ఓటో చిఱునవ్వుతో వెడలిపోయెను. ఆతఁడు కడు వేగమునఁ బర్వతపశ్చిమ భాగమునఁ దరులతాగుల్మ పరివృతప్రదేశమునఁ బ్రవేశించెను. అట నొక కొండవాగును సులభముగ నిర్గమించి అధిరోహణము ప్రారంభించెను.

కొంతదూర మేఁగునరి కొక భయంకర మగు నఘాతము కనఁబడినది. కనుల కగోచర మగు లోతున నీరు పాఱుచున్న ధ్వని వినబడసాఁగెను. అతఁడు శీఘ్రలి నాలు గడుగులు వెనుక కిడెను. అచట మరల మోకరించి గాఢతమభక్తి విశ్వాసములతో జగదీశ్వరునిఁ బ్రార్థించెను.

ఆసమయముననే పాపపురుషుఁ డాపర్వతోపరిభాగమున నిలచి మహాప్రళయమును సంకల్పించి మంత్రోచ్చారణ మొనరించెను.

గాని యాతని యాదేశమును బ్రకృతి పెడచెవి నిడెను. ఆతని యనుచరులుగూడ నాతని యాజ్ఞలఁ బాలింపరైరి.

సూర్యకాంతి తగ్గలేదు. మేఘజాలము క్రమ్ముకొనలేదు.

సర్వేశ్వరుఁడు ఓటోను సంరక్షించుచున్నాఁడని గ్రహించి దుఃఖాతిశయమున భయంకర నినాద మొనరించి పాపపురుషుఁడట నుండి వెడలిపోయెను.

## ౩౦

ఈరీతిగా గాఢతమనిర్మల భావముతో సర్వేశ్వరుని బ్రార్థించుటవలన ద్విగుణీకృత ధైర్యసారుఁడై ఓటో లేచి నిలచి తన పాదముల సమీపమున నున్నయగాధమును బాగుగా బరికించి చూచెను.

అతఁడు నిలుచియున్నకడ నాయఖాతము ఇరువదిగజముల వెడలుపు కలిగి యున్నది. దాని కావల నీవలఁ దరులయందుఁ దుప్పలు కుప్పలుగ నున్నవి. దానిని దాటి చాలపైకెక్కినగాని యాతఁడు మంచుగడ్డలుగల ప్రదేశమును జేరజాలఁడు.

కడువడిగ దృష్టి మరల్పకుండ దానిని బరికించుచు నాతఁడు దాని ననుసరించి నడువసాగెను. క్రమ క్రమముగ నాయఖాతము సన్నమగుచున్నట్లు కనబడెను. కాని కొంతదూర మేగుసరికచట రాళ్ళగుట్టలు మార్గనిరోధకముగ జేర్పఁబడి యుండెను. కావున నతఁడు మరలి తాను మొదట ప్రార్థించిన తావునకు వచ్చి దాని నతిక్రమించి పోవ మరల నఖాతము సన్నముగఁ గనబడసాగెను. అచటఁ గూడ రాలగుట్టలు కలవు గాని రెండవకొనయందువలె నంత మిక్కుటముగ లేవు. ఆఱుగజములవఱకు మాత్రమె యుండెను.

అచటనే దానిని దాటవలెను. అచట నుష్ణ మత్యధికముగ నుండుటచే నాతని యొడలినిండ చెమ్మట బట్టెను. ఆతఁడు స్వేదకణములఁ దుడుచుకొని కాలువవెడల్పును బరికించి చూడ దాని నతిక్ర

మించుట దుస్తర మని తోఁచెను గాని సమీపమునం దొకవృక్షము కనఁబడెను, దాని శాఖ లావలిగట్టువఱకును వ్యాపించి యుండెను. ఆవలి తీరమునఁ బ్రదేశము కడువిషమముగ నున్నది గాని మార్గాంతరము లేదు. ఆతఁడు వెంటనే యావృక్షము నెక్కి యావలికొనకు వ్యాపించిన శాఖాగ్రమును చేరెను.

ఆతని తల యొకించుక తిరుగసాఁగినది. ఆతఁడు సర్వేశ్వరునిపాదములను హృదయమున ధ్యానించుచు నిమీలితనేత్రుఁడై యొక్క దాటున నావలి కురికెను. కాని మరల నావలి గట్టునకుఁ బోవు టెట్లను నాలోచన కలిగి త్రుటికాల మాతనిఁ జింత యలముకొనెను గాని చింతాతిమిరజాలములఁ జీల్చి చెండాడుభానుతేజ మనందగిన యీశ్వరధ్యానమను నుత్తమసాధనమాతని కుండుటచే నాతఁడు సాగిపోయెను.

ఆతఁడు కృతనిశ్చయుఁడై భయంకరసర్పములను క్రూరమృగములను గూడ లెక్కచేయక సర్వజగద్రక్షకుఁడు నీశ్వరుఁడు తన్ను రక్షించుచున్నాఁడు గానఁ దన కేజీవియు నెట్టిహానియు జేయజాలదను గట్టినమ్మకముతో నాదేవదేవుని కృపవలనఁ దన కెట్టి నిరోధమును కలుగ దను గాఢవిశ్వాసముతో సాఁగిపోవుచుండెను.

అపుడపు డొక సర్పము సమీపమునఁ బ్రాకుచున్నట్లు శుష్కపత్రముల ధ్వని వినఁబడుచునే యుండెను. ఆతఁ డెంతటి ధైర్యశాలి యైనను నాతనికి సర్వేశ్వరుని సంరక్షణమం దెంతటి గాఢవిశ్వాసముండినను మనసుమాత్ర మాతని వంచించి యాయాతరుణములందు త్రుటికాలమాతని సంచకితుని గావింపఁజాలకపోలేదు. కాని వెంటనే భగవన్నామస్మరణ మాభీతినిఁ బాఱఁదోల గలుగుచుండెను.

ఆతఁడీరీతిని బదకొండుగంటలవేళయగుసరికి మఱియొకవిశాలమగు నగాధమును జేరి యచట నాసీనుఁడై తాను గొనివచ్చిన యాహారపదార్థములను దైవమును ధ్యానించుచు భుజించెను. ఆతఁ డాటల

భుజించి సింహావలోకనము గావింప భయంకర మగు పర్వతరామణీ యకము గోచరించెను. విశాల మగు నఖాతమును దాని కావల కంటక శిలాపథమును దాని నతిక్రమించిన చిత్రవిచిత్రము లగు కాంతులతో నొప్పు హిమవత్ప్రదేశమును గనఁబడియెను. దానిశిఖ రాగ్రముననే దేవదేవుని నికేతనము గూడనుండు నని యాతఁడు భావించుకొనెను. ఈ భయంకర మార్గముననే యాతఁ డరుగవలసి యున్నది.

అతఁడు భోజనము చేసి మరల మోకరించి నిర్మల భావముతో సర్వేశ్వరుని బ్రార్థించి మహోత్సాహమును బడసి ముందునకు సాఁ గిపోవ నచట మార్గనిరూపకఫలకము కనఁబడెను. దాని నెవ్వరో మానవులే యొక స్తంభమునకు బంధించి దానిపై నిటలీభాషయం దేమో వ్రాసిరి. దానిని ఓటో చదివెను.

,, లోరెంజోప్లోనో క్రీ౧౭-౭-౧౮౬౩వ వత్సరమున నిచటికి రాగ లిగెను. అతఁ డనుసరింపవలసిన మార్గ మన్యోభాగమున నున్నది. అతఁడు మరల నీ దారి నెన్నఁడును వెనుకకు రానేలే దని యెఱిఁగి యీపర్వతము నధిరోహింపఁ గోరువారీ గుఱుతును జూచి యపా యము నకును మరణమునకును బాలు గాక బ్రతికెదరు గాక ''

అని దానిపైని వ్రాయఁబడి యుండెను. అయ్యో అయ్యో, నా ప్రయత్న మెంత యసాధ్యముగఁ గనఁబడుచున్నది. అతఁడు తా నీ దారిని పోవునపుడు దీని నిచట నమర్చెను. అతఁడు కృతకృత్యుఁడై మరల రాగలిగి యుండినచో దీనిని దీసివేసియే యుండును. కాన నాతఁ డీపర్వతమార్గములందు దన ప్రాణములదొరగెననుటయే నిశ్చ యము అని ఓటో తలపోయగ నాతని కత్యధిక మగు నిరాశ కలిగి నది. కాని యది దీర్ఘకాలము నిలువలేదు. ఏదోమహాశక్తి తనయందు బ్రవేశించి తన్ను త్వరపెట్టుచున్న ట్లతనికిఁ దోఁచి చాలవింత కలిగిం

చెను. అతఁడు సముత్సాహియై లేచి యఖాతమువంకఁ జూడ దాని లోపలి భాగమున్న మార్గము కనఁబడియెను.

ఇఁక నాతని కెట్టిసంశయమును గలుగలేదు. ఈశ్వరుఁడే చేయి పట్టి ముందునకు లాగుచున్నాఁ డని తోఁచి యాతఁడు బిఱ్ఱాన నావారిని బట్టి నడువసాగెను. అతఁ డట్లు కొంతదూర మరుగుసరికి పైభాగమున భయంకరసీత్కారధ్వని వినబడి యాతని చిత్తమున మెఱుపు మెఱసినట్లు తళుక్కు మని పోయెను. అతడు తటాలునఁ జెంతనున్న గుల్మమును బిగ్గబట్టి నిలువఁ గలిగెను. కాని లేనిచో నాయఖాతమునఁ గూలవలసినదే. అతఁడు తలను పైకెత్తిచూడఁ గ్రూరసర్పము తన నాల్కల నాడించుచు బుస్సు మని ధ్వనిచేయుచుండెను.

అతఁడు దృష్టిని మరలించి దేవదేవుని పవిత్ర నామమును స్మరించి కడువేగమున నడువసాగెను. ఈరీతిగా ముప్పది నిముసముల వఱ కాతఁడు క్రమక్రమముగ నధోభాగమువంక కే సాఁగిపోవుచుండెను. ఇపుడతనికి నూతనోత్సాహము ప్రబలుటచే భయము, అనుమానము, ఆందోళనము మున్నగున వన్నియుఁ దొలగిపోయినవి. ఈనవశక్తి యే దైవశక్తి భగవదావేశము. అట్లు పోవఁ బోవ నచట నొకరాతివంతెన కనఁబడ నాతని కమితానందము కలిగినది.

ఆమార్గము చాలవిషమముగ నుండెను. గొఱ్ఱలు మున్నగు చతుష్పాదజంతువులైన దానిపై నడువసాహసింపవు. అటులున్నను ఓటో కొంచెమైన జంకలేదు. కాని యాతఁడు నడువజాలక మెల్లగఁ బ్రాకిపోసాఁగెను. ఏలయనఁ గ్రిందకు చూడ భయంకర మగు నాయఖాతముగోచరించి యాతని తల తిరుగసాగెను. కనులు పచ్చఁబాఱ సాఁగెను. కాన నాతఁ డట్లు ప్రాకవలసి వచ్చెను. అందువలన రాళ్ళకు దగుల్కొని బట్టలు చినిఁగిపోయెను. ఒడలినిండ గాయములై రక్తము స్రవింపసాఁగెను. ఎట్లైన నేమి, అతఁ డావలిగట్టును జేరగలిగెను.

అచట నాతఁడు క్షణకాలము విశ్రమించి మరల నడచిపోసాఁగను పోను పోను చలి మిక్కుటము కాసాగెను. అతఁ డపుడు మంచుగడ్డలపై నడచి పోవుచుండెను. శీతబాధ దుస్సహముగా నుండెను. అతని దృష్టి ముందునకే గాని వెనుక కొకప్పుడైన మరలలేదు. అతఁడు కడు వేగముగ నడుచుచుండుటచే రక్తము చాలహెచ్చుగ రక్తనాళములందు ప్రవహింపసాఁగినది. దానిచే నాతనికి శీతబాధ యంతగాఁ గనబడుట లేదు.

అచట నొక గుహ కనఁబడినది. తా నచట నించుక విశ్రమింపఁ దలఁచి దానిలోని కేఁగెను. అతఁ డచట మంచులేని తావున శిలాతలమునఁ గూర్చుండఁ బోవునంతలో నాతనికట్టెదుట నొకశవము కనఁబడెను. అది శీతలప్రదేశ మగుట నాశవము గట్టకరుచుకొని పోయెను గాని కుళ్ళిపోలేదు. చర్మముగూడ మామూలుగనే కొంచెము రంగు మారి యుండెను. అతఁడు దానిని సమీపించి పరీక్షించి చూచెను. ఇట్లకాలమరణమునకు పాత్రైన యాతఁ డెవ్వఁడో '' అని యతఁ డాశవముబట్టలను బరికించి చూడ నట్టి కాగితమును గనబడలేదు గాని వ్రేలి నొక యుంగరము మాత్రము కనఁబడినది.

దానిం దీసి యాతఁడు గుహాముఖమున కేఁగి చనుప దానిపై ,, లోరెంజోస్లాడ్రోడ్డ '' అను నక్షరములు కనఁబడినవి. అతని కాశవదర్శనము చాల నశుభసూచకమని తోఁచి మరల గాఢ మగు నిరుత్సాహము కలిగినది. కాని అతఁడు మరల దైవస్మరణతో బ్రయాణము సాఁగించెను. అప్పటికి సాయంకాలమున నైదుగంటలైనది. సూర్యుఁ డస్తాద్రిని సమీపించుచుండెను. అతఁడు కడువేగముగ నడచి గంటలో శిఖరద్వయసంధిస్థానమును జేరెను. ఉన్నతశిఖరారోహణము చాల సుకరముగఁ గనఁబడినది. ఆ మార్గము చాల సుగమముగ నున్నది. అతనికి ధైర్యసంతోషములు ప్రబలమయ్యెను. చలిబాధమాత్రము చాల హెచ్చుగనే యుండెను.

మఱియొక గంట యగుసరికి దైవశక్తిసంపన్నుఁడగు ఓటో శిఖరాగ్రభాగమున నిలువఁగలిగెను. అయ్యది అఱువది గజముల వెడల్పును నంతియె పొడుగును గల విశాలసమస్థలము. దానిపై మంచుకెరళ్ళు హిమోన్నతములుగ నుండెను. మానవపాద చిహ్నమెచ్చటను గోచరించుట లేదు. పర్వతపాదమున నిలిచి చూచిన సూది మొనవలెఁ గనఁబడిన శిఖరాగ్రభాగము పెక్కు గృహముల నిర్మింపఁదగిన తావు గలదని యాతఁడు తెలుసుకొనఁగలిగెను.

దాని మధ్యభాగమున శిథిలమైన యొకపవిత్రనౌక ఆతనికి దృగ్గోచరమయ్యెను. ఆతఁడత్యంతభక్తిభరితమానసుఁడై సంపూర్ణపవిత్రతా వినమ్రచేతస్కుఁడై సర్వేశ్వరుని దివ్యనామస్మరణ మొనరించుచు దానిని సమీపించెను.

మహాప్రళయసమయమునఁ బవిత్రకీర్తులలో పుణ్యపురుషుఁడగు రా జధిరోహించి ప్రళయపయోధిని జగదీశ్వర సంరక్షితుఁడై సంచరింపఁగలిగిన దానౌకయందే. దానిం గనినప్పుడు ఓటో మానసమునఁ గలిగిన యనిర్వాచ్య మహద్భావమును వర్ణింప నెవ్వరితరమగును. జీవాత్మ పరమాత్మతో లయమైనది. జీవాత్మ స్వస్వరూప పరిజ్ఞానమున శరీరమునుండి తాత్కాలికముగ విడివడి తన ప్రాణమునకు ప్రాణమును ప్రాణప్రదాతయు నగు నీశ్వరుని పాదమూలము నాశ్రయించి తన్మయమైనది. ఆపవిత్రస్థలమున నాపవిత్రనౌకాసమీపమునఁ బరిశుద్ధమానసుఁడగు నాతఁడు పరవశుఁడై పులకాంకిత శరీరుఁడై యానందబాష్పధారాసిక్తకపోలుఁడై మోకరించి భగవత్ప్రార్థన మొనరింపసాఁగెను. ఆ ప్రార్థనామహిమ మగణ్యము, అమానుషము, అలౌకికము, అత్యద్భుతము, అప్రమేయము. అతఁడు దివ్యమానవుఁడు. ఆతని సంకల్పము దైవసంకల్పము సలయించి దివ్యసంకల్పమైనది.

అట్టి సద్భావముతో నాతఁడానోకను దైవస్వరూపమని భావించి భక్తిపురస్సరముగ నొక శకలమును ఖండించి తన వస్త్రమునందు భద్రపఱచెను. అటనుండి వచ్చినదారినే మరల దిగి రాసాఁగెను. అది యేమి యద్భుతమో అది యేమిదివ్యమహిమయో యిపు డాతని కాదారి కడుసుగమముగఁ గనఁబడినది. కడువేగమున నాదారి నతఁడు నడువగలుగుచుండెను. తిన్నని దారులు గోచరించుచుండెను. భయదసర్పములును క్రూరసత్త్వములును గనఁబడుటయే లేదు.

సూర్యాస్తమయ మైనది. ఇంకను సంధ్యారాగకాంతులు ప్రకాశించుచుండెను. రాత్రి పదుకొండుగంట లగుసరికి పరమపావనుఁడు భక్తాగ్రగణ్యుఁడు, సదయహృదయుఁడు, స్వార్థత్యాగి, పరోపకారపారీణుఁడు నగు ఓటోపియనల్లా వైరక్షీతుఁడై తాను బసచేసినగృహమును జేరఁ గలిగెను.

౯౧

లిన్నాద్వీపము వెనిసుసింధుశాఖ యందున్న చిన్నదీవి. ప్రస్తుతమా దీవి ఫెరారాప్రభుని పరిపాలనముక్రింద నున్నది. దీవికి పశ్చిమభాగమున సముద్రతీరమునందు మనోహర మగు భవనము కలదు.

మహామారి యిటలీదేశమునందు ప్రబలముగ నున్నతరుణమున ఫెరారాప్రభుదంపతులు నగరమునుండి యాదీవియందలి నిజభవనమున కేతెంచిరి. ఆ దీవియం దావ్యాధి తీవ్రముగ వ్యాపింపలేదు. కొలఁదిగఁ దలచూపిన నదిగూడ నచిరకాలముననే సమసిపోయినది.

ఈభవనమున కనతిదూరమున కారాగృహ మున్నది. గొప్పనేరములఁ జేసిన యపరాధులను ఫెరారాసంస్థానాధికారు లీకారాగారమునకు బంపుచుందురు. వారి నాకారాగృహములోని కతిరహస్యవిధానమునఁ గొనిపోవుచుందురు. ఒకసారి యాకారాగారమునఁ బ్రవేశించిన వారు మరల నెన్నఁడు జీవములతో వెలికిరాలేదు. కారా

గారమున బ్రవేశించిన వారము దినములలోనే వారికి పరలోక ప్రవేశము కలుగు నటువంటి కలదు. విషముపెట్టియో కరవాలమునఁ దలనరకియో అన్నపానముల నొసంగక శుష్కింపఁజేసియో ఉరి దీసియో మఱియొకులఁ కడతేర్చెదరో యొక్కరును జెప్పఁజాలకున్నారు. కాని లిస్బాద్వీపవాసుల కాచెఱసాలయనిన మిక్కుట మగు భయము గలదు. వారు దానినిగూర్చి బిగ్గఱగ మాటలాడుట కైన సాహసింపఁ జాలకుందురు. రాత్రివేళ నొంటరిగా నెవ్వరు నాకారాగృహప్రాంతమున కేఁగరు.

౧౫౧౮ వ సంవత్సరము మార్చినెలలో నొకనాఁడు రమణీయమగుసాయంసమయమున ఫెరారాప్రభురాణి లూక్రిజాదివ్య సౌధమునం దొకమనోహర ప్రదేశమున సఖీజనపరివృతయై కూర్చుండి యుండెను.

ఆమె రోసెంథాలు భవనము వదలి $15\frac{1}{2}$ వత్సరములు గడచినవి. ఆమె యసామాన్య సౌందర్యము నానాటికి ప్రబల మగుచుండెనే కాని తరుగుటలేదు. ఆమె కొంచెముస్థూలశరీరిణి యైనది. శరీరము స్థూలమైనకొలఁదియు విషయవాంఛ మఱింత ప్రబల మగుచుండెను. ఆమె ముఖ మిప్పటికిని దివ్యశోభ నలరారుచునే యుండెను. ఆమెమానసము విషయవిహ్వలతకును భోగలాలసతకును ఘోరకృత్యములకును నిలయమై వెనుకటివలెనే యుండెను.

ఆరీతి నామెయు సఖీసమూహము నొకమందిరమునఁ జేరి యానాఁడు మధ్యాహ్నమే జరిగిన యొకవిషయమును గూర్చి ముచ్చటించుకొనుచుండిరి. స్మిర్నానుండి వెనిసునగరమున కేఁగుచున్న యొకనౌక లిస్బాద్వీపపరిసరమునకు వచ్చుసరి కేటులనో యేకారణముననో నౌకాధికారి యనుభవజ్ఞుఁడు కాకుంటనో నీటిలోని పర్వతశకలమునఁ గొట్టుకొనెను. అప్పుడు గాలివడి మిక్కుటముగ లేకుండెను. సముద్రము

చెరువువలెఁ బ్రశాంతముగ నుండెను. గాన నావికులు పడవలలోఁ కెక్కి సురక్షితముగా దరిఁ జేరఁగలిగిరి. ఈవిషయమును గూర్చియే లూక్రెజా మున్నగు వారు ముచ్చటించు చుండిరి. అంతలో నొక భటు డాహారపదార్థముల నొకపళ్ళెరమున నిడుకొని యిటకుగొని వచ్చెను.

,, నౌక పగులుటచే దరిఁ జేరినవారిని గూర్చి నీవు మఱియేమైనఁ దెలుసుకొనగలిగితివా ? ప్రభునియాజ్ఞను సాంతముగ నెఱవేర్చితివా?,, అని లూక్రెజా జిరోనిమో యనునాపరిజను నుద్దేశించిపలికెను.

,, దేవీ, అంతయును సరిగా నెఱవేర్పబడినది. వారి కందఱికి నెట్టి కొఱఁతయు లేకుండ నన్ని సౌకర్యములు నొనరింపఁబడెను. ,,

,, మనము వీరి నిట్లాదరించుటవలన వెనిసు దొరతనము వారు మనపట్ల నెంతయును గృతజ్ఞతను వెల్లడింపఁ గలరు. వారితో మైత్రి గలిగి యుండుట రాజకీయవిషయములందు మన కనుకూల ప్రదము. కాని యానౌకను గాపాడుట కేమైన నవకాశము కలదా ? ,,

,, దేవీ, అవకాశ మేమియును లేదు. దానిలోనిసామగ్రుల నన్నిటిని నావికులు దరికి గొని వచ్చుచున్నారు. ,,

,, ఆ నౌకలోనివా రందఱును వెనిసునగరవాసులేనా ! వారిలో నెవరైనఁ బ్రభుదర్శనము చేయ నర్హతగలవారుగా నుందురేమో. అట్టివా రెవరైన నున్నచో వారి నట్లాదరించుట మనకు జాల లాభకరము. ,,

,, అర్గొసీనౌకలోఁ బ్రయాణికు లంత హెచ్చుగా లేరు. కబ్బ జర్మను కుటుంబము మాత్రము కలదు. వారినిగూర్చి నావికు లత్యధికముగఁ బ్రశంసించిరి. కాని వారి యాభిజాత్య మెంతఘనమో వారు ప్రభువులో సామాన్యులో నాకుఁ దెలియదు. కాని వారు వియన్నానగరమున కేఁగుచున్నా రనియుఁ బియనల్లా యనునది వారి కుటుంబ

నామమనియు మాత్రము విని యుంటిని.

„ పియనల్లాకుటుంబమా ” యను వాక్యము నోటవెడలుటతోఁబాటు ప్రిదాగుణకాంతులు కపోలములఁగూడ నొక్క పెట్టున లూక్రెజాకు గ్రమ్ముకొనియె. ఆ నెరజాణ పలుకులోన నాగగుర్పాటు నడఁచుకొని కుటుంబయజమాని పేరెయ్యదియో విచారించితివా ? ”
అని యడిగెను.

„ ప్రభువు వారికి నియమించిన గృహమునకు నేను వారిని వెంటగొని పోవునపుడు నాతని భార్య ఓటోయని తనభర్త నేదోపనిమీఁదఁ బిలిచినది. ”

అని పరిజనుఁడు పలుక నామాటలకు లూక్రెజా ప్రత్యుత్తరమేమియు నీయక నే యుపాహారముల నత్యల్పముగ భుజించి యొక్క పరిచారికను వెంటఁ గొని తన యంతఃపురమందిరమున కేఁగెను.

ఆపరిచారిక పేరు కాంతరంగిక. ఆమె కొంతవయసు గడచిన స్త్రీ. లూక్రెజా తనరహస్యక్రీడల నన్నిటినామె సహాయమున నేఁడగుపుచుండును. ఘోరకార్యములందు గూడ నీకాంత లూక్రెజాకు సహచారిణియే. లూక్రెజా యీామె కత్యధిక మగుధన మొసఁగుచుండుటచేఁ గయనార్డో విశ్వాసిని గాకున్నను విధేయురాలై లూక్రెజాయిష్టానుసారము మెలఁగుచుండెను.

లూక్రెజా ముఖమున గోచరించిన చిత్తవికారసూచనల నాకాంత యిప్పటికే సరిగ గుర్తించి యుండుటచేఁ దన కేదో పని కలపన దాకున్న దని నిశ్చయించుకొనుచునే యామె లూక్రెజా ననుసరించెను.

గయినార్డో వినుము. ఈ ప్రపంచమునఁ గల పురుషులలో నే నత్యంతముగ గర్హించుపురుషుఁ డిప్పుడు నాచేఁ జిక్కియున్నాఁడు.

ఆకస్మికముగ నాతఁడీద్వీపమును జేరుకొనెను. ఆతఁడు వెనుక నాకొనరించిన యవమానముల కన్నిటికి నిపుడు తగిన ప్రతీకార

మొనరింప నిశ్చయించితిని. ఓటో పియునల్లా యిపుడు నాచేఁ జిక్కినాఁడు. లూక్రెజా ప్రేమను నిరసించుట యెంతటి మహాపరాధమో నే నిపు డతనికి బాగుగా బోధించెదను. ఇనుప పెట్టెలో శవమును బెట్టి బాధించినపుడైన నా పావన చరితాభ్యాసకుఁ డగు నహంకార స్వభావుఁడు నాపాదదాసుఁడు కాకుండునా? అదృశ్యము లగుచుండు కిటికీలను గూలిపడుచుండు కుడ్యములను గనినపుడైన నాతని చిత్తమునఁ గలవరము కలిగి లూక్రెజా నన్ను క్షమింపుము నేను నీదాసుఁడ నయ్యెద నని యాతఁడు నను బ్రార్థింపకుండునా ,, అని లూక్రెజా పలికెను.

ఆతఁడు నీసౌందర్యమునకుగూడ లొంగకపోవునంతటి పాషాణ హృదయుఁడు కాగలిగినను ఇపు డిట్టిబాధల కగ్గ మయ్యుజీవింపకుండుటకు మానవాధికుఁడుగ నుండవలెను గాని సామాన్య మానవుల కది శక్యముగాదు.

,, ఆలా గనుము. అటులైన మన మిపుడు ఓటో పావనత్వ మే మాత్రము నిలువగలదో పరీక్షింపనే వలయును. నేను జూచినప్పటికి నిప్పటికిఁ గాలమువలన నాయందు వలెనే ఓటోయందుగూడ సౌందర్యభంగకర మగుమార్పేదియును గలుగకుండినచో ఆసుందరాకారుఁ డగుయువకుఁ డిపుడు సంపూర్ణ వికాసభాసురుఁ డగుపురుషవతంసుఁడై యుండునేని యాతనినిటుల వినమ్రుని గావించుటకుఁ బ్రయత్నించుట నిష్ఫలము కాఁజాలదు. పురుషప్రపంచమున నామానసము నింతగాఢముగ నాకర్షింపజాలినవాఁ డీఓటో యొక్కఁడే ,,

" అటులైన నాతఁడు తప్పక నీదాసానుదాసు డగును. ,,

" ఆతని నేటిరాత్రియే యినుపశవపేటికయం దుంచవలెను, తెలిసినదా, "

" దేవీ నేనిపుడే పర్మను కట్టి యుత్తరువు నొసఁగెద ,, నని పలికి పరిచారిక వెడలిపోయెను. కాని యాయుత్తరువుల నొసంగుటకు

మున్నె ఆపరిచారిక లూక్రెజాభర్తకడ కేఁగి యాఫెరారాప్రభుని తో నేదో కొంతసంభాషణము గావించెను. పిమ్మట లూక్రెజా యాజ్ఞలను నెఱవేర్చెను.

ఆరాత్రియే సుమారు పదిగంటలవేళ ఫెరారాప్రభు దంపతు లిరువురును బ్రధానోద్యోగులును నారీమణులును కలసి భుజించుచు న్నతఱుణమున నాపరిచారిక వచ్చి ఓటోపియనల్లా నినుపెట్టెయం దుబంధించితి మని రహస్యముగా లూక్రెజా కెఱిగించెను.

అటులె సంజ్ఞామాత్రమున లూక్రెజా యాపరిచారికకు కృతజ్ఞ తను వెల్లడించి తన భర్త మున్నగు నారితో యథాప్రకారము మరల ముచ్చటింప సాఁగెను.

రాత్రి

లూక్రెజాకుఁ బరిచారిక తెలిపిన దంతయును సత్యమే. సూర్యాస్త మయమైన పిమ్మట తమ కొసఁగఁబడిన విడిది గృహమును వీడి మంద పవమానుఁ డొసంగు మహదానందమును జూరకొనుటకు సముద్ర తీరమున నడయాడఁ బోయెను. అతఁ డచట నీటిలోనికి బొడుచుకొని పోయి వేదికవలెఁ బ్రకృతికాంతిచే నమర్పఁబడిన శిలాతలంబునఁ గూర్చుండి ప్రకృతిరామణీయక పారవశ్యమున నించుక మైమఱచి యున్నంతలో నడుఁగుల సవ్వడి వినబడియెను. అతఁడు తిరిగిచూడ ముప్పురు పురుషులు తనవంకకే వచ్చుచుండిరి.

ఆతఁ డెట్టియపాయమును శంకింపక మరల నాసువిశాల మహా సాగర గంభీరశోభనే దిలకింప సాఁగెను. అత్తఱి నభోభాగమునందు బొడచూపిన తారకాసహస్రముల విమలదీప్తు లాసాగరరమ్యతరంగ డోలికల నూగులాడుచు విచిత్రచిత్రలేఖాప్రవీణుం డగు దివ్యచిత్ర కారశేఖరుని యలౌకిక సామర్థ్యము నీదివ్య మానవచిత్రకారుని భావఫలకమునఁ బ్రదర్శింపఁజేసెను. ఆకతమున నాతఁడు భక్తిపర వశుఁడై మైమరచెను.

అంతలో నాద్రోహులు వెనుకనుండి యూరకుఁ దనమునఁ బట్టుకొని యాతని చేతులఁ బాశములతో గట్టివేసిరి. ఈదురాగతమున కేమికత మని యాతఁ డడుగ వారు మౌనము వహించిరి. అట్లు లాతని బంధించి సముద్ర తీరముననే పట్టణ సీమాంతమును దాటు వఱకు నడపించుకొని పోయి యచటఁ గటాలున నొక యిరుకుసందున బడి వడివడి నడువసాగిరి. అదిదుష్ట మగు నుపవన మని తోఁచెను. అతఁ డెన్నివిధములఁ బ్రశ్నించినను వారేమియును బదులిడ రైరి.

అట్లుల కొంతదూర మరుగుసరికి దారుణకారాగృహ స్తంభములు దృగ్గోచరము లయ్యెను. ఆభయంకర ప్రదేశమును గూర్చి యింతకు వెనుకనే విని యుండుటచే నాతని మనసు చివుక్కుమనిపోయెను. తన యాలుబిడ్డలు తలపునకురా ధైర్య మించుక సడలి యొకటి రెండు వేడికన్నీటిబిందువు లాతని నేత్రములనుండి చెక్కులపై రాలెను.

ఆహా! ఎంతటి యవజ్ఞత! సర్వాంతర్యామి యగు సర్వేశ్వరుఁడు నిరంతరము నాచెంతనుండి నను గంటికి ఱెప్పవలెఁ గాపాడుచుండ నాకీప్రాణభీతి సముచిత మగునా? ఇది యవిశ్వాసము కాకుండునా? ఆహా! పాడుమనసు నన్ను భగవంతుని యాగ్రహమునకు బాత్రునిఁ జేయ నిట్టిపోకడలఁ బోవుచున్నది. సర్వేశ్వరుఁడే దాని మన్నించుగాక. అతిభయంకరమగు నరారాటు పర్వతారోహణము నవలీలగఁ గొనసాగించిన కరుణాంభోనిధుఁడు నన్ను దప్పక కాపాడును. నాకా స్వామి యెడల నెట్టి యవిశ్వాసమును లేదు. నాకెల్లర యెడలను సంపూర్ణ ప్రేమయే గాని ద్వేష మావంతయును లేదని యాతఁడు తలంచుకొని సర్వేశ్వరుని సన్నిధానమును భావించుకొని మానసిక ప్రార్థన మొనరించెను.

పది నిముషములలో వారు కారాగృహమును జేరిరి. కరదీపికను జేబూని నిలిచిన యొక వ్యక్తి ద్వారమును దెరచెను. ఆన

పు కాంతిని ఓటో తన వెంట వచ్చిన వారిని బాగుగా బరికించి చూచె వారిలో నొక్కనిఁ దా నెచటనో చూచిన ట్లాతని కనుమానము కలుగ మరల బాగుగాఁ బరికించి చూచి గుర్తించెను. వియన్నానగర న్యాయస్థానమున నిందితులు ముప్పురిలో నొక్కఁడగు షర్మనే యితఁడు. వానిని నాఁడా న్యాయస్థానముననే ఓటో చూచెను.

“షర్మను, నీకు నే నేమి హానిచేసితి” నని ఓటో కను నెమ్మదిగఁ బలికెను. షర్మను వినుపించుకొనని వానివలె నేమియును మాఱుపలుకఁ డాయె. తన కింక మరణమే గతి యని ఓటో నిశ్చయించుకొని ధీరత్వముతోఁ బ్రాణముల నర్పింపఁ దనకు మనస్స్థైర్యము నొసఁగు మని యాతఁ డార్తార్తి నిర్వాపకుఁ డగు భక్తరక్షకుని బ్రార్థించుచు వారితోఁ గూడఁ గమ్యాంతరములు నిర్గమించి పోని కేఁగుచుండెను. పిమ్మట చాలభద్రముగ రక్షింపఁబడిన యొక యరతలుపు తెరచి షర్మను ఓటో కర బంధములను విప్పి యాతని నాగది లోనికి ద్రోసెను. పిమ్మట నా రాతలుపును మూసి గడియలును దాళములను బిగించిరి.

ఆగది యంతయును గాఢాంధకారబంధురమై యుండెను. నేలపై నెండుగడ్డి పఱువఁబడి యుండెను. ఓటో యిప్పు డాకుశాస్తరమునం దాసీనుఁడై చాల దైన్యముతో నాలోచించుకొన సాఁగెను.

“నే నిట్లాకస్మికముగ మాయమైనందులకు నా ప్రియపత్నియు ముద్దుకుమారులు నెంతపరితపింతురో గదా! అయ్యో, వారి పాలిటికీ రాత్రి కాళరాత్రివలెఁ దోఁచును గదా” యను ఘోరసంతాపము భక్తాగ్రగణ్యుఁడును మహాధైర్యశాలియు దైవరక్షితుఁడు నగు ఓటో నుగూడ క్షణకాలము నిర్జింపఁ గలిగెను.

అంతలోఁ దనచేత నున్న పవిత్రనౌకాశకలపేటికా వృత్తాంత మాతని చిత్తమునకు సౌదామినీ ప్రకాశమువలెఁ బొడఁగట్టెను.

ఆతఁడు ప్రకంపిత చిత్తుఁడై వితాకఁ జెందెను. ఆహా! పాపపురుషుఁ డిటులనను దురాకర్షణలకు పాలుజేయఁ జూచు చున్నాఁడా? ఫౌస్టు వలెనే నన్నుగూడ దీర్ఘజీవితశక్తి స్వాతంత్ర్య భ్రాంతికిపాలుజేసి యాతఁడు నాయాత్మను గూడ హరింపఁజూచుచున్నాఁడా?

"అదియే నిజ మని తోఁచు చున్నది. ఈపాపపురుషుఁ డెంత దారుణచిత్తుఁడు. ఏమైన నేమి. న న్నాతని బారినుండి కాపాడుట కీ పవిత్రితమ నాకాశకలపేటిక వజ్రకవచమై యలరారుచుండ నా కెట్టిభయము" అని ఓటగో తలపోసి కిటికీలవంకఁ జూడనాతని సర్వాంగములును గంపితములు కాసాఁగెను. కాన నాతఁడు తనదృష్టిని గవాక్షములనుండి మరలించుకొనెను.

ఆతఁడు లేచి నిలువబోవ గదిపైభాగము తలకుఁ దగులసాఁగెను. ఆతఁ డిటు లంతకుపూర్వము ధ్యానమగ్నుఁడై యున్నతఱిని బరిజను లాహారపానీయముల నచట నుంచి పోయిరి. వాని నిపు డాతఁడుచూచెను.

అంతలో గవాక్షములు మాయము కాసాఁగెను. ఇఁక రెండు కిటికీలు మాత్రమే మిగిలి యున్నవి. గంట మ్రోగినది. ఒకకిటికీ అదృశ్యమైనది. మరల గంట రెండుసారులు మ్రోగెను. రెండవదికూడ మాయమయ్యెను. మూఁడవసారి మూఁడుసారులు గంట మ్రోగెను. గోడలు విరిగిపడి మిగిలినకిటికీని గప్పివేసెను. రేపు నాలుగుసారులును, ఎల్లుటిరోజున నైదుసారులును గంట మ్రోగునంతటితో నాపని తీరును. ఎవనిదుర్జ్ఞాను సారము నా కిట్టి దురవస్థతటస్థించినది. నే నిట్లుచావవలె నని విధించిన విరోధి యెవ్వఁడు? మానవులలో సీజరు కుటుంబమువారుతప్ప మఱెవ్వరు నింతటి పాషాణహృదయులు కాఁజాలరు. ఆహా! లూక్రెజా లూక్రెజా! ఇది నీపన్నాగమే. రోసంథాలు భవనమున నీహాసమూ విలాసమునకు లొంగి నేను నీ

దాసుఁడను గా నైతి నని పగఁబూని నేఁడు న న్నిట్లు సాధింపఁబూని తివి. ఇంతటి దారుణకృత్యముల నొనరింపజాలు వారిలో నీ వొక్క-తెవే యింకను మర్త్యలోకమున మిగిలి యున్నదానవు. నే నిట్లు చావవలె నని సర్వేశ్వరుఁడే సంకల్పించుచో నే నా దేవదేవుని పవిత్రనామ స్మరణములో ప్రాణముల వదలెదను. గాని ద్వేషమునకు ఈర్ష్యకును లొంగి నిన్ను దూషించుచు శరీరమునకే గాక పవిత్రమగు నాత్మకుఁగూడ వినాశనమును తెచ్చిపెట్టుటకు నే నొప్పువాఁడఁ గాను.''

అని పలుకునంతలో నాగది క్రమక్రమముగ సంకుచితమై శవపేటికవలె జాల నిరుకుగా మాఱిపోవుచుండుటచే నెంత ప్రయత్నించినను ఓటో కు ధైర్యము నిలువ కుండెను. అది యెట్టినిర్మాణ కౌశలమో గాని క్రమక్రమముగ గోడలు కుంగిపోవుచుండెను. పైకప్పు నేల నంటుకొనునంతటి చేరువకు వచ్చుచుండెను. ఎంతటిధైర్యశాలి యైన నీవిపరీత లక్షణముల గనినంతనే గుండెపగిలి తత్క్షణమ మృతి నొందుట కెట్టి సంశయమును లేదు. ఓటో తడుముకొనిన నాతని చేతులకు పైకప్పు తగులుచుండెను.

ఈ రీతిగా మూఁడు దినములు గడచెను. నాలుగవ దినముగూడ గడచినది. రాత్రియైనది. ఓటో నిద్రపోవుటకు భయపడుచుండెను. కనులు మూసిన పాపపురుషుఁడు ప్రత్యక్షమై మరల భ్రమింపఁజేయు నేమో యని యతఁడు సంశయించుచుండెను. లేచి నిలుచుట కైన వీలులేకుండఁ బైకప్పు తలకుఁ దగులుచుండెను. కావున నతఁడు కూర్చుండియే సర్వేశ్వరుని పవిత్రనామమును స్మరించుకొనుచుండెను. తెల్లవారుచున్న దని యాతఁడు భావించి గోడలవంకఁ జూచుచుండఁగ గంట నాలుగు సారులు మ్రోగెను.

నాల్గవసారి గంటమ్రోగినంతనే ఓటో అనుకొని యున్న గోడ మెల్లమెల్లగ నాతని ముందునకు ద్రోయుచు లోనికిఁ ద్రోసుకొని

వచ్చుచున్నట్లగుపడెను. నిలుచుండినపుడుమాత్రమే తలకు దగులుచుండినఁ బైకప్పు కూర్చుండగనే యాతని తలను తగులసాగెను. ఆతనినోట నొక భయంకరార్తధ్వానము వెడలినది. మరల నాతఁడు ప్రాగ్భాగమువంకఁ జూడ నొక్క కిటికీమాత్రమే మిగిలియుండెను. దానిలోనుండి యంగుళమాత్రముగఁ గాంతి లోనఁ బ్రసరించుచుండెను.

„ఆహా, రేపటితో, జేపటితో, అంతయునుమడిసిపోవును! ప్రియా! హా! నీనా, హా! ప్రియతనయులారా" అని యాతఁడు దుఃఖము నాపుకొనజాలక వెక్కి వెక్కి యేడువ సాఁగెను.

ఆరీతి నాతఁ డశ్రుజలములు విడుచుటచే నాతనికిఁ గొంత యుపశాంతి కలిగినది. అతఁ డాహారపదార్థములను మరల నచటఁ గని వానిని భుజించెను.

ఐదవనాఁ డంతయు నాతఁ డేకాగ్రతతో రాగద్వేషముల సంపూర్ణముగ నిర్జించి ప్రేమపరిపూర్ణుఁడై తన్మయుఁడై 'నేవు నీశ్వరునంగు లయముచేసి యోగియు మౌనియునై నిర్మలమనస్కుఁడై సర్వేశ్వర ధ్యానమున నిమగ్నుఁ డయ్యెను. ఆరాత్రి యాతని కిఁక నెట్టి భీతియును గలుగలేదు. ఆతఁడు సర్వేశ్వరుని దర్శించుచు స్మరించుచు దివ్యపురుషుఁడై చిదానంద స్వరూపుఁడై నిద్రించెను.

౯౩

ఐదవనాఁడు సూర్యాస్తమయమై చీకటిపడినది. మఱునాఁడు సూర్యోదయ మైనంతనే యైదవగవాక్షు మంతరించుననుటకు సూచనగా నైదుసారులు గంటమ్రోగగానే కృత్రిమనిర్మాణకౌశల మన నాగది గోడలును పైకప్పు నేకమై తన్ను నలిపివేసి జీవనము హరించు నను గట్టి నమ్మకముతో ఓటో నాటిరాత్రి కుశాస్తరణమున మేనుఁ జేర్చెను.

అతఁడు మరణమునకై చింతించుట లేదు. తన మరణ వృత్తాంతము నెఱుంగక తన కత్యంత ప్రేమాస్పదులగు తన యాలుబిడ్డలు తా నెన్నటికైన మరల రాఁగలుగు నను పేరాశకు బాత్రుఁడై పెక్కు వత్సరములవఱకు వేఁచియుండి చివర కాయాశ నిరాశ కాఁగా హృదయము వ్యాధిగ్రస్తము కాఁగ నిష్కృత్యములు విషతుల్యములు గాఁగ దారుణమనోవ్యథకు పాత్రుఁడై మృతి నొందుదునుగదా యను వంతయే యాతనిఁ గడుబాధించుచుండెను.

అతఁ డిట్టులఁ జింతాకులుఁడై ధ్యానమగ్నుఁడై యుండ నేదో ధ్వని వినఁబడెను. అతఁ డాగదిలోనికి వచ్చినది మొదలింతవఱకు నాతని సంతాపప్రార్థనల ధ్వనియును గంటలధ్వనియుఁ దప్ప వేఱొక్క ధ్వనినిగూడ నాతఁడు వినియుండలేదు. ఇపు డాధ్వని ద్వారముచెంత వినబడినది.

తలుపు తెఱవబడిన జాడ యైనది. వెంటనే చల్లనిగాలి లోనఁ బ్రవేశించినది. ఆ చిఱుగాలి "శ్రీగోపియనల్లా" అను కాంతాకంఠ కోమలనినాదము నాతని కర్ణమూలమున నైచెను.

ఆ కంఠనినాద మాతఁడు విని పెక్కు వత్సరములైనను ఆగాత్ర మాధుర్యము నాతఁడు మఱవలేదు. అయ్యది ఉబ్రాకైజా కంఠధ్వని.

"అటులైన నీవేనా నన్నిట్లు బాధించుచున్నది! మానవులందింతటి దారుణ కృతఘ్నత నలవరచుకొనఁ జాలిన స్వభావము గల వారు గూడ నుండ నవకాశము కలదా? నీ సోదరుని విషయమున నే నొనరించినదాని నంతను బహుశా పగులవప్పనే మఱవఁగలిగితివా?" అని యాతఁ డడిగెను.

ఉబ్రాకైజా మఱి పిన్నదను లేను. ఆమె నే విషయమును గూడ నెన్నఁడును మఱువఁజాలను. "గోసెంథాలు మర్గమున నీవె జూపిన యపారప్రేమను నీ వెట్లు తృణీకరించినదియు గూడ నేను

మగువ లేదు. అపుడు నేను నీపాదములఁబడి వేడిన నీవు కాలఁ దన్న లేదా ? నన్ను ఘాతుకమృగమువలె నీ వింతకాలమును గడునీచముగఁ జూచి యెడఁదొలఁగి యుండలేదా ? నేను జేసిన మహాపరాధము లకు నీవు నన్ను నిందించుటకుగూడఁ బూనుకొనలేదా ? ఏమైన నేమి నే నిపుడు నిన్ను నిందించుటకు రాలేను. నీవు సమ్మతించిన నిన్నుగా పాడుటకే వచ్చితిని. ”

“ ఈ కారాగారము నుండి తప్పించుకొనుటకు నేను సమ్మతింప కుందు నని తలఁచితివా ? ఊక్రెజా నన్ను విడిపింపుము. నా సతీసు తుల చెంతఁ జేర్పుము. మరల వారిని నేను గాఢాలింగన మొనరిం చుకొనఁ గల భాగ్యమును నాకుఁ జేకూర్పుము. నేను నీకొఱ కీశ్వ రుని బ్రార్థించెదను. కృతజ్ఞతతో నిన్ను బ్రశంసించెదను. ”

“ నీవలన నే నపేక్షించునది కృతజ్ఞతగాదు. గాఢతమ మగు ప్రేమ. ”

“ నీవు మరల నియమముల విధించుటకే వచ్చియుంటివా యటు లైన నోదుశ్శీలా ! వినుము. ఇపుడే నాతలకు తగులుచున్న యీ పై కప్పు నన్నీక్షణముననే నలిపి వేసి నాప్రాణముల హరించినను సం తసింతునే గాని నీయభిమతమును మాత్రము నే నెన్నటికి నీడేర్పవాఁ డఁగాను. ”

“ నీవు వెంటనే మృతినొందెదవని తలంపకుము. నేను నా యను కూలమును బట్టి పగసాధించుకొనఁ దలఁచినపుడు గాని ప్రభువు శత్రు సంహారమొనరింపఁ గోరినపుడుగాని యీ కారాగారమున బంధింప బడిన వారికి శీఘ్రమరణమును గలిగించునంతటి కనికర మెన్నఁడును జూపఁబడదు. పదునాజేండ్ల క్రితము రోసెంథాలు దుర్గమున నన్ను నిరసించిన ట్లిపుడు మరల నిరసింపకుము. రేపటి యుదయముననే గంట మైదుసాగులు మ్రోగినంతనే శవపేటికయం దుంచబడిన శవ

మునకు నలుతట్టు లెంతచేరువగ నుండునో అంతచేరువగనే యీగోడలును పైకప్పును నిన్ను నిర్బంధింపఁ గలవు. ఆ స్థితిలో గదల మెదల వీలులేక తినఁదిండియుఁ ద్రాగ నీరును లేక నీవు పెక్కుదినములు నవసి నవసి క్షుత్పిపాసలచే దహింపఁబడుచు సంపూర్ణముగ స్మృతి గలిగి వేతనల కడవఱకు ననుభవించుచుఁ బిమ్మట మృతి నొందెదవు! ఇప్పుడైన నా ప్రేమ నాదరింతువా ? ''

,, నీవు రామామణివి గావు, రాక్షసివి! పొమ్ము. వెడలిపొమ్ము. నే నెన్నటికి నీ పాపపుకోరిక కొడఁబడఁజాలను. ''

,, అటులైన నీకు మరణమే శరణ '' మని లూక్రెజా పలికి వెడలిపోయెను. తలుపు మూయఁబడెను గాని ఆ నిముషముననే పెక్కుమంది నడచివచ్చుచున్న పదధ్వనులును గుపితస్వనములును ఓటో చెవినిఁ బడెను. ఆగదితలుపు గడియలు విడిపోయినవి. తలుపు తెరువఁబడెను. మార్గమున దీపములవెలుఁగు కనఁబడెను. ,, ఓటోపియ నల్లా లేచి రమ్ము. నీవు బంధవిముక్తుఁడ నైతి '' వని గంభీరస్వనమున నెవరో సాధికారముగఁ బలికిరి.

ఈరీతిగా భక్తార్తిభంజుఁ డగు సర్వేశ్వరుఁడు తన మహాశక్తియె నట యెంతటి మానవశక్తియు నిలువఁజాల దని లోకమునకు వెల్లడింపఁ దలఁచి యట్టి ప్రోత్సాహమును గలిగించి తన భక్తుని గాపాడుట కావ్యక్తిని బంపి యుండెను. ఆసర్వేశ్వరుని మహామహిమను ఓటో స్మరించుకొని పులకితశరీరుఁడై ఆనందాశ్రుపూరితలోచనుఁడై భక్తిపారవశ్యముతో వెలికి వచ్చెను.

అట్లు తన్ను విడిపించినవాఁడు లూక్రెజాభర్త యగు ఫిరారా ప్రభువే యని యాతని ప్రభులాంఛనములఁ బట్టి ఓటో సులభముగా గ్రహింపఁ గలిగెను. ఎవరైనను నిమిత్తమాత్రులే. కుత్సిత మానవ సంకల్ప చిత్రనాటకములు ప్రారంభమైనంతనే వానిని గీటునఁబుచ్చు

టకు సర్వేశ్వరుఁడు తన దివ్యసంకల్పమును బ్రయోగించి ప్రతినాటకమును గల్పించుచునే యుండెను.

లూక్రెజాను షర్మనును నిర్బంధించిరి. వారిరువురును సైనికుల వశమున నుంచఁబడి యచటనే నిలిచి యుండిరి. ప్రభువుమాటున లూక్రెజా యాంతరంగిక పరిచారిక యగు గియనాడ్డో నిలిచి యుండెను.

"ఓటో పియనల్లా నీ విపుడె నీసతీసుతులం గలుసుకొనుము. వారు నీజాడ దెలియక దుఃఖభాజనులై యగతికులై యున్నారని తలంచి చింతిలకుము. నీవు కారాగారమున బంధింపఁబడిన నిముసముననే వారు విశ్వసింపఁదగిన వార్తను అది యసత్యమైనను హితంకర మగుటచే నసత్యదోషము కలుగక మేలే కలుగు ననునమ్మకముతో- నేను వారికిఁ బంపియుంటిని దానిని వారు విశ్వసించి యున్నా" రని ప్రభువు పలికెను.

"అయ్యా, మీకు వందనసహస్రము" అని ఓటో సంతోషితస్వాంతుఁడై నుడివెను.

"నే నెఱిఁగి యుండియు నీ విన్నిరోజులు లీట్రిదారుణ మనోవ్యథను బాలగుచుండ మిన్నకుండినందులకు నన్ను మన్నింపవేఁడెదను. లూక్రెజాప్రవర్తనము సరికాదనువదంతిని నేను విని యుండియు నీమెను నాయర్ధాంగి నొనరించుకొంటిని. కాని యీమెప్రవర్తన మేమియును మాఱలేదను ననుమానము నాకుఁ గలుగసాఁగెను. దానిని స్థిరపఱచుకొనుటకే నే నెఱిఁగి యుండియు యుక్తకాల మేతెంచు వఱకును మిన్నకుండ వలసినవాఁడనైతిని. లూక్రెజా నీయసమాన సౌందర్యాతిశయమును గని పరవశుఁడనై నిన్నుగూర్చి విన్నవదంతుల నన్నిటిని విస్మరించి అవదింతయు లతిశయోక్తులని నీవు తెలిపిన మధురోక్తులను పలికిన ప్రమాణవాక్యములను విశ్వసించితిని గదా హరి

ణయమాడితివి ? ఆప్రమాణములన్నియు నేమాయెను ? ఈరహస్య మును నాకు వెల్లడించినవా రెవ్వరో యెఱుఁగుదువా ? నీపాపకృత్య ములకు సహకారిణియై నీ కత్యంత విశ్వాసనీయ యైననీయాంతరంగిక పరిచారికయే ఈవిమల వర్తనునిచెంత నీవు పలికిన మోహవాక్యము లును నీవు చేసిన నియమమును బరస్త్రీలఁ గన్నెత్తిచూడ ననుగొప్ప నియమమును బూనిన యీపూజ్యవర్తనుఁడు నీదుర్నియమములఁ దిర స్కరించి తన ప్రాణములనుగోలుపోవుటకే సంసిద్ధుఁడై నిన్ను తృణీ కరించుచుఁ బలికిన పలుకులను నీ వప్పుడైనపట్టు విడువక నాతని మర ణమునే సంకల్పించుచు నాడిన రాక్షససహజము లగు మాటలను జెవులారవింటిని. అవి నే ప్రబలనిదర్శనము లయ్యెను ” అని ఫిరారా ప్రభువు కఠినాక్షరముగనిందించుచుండ లూక్రెజా పరిచారికవంక సాక్షేపణములఁ బ్రసరింపజేయుటతప్ప నెట్టిప్రత్యుత్తరము సేయలేదు.

,, ఓగయన్నా! నిన్ను గాపాడెద నని నేను మాటయిచ్చి యుం టిని గాన నీవు పోవచ్చును. ద్రోహి కులటా దాసుఁడా పెర్మను నిపే కారాగారమున నేకాంతవాసములఁబడియుండుటయే నీదుశిక్ష. భటు లారా, వీనిని గొనిపొండు ” అని ప్రభువు పలికెను.

ఆపరిచారిక వెంటనే వెడలిపోయెను. పెర్మనును భటులు చెఱ సాలకు గొనిపోయిరి.

,, ఓటోపియసల్లా మీకొఱ కొకనౌకను సిద్ధపఱచితిని. మీ రెచ టికి పోఁదలచిన నచటికి దానిపై నేఁగ వచ్చును. నీ విచట ననుభ వించిన కష్టములను జూచిన వింతలను మఱువఁగోరెద ” నని ప్రభు వనెను.

,, అయ్యా ! పెర్మనయు దుర్నీతివర్తనయు నయ్యెను నీమానిని గాపాడదగు నని నేను వేఁడుచున్నా ” నని ఓటో పలికెను.

,, ఓటో నీ వేమియును జెప్పవలదు. న్యాయశాస్త్రమును సార మాకును శిక్షితకాఁగలదు. నీ వింక వెళ్ళవచ్చు ” నని ప్రభువనెను తాను

మహాచ్ఛక్తి సంపన్నుఁ డగుసర్వేశ్వరుని కళాంశమునను జ్ఞానము లేని కతమున జీవము నీశ్వరునుండి పూర్తిగా వేఱుపఱచి కేవలము శరీరముతో లయింపఁజేసి యట్టియపవిత్ర కార్యముల నొనరించినను వ్యక్తికి హానిజేయుట సజ్జనధర్మము కాదు. గాన వెడలిపోవుటకు మనసు రాక ఓటో కొంచెము సంశయించుచు నిలువఁబడెను.

దానింగని ప్రభువు క్రోధమూర్తియై వెడలిపోవే మని గద్దించి పలికెను. వెంటనే భటులు ఓటో నటనుండి గొనిపోయిరి. ఏగది నుండి ఓటోను వదలిరో యాగదిలోనే లూక్రెజాను బంధించిరి. ఆమె తన గర్వితమతి నంతయు విడనాడి తన భర్తపాదముల నశ్రు జలముల నభిషేకించుచు నెంతయో వేడుకొనెను. కాని యాతని కావంతయైనఁ గరుణ కలుగలేదు. ఆతఁ డచటనే నిలచి నిష్కరుణముగ నాజ్ఞాపించుటచే భటులు దుఃఖభాజనులై తల మోదుకొనుచు వాపోవుచుఁ గొట్టుకొనుచున్న లూక్రెజా నాగదిలోనికిఁ ద్రోసి తలుపుల మూసిరి.

ఆప్రభుఁడుగూడ భగవంతుని ప్రేమామృతధారల గ్రోలినవాఁడు గాకుండుటచే పాషాణహృదయుఁడై దారుణవధను సంకల్పించి తెల్లవారువఱకు నచటనే నిలచి యుండెను.

సూర్యోదయ మైనంతనే దారుణ మారణయంత్రములకుఁ గీలు త్రిప్పిరి. గంట నైదుసారులు మ్రోగినది. లోననుండి భయంకరార్త ధ్వానము వెలువడుచుండెను. తోడనే పైకప్పు నేలమట్టముతోఁ గలసి పోయెను. ఆరెంటికిని మధ్యనున్న లూక్రెజా యీరీతి నతిభయంకర మరణమునకు బాల్పడి అవసానదశయం దైనపశ్చాత్తాపముతోఁ బ్రశాంతమానసయై సర్వేశ్వరునిఁ బ్రార్థింప నోచుకొనక తనువు దొరంగెను. అనపరాధియు మహోపకారియు భగవద్భక్తుఁడు నగు ఓటోను నిష్కారణముగ నిట్టి బలవన్మరణమునకు పాలుపఱుప నెం

చిన పాపఫల మిట్లు కట్టి కుడిపినది. ఆరాత్రి ప్రభు వట్లు దైవప్రేర ణమున స్వప్నపడి ఓటోను విడిపించి యుండనియెడల నిట్టి బలవన్మరణ మున కాతని పాలుపఱచి పగఁదీర్చుకొనఁ జాలితి నని ల్యూక్రెజా సంత సించుచుండి యుండును గాని మహాశక్తిసంపన్నుఁ డగు సర్వేశ్వరుని దివ్యసంకల్పము నెదుట స్వస్వరూప పరిజ్ఞాన లేశమైనలేని పశుప్రాయు మగు మానవ సంకల్ప మెట్టుల నిలువఁగలదు. సర్వేశ్వరుఁడు భక్త పరాధీనుఁడు. ఆహా! భక్తుఁడగు ఓటో ప్రేమాతిశయ మంతటి పాతకినిగూడ నాతఁడు రక్షింపఁ జూచెఁగదా!

## ౯౮

ఓటోపియనల్లా కారాగారమునుండి విముక్తుఁ డగుటయు ల్యూక్రెజా మృతి నొందుటయుఁ గూడ గతకాల వృత్తాంతములలోఁ గలిసిపోయెను. ఆఱునెలలు గడచినది. కాలచక్రభ్రమణము నెవ్వ రాపఁగలరు? ౧౯౧౩ వ సంవత్సరమున మే నెల జరుగుచున్నది.

వియన్నానగరమున నిపుడు మహామారివ్యాధి లేదు. వ్యాధి యంతరించినది గాని దాని వలనఁ గలిగిన ఘోరదుర్దశయు సంతాపమును స్థిరావాసము నేర్పఱచుకొనెను. అవి యంత శీఘ్రముగ వెడలఁగలఁ చుకొనలేదు.

జనసంఖ్యయం దర్ధభాగ మంతరించినది. బంధువియోగము లేని గృహ మొక్కటియైనఁ గనఁబడలేదు. ఒకనాఁడు సాయంకాలమునకు ఓటో వియన్నానగరమును జేరి తన సతీసుతుల నిజమందిరమున విడియించి ఫాస్టు మందిరమున కేఁగెను. అతఁడు సౌధద్వారము నొద్ద గుఱ్ఱమును దిగినంతనే ద్వారపాలకుఁ డశ్రుజలపూరితలోచనుఁడై నమస్కరించెను.

„ ఏమి నీ సంతాపకారణము? ”

,, అయ్యా, దయామయియగు ధరన్నా దేవి యీలోకమును విడి పోయినది. ''

,, హా ! సాధ్వీమతల్లీ ! ధరన్నా వెడలిపోయితివా ? నీవీ ఫౌస్టును బెండ్లియాడి సౌఖ్యపడగోరితివే గాని సౌఖ్యలేశమైనఁ బడయఁజాలక పోతివి గదా ! నీవు భక్తురాలవు. సర్వేశ్వరుఁడు నీఆత్మను గాపాడు '' నని కలుకొలకుల వెడలుకన్నీటిని గొనకోట దుడుచుకొనుచు ఓలో పలికెను.

ఆమె తొలుదొలుతనే మహామారి కాహుతి యయ్యెను గాని యామె యెట్టి శ్రమలకుఁ బాలుగాక యనాయాసముగఁ గూర్చుండి నది కూర్చుండినాయులనే ప్రాణములఁ దొరఁగి యీశ్వరసన్నిధాన మును జేరెను. తనభర్త ప్రార్థించికొని తెచ్చిన మహామారణ దేవత యీామెనే తొలుత బరిహారణముగఁ గొనెను. అయిన నేమి ? ఆమె నిరంతరమును సర్వేశ్వరుని పవిత్రనామస్మరణ మొనరించు ధన్యచరిత్ర యగుటచే నామెకు దివ్యులును స్వాగత మొసఁగిరి.

ఆమె ప్రేమమయి. భక్తిభరిత. దుశ్చింతలకామెయంతరంగమున నెడము లేదు. గాననే దేవదేవుఁడా పావనచరిత ననాయాసమరణము నకు బాలుచేసి నిజసన్నిధానమునఁ జేర్చుకొనెను.

తనభర్త పాపపురుషునివశుఁ డయ్యెనను వార్తను గాని శోలికా మందిరమున బిడ్డలను మార్చి రనుయుదంతమును గాని వినకుండనే యామె వెడలిపోయినది.

ఇఁక ఫౌస్టు గతియేమి ?

పతివ్రతా శిరోమణి యగు సతీమణి మరణమున గుండె చెదర హా ! నేనే యీసతీహంతకుఁడను. నేనే యింమెకుఁ నారణభూతుఁడ నని యాతఁడు పెద్దపెట్టున నేడువ సాఁగెను. గాని దానిభావము మాత్ర మెవ్వరికిని సుబోధము కాలేదు. దుర్భరసంతాపము వలనఁ గలిగిన ఆర్తప్రలాప మనియే యెల్లరును దలఁచిరి.

ధరస్సాదే తనజనని యని విశ్వసించుచుండుటచే ఆశీలాకన్య యాసాధ్వీమణి మరణమునకు దుఃఖాతురాలై వాపోయెను. అపావని మహామారిచే మృతినొందినను నాకన్యారత్న మావంతయు సంశయింపక శవసమీపమున మోకరించి శవశకటము వచ్చువఱకును నిర్మల భావముతో నీశ్వరుని గూర్చి ప్రార్థించుచునే యుండెను.

ఆమె ఆదుఃఖము నొంటరిగనే యనుభవించెనా ? లేదు.

నిర్మల ప్రణయప్రపూర్ణుఁడగు మేక్సిమిలను ప్రాణాధిక యగు నశీలాను ప్రాణక్షీతిచేఁ బరిత్యజింపఁ గలఁడా ? అది నిర్మలప్రణయ లక్షణమా ? నిర్మలప్రణయ మున్నచో స్వార్థపరత్వమున కెడ మున్నదా? ఆతఁడును మహామారిని ధిక్కరించి యాబాలికామణి నరనిముసమైన నెడబాయ కుండెను. మహామారి సోకుటయే సర్వేశ్వరుని సంకల్పమైనచో మేమిరువుర మొక్కసారియే దైవసాన్నిధ్యమున కేఁగగము గాక వెఱువ నేల యని యతఁడు తనలో ననుకొనెను.

ఆర్చిడ్యూలియపోల్గును మేరియాయును ధరస్సాసతి మరణమునకు జాలదుఃఖితులైరి గాని మాక్సిమిలను అశీలాల నోదార్చుటకు వారు దుఃఖమును లోన నడంచుకొని ధైర్యమును బూనిరి.

మహామారి దైన సేమి. సర్వేశ్వరుని నియమము నతిక్రమింపఁ గలదా? ఎవ్వరిమరణము నాతఁడు సంకల్పించునో వారినే గాక తక్కినవారిఁ జేరిఁజూడనైన దానితర మగునా? కాననే యొకొక్కక గృహమునఁ బెక్కండ్రును కొన్ని గృహముల నొక్క రిద్దఱునుగా మృతి నొందిరి. కొన్ని కుటుంబములలో నొక్కరును మృతి నొందనే లేదు. బలశాలు లట్టె యెగిరిపోయిరి. దుర్బలులు కనుకందలేదు. నవయువ్వనులంతలో నంతరించిరి, శతవృద్ధులకుఁ బాపు రానేలేదు. భీతచిత్తుల నది స్పృశింపనే లేదు. ధైర్యశాలులనే దనపొట్టఁ బెట్టుకొనెను. అది యిది యటునిటు నని దేవనియమము నెవరు నిర్ణయింపఁగలరు. అది

యీశ్వరనియమము గాని మానవ నియమము గాదు. అట్టిచో దానిని గ్రహింప నేమానవునితర మగును? అటులే జొరానాభవనమున ధరస్సనతి కొక్కటెకు మాత్రమె భగవదాజ్ఞ యయ్యెను.

ఈ యుదంతము నాలకించి ఓటో లోనికేఁగి ఫౌస్టును చూడఁ గోరెను. ఫౌస్టు ఏకాంతమందిరమునుండి ఓటో వచ్చిన వార్త విన్నంతనే యాతని జూడఁ గోరెను. అతఁ డేమివార్తను వినిపించునో యని ఫౌస్టు చాల నాతురపడుచుండెను.

,, నేను సఫలుఁడ నైతిని. నీపుత్రుఁడు సురక్షితుఁడును దైవరక్షితుఁడు నయ్యెను. ''

,, ఈ శుభవార్త విని సురక్షితముగ నీవు శుభరక్షను గొని రాఁగలుగునట్లు నిను గాపాడినందులకు సర్వాత్మీయుఁ డగు వానికి హృదయపూర్వకముగ వందనముల నర్పింప నోచుకొన కున్నను అత్యంతమగు కృతజ్ఞతను నీకు వెల్లడించుట కెట్టి యాటంకమును లేదు. నాకు గల కృతజ్ఞత యపారము. నాకృతజ్ఞతను సంపూర్ణముగ నేమానవుఁడును వివరింపజాలఁడు. ఏకవియును వర్ణింపజాలఁ'' డని ఫౌస్టు మహదానందపరవశుఁడై పలికెను.

నేను వందనముల నపేక్షించువాఁడఁ గాను. నాబహుమానము నాహృదయస్థానమునందే యున్నది. నా కీయాత్రాసందర్భమునఁ గలిగిన మితిలేని నిరోధములను వర్ణించి కాలము వృథజేయుట నాతలంపు గాదు. ఆపదలు నడగొండలవలె నగుపడి చివర కావిరివలె నదృశ్యమై పోవుచుండెను. భక్తవత్సలుఁ డగు కరుణామయుని కటాక్షమహాత్మ్యమున నే నీపవిత్రకార్యమును సాధింపఁగలిగితిని గాని యందునాప్రయోజకత యేమియును లేదు. పాపహేతువగు నహంభావమీశ్వరుని యనుగ్రహమున ననుదరిఁ జేరకుండఁ బాఱద్రోలఁబడెను. సర్వేశ్వరునికిఁగల కర్తృత్వమును మానవున కారోపించున దీదుర్మతి

యగు నహంభావమే. నే నాపర్వతశిఖరమున నిలచితిని. పవిత్రనౌకను జేతులార స్పృశించితిని. నా కాశకల మపుడు నాచెంత నే యున్నది. నే నిపుడు బిడ్డల జన్మ వృత్తాంతమును లియపోల్డు మేరియాలకును అడీలా మేక్సిమిలనులకును వెల్లడింపవలసి యున్నది. తమ ముద్దుల పట్టి యగు నడీలా నత్యధికముగఁ బ్రేమించుట యందు మేరియాసతి చేసిన యక్రమ మేమియును లేదని స్పష్టపఱపవలెను. ఈశుభరక్షను ఇరువదినాలుగవ వత్సరము పూర్తి యగువఱకును విడువకుండ ధరింపవలసిన యావశ్యకతను గూర్చి మేక్సిమిలనుకుఁ దెలుపవలసి యున్నది. " అని ఓటో పలికెను.

" అటులైన నాకుఁ గలుగనున్న ఘోరదుర్గతిని గూర్చి యిపుడే నాపుత్రుని కెఱిగించెదవా ? "

" నేనంతయు నెఱిఁగింపను. సత్యమును మరుగుపఱుచుటయును కృత్రిమమును నా కెంతమాత్రమును సమ్మతములు కాకున్నను, నీ తండ్రి పాపపురుషునికి వశుఁడయ్యె. ఆతనికి శాశ్వతనరకమే గతి యని యెఱిఁగించి యీ యువకుని జీవితమును దుఃఖభాజన మొనరించుటకు నేనంగీకరించను. అట్టి సత్యమును వెల్లడించుట పాపమూలమే గాని పుణ్యము కాఁజాలదు. ఇదియే ధర్మసూక్ష్మము. నోలిక గృహ రహస్యము నెఱిఁగింపక తప్పదు. అత్యాశవలనఁ దన పుత్రునకు రాజపదవి రావలెననుకోరికతో ఫాస్టు యిట్లు పిల్లలను మార్చుట కేర్పాటు చేసెనని మాత్రమె నేను జెప్పఁగలను. "

" ఆహా ? నీవెంత దయామయుఁడవు. పెక్కు వేల వందనముల నర్పించుచున్నాఁడ. ఆశుభరక్ష యెక్కడ ? నాసుతుఁడు దానిని నిరంతరమును ధరించునట్లు చేయుటకు నీ వేమి యుక్తి చేసెదవు " అని ఫాస్టు పలుక " నీభార్య యుంగరము గాని, శిరోజము గాని, మరియేదైన గాని యున్నచో నాకిమ్ము. " అని ఓటో అనెను.

‘‘ ఆ మృదుల కేశములను నేను ధరించుచుంటిని. అట్టి దీర్ఘ కేశముల కుంతలము లేకాంతిలకును గూడ నుండుట యెఱుగుదు.

‘‘ అయినను నాకు దాని నిమ్ము. నే నాశుభరత్న నా కేశపాశమున ధరింపజేసి తన జన్మవృత్తాంతమును వెల్లడించిన పిమ్మట ఓని నతని కౌగిలించుచుఁ ‘‘ బలియుస్వరూపిణి యగు నీ జననికి నీపైఁ గల నిరూపమాన మాతృవాత్సల్యసూచక మగు నీపవిత్రచిహ్నమును నీవు ధరింపుము. ఈశుభరత్న నీవహర్నిశము ధరింపవలయును. ఆసాధ్వీమణి దివ్యపథమునుండి నిన్ను గాపాడుచున్నది. ఒక్కనిముసమైన దాని వదలితివేని నీవు కృతఘ్నుఁడ వయ్యెద ’’వని నేను మెక్సిమిలను కెఱిఁగించెదను. ’’

‘‘ ఓటో సుజనవరేణ్యా! ఇది కడు శ్లాఘనీయము. నే నిఁక నిన్నుఁ బాసి పోయెదను. మరల నీదర్శనము నాకీజన్మమున లభింపదు. కాదు, కాదు, ౩౧-౮-౧౯౧౭వ తేదీని యనగ నాయవసానదినమునఁ గడసారి వియన్నానగరమున నిను దర్శించెదను. ’’

అని పలుకుచు ఓటో వాదించుచున్నను నిలువక వికృతవదనుఁడై సర్వావయవములు కంపితము లగుచుండ ఫౌస్టుతటాలున వెలి కురికెను.

‘‘ ఆగుము, ఆగుము, కడసారి నీపుత్రుని కౌగిలించుకొని మఱీ పొమ్ము. ’’

‘‘ వలదు, వలదు, నేను సాహసింపఁజాలను. ’’ అని పలుకుచు [illegible] ఫౌస్టు వెడలి పోయెను.

అప్పటిఫౌస్టు విపన్నవదనమును ఓటో యెన్నటికిని మఱువలేదు. అతఁడు తక్షణమే మోకరిలఁబడి భగ్నహృదయుఁడై సర్వేశ్వరుని ప్రార్థించెను.

## ౯౫

౧౫౧౭ వ వత్సరము జూలై నెల ౩౧ వ తేదిని నిజప్రకాశమున దిన మెల్లఁ బ్రపంచమును దేజోవంత మొనరించిన దినమణి యపర వారాశి గ్రుంకియనంతర మొకపాంథుఁడు ఓటోపియసన్లా మందిర ద్వారమును జేరెను.

అతని వసనములతియుదాసీనత నుపేక్షను వెల్లడించుచుండెను. అతనివదనము శవముమోముబోలె మిక్కిలి వెల్లనై యుండెను. అతనిదృష్టి విపరీతముగ నుండెను. కన్నులు గుంటలుపట్టి యుండెను. అతనిసమున్నత కాయము దుఃఖభారమునఁ గ్రుంగి యుండెను.

అతనిరాకకై ఓటో నిరీక్షించుచుండుటచే గవాక్షమునుండి గుర్తించి యాతఁడు బిరాన నెదు రేఁగి లోనికిఁ గొనివచ్చెను. వారినోట నొక్కమాటయైన వెలువడలేదు. అటులాతనిని ఓటో యొకగదిలోనికి గొనిపోయి తలుపుమూసెను. అపుడతఁ డొకశయ్యాసనమునఁ గూలబడి "ఓటో నే నన్న ప్రకారము వచ్చితిని. రేపే నాయవసాన దిన మని యాతఁ డనెను.

"ఫాస్టు. ఫాస్టు, రేపే రేపేనా ?"

"ఔను రేపే నేను శాపపురుషుని వశము కావలసిన దినము, నాజీవితము భిన్నవర్తనములకు భావచలనమునకు భిన్నావస్థలకు పాలైన నాజీవితము దయాశాలి యగుసీసహాయము లేకున్న నాపుత్రుని పవిత్రాత్మనుగూడ శాశ్వత నరకావాసమునకు పాలుచేయ వలసిన నాజీవితము రేపటితోఁ ముగియునని ఫాస్టు కడుసంతాపముతో వచించెను. అతిపూర్ణమున నాతని కంఠధ్వనియందుఁ గలిగిన మార్పు ఓటోమానసమును బూర్తిగాఁ గలచి వేసెను. అతఁడు దాని నెన్నటికి మఱువలేదు. ఫాస్టు మానసమును దహించుచున్న దుర్భరసంతాపమాతని స్వరము నట్లు మార్చి వేసెను.

,, నీపుత్రికయును అడీలాయును వివాహ మైనది. నా రిపువులును సౌఖ్యభాజనులై యున్నారు గాని తన తండ్రి యిట్టిమహాపరాధ మొనరించె ననుచింత మాత్ర మొక్కింత యాంతనికుండక తీరదయ్యెను."

,, ఏలిశాగృహ విషయమేగదా ? పాపపురుషు సంబంధము నాత డెఱుఁగదు గదా ? ,,

,, ఎఱుఁగఁడు. నీవు పరలోక గతుఁడ వైనపిమ్మట నారహస్యము నెఱిఁగినజీవి యొక్కటిమాత్రమె భగవదాజ్ఞయగు వఱకు నీలోకమున మిగిలి యుండును.

,, ఈయవస్థయం దిదిగొప్ప సంతోషవార్త. నాదురవస్థను నా పుత్రుఁ డెఱుఁగ డనుట నాకు మనశ్శాంతికరము. కాళరాత్రి యందు మెఱుపుతీఁగె నిన్ను విడచి నాలుగేం డ్లైనది. ఈనాలుగు వత్సరములును నేను విరామములేకుండ పర్యటన మొనరించితిని. కొంతకాలము నావిపరీతశక్తుల వినియోగించి భోగముల మునిఁగి తేలి దుఃఖము నడంచుకొంటిని. కొంతకాలము మానవ సంచారము లేని భయంకర కాంతారములందును మహాభూములందు నొంటరిగాఁ జరించితిని. ఏమిచేసిన నేమి ? నాదుర్భర సంతాపము క్షణికమైన నాకు విరామము నొసఁగలేదు. ఇఁక నవసాన మాసన్న మైనది. ,,

,, ఫాస్టు ! నీ వేల యవలిలఁ బాపపురుషుని వశము కావలెను ? మహానుభావుఁడు దివ్యమానవుఁడు ఈశ్వరసంకర్షన మహాభాగ్యమును బడసిన తపోధనుఁ డగువారక పూజ్యుని బ్రార్థించి తోడ్తెచ్చెదను. ఆభక్తాగ్రగణ్యుఁడు నీతోఁ గలసి కరుణాసముద్రుఁడు పతితపావనుఁడు నగునశ్వేశ్వరుని నిర్మలమానసముతోఁ బ్రార్థించును- లేదా నీవును నేనును బవిత్రతమ మగు పుణ్యస్థానమున కేఁగుదము. దేవతాఘంటపమును బిగ్గఁగౌఁగిలించు కొనుము. మన మిద్దరమును గలిసి మహేశ్వరుని సన్నిధానమును భావించుకొని గానముచేయుముగ

ప్రార్థన మొనరింతుము నీ వెఱుఁగవు. ఆతని మహిమ యపారము. ఆతని కరుణ యపారము.”

,, ఓహో, ఓహో, నాశరీరము దహించుకొని పోవుచున్నది. వలదు. వలదు. నీ విట్టిమాటలు పలుకవలదు. ఇంకఁ గొన్ని గంటలలోనే నేను దనువుఁ దొఱఁగఁగ నున్నాను. నా కెట్టియాశయును లేదు—నా పుత్రుఁ డాశుభరక్షను ధరించె నేమో తెలుపుము ?”

,, ఆతఁడు నిముషమైన దానిని తీసి వేయుట లేదు. దాని నతఁడు తనకంఠమునకుఁ గట్టుకొనెను. ఆపవిత్రరక్ష యాతని హృదయాంతిక మున సదా యలరారుచున్నది. దాని మహిమచే నాతని సంతాపము ప్రశాంత మయ్యెను. నీకొఱ కాతఁడు నిరంతరమును బ్రతి దినమును నుదయమునను సాయంకాలముననుగూడ సర్వేశ్వరు నత్యంతభక్తితోఁ బ్రార్థించుచుండును. నీ వొక తపోవనమునను పోతివని యాతఁడు నమ్ముచున్నాఁడు.”

,, ఆతఁ డటులే విశ్వసించుగాక ! అటులే వర్ధిల్లుగాక ! ”

,, నీమరణానంతర మావృత్తాంత మాతనికిఁ దెలుపుట యుక్త మని నేను దలంచెదను. నీకింతలోనే మృతినొందుట నిశ్చయమేనా ?”

,, రేపే, రేపే.”

,, అట్లైన నే నతని కెట్టి యనుమానమును గలుగని రీతిని నీ మరణవార్త నెఱిఁగింపవలసి యుండును.”

,, మరణశయ్య నున్నవానికి నీ వొసఁగినవాగ్దానముగా నీవీవాక్యములను భావింపవలెను.”

,, నే నట్లు భగవంతుని పాదపద్మముల సాక్షిగా బ్రమాణ మొనరించెదను.”

„ నేను చేసినమోసమునకు లియపోల్డును మేరియూసతియు నను నిందించిరా! నన్ను నిరసించుచున్నారా ? „

„ అయ్యో. ఎంతమాట్లాడితివి! వా రట్టివారు కారే. ఆరహస్యము వెల్లడి యైనందులకు వా రెంతయు సంతసించుచున్నారు. మేరియూసతి మహదానందముతోఁ దనపుత్రికను గాఢాలింగన మొనరించుకొని ఆనందింపఁ గలిగినది. ఆదంపతు లుదారభావులు. ప్రేమాస్వరూపులు. ద్వేషమునకును నీర్ష్యకును వారిమానసములందుఁ దావు లేదు. ఆమోసమునఁ బాల్గొనిన యాపరిచారిక మహామారివలనఁ జనిపోయినుగాని డాక్టరు లట్టను నిజమునంతయు నొప్పుకొనెను. ఆతనికి మరణదండనము విధింపవలదని లియపోల్డు మేరియాలు వేడుకొనుటచే సార్వభౌముఁ డాతని తనదేశమునుండి వెడలి పొమ్మని మాత్ర మాజ్ఞాపించెను. „

„ ఓటో, నీవు మహనీయుఁడవు. ఒక్కనికిమాత్రమే యుండఁదగిన సర్వసద్గుణములను నీయందు మూర్తీభవించినవిగాన నీవాతనితోఁ దుల్యుఁడవు. నే నింతకంటె నేమియును బలుకఁజాలను. ఇదియే కడచూపు, కడసరిమాట. ఈ రాత్రి నేను నీమందిరమున నొంటరిగా నొక గదిలో గడుపఁ గోరెదను. రేపు—అనునంతలో ఫౌస్టు ఘోరతమదుఃఖసముద్రమున మునిఁగిపోయెను. ఓటో యెన్నియో విధముల నోదార్చెను. చివరకు ఫౌస్టు కోరికపై ఓటో యాగది నుండి వెడలి పోయెను.

ఆరాత్రి ఓటో కన్నుమూయలేదు. సూర్యోదయ మగువఱకును ఏకరీతిగా జగదీశ్వరునిఁ బ్రార్థించుచు నారాత్రి నాతఁడు వేగించెను. ఆపత్కాలమున సంపత్కాలమున భక్తుల కాధారము, ఆశ్రయము, అభయప్రదాన చణమునగునది. జగదీశ్వరుని పవిత్రనామ మొకటియే గాక వేఱేమిగలదు?

## ౬౬

## ఉపసంహారము.

నగారోత్పదయ మైనది. వెనుకాలియనుపర్వత శిఖరోన్నత భాగమున ఫాస్టును పాపపురుషుఁడును నిలచి యుండిరి.

పాపపురుషుని వదనమున సంతాపము గాని, విరసనభావము గాని గోచరించుట లేదు. చూచువారికి భయవిహ్వలతను గలిగించుచు గడు దారుణముగ నున్నది. నేత్రములనుండి యగ్నికణములు రాలుచుండెను. మానవులం దతనికిగల మహాద్వేషము పరిస్ఫుట మగుచుండెను తాను సఫలుఁడనైతి ననుగర్వము వెల్లడి యగు చుండెను.

ఫాస్టు చకితుఁడై, ప్రకంపితుఁడై యుండునంతలో పాపపురుషుని కఠోరకంఠనినాద మాతని వీనులం బడియెను.

వెనుక నీకు నే నొకసారిచూపి యున్న మహానరకలోకమున నీకు శాశ్వతావాసమును గల్పింపఁ గొనిపోవు తరుణము కనుచేరువ దైనది. నీవు నీపుత్రుని విషయమున నొనరించిన మోసమును నే నెఱుఁగ ననియో భ్రమియుచుంటివిగదా. నాకుఁ దెలియకుండ నీ వొనరింప గోరు కార్యములను నేను గ్రహింపలే ననుకొంటివా ! మోసపోయిన వాఁడవు మానవాధముఁడ వగు నీవు గాని నేను గాను. ఏనాఁడు హోలికాగృహమున నీపుత్రుని సూర్చితివో యానాఁడే అనిముషమున నే నేను దానిని గ్రహించి యున్నాను. పాపపురుషునిగూడ వంచింపఁగల నని నీవు తలంచినందుకు నాలో నేను నవ్వుకొంటిని. ఎవ్వని సద్గుణములు లనిన నా కత్యంత మగునసహ్యము కలుగునో యెవ్వని సాహసమునకు నేను చాలవెఱచు చుందునో యట్టిమానవుఁడు ఓకో పియునల్లా రౌబుక్కుఁడునగాత్రమే కలఁడు. అతనిగూడ నేనులోబఱచు కొనఁ జూచితిని, అతఁడు దారిద్ర్యమునఁ గూడు లేక మాఁడుచున్నతఱి నేను మానవాకృతి నతనికడ కేఁగి ధన మొసఁగితిని, అతఁడు దాని

నూరక స్వీకరింపఁ డని యెఱిఁగి యొకప్రతికృతిని గోరితిని. ఒక్కసారి కటికదారిద్ర్యమునుండి మహాసంపన్నుఁ డయ్యెనేని కన్నుగానక ధనమదాంధతచే నాతఁడు పాపపుత్రోవలఁబడి చెడునని యాసించితి గాని యొక్కొకపుడు సంకల్పములుగూడ నాకే ప్రతికూలము లగుచుండును. పాపపురుషుని దురాకర్షణలు పుణ్యాభావముననే మఱింత పురికొల్పును. ఓటోపియునల్లావిషయమున నటులే జరిగినది. నే నొసఁగినధనమాతఁడు మహదైశ్వర్యవంతుఁ డగుటకే సాధన మగునట్లొక మహోన్నతశక్తి సంకల్పించెను. ఆశక్తిని నేను పేర్కొనఁజాలను గాని యాశక్తి మహిమము ముందర నాసామర్థ్యము సముద్రమున నీటితుంపరమె యనఁగును. ఆ ఓటో పవిత్రవర్తనము నెదుట నా ప్రోత్సాహ విరాళిగా విఫల మైనది. ''

'' ఆఁ! ఓటోయే నాపుత్రుని నీబారినుండి రక్షింపఁగలిగె '' నని ఫౌస్టు సాహసించి పెడమొగముగఁ బలికెను.

'' నే నెఱుఁగుదును. అతఁడు సఫలుఁ డయ్యెను. నే నాతనిప్రయత్నమున కెన్నియో యంతరాయములు కల్పించితిని. అతఁడు లూక్రేజాకు వశుఁ డగునట్టి విచిత్రసంఘటనల సమకూర్చితిని. కాని నాప్రయత్నము నిష్ఫలమయ్యెను. అరారాటుపర్వతము నాతఁ డెక్కఁజాలకుండునట్లు ప్రయత్నించితిని. అదియును సాఁగదాయె. మరల నతని లిస్బ్నా దీసికొనుచుఁ జేర్చి లూక్రెజాచేఁ నతని చెఱసాలయందు బంధింపఁజేసి బలవన్మరణ మాసన్నమైనదని నాతఁడు గ్రహించునట్లొనరించితిని. వర్ణింప నలవిగాని యట్టి మహాభయంకరదశయందుగూడ నాప్రబోధములు ధిక్కరింపగలవాఁ డింకేమానవుఁడు నుండఁడు గాని ఓటో మాత్రము అట్టి వేళ మహత్తరశక్తి రక్షించుచుండుటచే నన్ను ధిక్కరించుటయే గాక కనుగందకుండ నాబలవన్మరణము నుండి తప్పించుకొనఁ గలిగెను. నే నింక నాపవిత్రశీలుని వంచింప నెట్టిప్రయత్నము చేసినను ప్రయోజనము కలుగదు కాన వదలుకొంటిని. ''

,, ఏల నా కీవృత్తాంత మంతయు నెఱింగించితివి ? ''

,, ఓమూర్ఖుఁడా ! నీదౌర్భాగ్యమును నీకు వెల్లడించుటకే కరుణా సముద్రుఁ డగు నామహచ్ఛక్తి యెంతటిపతితు నైనను దన్నుఁ బ్రార్థించు నేజీవినిగూడఁ బరిత్యజింపఁ డని నీకు స్పష్టపఱచుటకే. నీవు ధైర్యమును బూని యామహచ్ఛక్తి పాదముల నాశ్రయించి యుంటివేని తప్పక నీ వాతని కరుణాకటాక్షమునకు పాత్రుఁడవై యుందువు. నీవు బుద్ధిపూర్వకముగా నామహదవకాశమును గోల్పోయితివి. ఓరీ సదుపదేశములు విని యుంటివేని నిన్నరాత్రి నైన నాతని హితబోధ నాలకించి యామహచ్ఛక్తిని నిర్మలభక్తితోఁ బ్రార్థించి యుంటివేని ఆమహచ్ఛక్తి సంపన్నుని యెదుట శలభసదృశుఁడ నగునే నాతని సన్నిధానమునుండి నినుగొనిపోవఁజాలుదు నని తలఁచితివా ? అదినా తరమా ! నీబోటి మానవులయెదుట నేను మహాశక్తిసంపన్నుఁడ నైనను జగదీశ్వరుని కట్టైనుట కడుహీనసత్త్వుఁడనే యని తెలియఁ జాల నైతివి. ''

,, అయ్యో ! అయ్యో ! నాకుగూడ నాశయుండెనా ! నేను బోఁగొట్టుకొంటినా ? హా ! హా ! హా ! ద్రోహీ ! పాతకరాక్షసాధమా ! నాకేల చెప్ప వైతివి ? ''

,, నీకుమాత్ర మేల ఆశ కవకాశములేదు. ఆ మహనీయుని ప్రేమకు హద్దు గలదా ? ఆతఁడు కరుణాసముద్రుఁడు గాఁడా ? పతితపావనుఁడు గాఁడా ? భక్తార్తిభంజనుఁడు గాఁడా ? శరణాగత రక్షణావినోదము కలవాఁడు గాఁడా ? ఏమైన నేమి ? ఆయవకాశము దాటిపోయినది. నీ కిఁక నాప్రాప్తి లేదు. అదిగో నరకద్వారములు నీకొఱకు పూర్తిగాఁ దెరువఁబడినవి. నీవు మహాపాపివి. నీభోగపరాయత కొఱకు నాశక్తి నూఱిగొని నీవు చేసినద్రోహముల కంతముగలదా ? మహావాయుప్రకోపనము మహామారి సహాకర్షణము నీనివలన నెన్నికోట్ల

మంది కెంతటి దురవస్థమరణము మున్నగు నాపదలు తటస్థించుచు పంటలుపోయెను. పశువులుమడిసెను. ఇండ్లు కూలెను. అగ్నిపర్వత ప్రకోపనమునకును నీయాజ్ఞయేఁగదా కారణము. దానివలనఁగలిగినసష్ట మెంతదారుణము చివరకు నిన్నత్యంతగాఢముగఁ బ్రేమించిన పతి ప్రతా శిరోమణి యగు ఛరస్నాదేవి మరణమునకుగూడఁ గారణము నీవే కాదా ?”

“ అయ్యో ! అయ్యో ! ఆ కారాగృహమున నీబారిబడకముందే, నే నేల చావనైతిని హా ! దుర్భరము దుర్భరము. ఆ ఛరస్నా యైన మరణించి యుండరాదా !

“ మరణించియే యుండును. ఆమె ప్రాణములఁ దీయుటకు నీయుపపత్నియగు నా యామెకు విషము పెట్టినది. అప్పుడు నేను ఓటోను సాధనభూతునిగా గొని విరుగుడు నిచ్చి యామెను గాపాడితిని.”

“ ఏమి ఏమి, నీవుగూడ నొకప్రాణమును గాపాడితివా ? అట్లైన నీకుగూడఁ గరుణగలదా ”

“ నే నీదుర్దశకు లోనైనపుమ్మట నాకుఁ గరుణ కలుగనే లేదు. కరుణవలన నేను నీభార్య ప్రాణములఁ గాపాడితి నని తలంపకుము. నీపాపకృత్యముల కారణము వలననే యామె చనిపోవలె ననియు నిక్కముగా నీపాపములసంఖ్య పెరుగవలె ననియు నే నప్పు డామెను గాపాడితిని ”

“ ఘోరకరాంతకుఁడవు కృతఘ్నుఁడవు. ”

“అన్యాయాధిపతిపైని మేజస్ట్రేటుపైని నీకట్టి యపకార మొనరింప నన్యాయాధిపతి పుత్రునిపైని నీ వెంతటి క్రౌర్యమును చూపితివో జ్ఞాపకము లేదు. నేను కృతఘ్నుఁడనా ! నీవు కరుణా భరితుఁడవు. కాఁబోలు నేమి !

“ అయ్యో ! నన్నింకను బ్రతుకనిమ్ము. కొన్ని గంటలు - కొన్ని నెల

లు-కొన్ని వారములు- కొన్ని దినములు- ఒక్క దినము- ఒక్క గంట యైన బ్రదుకనిమ్ము!"

"నీకు మరణకాల మాసన్నమైనది. క్షణికమైన మనజాలవు. అని పాపపురుషుఁడు పలికి ఫాస్టును బట్టుకొన రాగ" రక్షింపు రక్షింపుము, మననిమ్ము పిమ్మట నీవాఁడనయ్యెద "నని ఫాస్టు మొఱఁబెట్టసాగెను."

"ఇదిగో నావాఁడ వైతి వని పాపపురుషుఁడు ఫాస్టు నదిమి పట్టెను. వెంటనే భయంకరముగ మంటలు లేచెను. ఆసమయము ననే ఫాస్టు నిటునటు చూచి పాపపురుషుఁ డతని నాయగ్నిజ్వాలలో విసరివేసి తానుగూడ నందురికెను.

కరుణాసముద్రుఁ డగు సర్వేశ్వరుఁ డెంతటి ఘోరపాతకుల నైన రక్షించు నని నమ్మవలెను. మహాపాతకినే నా కిఁక గతియేమని పలికి యు నిరాశఁజెందరాదు. అట్టి నిరాశవలననే యాతఁడట్టిగతికివచ్చెను. సంపూర్ణ విశ్వాసము వలననే ఓటో తరించె ననునమృతవాక్కుల నాకాశవాణి వచించెను.

సంపూర్ణము.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B133 |
| పుస్తకం పేరు | ఫాస్టు 02 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 323 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 318 |
| లేని పేజీలు | 163,164 |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |